# రహస్య యోగులు



శ్రీధరన్ కాండూరి

# ఈ పుస్తకంలో............

## Part - 1

19. భవిష్యత్తులో వాయుదేవుడిగా అవతరించబోతున్న మహాయోగి వడిరాజరు జీవిత విశేషములు?
20. ప్రాచీన తమిళనాడు నుండి అదృశ్యం అయిపోయిన కుమారిఖండ భూభాగం మిస్టరీ?
21. 40 రోజులపాటు స్వచ్ఛంధ సజీవ సమాధిలో జీవించిన హఠయోగి సాధుహరిదాస్?
22. హైందవ వివాహ సాంప్రదాయ రహస్యములు?
23. బెనారస్ హైందవ యోగిని "మాజీ" జీవిత విశేషాలు?

## *Part - 2*

1. బ్రహ్మర్షి పర్వతాలపై సిద్ధయోగుల సూక్ష్మరూప సంచార విశేషాలు?
2. జీవసమాధి అంటే ఏమిటి?
3. సిద్ధయోగులు అందించిన "సిద్ధవైద్య" మర్మం ఏమిటి?
4. అద్భుత శక్తులు కలిగిన అంబజోగాయ్ దివ్యక్షేత్రం విశేషాలు?
5. గయ క్షేత్ర అద్భుత విశేషములు?
6. బ్రహ్మచర్య మహత్యం ఏమిటి?
7. అద్భుత ఫలితాలను ఇచ్చే ఉచ్ఛిష్ఠ ఛండాలినీ సాధన ?
8. హైందవ ఆచారాల మర్మం?
9. స్తంభేశ్వర్ మహదేవ్ ఆలయం - గుజరాత్.



# నామాట

"సిద్ధ" అనగా పరిపూర్ణత సాధించినవాడు అనిఅర్థం. కేవలం శైవ మతంలోనే కాకుండా మహాయాన బౌద్ధమతంలోని తాంత్రిక విభాగమైన వజ్రయానంలోను, జైనమతంలోను కూడా "సిద్ధులు" అని పిలువబడే యోగులు ఉన్నట్లుగా తెలుస్తున్నది. ప్రాచీన తమిళనాడు ప్రాంతంలో 18 మంది సిద్ధులు వివిధ కాలాలలో ఈ భూమిపై సంచరించినట్టుగా తెలుస్తున్నది. సాధారణంగా యోగులు తమ తపోశక్తితో మానవులకు అప్పుడప్పుడు మేలు చేసినట్లుగా పురాణాల ద్వారా తెలుస్తున్నది. అయితే ప్రాచీన ద్రావిడ దేశంలో (నేటి తమిళనాడు) జీవించిన సిద్ధపురుషులు మానవులకు అనేక రకాలుగా మేలు చేసారు. కొన్నివేల సంవత్సరాల నుండి మానవుడి ఆరోగ్యాన్ని కాపాడుతున్న "సిద్ధవైద్యమును" కనిపెట్టింది ఈ సిద్ధయోగులే అని గుర్తించాలి. మానవులయొక్క గతజన్మతో సహా ఈ జన్మకు సంబంధించిన అనేక విషయాలను చెప్పగలిగే నాడీ జోస్యాన్ని రూపొందించింది కూడా ఈ సిద్ధయోగులే అని గ్రహించాలి. అనేక రకాల వనమూలికలను ఉపయోగించి ఇనుము, రాగి లాంటి లోహాలను బంగారంగా మార్చగలిగిన "రసవిద్య (ఆల్కమి)"లో ఈ సిద్ధపురుషులు అద్భుత నైపుణ్యాన్ని కలిగి ఉండేవారని ఆనాటి గ్రంథాలలో లిఖించబడి ఉన్నది.

రసవాదులుగా, వైద్యులుగా, వేదాంతులుగా, పరమశివభక్తులుగా, అద్భుత మహిమలుగలిగిన సిద్ధపురుషులుగా గుర్తించబడిన ఈ సిద్ధయోగులు ఏనాడూ తమకు ఉన్న "అష్టసిద్ధుల" గురించి తమతోటి మానవులకు ప్రకటించలేదు. వారు ఏవిధమైన గుర్తింపునూ, ప్రశంసలను ఆశించకుండా కేవలము మానవజాతి కల్యాణంకోసమే పాటుపడ్డారు. ఒక రకంగా చెప్పాలంటే ఆనాటి ఆ సిద్ధపురుషులు ఒకవిధమైన అజ్ఞాతంలో జీవించారు. ఆ కారణంగానే వారిని "రహస్యయోగులు" అని కొందరు వేదాంతులు పిలవటం జరిగింది. అద్భుతమైన ఎన్నో శాస్త్రీయ పరిశోధనలకు పేరుపడిన ఆ రహస్యయోగులకు సంబంధించిన అద్భుతమైన అంశాలను గురించి వివరించటంకోసమే రచించబడిన ఈ ఆసక్తికర మరియు విశ్లేషణాత్మక గ్రంథం **"రహస్యయోగులు"** సమస్త తెలుగు పాఠకులను తప్పకుండా అలరింపచేస్తుందని, ఆలోచింపచేస్తుందని ఆశిస్తున్నాను.

ఇట్లు

మీ

శ్రీధరన్ కాండూరి



# 1. సిద్ధపురుషుల సంక్షిప్త జీవిత విశేషములు?

పతంజలి మహర్షి మూలానక్షత్రంలో, ఫాల్గుణమాసంలో జన్మించాడు. ఈయన 5 యుగాలపైన 7 రోజులపాటు జీవించాడని చెబుతారు. ఈయన రామేశ్వరంలో జీవ సమాధి అయ్యాడు.

అగస్త్యమహర్షి ఆశ్లేషా నక్షత్రంలో మార్గశిర మాసంలో జన్మించాడు. ఈయన 4 యుగాల 48 రోజులపాటు జీవించాడు. ఈయన తిరువనంతపురం (త్రివేంద్రం)లో జీవ సమాధి అయ్యాడు.

కమలముని వైశాఖ మాసంలోని పుష్యమి నక్షత్రంలో జన్మించాడు. ఈయన 4వేల సంవత్సరాలు మరియు 48 రోజులపాటు జీవించాడు. ఈయన తిరువారూర్‌లో జీవ సమాధి అయ్యాడు.

తిరుమూలార్ భాద్రపద నెలలో ధనిష్టా నక్షత్రంలో జన్మించాడు. ఈయన 3వేల సంవత్సరాల 13 రోజుల పాటు జీవించాడు. ఈయన చిదంబరంలో జీవ సమాధి అయ్యాడు.

కుత్తంబాయ్‌సిద్ధర్ ఆషాఢ మాసంలో విశాఖా నక్షత్రంలో జన్మించాడు. ఈయన 18 వందల సంవత్సరాల, 16 రోజులపాటు జీవించాడు. ఈయన మాయవరంలో జీవ సమాధి అయ్యాడు.

కొరాక్కర్ కార్తీక మాసంలోని ఆశ్లేషా నక్షత్రంలో జన్మించాడు. ఈయన 880 సంవత్సరాల 11 రోజుల పాటు జీవించాడు. ఈయన పేరూర్‌లో జీవ సమాధి అయ్యాడు.

సుందరానందర్ శ్రావణ మాసంలో, రేవతీ నక్షత్రంలో జన్మించాడు. ఈయన 8వందల సంవత్సరాల 28 రోజులపాటు జీవించాడు. ఈయన మధురైలో జీవ సమాధి అయ్యాడు.

కొంగనార్ చైత్ర మాసంలోని ఉత్తరాషాఢా నక్షత్రంలో జన్మించాడు. ఈయన 8వందల సంవత్సరాల 16 రోజులపాటు జీవించాడు. ఈయన తిరుమలలో జీవ సమాధి అయ్యాడు.

వాన్మీగర్/వాల్మీకి భాద్రపద మాసంలో అనూరాధ నక్షత్రంలో జన్మించాడు. ఈయన 7వందల సంవత్సరాల 32 రోజులపాటు జీవించాడు. ఈయన ఎట్టుకుడిలో జీవ సమాధి అయ్యాడు.

రామదేవర్ మాఘమాసంలో పుబ్బ నక్షత్రంలో జన్మించాడు. ఈయన 7వందల సంవత్సరాల 6 రోజుల పాటు జీవించాడు. ఈయన అజగరమలైలో జీవ సమాధి అయ్యాడు.

నందీశ్వరర్ వైశాఖ నెలలో, విశాఖ నక్షత్రంలో జన్మించాడు. ఈయన 7వందల సంవత్సరాల 3 రోజులు జీవించాడు. ఈయన కాశీలో జీవ సమాధి అయ్యాడు.

మచ్చముని ఆషాఢం మాసంలోని రోహిణీ నక్షత్రంలో జన్మించాడు. ఈయన 300 సంవత్సరాల 62 రోజులపాటు జీవించాడు. ఈయన తిరుప్పరన్‌కుంద్రంలో జీవ సమాధి అయ్యాడు.

భోగర్ వైశాఖ మాసంలోని భరణీ నక్షత్రంలో జన్మించాడు. ఈయన 300 సంవత్సరాల 18 రోజులపాటు జీవించాడు. ఈయన పళనిలో జీవ సమాధి అయ్యాడు.

పంబత్తిసిద్ధర్ కార్తీక మాసంలోని మృగశిరా నక్షత్రంలో జన్మించాడు. ఈయన 123 సంవత్సరాల 14 రోజులపాటు జీవించాడు. ఈయన శంకరన్‌కోయిల్‌లో జీవ సమాధి అయ్యాడు.



# 2. యోగశాస్త్రంలో సిద్ధపురుషుల ప్రాముఖ్యత ఏమిటి?

హైందవ పురాణాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం "సిద్ధలోకం" ఒక సూక్ష్మలోకంగా ఉంటుందని తెలుస్తున్నది. సిద్ధయోగులు ఈ లోకంలోనే జన్మిస్తారని చెబుతారు. ఈ లోకంలో జన్మించిన సిద్ధయోగులకు అష్టసిద్ధులు ఉంటాయి. కొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం సిద్ధలోకం మరియు బ్రహ్మలోకం ఒకే గ్రహవ్యవస్థలో భాగంగా ఉంటాయని తెలుస్తున్నది. ఈ అనంత విశ్వంలో బ్రహ్మలోకం అత్యంత ఎత్తులో ఉండే గ్రహం అని, ఆ గ్రహానికి ఉపగ్రహంగా ఉండేది సిద్ధలోకమని తెలుస్తున్నది.

పురాణాలలో చెప్పబడిన నారదమహర్షి, సిద్ధలోకంలో నివసిస్తాడని ుతారు. ఆయన ఈ విశ్వంలోని అనేక గ్రహ వ్యవస్థలలో సంచరిస్తాడు. సిద్ధలోకంలో జీవించేవారు కేవలము తమ సంకల్ప బలంతో ఏ లోకానికైనా వెళ్ళగలరు.

సిద్ధయోగులు, జనన మరణ చక్రానికి అతీతులుగా ఉంటారు. అనగా వారు మళ్ళీ జన్మించటం, మరణించటం ఇకపై జరగదు. అది ఎలాగంటే సిద్ధయోగులు మామూలు మనుషులుగా జన్మించి, తీవ్రమైన తపస్సులు చేసి యోగశాస్త్రంలో చెప్పబడిన వివిధరకాల సాధనలుచేసి అష్టసిద్ధులను పొందుతారు. అందువలన వారికి ఈ జన్మలో మరణం అనేది ఉండదు. వారుచేసిన సాధన కారణంగా వారి గతజన్మల కర్మఫలం పూర్తిగా నశించిపోయి ఉంటుంది. అందువలన వారు మళ్లీ జన్మించవలసిన పరిస్థితి ఉండదు.

రామాయణం, మహాభారతం మరియు విభిన్న హైందవమత గ్రంధాలలో "సిద్ధాశ్రమం" గురించి చెప్పబడి ఉన్నది. సిద్ధాశ్రమ ప్రదేశంలో విశ్వామిత్ర మహర్షియొక్క ఆశ్రమం ఉన్నదని రామాయణ గ్రంథంలో వ్రాయబడి ఉన్నది. మహావిష్ణువు వామనావతారం ఎత్తినప్పుడు ఆయన ఈ సిద్ధాశ్రమంలోనే జీవించాడని భాగవత పురాణగ్రంథంలో చెప్పబడి ఉన్నది. ఇంకొక విశేషం ఏమంటే ఈ వామనమూర్తి, రామలక్ష్మణులను

తన ఆశ్రమ ప్రాంతానికి తీసుకువెళ్ళి అక్కడ యజ్ఞయాగాలకు తీవ్ర ఆటంకం కలిగిస్తున్న కొందరు రాక్షసులను రామలక్ష్మణులచేత సంహరింపచేసాడని హైందవ మత పురాణాలలో చెప్పబడింది.

విశ్వామిత్ర మహర్షి, వశిష్టమహర్షి, కణాదమహర్షి, పులస్త్య, అత్రి అనే మహర్షులు, శంకరాచార్య, గోరక్‌నాథ్, భీష్ముడు, కృపాచార్యుడు ఇప్పటికీ భౌతిక దేహాలతో సిద్ధాశ్రమ ప్రాంతంలో సంచరిస్తూ, అక్కడ మహర్షులు చెప్పే ఆధ్యాత్మిక విషయాలను ఆలకిస్తూ ఉంటారని ప్రఖ్యాత యోగశాస్త్ర పండితుడు పండిట్ గోపీనాథ్‌కవిరాజ్ మరియు గొప్ప తంత్రవాది మరియు ఆధ్యాత్మిక గురువు అయిన డా.నారాయణదత్‌శ్రీమాలి అనేవారు మానవ లోకానికి వెల్లడిచేసారు.

దక్షిణ భారతదేశంలో క్రీ.శ. 8వ శతాబ్దం నుండి ఈ సిద్ధయోగులకు సంబంధించిన సమాచారం కొన్ని గ్రంథాలలో లభిస్తున్నది. ఈ సిద్ధయోగులలో మొదటి వారైన అగస్త్యుడు, వాల్మీకి కృతయుగానికి చెందిన వారని చెబుతారు. సిద్ధయోగుల సంఖ్య 18. అయితే వారందరూ విభిన్న కాలాలకు చెందినవారని గుర్తించాలి. ఒకయోగికి మరియు ఇంకొక యోగికి మధ్య కొన్నివేల లేదా లక్షల సంవత్సరాల విరామం ఉన్నది. ఆనాటి సిద్ధ యోగులు అనేక రంగాలలో ఒకవిధమైన విప్లవాన్ని సృష్టించారని చెప్పక తప్పదు. సైన్స్ రంగంలో, వైద్యరంగంలో వారు అనేక నూతన ఆవిష్కారాలకు (డిస్కవరీస్) శ్రీకారం చుట్టారు. కొన్నివేల సంవత్సరాల క్రితమే ఆకాశంలో ప్రయాణం చెయ్యగలిగిన ప్రత్యేక విమానాల్ని ఈ సిద్ధయోగులు రూపొందించినట్లుగా తెలుస్తున్నది. యోగశాస్త్రాన్ని రూపొందించిన పతంజలి మహర్షికూడా ఈ సిద్ధపురుషులలో ఒకడని చెబుతారు. ఈ సిద్ధయోగులు దక్షిణ భారత దేశానికి చెందినవారైనప్పటికీ వీరియొక్క ప్రభావం దక్షిణాన శ్రీలంక నుండి ఉత్తరాన టిబెట్ వరకు దాదాపు దక్షిణ ఆసియా ఖండమంతా విస్తరించినట్లుగా తెలుస్తున్నది. కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం ఈ 18 మంది సిద్ధయోగులు క్రీ.శ. 7-11వ శతాబ్దాల మధ్య మానవ లోకంలో సంచరించినట్లుగా తెలుస్తున్నది.

ఈ సిద్ధపురుషులు శైవమతానికి చెందినవారుగా గుర్తించబడ్డారు. వీరు మానవుల భౌతిక అభివృద్ధికి కావలసిన అనేక అంశాలను రూపొందించటమే కాకుండా మానవులకు ముక్తి మార్గాన్ని చూపించటం కోసం చక్కటి వేదాంతాన్ని కూడా అందించారు.

**జంగమ దేవరలు :**

కొన్ని వందల సంవత్సరాల క్రితం ఆనాటి కర్నాటక రాష్ట్రంలో బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని నిరసించిన కొందరు బ్రాహ్మణేతర కులాలవారు శివలింగాన్ని తమ మెడలోగాని, చేతికిగాని ఒక దారంతో కట్టుకుని సంచరించటం మొదలుపెట్టారు. లింగధారణ చేసే ఈ నూతన వర్గంవారిని **"లింగాయత్‌లు"** అని పిలుస్తారు. ఈ లింగాయత్‌వర్గం శైవ మతంలో క భాగమే అని గుర్తించాలి.

ాహ్మణులకు యజ్ఞోపవీతం ఉండగా, ఈ లింగాయత్‌లు లింగానికి ు- దారాన్ని లేదా సూత్రాన్ని కట్టి ధరిస్తారు. ఈ దారాన్నే **"లింగసూత్రం"** అని పిలుస్తారు.

ఈ లింగాయత్ కులంలో పూజారులవంటి పాత్రను పోషించే వారిని **"జంగమదేవరలు"** అని పిలుస్తారు. వీరు తమతోటి పురుషులను మాత్రమే వివాహం చేసుకుంటారు. ఈ జంగమదేవరలు అనేవర్గం ఎలా ఆవిర్భవించింది? అన్న విశేషాన్ని తెలియజేసే ఒక వృత్తాంతాన్ని ఈ వర్గంవారు ఇలా చెబుతూ ఉంటారు....

"తన వివాహ సమయంలో పరమశివుడు, బ్రాహ్మణులకు దానాలు చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఆ సమయంలో ఏ బ్రాహ్మణుడూ ఆయనకు దొరకలేదు. దాంతో ఆయన తన "జంగ(కాలు)"ను చీల్చాడు. అప్పుడు ఆ కాలు(జంగ) నుండి ఒక పురుషుడు ఆవిర్భవించాడు. జంగ నుండి ఆవిర్భవించిన ఆ పురుషుడికి శివుడు, "జంగమ" అన్నపేరు పెట్టాడు. అప్పుడు శివుడు ఆ జంగమకు దానాలు చేసాడు. ఆనాడు శివుని కాలు నుండి ఆవిర్భవించిన ఆ జంగముడే ఆ తరువాతకాలంలో జంగమ విధానానికి మూలపురుషుడు అయ్యాడు. ఘర్వాల్‌లోని కేదార్‌నాథ్ వద్ద జంగమదేవరలకు సంబంధించిన ఒక మఠము మరియు ఒక ఆలయము ఉన్నాయి.

అష్టసిద్ధులు అంటే ?

యోగులు అణిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రకామ్యం, వసత్వం, ఈసత్వం మరియు గరిమ అను అష్ట సిద్ధులను, యోగమార్గమును అనుసరించుట వలన పొందగలరు. ఈ అష్టసిద్ధులు పొందినవారు ఆవగింజంత సూక్ష్మరూపమును గాని, మహాపర్వతమంత భారీపరిమాణ ములోకి గాని మారగలరు. వీరు కేవలము సంకల్ప మాత్రముననే తాము కోరుకున్న చోటుకి క్షణములలో వెళ్ళగలరు. వీరు తమ ఆత్మను, ఇతర మృతకళేబరముల లోనికి ప్రవేశపెట్టి, వాటిని తిరిగి బ్రతికించగలరు. వీరు తమ ఇచ్ఛ ప్రకారము ఏదైనా జరుగునట్లు, లేదా జరుగకుండా ఆగునట్లు చేయగలరు.

వజ్రయాన బౌద్ధమతంలో కూడా సిద్ధుల ప్రస్థావన ఉన్నది. అయిఊ ఆ సిద్ధపురుషులకు మరియు దక్షిణభారతదేశానికి చెందిన 18 మంట సిద్ధపురుషులకు ఎలాంటి సంబంధం లేదని గుర్తించాలి. అదేవిధంగా ఉత్తర భారతదేశానికి చెందిన గోరక్‌నాథ్ బోధనలను అనుసరించే నాథ సిద్ధులు కూడా ఒక ప్రత్యేకమయిన వర్గంవారని గ్రహించాలి.

కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం వజ్రయాన బౌద్ధమతం, గోరక్‌నాథ్ రూపొందించిన నాథ్‌మతం మరియు మధ్య యుగాలకు చెందిన రసవాదుల సిద్ధాంతం మరియు తంత్రశాస్త్రం, శైవ మతం, హఠయోగం మరియు ప్రాణాయామం అనే వివిధ రకాల సిద్ధాంతాలు కలగలసి ప్రాచీన ద్రవిడదేశంలో "సిద్ధమతం"గా రూపొందింది అని తెలుస్తున్నది.

సిద్ధపురుషులలో ప్రముఖుడిగా గుర్తించబడిన భోగర్ తన గురువైన కలంగినాధర్‌తో కలిసి చైనా నుండి ద్రవిడదేశంలోని పళని ప్రాంతానికి వచ్చాడు. ఆ తరువాత భోగర్, పళని కొండమీద ఒక మురుగన్ విగ్రహాన్ని ప్రతిష్టించాడు. రసశాస్త్రంలో(ఆల్కెమీ) అద్భుతమైన పాండిత్యం కలిగిన భోగర్ "నవపాషాణములు" అని పిలువబడే 9 రకాల రసాయనాలను ఉపయోగించి పళని క్షేత్రంలోని మురుగన్(సుబ్రహ్మణ్యస్వామి) రూపొందించాడని తెలుస్తున్నది. కుండలినీయోగం మరియు రసవాదం మీద దాదాపు 7వేల శ్లోకాలను ఈ భోగర్ రచించినట్లుగా చెబుతారు.

సిద్ధవైద్యంలో కూడా భోగర్ అపూర్వమైన పాండిత్యాన్ని కలిగి ఉన్నట్లుగా తెలుస్తున్నది.

ఆనాటి ఐరోపా, మధ్యప్రాచ్యం మరియు ఆసియా దేశాలలో రసవాదం ఎంతో ప్రాధాన్యత సంతరించుకున్నది. తక్కువ విలువ ఉండే లోహాలను బంగారంగా మార్చే ఒక ప్రత్యేక రసాయనిక పద్ధతిని ఆనాటి రసవాదులు కనుగొన్నారు. భారతదేశంలోని సిద్ధయోగులు కూడా ఈ రసవాదాన్ని ఎంతో అభివృద్ధి పరచారు.

క్రీ.శ. 1293వ సంవత్సరంలో ఇటలీ దేశానికి చెందిన మార్కోపోలో అనే ఒక యాత్రికుడు చైనా నుండి సముద్ర మార్గంలో భారత దేశానికి వచ్చాడు. (ఇటలీదేశానికి చెందిన మార్కోపోలో ఐరోపా నుండి బయలుదేరి మధ్య ఆసియా, చైనా మరియు భారత దేశాలలో పర్యటించాడు.) అతడు మొదట అరేబియా సముద్ర తీరంలో ఉన్న మలబార్ (నేటి కేరళ రాష్ట్రంలోని ప్రాంతం) ప్రాంతంలో మజిలీ చేసాడు. అక్కడ మార్కోపోలోకి రసవాదులైన కొందరు సిద్ధయోగులు కనిపించారు. వారు మానవుల ఆయుర్దాయాన్ని పెంచే ఒక రసాయనాన్ని తయారు చేస్తున్నారని మార్కోపోలో తెలుసుకున్నాడు. గంధకం(సల్ఫర్), పాదరసం (మెర్క్యురి) మరియు వాయువు అనే మూడు పదార్థాలను కలిపి ఒక అద్భుతమైన రసాయనాన్ని తయారుచేసారు. దానిని తీసుకున్నట్లయితే మానవునియొక్క ఆయుర్దాయం 150 నుండి 200 ఏళ్ళవరకు పెరుగుతుందని ఆ సిద్ధపురుషులు మార్కోపోలోకి చెప్పారు. పాదరసం పరమశివునియొక్క వీర్యకణంగా హైందవ పురాణాలలో పేర్కొనబడింది.

చంద్రుడు, సూర్యుడు మరియు వాయువు అనే మూడు రూపాలకు ప్రతీకలైన పాదరసం, గంధకం మరియు వాయువు కలయికతో తయారు చేయబడిన ఈ ద్రావణాన్ని ఆనాటి సిద్ధయోగులు "అమృతం" అని పిలిచారు.

**స్త్రీల ఆరోగ్యంకోసం సిద్ధయోగులు చెప్పిన ఔషధ చిట్కాలు :**

సిద్ధయోగులు మానవజాతి క్షేమంకోసం సిద్ధవైద్యాన్ని రూపొందించారు. ప్రతి సిద్ధుడు కొన్ని ప్రత్యేకమయిన ఔషధ చిట్కాలను

మానవులకు అందించాడు. కొందరు సిద్ధులు, స్త్రీలకు ఉపయోగించే కొన్ని చిట్కాలను చెప్పటం జరిగింది. వాటి వివరాలు ఇలా ఉన్నాయి....

♦ 148 మిల్లీలీటర్ల పాలకి ఒక రెబ్బ కుంకుమపువ్వును కలిపి తక్కువ వేడిమీద మరగపెట్టాలి. ఆ తరువాత ఆ పాలలో ఒక చెంచాడు తేనె కలిపి ఆపై ఆ పాలను త్రాగాలి. ఇలా 48 రోజులపాటు చేసినట్లయితే శరీరఛాయ ఆకర్షణీయంగా మారిపోతుందని "పులిప్పాణి సిద్ధర్" పేర్కొన్నాడు.

♦ టేకు, అతిమధురం (యష్టిమధు), తోక మిరియములు అనే మూడు పదార్థాలను కలిపి మెత్తగానూరి ఆపై ఆ పదార్థాన్ని బాలింతరాలు తన వక్షోజాలకు పూసుకున్నట్లయితే ఆమెలో చనుబాలు సమృద్ధిగా తయారవుతాయని అగస్త్యర్ (అగస్త్యమహర్షి) అనే సిద్ధయోగి పేర్కొన్నాడు

♦ 4 ఔన్సుల నీటికి, 1 ఔన్సు తేనె కలిపి 40 రోజులపాటు సేవించినట్లయితే ఊబకాయం తగ్గుతుందని "భోగర్" అనే సిద్ధయోగి పేర్కొన్నాడు.

♦ కొద్ది పరిమాణంలో "పసుపుసవ్విరంజనం" (ఎల్లో ఆరిప్‌మెంట్) మరియు పసుపుసవ్విరంజనం"కి సగం పరిమాణంలో తడిసున్నం (క్విక్‌లైమ్) కలిపి దానిని అవాంఛిత రోమాలు ఉన్నచోట పట్టించి 20 నిమిషాలపాటు అలాగే ఉంచి ఆపై నీటితో కలిగినట్లయితే అవాంఛిత రోమాలు వాటంతట అవే ఊడిపోతాయని "ధీరయార్" అనే సిద్ధయోగి తెలియజేసాడు.

బాగాపెరిగిన గంగరావిచెట్టు బెరడును తీసుకుని దానిని మెత్తగా పొడికొట్టి ఆపై ఆ పొడిని స్వచ్ఛమైన కొబ్బరినూనెలో కలిపి ఆ తరువాత దానిని ఎండలో బాగా ఆరబెట్టి ఆపై దానిని గజ్జికురుపులపై పూసినట్లయితే అవి సంపూర్తిగా నయం అయిపోతాయని అగస్త్యర్ పేర్కొన్నాడు.



# 3. తిరుజ్ఞాన సంబంధర్ జీవిత విశేషములు?

ప్రాచీన తమిళనాడులోని చోళదేశం అనే రాజ్యంలో ఉన్న సర్కాలి అనే ప్రదేశంలో శివపాదహృదయర్ మరియు భాగవతియార్ అనే పుణ్య దంపతులు నివసిస్తూ ఉండేవారు. ఈ దంపతులు పరమశివుడిని త్రికరణ శుద్ధిగా పూజిస్తూ ఉండేవారు. ఆ కాలంలో చోళరాజ్యంలో జైనమతం ప్రబలంగా ఉండేది. అలాంటి పరిస్థితుల్లో కూడా ఈ బ్రాహ్మణ దంపతులు శైవ మతాన్ని అనుసరిస్తూ ఉండేవారు. ఇంకొక విశేషం ఏమంటే ఆ రోజుల్లో జైన మతానికి ప్రభుత్వ ప్రోత్సాహం ఉండేది. ఫలితంగా జైనమతాధికారులు బలప్రయోగం ద్వారా అయినాసరే చోళరాజ్యంలోని శైవులందరిని జైన మతంలోకి మార్చాలని ప్రయత్నాలు చేస్తూ ఉండేవారు. (ఇప్పటికీ కొన్ని విదేశీ శక్తులు, "తమ మతానికి చెందిన రాష్ట్రాల ముఖ్యమంత్రులు మరియు ప్రధానమంత్రిని సైతం కీలు బొమ్మలా ఆడించగలిగిన రాజమాతల సహకారంతో" తమ మతప్రచారం మరియు బలవంతంగా తమ మతంలోకి హైందవుల్ని చేర్చటం లాంటి దౌర్జన్య కార్యక్రమాలు భారతదేశం అంతటా జరుపుతూనే ఉన్నాయి. అయినప్పటికీ హైందవమతం ఆ మతమార్పిడి ఉన్మాదుల దాడులు తట్టుకుంటూ వటవృక్షంలా నిలిచి ఉన్నది.) ఇలాంటి ప్రయత్నాలు ఆనాటి తమిళదేశంలో, కన్నడదేశంలో ప్రబలంగా జరిగాయి. అయినప్పటికీ వాటిని ఎదుర్కొని శైవమతం మేరుపర్వతంలా ఎదిగిపోయింది. ఇలాంటి పరిస్థితుల్లో శివపాదహృదయర్ తన ఇష్టదైవం అయిన పరమశివుడిని ఇలా ప్రార్థించాడు. "ఓ ఈశ్వరా! ఈ జైనమత ప్రచారకుల దౌర్జన్యాలను అణిచి మరల శైవమతాన్ని సర్వప్రజల మతంగా మార్చగలిగే ఒక శక్తివంతుడైన పుత్రుడిని నాకు ప్రసాదించు".

పరమశివుడు తన భక్తుడి కోర్కెను మన్నించాడు. ఫలితంగా శివపాదహృదయర్ భార్య భాగవతియార్ గర్భవతి అయ్యింది. సూర్యాది గ్రహములు ఉచ్ఛస్థితిలో ఉన్న ఒక శుభ ముహూర్తాంలో ఆమె బాలసూర్యుడు లాంటి ఒక మగబిడ్డను ప్రసవించింది. లేక, లేక కలిగిన

ఆ బిడ్డను శివపాదహృదయర్ దంపతులు ఎంతో గారాబంతో పెంచసాగారు. అతడు కారణజన్ముడని శివపాదహృదయర్‌కి స్పష్టంగా తెలుసు.

ఎల్లప్పుడూ కైలాసంలో ఉండే తాను ఇలా మానవ లోకంలో జన్మించటం ఆ బిడ్డకు ఎంతో బాధ కలిగించేది. ఫలితంగా ఆ బిడ్డ ఎల్లప్పుడూ గుక్కపట్టి ఏడుస్తూ ఉండేవాడు. ఎప్పుడూ ఏడవటం ఆ బిడ్డకు అలవాటు అని చుట్టుప్రక్కలవాళ్ళు అనుకుంటూ ఉండేవారు.

ఆ బిడ్డకు ఇంకా మాటలు రాలేదు. అతడు అప్పటికి ఇంకా పాలు తాగే వయసులోనే ఉన్నాడు. అలాంటి సమయంలో ఒకరోజున శివపాద హృదయర్ దంపతులు ఆ బిడ్డను తీసుకుని ఒక శివాలయం వద్దకు వెళ్ళారు. ఆ తరువాత వారు ఆ బిడ్డను ఆలయ పుష్కరిణి గట్టుమీద పడుకోపెట్టి స్నానం చెయ్యటం కోసం పుష్కరిణిలోకి దిగారు. గట్టుమీద పడుకోపెట్టబడిన ఆ బిడ్డ తన ఎదురుగా కనిపిస్తున్న ఆలయ శిఖరంవైపుచూసి గుక్కపట్టి ఏడవటం ప్రారంభించాడు. అతడు పుష్కరిణిలోకి దిగిన తన తల్లిదండ్రులకోసం రోదిస్తున్నాడని అక్కడ ఉన్న వాళ్ళు అనుకున్నారు. కానీ ఆ బిడ్డ, కైలాసంలో ఉన్న తన అసలైన తల్లిదండ్రులైన ఆదిదంపతులకోసం ఆర్తితో ఏడుస్తున్నాడని ఎవరికీ అర్థంకాలేదు.



బాల సంబంధర్‌కి పాలు త్రాగిస్తున్న పార్వతీదేవి.

పుష్కరిణి గట్టున పడుకుని తనకోసం ఆరాటపడుతున్న ఆ బిడ్డయొక్క ఆర్తిని అర్థంచేసుకున్న పరమశివుడు, పార్వతీదేవితో కలిసి మారువేషంలో ఆ పుష్కరిణి గట్టుకు వచ్చాడు. అప్పుడు పరమశివుడు, పార్వతితో ఇలా

అన్నాడు. "మన అంశతో జన్మించిన ఈ బిడ్డకు ఒక బంగారు గిన్నెలోని నీ చనుబాలను పట్టి త్రాగించు". పరమశివుని ఆజ్ఞ ప్రకారమే పార్వతీదేవి ఒక బంగారు గిన్నెలోకి తన చనుబాలను నింపి ఆపై ఆ బిడ్డను ఎత్తుకుని ఆ బిడ్డకు బంగారు పాత్రతో పాలు త్రాగించింది. సకల జ్ఞానాలకు అధిపతి అయిన ఆ పార్వతీమాత స్తన్యాన్ని సేవించిన ఆ బిడ్డకు సమస్త వేదజ్ఞానము అబ్బింది.

పార్వతీపరమేశ్వరుల అనుగ్రహాన్ని పొందిన ఆ బిడ్డకు అప్పటి నుండి "అలూదెయపిల్లయార్" అన్నపేరు వచ్చింది. అనగా "దైవ అనుగ్రహం పొందినవాడు" అనిఅర్థం. పార్వతీదేవియొక్క చనుబాలను త్రాగిన కారణంగా ఆ బిడ్డకు అపారమైన జ్ఞానం సంప్రాప్తించింది. ఫలితంగా ఆ బిడ్డకు "తిరుజ్ఞాన సంబంధర్" అన్న ఇంకొక పేరుకూడా వచ్చింది. ఎప్పుడైతే పార్వతీమాత స్తన్యాన్ని సేవించాడో అప్పటి నుండి ఆ బిడ్డకు మధురంగా గానం చెయ్యగలిగే మహాశక్తి వచ్చింది. పరమశివునియొక్క లీలను కీర్తిస్తూ "తిరుజ్ఞాన సంబంధర్" పాడిన ఆ గీతాలే ఆ తరువాత కాలంలో "దేవరమ్" అన్నపేరుతో ప్రసిద్ధికెక్కాయి.

ఇక అసలు కథకు వద్దాం. స్నానం ముగించుకుని ఒడ్డుకివచ్చి చూసిన శివపాదహృదయర్ దంపతులకు గట్టుమీద కేరింతలు కొడుతూ పడుకుని ఉన్న బిడ్డ కనిపించాడు. ఆ బిడ్డ మూతిమీద పాలచారికలు కనిపించాయి. ఆ బిడ్డకు ఎవరో తల్లి పాలు ఇచ్చి ఉంటుందని శివపాదహృదయర్ అనుకున్నాడు. "పవిత్ర బ్రాహ్మణ కులంలో పుట్టిన నా బిడ్డ ఎవరో కుల గోత్రాలు తెలియని స్త్రీ ఇచ్చిన పాలుతాగటం నా ఆచారానికి ఎంతో అపచారం". ఇలా అనుకున్న శివపాదహృదయర్ ఒక బెత్తం తీసుకుని మూడు సంవత్సరాల ఆ బిడ్డ ముందు ఆ బెత్తాన్ని ఊపుతూ "నీకు ఈ పాలు ఇచ్చింది ఎవరో మర్యాదగా చెప్పు. లేకపోతే నీకు దెబ్బలు తప్పవు" అన్నాడు కఠినంగా. మూడు సంవత్సరాల ఆ పసిబిడ్డ తన చేతిని ఆకాశంలోకి చూపి చిరునవ్వు నవ్వాడు. అప్పుడు శివపాదహృదయర్ తల ఎత్తి ఆకాశంలోకి చూడగా వృషభ వాహనాన్ని అధిరోహించి పార్వతీ సమేతుడై పరమశివుడు కనిపించాడు. ఆ దృశ్యాన్ని చూసిన శివపాదహృదయర్‌కి ఆనందంతో వళ్ళు పులకరించిపోయింది. తనబిడ్డ

పరమేశ్వరుని కటాక్షానికి పాత్రుడు అయ్యాడు అన్న విషయాన్ని తెలుసున్న శివపాదహృదయర్ ఆ తరువాత ఆ బిడ్డను తన భుజాలమీద ఎక్కించుకుని భార్యతో సహా శివాలయం చుట్టూ ప్రదక్షిణలు చేసాడు.

మర్నాడు ఉదయం పిల్లయార్(ఆబిడ్డ) తిరుక్కోలక క్షేత్రానికి వెళ్ళి అక్కడ వేంచేసి ఉన్న పరమశివుడిని చూస్తూ హృదయం పులకరించిపోయి నృత్యంచేస్తూ పరమశివుడిని కీర్తిస్తూ గానంచేసాడు. పిల్లయార్ తన చేతులతో తన పాటకు తాళం వెయ్యటంవల్ల అతడి లేత చేతులు కంది పోతాయని భావించిన పరమశివుడు రెండు బంగారు తాళములను ఆ బిడ్డ చేతిలో ఉంచాడు.

కొంతకాలం గడిచింది. సంబంధర్(పిల్లయార్) తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆ తీర్థయాత్ర సందర్భంలో సంబంధార్ ఒక మహా శివభక్తుడిని కలుసుకున్నాడు. ఆ శివభక్తుడిపేరు తిరునీలకంఠ యాజ్‌పనార్.

"యాజ్" (తమిళంలో యాజ్ అనగా వీణ అని అర్థం)ని వాయిస్తూ ఎల్లప్పుడూ పరమశివుడిని కీర్తిస్తూ ఉంటాడు కనుక ఆ తిరునీలకంఠకు "తిరునీలకంఠయాజ్‌పనార్" అన్నపేరు వచ్చింది. సంబంధర్, నీలకంఠకు నమస్కరించి వీణ వాయించమని అతడిని అర్థించాడు. అందుకు అంగీకరించిన నీలకంఠయాజ్‌మనార్ అద్భుతంగా వీణను వాయించటం మొదలుపెట్టాడు. ఆ వీణాగానమృతానికి సంబంధర్ హృదయం కరిగి పోయింది. ఆ తరువాత నీలకంఠయాజ్‌పనార్, సంబంధర్‌తో ఇలా అన్నాడు. "ఇకపై మనిద్దరమూ కలిసి ఉందాం. పరమశివునిపై నీవు పాడే పాటలకు అనుగుణంగా నేను వీణను మ్రోగిస్తాను". సంబంధర్ ఎంతో సంతోషంతో అతడికోర్కెను మన్నించాడు.

తీర్థయాత్రలో భాగంగా బాలసంబంధర్ చిదంబర క్షేత్రానికి చేరుకున్నాడు. ఆ క్షేత్రంలో వెలసిన నటరాజస్వామినిచూసి సంబంధర్ ఎంతో పులకరించి పోయాడు. చిదంబరం క్షేత్రంలో వెలసిన నటరాజస్వామి సన్నిధిలో ఉన్న బ్రాహ్మణులు, పరమశివుని వెంట ఉండే శివగణాలు లాగా సంబంధర్‌కి కనిపించారు. దాంతో సంబంధర్ తన వెంట ఉన్న నీలకంఠయాజ్‌నార్‌కి ఆ బ్రాహ్మణులను చూపించి ఆపై నీలకంఠతో ఇలా అన్నాడు. "ఆ బ్రాహ్మణులు శివగణాలులాగా

కనిపించటంలేదా?". నీలకంఠయాజ్‌నార్‌కి కూడా ఆ బ్రాహ్మణులు శివగణాలులాగా కనిపించటంతో అతను ఎంతో ఆశ్చర్యపోయాడు. పరమ శివభక్తుడైన సంబంధర్ తమను శివగణాలుగా చూడటంతో ఆ బ్రాహ్మణులకు ఎంతో సంతోషం కలిగింది. దాంతో వాళ్ళు సంబంధర్‌కి పాదాభివందనం చెయ్యటంకోసం అతని పాదాలవద్ద వంగబోయారు. అప్పుడు సంబంధర్ వారిని వారించి తానే వారి పాదాలకు మ్రొక్కాడు.

ఆ తరువాత సంబంధర్, నీలకంఠయాజ్‌మనార్ జన్మస్థానాన్ని దర్శించాడు. ఆ తరువాత సంబంధర్‌కి తిరుఅరతూరాయ్ క్షేత్రానికి వెళ్ళాలని నిపించింది. ఒక విచిత్రం ఏమంటే ఆ సమయంలో సంబంధర్ వయస్సు కేవలం 5 సంవత్సరాలు. సంబంధర్ కాలినడకన ఇలా యాత్రలు చెయ్యటం తట్టుకోలేని అతని తండ్రి శివపాదహృదయర్ కూడా సంబంధర్‌తో కలిసి యాత్రలు చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఈసారి యాత్రల విశేషం ఏమంటే బాలుడైన సంబంధర్ తన చిన్ని పాదాలతో కొన్నిమైళ్ళు నడిచేవాడు. ఆ తరువాత అతనికి అలసట వచ్చేది. అప్పుడు అతని తండ్రి శివపాదహృదయర్ ఆ బిడ్డను (సంబంధర్) తన భుజాలపై ఎక్కించుకుని మరికొంతదూరం నడిచేవాడు. ఈవిధంగా సంబంధర్ కొంత దూరం నడిచి, కొంతదూరం తన తండ్రి భుజాలమీద కూర్చుని మొత్తానికి మారన్‌పాడి అన్న ప్రదేశానికి చేరుకున్నారు. విపరీతంగా అలిసిపోయిన కారణంగా వాళ్ళు ఆ ప్రాంతంలోని ఒక సత్రంలో బసచేసారు.

తన భక్తుడు అయిన పసిబిడ్డ సంబంధర్ నడిచి, నడిచి అలసిపోవటంతో పరమశివుడికి ఎంతో బాధ కలిగింది. ఆ బిడ్డకి పల్లకి ఉంటే అతడు దాంట్లో హాయిగా ప్రయాణించి తన క్షేత్రానికి చేర్చుకోగలడని భావించిన పరమశివుడు ఆ రోజు రాత్రి తిరుఆరుతురాయ్ గ్రామంలోని బ్రాహ్మణులకు కలలో కనిపించి వారితో ఇలా చెప్పాడు. "రేపు ఉదయం ఇటువైపుగా నా భక్తుడు అయిన సంబంధర్ అనే ఒక బాలుడు నడిచి వస్తాడు. మీరు ఒక ముత్యాల పల్లకిని, ముత్యాల గొడుగును తీసుకువెళ్ళి ఆపై ఆ సంబంధర్‌ని ఆ పల్లకిలో కూర్చోపెట్టి ఆపై అతడికి ఎండ తగలకుండా ముత్యాల గొడుగునువేసి అతడిని తిరుఅరుత్తరాయ్‌కి తీసుకురండి".

ఆ తరువాత పరమశివుడు, సంబంధార్‌కి స్వప్నంలో కనిపించి అతనితో ఇలా చెప్పాడు. "నీవు రేపు ఉదయం తిరుఅరుత్తరాయ్ వైపు ప్రయాణిస్తున్నప్పుడు కొందరు బ్రాహ్మణులు నీకు పల్లకిని మరియు గొడుగును కానుకగా సమర్పిస్తారు. వాటిని స్వీకరించు".

మర్నాడు ఉదయం తిరుఅరుత్తరాయ్ వైపు వెళుతున్న సంబంధర్‌కి ఆ బ్రాహ్మణులు ఎదురుగావచ్చి పరమశివుడు ఇవ్వమన్న కానుకలు సంబంధర్‌కి ఇచ్చారు. సంబంధర్ ఆ కానుకలకు నమస్కరించి ఆపై పల్లకీ ఎక్కాడు. తిరుఅరుత్తరాయ్ క్షేత్రంలో దైవదర్శనం చేసుకున్న తరువాత అనేక క్షేత్రాలను దర్శించి ఆపై సర్కాలికి చేరుకున్నాడు.

స్వగృహానికి తిరిగి వచ్చిన తరువాత శివపాదహృదయర్ తమ బ్రాహ్మణ కులాచారం ప్రకారం సంబంధర్ ఉపనయనం చేసాడు. అప్పటి నుండి సర్కాలిలో ఉన్న బ్రాహ్మణ గురువులు, సంబంధర్‌కి వేదాలను నేర్పటం ప్రారంభించారు. ఒక విచిత్రం ఏమంటే గురువు తనకి వేదాన్ని బోధించటం ప్రారంభించగానే సంబంధర్ వేదాలను అనర్గళంగా పఠించటం ప్రారంభించాడు. గతజన్మలో అతడు కలిగి ఉన్న అద్భుత జ్ఞానం కారణంగా అతడు గురువు చెప్పకముందే సమస్త వేదాలను పలకగలిగాడు. ఒక విచిత్రం ఏమంటే గురువుల వద్ద వేదాలు నేర్చుకోవటానికి వచ్చిన సంబంధాలు వారు చెప్పకముందే వారిముందు తన వేదజ్ఞానాన్ని ప్రదర్శించి వారిని ఆశ్చర్యపరచాడు. ఆ తరువాత శివపంచాక్షరీ మంత్రంయొక్క సారాన్ని ఆ గురువుకి వివరించాడు. ఆ సమయంలో తిరునవుక్కరసు అనే ఒక శివయోగి, సంబంధర్‌ని కలుసుకున్నాడు. కొద్ది రోజులు గడిచాక సంబంధర్ మళ్ళీ తీర్థయాత్రలు ప్రారంభించాడు. ఈసారి అతడు తన తీర్థయాత్రలలో భాగంగా మొదట తిరుపచిలాశ్రమం అనే శివక్షేత్రానికి చేరుకున్నాడు.

ఆ సమయంలో పరమశివభక్తుడైన మాళవరాజు కుమార్తె ఎన్నటికీ నయంకాని ఒక దీర్ఘవ్యాధితో బాధపడుతున్నది. ఏ వైద్యుడు తన కుమార్తెకు రోగం నయం చేయలేకపోవటంతో ఆ రాజు తన కుమార్తెను తీసుకుని తిరుపచిలాశ్రమం ఆలయానికి వచ్చాడు. ఆపై ఆమెను దైవం ముందు ఉంచాడు. సరిగ్గా అదే సమయంలో సంబంధర్ ఆలయంలోనికి వచ్చాడు.

అంతేకాదు ఆలయంలో దైవంముందు అనారోగ్యం కారణంగా స్పృహతప్పి పడిపోయి ఉన్న రాజకుమార్తెను చూసి ఎంతో జాలి పడ్డాడు. ఆమెను కాపాడాలని సంబంధార్ నిర్ణయించుకున్నాడు. వెంటనే ఆయన, ఆ రాజ కుమార్తెను రక్షించమని ఆ క్షేత్రంలో వెలసిన పరమశివుడిని వేడుకుంటూ ఒక గీతం పాడాడు. మహాభక్తుడు అయిన సంబంధర్ కోర్కెను పరమశివుడు మన్నించాడు. ఫలితంగా, ఎన్నేళ్ళుగానో అనారోగ్యంతో ఉంటున్న ఆ రాజ కుమార్తె క్షణంలో ఆరోగ్యవంతురాలిగామారి లేచి కూర్చున్నది. ఈ సంఘటనతో సంబంధర్‌యొక్క మహాత్యం లోకానికి స్పష్టంగా తెలిసింధ్ది.

ఆ తరువాత సంబంధర్ అక్కడ నుండి కొన్ని పుణ్యక్షేత్రాలు దర్శించి సెంకుర్నూర్ అనే ప్రదేశానికి చేరుకున్నాడు. ఆ సమయంలో అక్కడి ప్రజలు చలిజ్వరంతో తీవ్రమైన బాధపడుతున్నారు. తమను ఆ బాధనుండి రక్షించమని ఆ ప్రజలు, సంబంధర్‌ని ప్రార్ధించారు. అప్పుడు సంబంధర్ పరమశివుడిని ఒక పాటతో స్తుతించాడు. ఫలితంగా అక్కడి ప్రజలకు చలిజ్వరం తగ్గిపోయింది.

అక్కడి నుండి మరికొన్ని పుణ్యక్షేత్రాలు దర్శించి ఆపై అతడు తిరువాదూతురాయ్ చేరుకున్నాడు. అతనితోపాటే తీర్థయాత్రలు చేస్తున్న అతని తండ్రి శివపాదహృదయార్, తిరువాదుతురై చేరుకున్నారు. ఆ సమయంలో శివపాదహృదయార్ ఒక మహాయాగాన్ని చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఆ మహాయాగానికి ఎంతో డబ్బు కావలసి ఉంటుంది. తండ్రి కోర్కెను నెరవేర్చాలని నిర్ణయించుకున్న సంబంధర్ వెంటనే అక్కడ ఉన్న శివాలయానికివెళ్ళి శివుని కీర్తిస్తూ ఒక గీతాన్ని ఆలపించాడు. వెంటనే అతడిముందు "శివగణాలు ప్రత్యక్షం అయి ఆపై అతని చేతిలో వెయ్యి బంగారు నాణాలు ఉన్న సంచిని ఉంచి ఆపై అతనితో ఇలా చెప్పారు. "ఈ సొమ్మును నీకు ఇవ్వమని పరమశివుడు పంపించాడు".

సంబంధర్ ఎంతో సంతోషంతో ఆ సొమ్మును తీసుకుని పరమశివుడికి తన కృతజ్ఞతలు తెలియజేసాడు. ఆ తరువాత సంబంధర్ ఆ సొమ్ముని తన తండ్రికి ఇచ్చాడు. ఆ తరువాత శివపాదహృదయార్ ఆ సొమ్ముతో సర్కాలి చేరుకుని యజ్ఞాన్ని సంతృప్తిగా పూర్తిచేసాడు.

సంబంధర్ ఆ తరువాత సత్తమంగాయ్ క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ తిరునీలకంఠనయనార్ అనే గొప్ప శివభక్తుడు సంబంధర్‌ని ఎంతో ఆనందంతో ఆహ్వానించాడు. ఆ సమయంలో సంబంధర్, నీలకంఠ నయనార్‌ని కీర్తిస్తూ ఒక పాటను పాడాడు. ఆ తరువాత సంబంధర్, కెజవేలూర్ క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ ఆయనకు చిరుతొండర్ అనే ఒక గొప్ప శివభక్తుడు కనిపించాడు. అప్పుడు సంబంధర్, చిరుతొండర్‌ని కీర్తిస్తూ ఒక గీతాన్ని పాడాడు. శివభక్తులయొక్క గొప్పతనం ఏమంటే శివునియొక్క భక్తుల్నికూడా శివునితో సమానులుగా భావిస్తూ వారిని కీర్తిస్తారు, పూజిస్తారు. ఆ కారణంగానే మహా శివభక్తుడైన సంబంధర్, ఇతర శివభక్తులైన నీలకంఠనయనార్, చిరుతొండర్‌లను భక్తితో కీర్తించారు.

సంబంధర్ తిరుకెజవేలూర్‌లో ఉన్నంతకాలమూ ప్రతిరోజూ తిరుమరుగల్‌కి వెళ్ళి అక్కడ వేంచేసి ఉన్న పరమశివుడిని పూజిస్తూ ఉండేవాడు. ఒకరోజున ఒక వ్యాపారి తన భార్యతో కలిసి అక్కడకు వచ్చాడు. ఆ రోజు రాత్రి అందరూ నిద్రపోతున్న సమయంలో ఒక విషపూరితమైన త్రాచుపాము ఆ వ్యాపారిని కాటువేసింది. ఫలితంగా అతడు చనిపోయాడు. వైద్యులు ఎన్ని ప్రయత్నాలుచేసినా అతడు బ్రతకలేదు. ఆ సమయంలో ఆ వ్యాపారి భార్య ఆ క్షేత్రంలో వెలసిన పరమశివుడిని, తన భర్తను రక్షించమని పలు, పలు విధాల ప్రార్థించింది. అదే సమయంలో సంబంధర్ ఆ ఆలయంలోకి వచ్చాడు. భర్తకోసం విలపిస్తున్న ఆ భార్యనుచూసి విచారించాడు. ఆ తరువాత ఆమె భర్తను రక్షించమని కోరుతూ మహేశ్వరుడిని కీర్తిస్తూ ఒక గీతాన్ని ఆలపించాడు. పాముకాటువల్ల చనిపోయిన ఆ వ్యాపారి, ఆ గీత ప్రభావంవల్ల మరల సజీవుడై లేచికూర్చున్నాడు. చనిపోయిన వాడిని బ్రతికించిన సంబంధర్‌ని చూసి అక్కడి వారందరూ ఎంతగానో మెచ్చుకున్నారు. ఆ తరువాత సంబంధర్‌కి పాదాభివందనం చేసారు.

ఆ తరువాత చిరుతొండర్ అభ్యర్థనమీద సంబంధర్, చెంకటన్‌కుడి క్షేత్రంలో వెలసిన పరమశివుడిని దర్శించాడు. దర్శనం అయిన తరువాత సంబంధర్ ఆ గుడిలోంచి బయటకు వస్తున్న సమయంలో ఆ క్షేత్రంలోని దైవం, నిజరూపంలో సంబంధర్‌కి దర్శనమిచ్చాడు. ఆ క్షేత్రం నుంచి తిరిగి వెళుతున్న సమయంలో సంబంధర్, తిరుపూకలూర్ అనే గ్రామంలో

ఆగి అక్కడ ప్రముఖ శివభక్తుడు అయిన మురుగనయనార్‌ని కలుసుకుని ఆపై ఆయన్ని కీర్తిస్తూ ఒక గీతం పాడాడు.

ఆ తరువాత ప్రముఖ శివభక్తుడు అయిన అప్పార్‌స్వామింగళ్ సూచన మేరకు సంబంధర్, తిరువారూర్ వెళ్ళి అక్కడ వెలసిన త్యాగీశస్వామిని దర్శించాడు. ఆ తరువాత అప్పర్‌స్వామిగళ్, సంబంధర్ మరియు మురుగనాయర్ కొన్నాళ్ళపాటు ఆ క్షేత్రంలోనే కలిసి కాలంగడిపారు. ఆ తరువాత సంబంధర్, తిరువీరిమిళు అనే గ్రామానికి వెళ్ళాడు.

సంబంధర్ స్వగ్రామమైన సర్కాలికి చెందిన కొందరు బ్రాహ్మణులు ఆ సమయంలో తిరువీరిమిళు గ్రామానికి వచ్చారు. ఆ బ్రాహ్మణులు సంబంధర్‌కి నమస్కరించి ఆయనను సర్కాలికి వచ్చి అక్కడ వెలసిన దైవం తోనియప్పార్‌ని దర్శించమని కోరుకున్నారు. అందుకు అంగీకరించిన సంబంధర్ మరునాడు ఉదయం ఆలయమునకు వెళ్ళాడు. అయితే అక్కడ అప్పటికే తోనియప్పార్ కూర్చుని ఉన్నట్లుగా కనిపించింది. దాంతో సంబంధర్ కొన్ని గీతాలతో తోనియప్పార్‌ని కీర్తించాడు.

ఆ సమయంలో తిరువీరిమిళు ప్రాంతంలో తీవ్రమైన కరువు ఏర్పడింది. త్రాగటానికి నీరులేక పశువులతోపాటు మనుషులు కూడా చనిపోయే దారుణ పరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పుడు సంబంధర్ ఆ పరిస్థితులనుచూసి ఎంతగానో చలించిపోయారు. అప్పుడు ఆయన ఆ క్షేత్రంలో వెలసిన శివుని వద్దకుపోయి ఆ కరువును నిర్మూలించమని ప్రార్ధించాడు. సంబంధర్ ప్రార్ధనలకు కరుణించిన పరమశివుడు ఆయన ముందు ప్రత్యక్షం అయి సంబంధర్‌కి ఒక బంగారు నాణెము అతనితోపాటు ఉన్న అప్పర్‌స్వామిగళ్‌కి ఒక బంగారునాణెము ఇచ్చాడు.

ఆ రోజుల్లో మధురై ప్రాంతంలో జైనమత ప్రాబల్యం అంతకంతకీ పెరిగిపోతున్నది. చివరికి మధురైని పాలించే మహారాజులు కూడా జైన మతంలోకి మారిపోయే పరిస్థితి ఏర్పడింది. ఆ మత ప్రభావానికి లొంగ కుండా మిగిలినవారు ఇద్దరే ఉన్నారు. వారు మధురై మహారాణి మంగయార్‌కరసియార్ మరియు మధురై మహామంత్రి కులాచ్చిరాయ్ నాయనార్ వారు తీవ్రమైన శివభక్తిని కలిగి ఉండేవాళ్ళు. శివుడి విభూతి ముఖాన పెట్టుకున్నట్లయితే మధురై మహారాజు (అప్పటికే జైన మతంలోకి

మారిపోయాడు) తమపై ఆగ్రహిస్తాడని భయపడిన మహారాణి మరియు మహామంత్రి శివభక్తిని తమ మనసులోనే దాచుకుని రహస్యంగా శివుడిని పూజిస్తూ ఉండేవారు. ఇలాంటి సమయంలో మహారాణికి సంబంధర్‌కి సంబంధించిన వార్తలు అందాయి. అతడిని ఎలాగైనా తమవద్దకు పిలిపించుకుని అతని సహకారంతో మధురైలో చీడలాగా వ్యాపిస్తున్న జైన మతాన్ని అంతంచేసి మరల శివమతాన్ని ఉద్ధరింపచేయాలని ఆ మహారాణి మరియు మహామంత్రి నిర్ణయించు కున్నారు. ఆ తరువాత ఆ మహారాణి, మహారాజుకి తెలియకుండా ఒక దూతను రహస్యంగా సంబంధర్ వద్దకు పంపించి అతడిని మధురైకి రమ్మని వర్తమానం పంపింది.

మహారాణి నుండి వర్తమానం అందుకున్న సంబంధర్ వెంటనే అప్పార్ స్వామిని కలుసుకుని ఆయనతో ఇలా చెప్పాడు. "నేను వెంటనే మధురై వెళ్ళాలనుకుంటున్నాను". అప్పటికి 5 సంవత్సరాల బాలుడైన సంబంధర్ మధురై వెళ్ళి అక్కడ జైన మత గురువులతో పోటీపడి ప్రమాదం పాలు అవుతాడేమో అని భయపడిన అప్పార్‌స్వామి, సంబంధర్‌ని మధురైకి వెళ్ళ వద్దని కోరాడు. కానీ సంబంధర్ అందుకు అంగీకరించలేదు. అయితే సంబంధర్‌కి అండగా శివశక్తి ఉంటుంది అని గుర్తించిన అప్పార్‌స్వామి చివరికి అంగీకరించాడు.

సంబంధర్, మధురై వైపు ప్రయాణం మొదలుపెట్టాడు. సరిగ్గా అదే సమయంలో పాండ్యరాజ్యమంతటా (నాటి పాండ్య రాజ్యానికి రాజధానిగా మధురై నగరం ఉండేది) వ్యాపించి ఉన్న జైనమతాచార్యులకి ఏవో అశుభ శకునాలు కనపడటం మొదలయ్యింది. దాంతో వాళ్ళు ఆ విషయాన్ని పాండ్యరాజుకి తెలియజేసారు. సరిగ్గా అదే సమయంలో పాండ్యరాణికి మరియు మహామంత్రికి అనేక శుభశకునాలు దర్శనమిచ్చాయి.

మహారాణి భవనం బయట నిలుచుని ఉన్న సంబంధర్ వద్దకు మహా మంత్రి వచ్చి ఘనస్వాగతం ఇచ్చి భవనం లోపలికి తీసుకువెళ్ళాడు. మహారాణి, సంబంధర్ పాదాలమీదపడి నమస్కరించింది. మహాశక్తివంతుడైన సంబంధర్, మధురైకి వచ్చాడు అన్న విషయం జైన మతాచార్యులుకి తెలిసిపోయింది. ఎప్పుడైతే సంబంధర్ మధురైలో అడుగు పెట్టాడో ఆ క్షణమే మధురైలోని శివభక్తులకి ఎక్కడలేని ధైర్యం వచ్చింది.

దాంతో వాళ్ళు ఎంతో ఉత్సాహంతో "ఓం నమఃశ్శివాయ" అనే పంచాక్షరీ మంత్రాన్ని దిక్కులు పిక్కటిల్లేలా ఉచ్ఛరించటం మొదలు పెట్టారు. శైవ మతాన్ని నాశనంచేసి జైన మతాన్ని వ్యాపింప చెయ్యాలని కంకణం కట్టుకున్న ఆ జైన మతాచార్యులకి శైవులు చేస్తున్న పంచాక్షరీ నామజపం వినటానికి వీలులేనంత కఠోరంగా వినపడింది. దాంతో వాళ్ళు మహారాజు వద్దకు వెళ్ళి ఆయనతో ఇలా అన్నారు.

"మహారాజా! ఎవరో బ్రాహ్మణ బాలుడు నీ రాజ్యంలో శైవ మతం ప్రచారం చెయ్యటానికి వచ్చాడు. అతడు నిజంగా అంత గొప్ప శివభక్తుడు అయితే అతడిని మాతో వాదించి గెలవమను. అప్పుడు చూద్దాం. అతని సత్తా ఎంతో". అసలు సంబంధర్‌ని భూమిమీద లేకుండా చేస్తే అతడితో వాదించి గెలవాల్సిన పని ఉండదు అని భావించిన కొందరు జైనమతాచార్యులు, చేతబడి చేయించి సంబంధర్‌ని అంతం చెయ్యాలని ప్రయత్నించారు. సర్వ తాంత్రిక శక్తులకు అధిపతి అయిన పరమశివుడి భక్తుడైన సంబంధర్‌ని క్షుద్ర ప్రయోగాలు ఏమీ చెయ్యలేకపోయాయి.

జైనమతాచార్యులయొక్క దుర్బోధలకు తలవంచిన మహారాజు, సంబంధర్ మరియు ఇతర శివభక్తులు బస చేసిన డేరాకు నిప్పు పెట్టించాడు. అయితే సంబంధర్ మహత్యం కారణంగా ఆ నిప్పు ఆరిపోయింది. ఎవరికీ ఏ హాని జరగలేదు. కానీ మహాభక్తుడు అయిన సంబంధర్‌కి హాని చెయ్యాలని ప్రయత్నించిన మహారాజుకి శరీరమంతా విపరీతమైన మంటలు మొదలయ్యాయి. ఆ బాధ తట్టుకోలేక మహారాజు నేలపైపడి పొర్లాడు. రాజు బాధ తగ్గించటానికి రాజవైద్యులు ఎన్నో ఔషధాలు వాడారు. అయినా ఫలితం దక్కలేదు. జైన మతాచార్యులు తమ మంత్రశక్తిని ఎంతగా ఉపయోగించినా రాజుగారి బాధ తగ్గలేదు. అప్పుడు మహారాణి, రాజు వద్దకు వెళ్ళి ఆయనతో ఇలా అన్నది. "ప్రభూ! మీరు మహా శివభక్తుడు అయిన సంబంధర్ డేరాకు నిప్పు ముట్టించి ఆయనను అంతం చెయ్యాలని ప్రయత్నించారు. కానీ ఆయనకు ఏమీ కాలేదు. మీరు చేసిన పాపం మీకే తగిలింది. ఫలితంగా మీరు ఒళ్ళంతా మండిపోతున్న బాధతో తల్లడిల్లి పోతున్నారు. మీరు వెంటనే ఆ సంబంధర్‌ని పిలిపించండి. ఆయనే మిమ్మల్ని ఈ బాధ నుండి రక్షిస్తాడు".

అప్పుడు రాజుగారు, రాణితో ఇలా అన్నాడు. "ఆ బాలయోగి సంబంధర్ నా బాధను తగ్గించినట్లయితే నేను తప్పకుండా శైవ మతంలో చేరతాను". అప్పుడు మహారాణి మరియు మహామంత్రి తమ పరివారంతో సంబంధర్ వద్దకు చేరుకుని ఆయన పాదాలకు నమస్కరించి ఆయనను రాజుగారి వద్దకు రమ్మని అభ్యర్థించాడు. మహారాణి ద్వారా విషయం తెలుసుకున్న సంబంధర్ ఏమాత్రం వెనుకాడకుండా మహారాజు వద్దకు వచ్చాడు. సంబంధర్ తన చేతితో రాజుగారిని తాకాడు. దాంతో ఆయన బాధ అదృశ్యం అయిపోయింది. ఆ సంఘటనతో రాజుగారికి సంబంధర్ యొక్క మహాత్యం అర్థమయిపోయింది. ఇది చూసిన జైన మతాచార్యులకు ఆందోళన కలిగింది. రాజుగారికి శైవమతంపై పూర్తి నమ్మకం కుదిరితే అతడు ఇకపై జైన మతాన్ని ఆదరించడని, జైనమతాచార్యులకి భయం పుట్టింది. దాంతో వాళ్ళు సంబంధర్‌ని తమతో వాదించి గెలవమని సవాల్ చేసారు. జైన మతాచార్యులు మరియు సంబంధర్‌కి మధ్య పోటీ పెట్టటానికి మహారాజు అంగీకరించాడు.



అగ్నిలో తమ, తమ తాళపత్ర గ్రంథాలను వేస్తున్న సంబంధర్ మరియు జైనమత గురువులు.

ఆ పోటీ రెండు రకాలుగా జరిగింది. అది ఎలాగంటే ఒక జైన మతాచార్యుడు, సంబంధర్‌తో ఇలా అన్నాడు. "మీ శైవ మతానికి సంబంధించిన సమాచారాన్ని వ్రాసిన తాళ పత్రాలను అగ్ని గుండంలో వెయ్యాలి. మీ శైవ మతం నిజంగా గొప్పదైతే ఆ తాళపత్రాలు కాలకుండా బయటకు వస్తాయి. మేము కూడా మా మత సిద్ధాంతాలను వ్రాసిన తాళ పత్ర గ్రంధాలను ఆ అగ్ని గుండంలోనే వేస్తాం. మా మతం గొప్పది అయితే మా తాళపత్ర గ్రంధాలు అగ్నిలో కాలకుండా బయటకు వస్తాయి. మీ తాళపత్ర గ్రంధాలు కాలిపోతాయి".

సంబంధర్ అందుకు అంగీకరించాడు. పరమశివుడిపై ఒక భక్తిరస పూరితమైన గీతాన్నిపాడి, ఆ తరువాత తన వద్ద ఉన్న కొన్ని శైవమత సంబంధ తాళపత్ర గ్రంధాలను తన ఎదురుగా ఉన్న అగ్ని గుండంలో వేసాడు. జైన మతాచార్యులు కూడా కొన్ని తాళపత్ర గ్రంధాలను తీసుకు వచ్చి అగ్ని గుండంలో వేసారు. పెద్ద పెద్ద జ్వాలలతో మండుతున్న ఆ అగ్ని గుండంలో వేయబడిన జైనుల తాళపత్ర గ్రంధాలు కన్నుమూసి తెరిచేలోగా బూడిదగా మారిపోయాయి. సంబంధర్ వేసిన తాళపత్ర గ్రంధాలు ఎంతసేపు గడిచినా అగ్నిలో తగలపడక యధాతధంగా ఉన్నాయి. అది చూసిన రాజుకి సంబంధర్‌యొక్క మహత్యం స్పష్టంగా అర్థమయ్యింది. సంబంధర్ పోటీలో గెలిచాడని జైనమతాచార్యులు ఓడియారని రాజు అధికారికంగా ప్రకటించాడు.

ఇంత జరిగినా జైన మతాచార్యులకు బుద్ధిరాలేదు. సంబంధర్‌కి నిజంగా శక్తి ఉంటే ఇంకో పోటీలో కూడా పాల్గొనాలని రాజుతో చెప్పారు. రాజు అంగీకరించాడు. అప్పుడు ఒక జైన మతాచార్యుడు, సంబంధర్‌తో ఇలా అన్నాడు. "నీ శైవ మతానికి చెందిన తాళపత్ర గ్రంధాలను వైగై నది ప్రవాహంలో వెయ్యాలి. నీ మతంలో సత్యం ఉన్నట్లయితే, నీ దైవానికి మహత్తు ఉన్నట్లయితే నీవు ప్రవాహంలో వేసిన తాళపత్ర గ్రంధాలు ప్రవాహానికి ఎదురుగా తేలి ఒడ్డుకు చేరుకుంటాయి".

సంబంధర్ ఆ పోటీకి కూడా అంగీకరించాడు. ఇంతకుముందు జరిగిన పోటీలో ఓడిపోయినా ఏమాత్రం సిగ్గుపడకుండా మళ్ళీ పోటీకి సిద్ధపడుతున్న జైనమతాచార్యులను చూసిన పాండ్యరాజ మంత్రి కులాచరైనయనార్‌కి

ఎంతో ఆగ్రహం వచ్చింది. అప్పుడు ఆయన, జైన మత గురువులతో ఇలా అన్నాడు. "సంబంధర్ ఈ పోటీలో కూడా గెలిస్తే మీరు ఏం చేస్తారు". అప్పుడు జైన మత గురువులు, మహారాజుతో మరియు మహామంత్రితో ఇలా అన్నారు. "ఈ పోటీలో సంబంధర్ గెలిస్తే మమ్మల్ని ఉరి తియ్యండి. ఒకవేళ సంబంధర్ ఓడిపోతే అతడిని ఉరితీయాలి అన్నారు. అందుకు సంబంధర్ కూడా అంగీకరించాడు.

సంబంధర్, పరమశివుని కీర్తిస్తూ వ్రాసిన పాటలు ఉన్న తాళపత్ర గ్రంధాలను ఒకసారి తన కళ్ళకు అద్దుకుని నదిలోకి విసిరివేసాడు. ఆ తరువాత జైన మత గురువులు కూడా తమ మత సిద్ధాంతాలను వ్రాసిన తాళపత్ర గ్రంధాలను వైగై నదిలోకి విసిరివేసారు. కొంతసేపు గడిచింది. సంబంధర్ నదిలోకి విసరిన తాళపత్ర గ్రంధాలు ప్రవాహానికి ఎదురుగా కొట్టుకువచ్చి ఆపై ఒడ్డుకి చేరుకున్నాయి. జైన మత గ్రంధాలు నీళ్ళల్లో కొట్టుకుపోయాయి. ఆవిధంగా జైనమత గురువులు పోటీలో ఓడిపోయారు. దాంతో పాండ్యరాజు, ఆ పోటీలో పాల్గొన్న జైన మత గురువుల్ని ఉరి తీయించాడు. ఆవిధంగా పాండ్య రాజ్యంలో జైనమతం నశించి పోయింది. శైవ మతం మళ్ళీ వ్యాపించటం మొదలయ్యింది.

సంబంధర్ తనకు 16 సంవత్సరాలు వయస్సు వచ్చేవరకు దక్షిణ భారతదేశంలోని, ఉత్తర భారతదేశంలోని మరియు శ్రీలంక దేశాలలో ఉన్న అనేక ముఖ్యమైన శైవ క్షేత్రాలను దర్శించుకున్నాడు. ఆ తరువాత ఆయన దక్షిణ భారతదేశంలో సంచరించటం మొదలు పెట్టాడు. సరిగ్గా అదే సమయంలో మైలాపూర్‌లో (ఆధునిక చెన్నై నగరానికి దగ్గరలో ఉన్న ప్రాంతం) 'శివనేశర్ అనే ధనికుడైన వ్యాపారి ఉండేవాడు. అతడికి పుంపవాయ్ 'అనే ఒక కుమార్తె ఉన్నది. ఆమె చాలా అందంగా ఉండేది. సంబంధర్ గురించి అనేక విషయాలను తెలుసుకున్న శివనేశర్ తన కుమార్తెను సంబంధర్‌కు ఇచ్చి వివాహం చెయ్యాలని అనుకున్నాడు. అప్పటికి అతని కుమార్తె వయస్సు 12 సంవత్సరాలు.

ఇలాంటి సమయంలో ఒకరోజున ఒక విషపూరితమైన సర్పం కాటు కారణంగా పుంపవాయ్ చనిపోయింది. సంబంధర్ ఆమెను తప్పనిసరిగా బ్రతికించగలడు అని విశ్వసించిన శివనేశర్ మరణించిన తన కుమార్తెకు

దహన క్రియలు జరిపించి ఆపై ఆమె అస్థికలను సేకరించి ఒక కుండలో ఉంచి ఆ కుండను ప్రతిరోజూ పూలతో పూజిస్తూ ఆపై సంబంధర్‌ని మనసులో ధ్యానం చేసుకోవటం మొదలుపెట్టాడు. కొంతకాలం గడిచింది సంబంధర్ తన తీర్థయాత్రలో భాగంగా తిరువత్తియూర్ చేరుకున్నాడు.

మైలాపూర్ ప్రాంతం తిరువత్తియూర్‌కి చాలా దగ్గరలో ఉంటుంది. సంబంధర్, తిరువత్తియూర్ వచ్చాడన్న విషయం తెలుసుకున్న శివనేశర్ మైలాపూర్ నుంచి తిరువత్తియూర్ దాకా తాటాకు పందిళ్ళువేసి ఆపై సంబంధర్‌ని ఆ పందిళ్ళ క్రింద నుండి మైలాపూర్‌లోని తన గృహానికి రమ్మని ఆహ్వానించాడు. అతని ఆహ్వానాన్ని మన్నించి సంబంధర్ తన పల్లకిలో మైలాపూర్‌కి చేరుకున్నాడు. అక్కడ శివనేశర్ కుమార్తెయొక్క అస్థికలు ఉంచిన పాత్ర కనపడింది. జరిగిన విషయాన్ని దివ్యదృష్టి ద్వారా తెలుసుకున్న సంబంధర్, శివనేశర్ కుమార్తెను బ్రతికించాలని నిర్ణయించుకున్నాడు. ఆ తరువాత సంబంధర్, మైలాపూర్‌లోని కపాలేశ్వరస్వామిని (పరమశివుడిని) కీర్తిస్తూ ఒక గీతాన్ని ఆలపించాడు. ఆ గీత ప్రభావంవల్ల పాత్రలో ఉంచబడిన పుంపవాయ్ అస్తికలు ఒక మృతదేహం రూపంలోకి మారాయి. ఆ తరువాత సంబంధర్, ఈశ్వరుడిని స్తుతిస్తూ ఇంకొక గీతం పాడాడు. ఆ గీత ప్రభావం వల్ల పుంపవాయ్‌కి ప్రాణాలు తిరిగి వచ్చాయి. ఆమె సజీవంగా అక్కడ నిలబడింది. అప్పుడు శివనేశర్ రెండు చేతులూ జోడించి సంబంధర్‌కి నమస్కరించి ఆయనతో ఇలా అన్నాడు.


తిరుజ్ఞాన సంబంధర్

"నేను నా కుమార్తె పుంపవాయ్‌ని మీకిచ్చి వివాహం చెయ్యాలని ఏనాడో నిర్ణయించుకున్నాను. మీ దయవల్ల ఆమె ఇప్పుడు మళ్ళీ బ్రతికింది. దయచేసి ఆమెను మీరు వివాహం చేసుకోవాలి". అప్పుడు సంబంధర్ చిరునవ్వు

నవ్వుతూ ఇలా అన్నాడు. "నీ కుమార్తె పుంపవాయ్‌కి నేను ప్రాణాలుపోసి బ్రతికించాను. నాచేత ప్రాణం పోయబడిన ఆమె నా కుమార్తెతో సమానం అవుతుంది. అందువలన నేను ఆమెను వివాహం చేసుకోవటం ధర్మవిరుద్ధం అవుతుంది. కనుక నేను ఆమెను వివాహం చేసుకోవటం వీలుకాదు".

"సంబంధర్ చెప్పిన మాటల్లో ఎంతో ధర్మం ఉన్నది" అని అర్థం చేసుకున్న పుంపవాయ్ మరేమీ ఎదురు చెప్పలేదు. సంబంధర్ తప్ప మరెవ్వరినీ తన భర్తగా ఊహించుకోలేని పుంపవాయ్ సన్యాసినిగా మారిపోయి తన చివరి శ్వాస వరకు శివ ధ్యానంలో కాలంగడుపుతూ ఉండిపోయింది. కొద్దిరోజులు గడిచాయి సంబంధర్‌కి అప్పటికి 16 సంవత్సరాలు వయస్సు వచ్చింది. అతనికి వివాహం చెయ్యాలని అతని తండ్రి శివపాదహృదయార్ నిర్ణయించుకున్నాడు. నల్లూర్‌పెరుమానం అనే ప్రదేశంలో నివసిస్తున్న నంబందర్‌నంబి అనే వ్యక్తియొక్క కుమార్తెను సంబంధర్‌కు ఇచ్చి వివాహం చెయ్యాలని శివపాదహృదయార్ తీర్మానించాడు. తండ్రి మాటను కాదనలేని సంబంధర్ వివాహం చేసుకోవటానికి అంగీకరించాడు.

శాస్త్రోక్తంగా సంబంధర్‌కి వివాహం జరిగింది. వివాహం జరిగిన తరువాత సంబంధర్ దంపతులు శివాలయంలోకి వెళ్ళి శివుడిని పూజించారు. ఆ తరువాత సంబంధర్ పరమశివుడిని ఇలా ప్రార్థించాడు. "ఈశ్వరా! నాకు ఇక నీలో ఐక్యం అయ్యే అవకాశాన్ని ప్రసాదించు. నాకు ముక్తిని అనుగ్రహించు". అప్పుడు పరమశివుడు ప్రత్యక్షం అయి సంబంధర్‌తో ఇలా అన్నాడు. "నీవు, నీ భార్య మరియు నీ వివాహానికి వచ్చిన వారికి కైలాస ప్రాప్తిని ప్రసాదిస్తున్నాను". ఆ తరువాత సంబంధర్, పరమశివుడిని కీర్తిస్తూ "పంచాక్షరీ మంత్రాన్ని ఒక గీత రూపంలో పాడాడు. ఆ పాట పూర్తి అయిన మరుక్షణమే సంబంధర్ దంపతులు మరియు ఆ ఆలయంలోకి సంబంధర్‌తో పాటుగా వచ్చిన తిరునీలకాంతర్, మురుగనయనార్, తిరునీలకాంతయాజ్‌పన్నార్‌లు దివ్యజ్యోతులుగా మారి ఆ ఆలయంలోని శివలింగంలో లీనమైపోయారు".

ఆవిధంగా తిరుజ్ఞానసంబంధర్ అతి చిన్న వయస్సులోనే ఎన్నో మహత్యాలను ప్రదర్శించి మరియు జైనమత దుర్మార్గాలను అణచివే

శైవమతాన్ని మళ్ళీ పునరుద్ధరించి 64 మంది శైవ నాయనారుల్లో ప్రముఖుడిగా గుర్తించబడ్డాడు. శివునిలో లీనమయ్యేనాటికి తిరుజ్ఞానసంబంధర్ వయస్సు కేవలం 16 సంవత్సరాలు కావటం విశేషం.

## 4. సిద్ధపురుషుడు గజానన్ మహారాజ్ జీవిత విశేషములు?

మహారాష్ట్రలోని బుల్ధానా జిల్లాలో ఉన్న షిగామ్ ప్రాంతంలో అత్యంత శక్తివంతుడిగా పేర్కొనబడిన ఒక మహాయోగి సమాధి ఉన్నది. ఆ మహాయోగి పేరు గజానన్ మహారాజ్. నాగపూర్-ముంబయి రైలుమార్గంలో షిగామ్ రైల్వేస్టేషన్ తగులుతుంది.

గజానన్‌మహారాజ్ తొలి జీవితము విశేషాలు చరిత్ర కారులకు అందటంలేదు. ఆ కారణంగా ఆయన ఏ తారీఖున మరియు ఏ సంవత్సరంలో పుట్టారో తెలియదు. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే గజానన్‌మహారాజ్ తెలంగాణాకు చెందిన ఒక బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడని తెలుస్తున్నది.

భారతీయ తొలి స్వతంత్రయోధులలో ఒకడైన శ్రీబాలగంగాధర్‌తిలక్ యొక్క సన్నిహిత స్నేహితుడు అయిన దాదాసాహెబ్‌కార్పడె చెప్పిన సమాచారం ప్రకారం చూసినట్లయితే "గజానన్ మహారాజ్ తెలంగాణా ప్రాంతానికి చెందిన ఒక పండిత బ్రాహ్మణుడు అని, ఆయన తెలంగాణా యాసతో కూడిన తెలుగు మాట్లాడేవాడని తెలుస్తున్నది.

కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం గజానన్ మహారాజ్ తన 11వ ఏట ఇల్లు వదిలిపెట్టి పారిపోయాడని, ఆయన తల్లిదండ్రులు భవానీరాం మరియు సాహుబాయ్ అని తెలుస్తున్నది. షిగామ్ పట్టణానికి దగ్గరలో ఉన్న థాల్ అనే ఒక కుగ్రామంలో గజానన్ మహారాజ్ జన్మించి ఉంటాడని ఈ పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు. అయితే వీరు చెబుతున్న సమాచారాన్ని నిరూపించే ఆధారాలు మాత్రం లభ్యం కావటం లేదు.

మరికొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం అక్కల్‌కోటలోని స్వామిసమర్ధ ఆశ్రమంలో గజానన్‌మహారాజ్ కొద్దిరోజులు నివసించారని అప్పటికి ఆయన బాలుడని తెలుస్తున్నది. మరికొంతమది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం స్వతంత్ర పోరాటంలో పాల్గొన్న తాంతియతోపే అనే విప్లవ వీరుడే గజానన్ మహారాజ్ అయి ఉంటాడని తెలుస్తున్నది. బ్రిటీష్‌వారి దృష్టి నుండి తప్పించుకోవటంకోసమే తాంతియాతోపే సన్యాసి రూపం ధరించి తిరిగాడని ఈ పరిశీలకులు అభిప్రాయ పడుతున్నారు. అయితే వీరి ఊహలను బలపరచే ఆధారాలు కూడా ఏమాత్రం లభించటం లేదు.

'గజాననుడు' అనగా గజముఖం కలవాడు అనిఅర్థం. కనుక గజాననుడు అంటే 'గణపతి' అని అర్థంచేసుకోవాలి. ఆ స్వామి అంశతో జన్మించిన ఒక మహాయోగికి గజానన్‌మహారాజ్ అన్నపేరు పెట్టబడింది. యోగులు 3 రకాలుగా ప్రవర్తిస్తూ ఉంటారని యోగశాస్త్రం తెలియజేసింది. ఆ రకాలు ఏవంటే 1. ఉన్మత్త (పిచ్చివాడు) 2. పిశాచ (దయ్యం) 3. బాల (పిల్లలు).

గజానన్‌మహారాజ్ ప్రవర్తన ఒక పసిబిడ్డలాగా ఉండేదని ఆయనను బాగా దగ్గరగా చూసిన వ్యక్తులు చెప్పేవారు. కొన్నిసార్లు ఆయన పిచ్చివాడి లాగా ప్రవర్తించేవాడట. కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం గజానన్ మహారాజ్ వేదాలను కంఠతా పట్టాడని, ఆయన మహా పండితుడు అని తెలుస్తున్నది. గజానన్‌మహారాజ్ తొలిసారిగా షిగామ్ ప్రాంతంలో క్రీ.శ.1878, ఫిబ్రవరి 23వ తేదీన ప్రజల దృష్టిలో పడ్డాడు.

షిగామ్ అనే గ్రామంలో ఒక ఇంటివద్ద బ్రాహ్మణులకు ఎవరో సంపన్నుడు విందు భోజనాలు పెడుతున్నాడు. వాళ్ళు భోజనాలు చేసిన తరువాత ఆ ఎంగిలి ఆకులు ఎత్తి ఒకచోట కుప్పగా పారేసారు. అప్పుడు వీధి కుక్కలు ఆ ఆకులమీదకి ఎగబడి వాటిలో మిగిలిన ఆహార పదార్థాలను ఆత్రంగా తింటున్నాయి. ఆ సమయంలో ఆ విందు భోజనాలు ఏర్పాటు చేసిన వెంకట్ మరియు దామోదర్ అనే వ్యక్తులు అనుకోకుండా ఆ ఎంగిలి

ఆకులవైపు చూడగా అక్కడ నగ్నంగా ఉన్న ఒక 16 ఏళ్ళ బాలుడు అక్కడ ఉన్న కుక్కలతో కలిసి ఎంగిలి ఆకులతో ఉన్న పదార్థాలను ఆనందంగా స్వీకరిస్తూ కనిపించాడు. అంతేకాకుండా కుక్కలు నాకిన ఆకుల్ని కూడా ఆ బాలుడు నాకాడు. చూడటానికి పిచ్చివాడిలా కనిపిస్తున్న ఆ బాలుడి శిరస్సు చుట్టూ ఒక దివ్యతేజస్సు కనపడింది. అతడు సాక్షాత్తు మారువేషంలో ఉన్న దత్తాత్రేయుడు అయి ఉంటాడని వెంకట్ మరియు దామోదర్‌లు భావించారు. దాంతో వాళ్ళు ఆ బాలుడి వద్దకు వెళ్ళి అతడితో ఇలా అన్నారు. "నాయనా! ఇంట్లోకి రా. నీకు మంచి భోజనం పెడతాం. ఆ ఎంగిలి ఆకుల్ని వదిలిపెట్టు".

అప్పుడు ఆ బాలుడు చిరునవ్వు నవ్వుతూ "అలాగే" అన్నట్లుగా తల ఊపాడు. ఆ తరువాత వాళ్ళు ఆ బాలుడిని ఇంట్లోకి తీసుకువెళ్ళి ఒక మంచి ఆకులో తాజా ఆహార పదార్థాలు వడ్డించి ఆ ఆకుని అతడిముందు ఉంచారు. అప్పుడు ఆ బాలుడు తన ఆకులో వడ్డించిన పదార్థాలు అన్నింటినీ కలిపి, ఆపై దాంట్లో ఒక ముద్ద మాత్రమే నోట్లోవేసుకుని ఆ తరువాత ఆ ప్రక్కనే ఉన్న మురికిగుంటలో ఉన్న నీటిని తీసి తన దాహం తీర్చుకున్నాడు. ఆ తరువాత కాలంలో ఆ బాలుడే "గజానన్ మహారాజ్" అన్నపేరుతో ప్రఖ్యాతి చెందాడు.

అదేరోజు సాయంత్రం గజానన్ మహారాజ్ వీధులలో పిచ్చివాడిలాగా సంచరిస్తూ ఆపై ఒక ప్రదేశంలో కూర్చుని సమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు. ఆ సమయంలో బంకట్‌లాల్‌అగర్వాల్ అనే ఒక సంపన్న వడ్డీవ్యాపారి గజానన్ మహారాజ్‌ని చూసాడు. ఆయన గొప్పయోగి అని బంకట్‌లాల్‌కి వెంటనే అర్థమయ్యింది. ఆ తరువాత అగర్వాల్ ఆహ్వానం మీద గజానన్ మహారాజ్, అగర్వాల్ ఇంటికి వెళ్ళాడు.

గజానన్ మహారాజ్ తన జీవితకాలంలో ఎన్నో మహాత్యాలను ప్రదర్శించాడని బంకట్‌లాల్ తెలియజేసాడు. గజానన్ మహారాజ్ చేసిన మహత్యాలలో ముఖ్యమైనవి ఏవంటే ఆయన తన రెండు చేతులతో చెరుకు గడను మెలితిప్పి చెరుకురసం పిండాడు. ఒకసారి నిప్పులేకుండా హుక్కాని

వెలిగించాడు. ఇంకొకసారి ఎండిపోయిన బావిలో నిండుగా నీరువచ్చేలా చేసాడు. మరొకసారి ఒక కుష్ఠు వ్యాధిగ్రస్తురాలికి ఆ వ్యాధి నుండి విముక్తి కలిగించాడు.

**గజానన మహారాజ్ లీలలు :**

మొదట్లో చాలాకాలంవరకు షిగామ్ ప్రాంత ప్రజలు గజానన్ మహారాజ్‌ని పిచ్చివాడుగానే భావించేవారు. ఒకసారి గజానన్ మహారాజ్ ఒక మే నెలలో మిట్టమధ్యాహ్నంవేళ ఎండలో సంచరిస్తూ విపరీతమైన దాహానికి గురి అయ్యాడు. అప్పుడు ఆయన భాస్కర్ అనే ఒక ధనవంతుడి ఇంటికివెళ్ళి తనకు కాసిన మంచీనీళ్ళు ఇవ్వమని ఆయనను అడిగాడు. అప్పుడు ఆ భాస్కర్ కోపంతో ఇలా అన్నాడు. "నీలాంటి సోమరిపోతులకు మంచినీళ్ళు ఇచ్చినా అది పాపమే. నువ్వు అవతలికి పో". దాహంతో అలమటించి పోతున్న తనకు నీళ్ళు ఇవ్వకపోగా కోపంతో ఛీత్కరించిన భాస్కర్‌ని ఏమీ అనకుండా గజానన్ మహారాజ్ అక్కడికి దగ్గరలో ఉన్న ఒక బావి దగ్గరకు వెళ్ళాడు. ఆ బావి ఏనాడో ఎండిపోయింది. అప్పుడు భాస్కర్ తన అరుగుమీద కూర్చుని ఇలా అన్నాడు. "రేయ్ బుద్ధిహీనుడా! ఆ ఎండిపోయిన బావిలో నీకు నీళ్ళు ఎక్కడ దొరుకుతాయ్?".

గజానన్‌మహారాజ్ ఏమీ మాట్లాడకుండా ఆ బావి ప్రక్కనే కూర్చుని ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. కొద్ది నిమిషాలు గడిచాయ్. అప్పటివరకు ఎండిపోయిన ఉన్న ఆ బావిలో చాలా వేగంగా నీళ్ళు ఊరి పై అంచు దాకా వచ్చేసాయ్. ఆ దృశ్యం చూసిన భాస్కర్‌కి తలతిరిగిపోయింది. తాను హీనంగా మాట్లాడిన గజానన్ మహారాజ్ సామాన్యుడు కాదని, ఒక మహా యోగి అని భాస్కర్‌కి అర్థమయిపోయింది. వెంటనే భాస్కర్, గజానన్ మహారాజ్ పాదాలపైపడి క్షమాపణలు కోరుకున్నాడు. అంతేకాదు తన మిగిలిన జీవితాన్ని గజానన్ మహారాజ్ శిష్యుడిగా గడిపాడు.

ఒకరోజున గజానన్ మహారాజ్, షిగామ్‌గ్రామం పొలిమేరల్లో కూర్చుని ధ్యానం చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఆ గ్రామంలోని ఒక మోతుబరి ఆసామి కొడుకులు అటువైపుకే వచ్చారు. వాళ్ళు చదువు, సంధ్య లేని తుంటరివాళ్ళు. మహాత్ముడైన గజానన్ మహారాజ్‌యొక్క గొప్పతనం ఆ యువకులకు తెలియదు. దాంతో వాళ్ళు ధ్యానంలో ఉన్న గజానన్

మహారాజ్‌కి ధ్యానభంగం చెయ్యటంకోసం ఆయనను అనేకరకాలుగా ఇబ్బందిపెట్టారు. పెద్ద గొంతుతో.ఆయనను నిందించారు. అయినా ఆయన కళ్ళు తెరవలేదు. ధ్యానంలోంచి బయటకురాలేదు. ఎలాగైనా ఆయన ధ్యానాన్ని భగ్నం చెయ్యాలని భావించిన ఆ యువకులు అక్కడకు దగ్గరలో ఉన్న ఒక చెరుకుతోట నుండి కొన్ని చెరుకు గడలను తీసుకువచ్చి ఆ గడలతో గజానన్ మహారాజ్‌ని చావుదెబ్బలు కొట్టారు. వాళ్ళు అన్ని దెబ్బలు కొట్టినా ఆయన శరీరంపై ఎలాంటి గుర్తు పడలేదన్న విషయం ఆ మూర్ఖులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. తాము పిచ్చివాడు అని భావిస్తున్న గజానన మహారాజ్ నిజమైన సిద్ధపురుషుడు అని ఆ యువకులకు అప్పుడు అర్ధమయ్యింది. దాంతో వారు ఆయనకు నమస్కరించి తమను క్షమించమని వేడుకున్నారు. అప్పుడు గజానన్ మహారాజ్ మెల్లిగా కళ్ళుతెరచి చిరునవ్వు నవ్వాడు. ఆపై మృదువైన స్వరంతో వారితో ఇలా అన్నాడు.

"బిడ్డలారా! ఈ చెరుకు గడలతో నన్ను కొట్టి కొట్టి మీరు బాగా అలసిపోయారు. ఇప్పుడు నేను ఇవ్వబోయే చెరకురసాన్ని తాగి మీ అలసట తీర్చుకోండి". గజానన్ మహారాజ్ మహత్యం కారణంగా ఆయనముందు కొన్ని చిన్న చిన్న పాత్రలు ప్రత్యక్షం అయ్యాయి. ఆ తరువాత గజానన్ మహారాజ్ ఆ యువకులవద్ద ఉన్న చెరుకు గడలను తీసుకుని తన చేతులతో వాటిని బలంగా మెలిపెట్టాడు. ఫలితంగా ఆ చెరుకుగడల నుండి రసం కారి అక్కడ ఉన్న చిన్న పాత్రలు నిండిపోయాయి. ఆ తరువాత గజానన్ మహారాజ్ ఆ యువకులకు చెరుకురసం ఉన్న పాత్రలు ఇచ్చి త్రాగమని కోరాడు. తనను హింసించిన వారికి కూడా అతిధి మర్యాదలు చెయ్యగలిగిన మహామనిషి గజానన్ మహారాజ్. ఆ యువకుల హింసా స్వభావాన్ని తన అహింసతో మార్చగలిగిన మహనీయుడు గజానన్ మహారాజ్.

ఒకసారి గజానన్ మహారాజ్, తన శిష్యుడైన వెంకట్‌ని పిలిచి అతడితో "నాయనా! చిలుము కాల్చుకోవాలి. నీవు ప్రక్కనే ఉన్న ఆ కొలిమివద్దకు వెళ్ళి అక్కడ ఉన్న కంసాలిని అడిగి కొంచెం నిప్పు తీసుకురా" అన్నాడు. వెంకట్, కంసాలి వద్దకువెళ్ళి "గజానన్ మహారాజ్‌కి నిప్పుకావాలి ఇవ్వు" అన్నాడు. అప్పుడు ఆ కంసాలి వెటకారంగా నవ్వుతూ "మీ గజానన్ మహారాజ్ ఈ సమాజానికి ఒక భారం. అలాంటి వాడికి నిప్పు ఇవ్వటం

వృథా" అన్నాడు. కంసాలి అలా మాట్లాడేసరికి వెంకట్‌కి చాలా బాధవేసింది. దాంతో అతడు మరేమీ మాట్లాడకుండా గజానన్ మహారాజ్ వద్దకు వెళ్ళాడు. జరిగింది దూరం నుండి గమనించిన గజానన్ మహారాజ్, వెంకట్‌తో ఇలా అన్నాడు.

"నాయనా! ఒక కాలిపోయిన అగ్గిపుల్ల క్రింద పడి ఉన్నది. దానిని తీసి నా చిలుముమీద ఉంచు. చిలుము ఎలా అంటుకోదో చూస్తా". వెంకట్, గజానన్ మహారాజ్ చెప్పినట్లే చేసాడు. గజానన్ మహారాజ్ చిలుముని బలంగా పీల్చాడు. అంతే చిలుము అంటుకుని పొగ రావటం మొదలయ్యింది. ఈ అద్భుతాన్ని చూసిన అక్కడివారు గజానన్ మహారాజ్ మహత్యాన్ని స్పష్టంగా తెలుసుకున్నారు. అదేరోజు మధ్యాహ్నం ఆ కంసాలి తన బంధువులకోసం ఒక విందు భోజనం ఏర్పాటుచేసాడు. బంధువులు అందరూ భోజనాలు చెయ్యటానికి సిద్ధమవుతున్నారు. ఇంతలో వంట గదిలో నుండి కుళ్ళు కంపు రావటం మొదలయ్యింది. అది ఏమిటో చూద్దామని ప్రయత్నించినవారికి విందుభోజనం కుళ్ళు వాసన వస్తున్నదని అర్థమయిపోయింది. దాంతో ఆ బంధువులు ఆ కంసాలిని నానాతిట్లు తిట్టి అక్కడ నుండి వెళ్ళిపోయారు.

ఉదయం తాను గజానన్ మహారాజ్‌ని కించపరచిన కారణంగానే తన ఇంట్లో చేసిన వంటలు కుళ్ళు వాసన వస్తున్నాయి అని ఆ కంసాలికి అర్థమయ్యింది. దాంతో అతడు గజానన్ మహారాజ్ వద్దకు వెళ్ళి తనను క్షమించమని ఆయనను ప్రాథేయపడ్డాడు. గజానన్ మహారాజ్ చిరునవ్వు నవ్వి ఆ కంసాలితో "నీ ఇంట్లో వండిన పదార్థాల నుండి కొంచెం తీసుకుని రా" అన్నాడు. ఆ కంసాలి వెంటనే తన ఇంటికి వెళ్ళి ఒక చిన్న గిన్నెలో కొంచెం అన్నం పెట్టుకుని తీసుకుని వచ్చి గజానన్ మహారాజ్ చేతిలో పెట్టాడు. గజానన్ మహారాజ్ తనచేతిలో ఉన్న గిన్నెలోని అన్నాన్ని ఒకసారి తేరిపార చూసాడు. అంతే ఆ అన్నం మధురమైన వాసనలను వెలువరించటం మొదలుపెట్టింది.

అప్పుడు గజానన్ మహారాజ్ తనచేతిలోని గిన్నెను కంసాలి చేతిలో ఉంచి అతడితో "ఈ అన్నాన్ని నీ ఇంట్లో ఉన్న ఆహార పదార్థాల్లో కలుపు. అంతా సరిగా అవుతుంది" అన్నాడు. ఆ కంసాలి అలాగే చేసాడు. దాంతో

అతడి ఇంట్లోని ఆహార పదార్థాలు చక్కటి సువాసనలను వెలువరించటం మొదలుపెట్టాయి. అద్భుతమైన ఆ సువాసనలకు ఆకర్షితమైన అతడి బంధువులు వెంటనే అతడి ఇంటికివచ్చి భోజనాలు పెట్టమని అడిగారు. కంసాలి అందరికీ భోజనాలు వడ్డింపచేసాడు. తమ జీవితంలో ఇంత రుచికరమైన భోజనం ఏనాడూ చేయలేదని ఆ బంధువులు కంసాలిని ఎంతగానో ప్రశంసించారు. గజానన్ మహారాజ్ మహత్యం ఎలాటిందో ఆ కంసాలికి ఆ రోజున స్పష్టంగా అర్థమయ్యింది.

ఒకసారి గజానన్ మహారాజ్, షిగామ్‌లోని వెంకట్ అనే ఒక భక్తుడి ఇంట్లో ఆధ్యాత్మిక సమావేశం జరుగుతుంటే అక్కడికి వెళ్ళాడు. ఆ సమయంలో వెంకట్ పనివాళ్ళు ఆ సమావేశానికి దగ్గరలో ఉన్న ఒక తోటలో మొక్కజొన్న కండెలు నిప్పులమీద కాల్చటం మొదలుపెట్టారు. దురదృష్టవశాత్తు కండెలు కాల్చటంకోసం అంటించబడిన మంటలు పెద్దవి అయిపోయి అక్కడికి దగ్గరలో ఒకచెట్టుమీద ఉన్న తేనెతుట్టెకు తాకాయి. దాంతో ఆ తుట్టెమీద ఉన్న వేలాది తేనెటీగలు ఆగ్రహంతో ఇవతలికి వచ్చి ఆధ్యాత్మిక సమావేశం జరుపుకుంటున్న భక్తులమీదకి విరుచుకుపడ్డాయి. కనిపించినవాడిని ఇష్టమొచ్చినట్లుగా కుట్టటంప్రారంభించాయి ఆ తేనెటీగలు. దాంతో అప్పటివరకు అక్కడ హాయిగా మాట్లాడుకుంటున్న భక్తులు భయంతో కేకలు వేస్తూ కనిపించిన దారివైపు పరుగులు తీసారు.

గజానన్ మహారాజ్ మాత్రం చాలా ప్రశాంతంగా అక్కడే కూర్చుండి పోయాడు. తేనెటీగలు ఆయన శరీరంమీద ఏమాత్రం ఖాళీ వదలకుండా కాట్లు వేసాయి. అదిచూసిన వెంకట్ ఎంతో ఆందోళనకు గురై గజానన్ మహారాజ్ వద్దకు వెళ్ళాడు. కొంతసేపటికి ఆ తేనెటీగలు అన్నీ వెళ్ళిపోయాయి. అప్పుడు భక్తులంతా అక్కడికి తిరిగివచ్చారు. గజానన్ మహారాజ్ వంటిమీద దిగిపోయి ఉన్న తేనెటీగ కొండెల్నిచూసి ఆ భక్తులు ఎంతో ఆందోళనకు గురి అయ్యారు. ఏవేవో మందులుతెచ్చి ఆయన వంటిపై రాసారు. అయినా ఏ ప్రయోజనమూ కలుగలేదు.

అప్పుడు గజానన్ మహారాజ్ వారికి ధైర్యంచెప్పి ఆపై యోగశాస్త్రంలో చెప్పబడిన ఒక ప్రత్యేకమయిన భంగిమ ఆసనంలో కూర్చున్నాడు. ఫలితంగా ఆయన శరీరంలో దిగిపోయిన తేనెటీగ కొండెలు వాటంతట

అవే బయటకు వచ్చేసాయి. దాంతో ఆయన శరీరం మామూలుగా తయారయ్యింది. ఆ దృశ్యంచూసి అక్కడచేరిన భక్తులు ఆనందంతో హర్ష ధ్వానాలు చేసారు. ఆ తరువాత ఆ భక్తులందరూ గజానన్ మహారాజ్‌తో కలిసి రుచికరమైన మొక్కజొన్న కండెలు ఆనందంగా తిన్నారు.


శ్రీగజానన్ మహారాజ్

గజానన్ మహారాజ్ జంతువులపై కూడా తన ప్రభావాన్ని చూపగలిగాడు. అది ఎలాగంటే గజానన్ మహారాజ్‌కి తక్లికర్ అనే ఒక శిష్యుడు ఉండేవాడు. అతనివద్ద ఒక గుర్రం ఉండేది. అది తన దగ్గరకు ఎవరు వచ్చినా వాళ్ళని తన వెనక కాళ్ళతో తన్నటం లేదా తన దంతాలతో వాళ్ళ చేతులను, కాళ్ళను కరవటం లాంటి క్రూర కృత్యాలకు పాల్పడుతూ ఉండేది. ఆ గుర్రంయొక్క ప్రవర్తన గురించి ఆ ప్రాంతం అంతా తెలిసి పోయింది. దాంతో దాన్ని ఎవరికైనా అమ్మేదామన్నా తక్లికర్‌కి వీలుకాలేదు. దాంతో అతడు ఆ గుర్రాన్ని తీసుకుని గజానన్ మహారాజ్ వద్దకు వెళ్ళాడు. ఆ గుర్రాన్ని గజానన్ మహారాజ్ ఆశ్రమం బయట ఉన్న ఒక ప్రదేశంలో ఇనుప గొలుసులతో కట్టేసాడు తక్లికర్. రాత్రి అయ్యింది. తక్లికర్ ఆశ్రమం బయట ఒక మంచంమీద పడుకుని నిద్రపోతున్నాడు. అర్ధరాత్రి సమయంలో అతనికి మెళుకువ వచ్చింది. కళ్ళు తెరచి చూసిన అతనికి కొంచెం దూరంలో గుర్రం నిలుచుని ఉన్నది. దానికి కట్టిన గొలుసు తెగిపోయి ఉన్నది. గుర్రాలు నిలుచునే నిద్రపోతాయి. ఆవిధంగానే ఈ గుర్రంకూడా నిలుచుని నిద్రపోతున్నది. ఆ గుర్రాన్ని పరిశీలించిన తక్లికర్‌కి ఒక విచిత్రమైన దృశ్యం కనిపించింది. అది ఏమిటంటే ఆ గుర్రం కాళ్ళమధ్య గజానన్ మహారాజ్ పడుకుని నిద్రపోతున్నాడు.

ఆ తరువాత తక్లికర్ మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు. తెల్లవారింది. ఆ గుర్రం చాలా సాత్వికంగా ప్రవర్తించటం మొదలుపెట్టింది. గజానన్ మహారాజ్ మహత్యం కారణంగానే ఆ గుర్రం తన మొరటుతనాన్ని వదిలిపెట్టి మంచిగా మారిపోయిందని తక్లికర్‌కి అర్ధమయ్యింది.

నకుల్‌అగర్వాల్ అనే ఒక వ్యాపారి గజానన్ మహారాజ్ శిష్యుడిగా ఉండేవాడు. ఈ అగర్వాల్ వద్ద ఒక పొగరుబోతు ఆవు ఉండేది. అది తనకు ఎవరు కనిపిస్తే వాళ్ళని తన కొమ్ములతో పొడిచి తీవ్రంగా గాయపరుస్తూ ఉండేది. ఒకసారి అదిచేసిన హింసకు తట్టుకోలేక నలుగురు మనుషులు ఆ ఆవును ఒక పెద్ద తాడుతో కట్టివేసి ఆపై దానిని ఈడ్చుకుంటూ గజానన్ మహారాజ్ వద్దకు తీసుకువచ్చారు. ఆ దృశ్యం చూసిన గజానన్ మహారాజ్ ఎంతో ఆగ్రహించి ఆపై పెద్ద స్వరంతో ఆ మనుషులతో ఇలా అన్నాడు.

"మీకు ఎంత ధైర్యం. పవిత్రమైన ఆ ఆవును అలా తాళ్ళతో కట్టివేసి ఈడ్చుకు వస్తారా?. ముందు దాన్ని విడిచిపెట్టండి". గజానన్ మహారాజ్ అలా అనేసరికి ఆ మనుషులు ఎంతో కంగారుపడి ఆపై ఆ ఆవును బంధాల నుండి విడిపించారు. అప్పుడు ఆ ఆవు మెల్లిగా నడుస్తూ గజానన్ మహారాజ్ వద్దకువెళ్ళి ఆయన పాదాలపై తన తలను ఉంచింది. అదే సమయంలో అక్కడకు వచ్చిన అగర్వాల్ ఆ దృశ్యం చూసి ఎంతో ఆశ్చర్యానికి గురి అయ్యాడు. ఎంతో పొగరుబోతుగా ఉన్న ఆ ఆవు గజానన్ మహారాజ్ దర్శనంతో సాధుజీవిగా మారిపోవటం అగర్వాల్‌కి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ తరువాత అగర్వాల్ ఆ ఆవును గజానన్ మహారాజ్ ఆశ్రమానికి సమర్పించాడు. ఇప్పటికీ షిగామ్ సంస్థానంలో ఆ ఆవుయొక్క సంతతి వర్ధిల్లుతున్నది.

గజానన్ మహారాజ్ పొడవుగా, బలంగా, అందంగా ఉండేవాడట. ఆయన చేతులు చాలా పొడవుగా ఉండేవి. ఆయన చాలా బలాన్ని కలిగి ఉండేవాడట. ఒకసారి హరిపాటిల్ అనే ఒక మల్లయుద్ధ నిపుణుడు, గజానన్ మహారాజ్‌తో కుస్తీపోటీకి దిగాడట. ఆ కుస్తీలో హరిపాటిల్, గజానన్ మహారాజ్‌ని ఒక అంగుళంకూడా కదల్చలేకపోయాడట. గజానన్ మహారాజ్ తన రెండు చేతులతో హరిపాటిల్‌ని ఎత్తి నేలమీద కుదేసాడు.

హరిపాటిల్ లాంటి మహాబలాఢ్యుడిని అవలీలగా మట్టికరిపించినబలం గజానన్ మహారాజ్‌కి ఉన్నదని ఆనాడు ఋజువు అయ్యింది.



చిలుము త్రాగుతున్న గజానన్ మహరాజ్

గజానన్ మహారాజ్ ఎల్లవేళలా చిలుము త్రాగుతూ ఉండేవాడు. ఆయన బుసకొట్టే శబ్దంతో చిలుము పొగని బలంగా పీలుస్తూ ఉండేవాడు. ఒక విశేషం ఏమంటే ఆయనకు చిలుము తాగటం అలవాటుకాదు. కానీ భక్తులు ఆయనకు చిలుము తెచ్చిఇచ్చి త్రాగమని కోరేవారు. భక్తుల కోరికలు కాదనలేని గజానన్ మహారాజ్ ఆ చిలుముపీల్చి భక్తుల్ని ఆనందపరచేవాడు.

గజానన్ మహారాజ్ ఎల్లప్పుడూ జపమాల తిప్పుతూ "గణ్ గణ్ గణాత్ బోటే" అని పాడుతూ ఉండేవాడని చెబుతారు. కొంతమంది అభిప్రాయం ప్రకారం స్వామిసమర్థ్ మరియు గజానన్ మహారాజ్‌ల మధ్య ఎన్నో పోలికలు ఉన్నాయని తెలుస్తున్నది. ఇద్దరూ పరమహంస సన్యాసులే కావటం విశేషం. మరి కొంతమంది అభిప్రాయం ప్రకారం స్వామిసమర్థ్, ఆ తరువాత కాలంలో గజానన్ మహారాజ్‌గా జన్మించారని తెలుస్తున్నది.

గజానన్ మహారాజ్ క్రీ.శ. 1909, సెప్టెంబర్ 8వ తేదీన మహారాష్ట్ర లోని షిగామ్‌లో సమాధి అయ్యాడు.

షిగామ్‌లోని ఆయన సమాధి మీద ఆయన పేరుమీదుగా ఒక ఆలయం నిర్మించబడింది. ప్రతిరోజూ వందలాదిమంది భక్తులు ఈ ఆలయాన్ని దర్శించుకుని తరిస్తూ ఉన్నారు. ఈనాడు భౌతికంగా గజానన్

మహారాజ్ కనపడకపోయినప్పటికీ ఆయన ప్రాణజ్యోతియొక్క ప్రభావం ఈ క్షేత్రానికి వచ్చిన భక్తులకు స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది.

## 5. మధ్వ పీఠాధిపతి రఘోత్తమతీర్థర్ జీవిత విశేషాలు?

వైష్ణవమతంలో విభిన్న వర్గాలు ఉన్నాయి. అలాంటి వాటిలో "మధ్వమతం" కూడా ఒకటి. "మధు" అనగా సంతోషం. "వ" అనగా జ్ఞానం అనిఅర్థం. "మధ్వ" అనగా ఆనందంయొక్క జ్ఞానం అనిఅర్థం.

దైవాంశ సంభూతుడయిన మధ్వాచార్యులు స్థాపించిన మధ్వమతం ఆయన తరువాతకాలంలో సరైన గురువు లేనికారణంగా ఎన్నో ఆటు పోటులకు గురైంది. మధ్వ మతస్తులు గమ్యం తెలియని బాటసారులు లాగా మారిపోయారు. అలాంటి సమయంలో భగవత్ సంకల్పంవల్ల ఒక దివ్యపురుషుడు ఈ లోకంలో రఘోత్తమతీర్థర్ అనే సిద్ధపురుషుడిగా అవతరించాడు. ఆయన ఆధ్వర్యంలో మధ్వమతం ఒక శక్తివంతమైన మతంగా రూపుదిద్దుకున్నది.

మధ్వమతంలో 14వ మతాచార్యుడిగా గుర్తించబడిన శ్రీరఘోత్తమ తీర్థర్ క్రీ.శ.1537-1596 మధ్య భౌతికదేహంతో మానవుల మధ్య సంచరించారు.

ఉత్తరాదిమఠ అధిపతి అయిన శ్రీరఘువర్య తీర్థర్ ఒకసారి హైదరాబాద్ నవాబు పాలనలో ఉన్న నిజాం రాష్ట్రంలోని స్వర్ణవట అనే గ్రామానికి వెళ్ళారు. ఆ గ్రామ జమిందారు సుబ్బభట్ట మరియు ఆయన భార్య గంగాబాయ్, శ్రీరఘువర్యతీర్థర్‌ని తమ భవనానికి భిక్ష తీసుకోవటానికి ఆహ్వానించారు. అయితే రఘువర్యతీర్థర్ ఆ దంపతుల ఆహ్వానాన్ని తిరస్కరించారు. అందుకు గల కారణాన్ని కూడా ఆయన ఆ దంపతులకు చెప్పారు. అది ఏమిటంటే ఆ పందులకు సంతానంలేదు.

అప్పుడు ఆ జమిందారు దంపతులు రఘువర్యతీర్థర్‌ని ఎన్నో విధాలుగా ప్రాధేయపడి ఆయనను తమ భవనానికి రమ్మని వేడుకున్నారు. అప్పుడు

ఆయన ఆ దంపతులతో ఇలా అన్నారు. "సరే, మీ ఇంటికి వచ్చి నేను భిక్ష తీసుకోవాలి అంటే మీకు మొదట పుట్టే మగబిడ్డని నా ఆధ్వర్యంలో నడిచే ఉత్తరాది మఠానికి ఇవ్వాలి. అందుకు మీరు సమ్మతిస్తే మీ ఇంటికి వచ్చి భిక్ష స్వీకరిస్తాను. "అసలు తమకు సంతానమే లేదు అని నిరాశలో ఉన్న ఆ దంపతులకు తమకు పురుష సంతానం కలుగుతుంది అని రఘువర్య తీర్థర్ నర్మగర్భంగా చెప్పటంతో మహదానందం కలిగింది". మీరు చెప్పినట్టే మాకు మొదట మగబిడ్డ పుడితే ఆ బిడ్డను మీ మఠానికి ఇస్తాం. మీరు వెంటనే మా ఇంటికి వచ్చి భిక్ష స్వీకరించండి అని ఆ దంపతులు, స్వామి వారికి చెప్పారు.

ఆ తరువాత శ్రీరఘువర్యతీర్థర్ ఆ జమిందారు గృహానికి వెళ్ళి అక్కడ శ్రీమూలరామ మరియు సీతాదేవికి పూజలుచేసారు. ఆ తరువాత కొన్ని మంత్ర అక్షింతలను ఆ దంపతులకు ఇచ్చారు. కొంతకాలం గడిచింది. జమిందారు భార్య గంగాబాయి గర్భవతి అయ్యింది. ఆ విషయాన్ని జమిందారు, శ్రీరఘువర్యతీర్థర్‌కి ఒక దూత ద్వారా తెలియజేసారు. తొమ్మిది నెలల గడిచాయి. ఇక ఏ క్షణమైనా గంగాబాయికి ప్రసవం కావొచ్చు. అప్పుడు రఘువర్యతీర్థర్ ఒక పెద్ద బంగారు పళ్ళాన్ని తన మఠం నుండి జమిందారు ఇంటికి పంపించారు. బిడ్డపుట్టగానే ఆ బిడ్డను మొదట ఆ బంగారు పళ్ళెంలో పడుకోబెట్టాలని ఆయన ఆ జమిందారుకి తెలియజేసారు. ఆ తరువాత గంగాబాయికి ప్రసవం అయ్యింది. మంత్రసాని చాలా జాగ్రత్తగా పుడుతున్న బిడ్డ నేలను తాకకుండా తన చేతులతో ఆ బిడ్డను పట్టుకుని బంగారు పళ్ళెంలో పెట్టింది. ఆ తరువాత బిడ్డను ఉంచిన ఆ బంగారు పళ్ళాన్ని వెంటనే ఉత్తరాది మఠానికి తీసుకువెళ్ళాడు జమిందారు. అప్పుడు రఘువర్యతీర్థర్ ఆ బిడ్డకు రామచంద్ర అన్నపేరు పెట్టి ఆ బిడ్డను అక్కడే పెంచటం మొదలుపెట్టారు.

మఠంలో ఉన్న వ్యాసకూర్మ సాలగ్రామానికి ప్రతిరోజూ పాలతో అభిషేకం చేస్తారు. అలా అభిషేకం చేయబడిన పాలను ఆ బిడ్డకు పట్టించేవారు. ఆ బిడ్డకు (రామచంద్ర) ఏడు సంవత్సరాల వయస్సు వచ్చిన తరువాత ఆ మఠంలోనే ఉపనయనం చేసారు. ఆ మరుసటి సంవత్సరమే ఆ బిడ్డకు సన్యాసం ఇవ్వబడింది. సన్యాసంతోపాటుగా ఆ బిడ్డకు శ్రీరఘోత్తమ తీర్థర్ అన్న బిరుదుకూడా ఇవ్వబడింది. (ఆ తరువాత కాలంలో

శ్రీరఘోత్తమతీర్థర్ దాదాపు 39 సంవత్సరాలపాటు ఉత్తరాదిమఠ సింహాసనాన్ని పరిపాలించారు.)

శ్రీరఘోత్తమతీర్థర్‌కి వేదాంత శాస్త్రాలలో ప్రాథమిక జ్ఞానం వచ్చిన తరువాత మఠానికి సంబంధించిన 'ఆద్య' 'వరదాచార్య' అనే పండితుడిని శ్రీరఘోత్తమతీర్థర్‌కి వేదాంత శాస్త్రాలలో పరిపూర్ణ జ్ఞానాన్ని అందించటం కోసం నియమించారు శ్రీరఘువర్యతీర్థర్. వరదాచార్య ప్రతిరోజూ మఠానికి వచ్చి బాలుడైన శ్రీరఘోత్తమతీర్థర్‌కి వేదాంత శాస్త్రాల పాఠాలను బోధిస్తూ ఉండేవాడు. కొద్ది రోజులు గడిచాయి. "నా అంతటి పండితుడు ఉత్తరాది మఠానికి వెళ్ళి ఒక బాలుడికి పాఠాలు చెప్పటమా? ఇది నా స్థాయికి ఎంతమాత్రం తగదు". అని అహంకరించిన వరదాచార్య అప్పటి నుండి మఠానికి వెళ్ళటం మానేసాడు. ఆ గ్రామంలో దళపతి అనే ఒక పెద్ద భూస్వామి ఉండేవాడు. అతడు వరదాచార్యను ఎంతగానో గౌరవిస్తూ ఉండేవాడు. అతడికి శ్రీరఘోత్తమతీర్థర్ యొక్క ప్రత్యేకతలు తెలియవు. అందువలన అతడు వరదాచార్యను మరియు శ్రీరఘోత్తమతీర్థర్‌ను సమానంగా చూసేవాడు.

'తనను వరదాచార్య తక్కువగా చూస్తున్నాడు' అని తెలిసినప్పటికీ శ్రీరఘోత్తమతీర్థర్ ఆ విషయాన్ని పట్టించుకోకుండా చాలా ఓర్పుగా వరదాచార్య ఇంటికి వెళ్ళి ఆయన వద్ద పాఠాలు నేర్చుకోవటం మొదలు పెట్టాడు. కొద్ది రోజులు గడిచాయి. ఒకసారి ద్వాదశి వచ్చింది. ఆ రోజున తన ఇంటికివచ్చి భోజనం చెయ్యమని వరదాచార్యను మరియు శ్రీరఘోత్తమతీర్థర్‌ను కోరాడు దళపతి. వరదాచార్య సకాలానికే దళపతి ఇంటికి వెళ్ళిపోయాడు. శ్రీరఘోత్తమతీర్థర్ మఠంలో తాను చేయవలసిన హోమాలు మరియు పూజలు ముగించుకుని దళపతి ఇంటికి వెళ్ళేసరికి కొంచెం ఆలస్యం అయ్యింది. అప్పటికే వరదాచార్య మరియు మిగిలిన బ్రాహ్మణులు చక్కగా భోజనాలు చేస్తున్నారు. తమతోపాటు భోజనానికి పిలువబడిన శ్రీరఘోత్తమతీర్థర్ రాకుండా తాము మాత్రమే భోజనాలు చెయ్యటం సబబు కాదు అని వరదాచార్య బృందానికి ఏమాత్రం తోచలేదు. అందుకు కారణం వరదాచార్యకి శ్రీరఘోత్తమతీర్థర్ అంటే కొంచెం ద్వేషం మరికొంచెం చులకన ఉన్నాయి అని చెప్పవచ్చు. అయితే దళపతి భార్యకి

శ్రీరఘోత్తమతీర్థర్ యొక్క మహత్యం తెలుసు. అందుకే ఆమె శ్రీరఘోత్తమ తీర్థర్ పాదాలపై పడి తన భర్త దళపతి చేసిన తప్పును మన్నించమని ఆయనను వేడుకున్నది.

ఆ తరువాత శ్రీరఘోత్తమతీర్థర్ కూడా అక్కడ భోజనం చేసి ఆపై మఠానికి చేరుకున్నాడు. మఠానికి చేరుకున్న తరువాత ఉదయం జరిగిన సంఘటన గుర్తుకువచ్చి శ్రీరఘోత్తమతీర్థర్ ఎంతో విచారానికి గురి అయ్యాడు. "అయ్యో! నాకు గొప్ప పాండిత్యం లేకపోవటం వల్ల నేను ఆ వరదాచార్య ఇంటికివెళ్ళి విద్యను నేర్చుకోవలసి వస్తున్నది. ఆయన వీలు దొరికినప్పుడల్లా నన్ను అవమానిస్తున్నాడు. ఇలా ఎంతకాలం అవమానాలు భరిస్తూ విద్య నేర్చుకోవాలి? అని బాధపడుతూ నిద్రలోకి జారుకున్నాడు శ్రీరఘోత్తమతీర్థర్. అప్పటికి కొద్ది నెలల క్రింత భౌతిక దేహాన్ని చాలించి బృందావనంలోకి ప్రవేశించిన శ్రీరఘువర్యతీర్థర్, శ్రీరఘోత్తమతీర్థర్ స్వప్నంలో కనిపించి ఆపై చిరునవ్వుతో ఇలా అన్నాడు. "నీవేమీ విచారించకు నీ సమస్యను నేను పరిష్కరిస్తాను. ఒక్కసారి నీ నాలుకను బయటకుచాపు". శ్రీరఘోత్తమతీర్థర్ నిద్దురలోనే తన నాలుకను బయటకు చాపాడు. అప్పుడు ఆయన గురువైన శ్రీరఘువర్యతీర్థర్ తన వ్రేలితో శ్రీరఘోత్తమతీర్థర్ నాలుక మీద ఏవో బీజాక్షరాలను వ్రాసి ఆపై ఇలా అన్నారు. "నీవు ఇకపై సామాన్యుడిలా జీవించకు. ఒక మహారాజులా దావు, దర్పంతో ప్రవర్తించు. ఈ ఉత్తరాధి మఠానికి గొప్ప స్థాయిని కల్పించు" అని చెప్పి అదృశ్యం అయిపోయారు. మర్నాడు తెల్లవారుఝామున నిద్రలేచిన శ్రీరఘోత్తమ తీర్థర్‌లో ఏదో విచిత్రమైన మార్పు వచ్చింది. ఆయనలో సరస్వతీదేవి ప్రకాశిస్తున్నది. ఆ రోజు మధ్యాహ్నం నుండి శ్రీరఘోత్తమతీర్థర్ మఠంలోని అనేకమందికి వేదాంత శాస్త్రంలో అత్యున్నతస్థాయి పాఠాలు బోధించటం ప్రారంభించాడు.

అంతేకాకుండా స్వప్నంలో తన గురువైన రఘువర్యతీర్థర్ చెప్పిన విధంగా తన విధానాన్ని పూర్తిగా మార్చుకున్నాడు. అనేకమంది సేవకుల్ని ఏర్పాటుచేసుకున్నాడు. తాను, తన శిష్యులు ప్రయాణం చెయ్యటానికి ఏనుగులను ఏర్పాటు చేసాడు. మఠం నిర్వహించటానికి వైభవోపేతమయిన నిర్మాణాలను ప్రారంభించాడు. ఆ నిర్మాణాల నిర్వహణకు ప్రత్యేకమయిన

నిపుణులను నియమించాడు. అప్పటి నుండి శ్రీరఘోత్తమతీర్థర్ తన మఠంలో చేరిన వందలాదిమందికి "న్యాయసుధ" అన్న వేదాంత గ్రంథంమీద తన మధురమైన స్వరంతో ఉపన్యాసం ఇవ్వటం ప్రారంభించాడు.

తను మాత్రమే గొప్ప పండితుడిని అని, తనకు మాత్రమే "న్యాయసుధ" గ్రంథంపై పట్టు ఉన్నదని విర్రవీగే వరదాచార్యకు శృంగభంగం జరిగిన ఒక సంఘటన ఆ తరువాత కాలంలో జరిగింది. అది ఏమిటంటే...

ఒక రోజు శ్రీరఘోత్తమతీర్థర్ "న్యాయసుధ" గ్రంథంలోని అతిక్లిష్టమైన భాగాన్ని శిష్యులకు బోధిస్తున్నాడు. నిజానికి ఆ భాగాన్ని అర్థంచేసుకోవటం వరదాచార్యకు ఏనాడూ సాధ్యంకాలేదు. ఆ సమయంలో అక్కడే ఉన్న వరదాచార్యకు ఒక భయం ఏర్పడింది. అది ఏమిటంటే శ్రీరఘోత్తమతీర్థర్ తనని పిలిచి ఆ భాగానికి అర్థం చెప్పమని అడుగుతాడని, తాను చెప్పలేడు కనుక అందరిముందు తన పరువు పోతుందని". శ్రీరఘోత్తమతీర్థర్ తనని ఏమీ అడగక ముందే వరదాచార్య అక్కడనుండి లేచి ప్రక్కనే ఉన్న ఒక గోద వెనకాల ఎవరికీ కనపడకుండా నక్కాడు. అయితే ఇవేమీ పట్టించుకోని శ్రీరఘోత్తమతీర్థర్, గురుకటాక్షం వల్ల తనకు లభించిన అపూర్వ పాండిత్య బలం కారణంగా న్యాయసుధలోని క్లిష్టమైన భాగాన్ని అవలీలగా వివరించాడు. గోడచాటున దాక్కున్న వరదాచార్య, శ్రీరఘోత్తమతీర్థర్ చెప్పింది విని ఎంతగానో సిగ్గుపడ్డాడు.

'అవతార పురుషుడైన శ్రీరఘోత్తమతీర్థర్‌ని తాను ఎంతగానో చిన్నచూపు చూసి అవమానించాడు'. ఈ విషయం అర్థంకాగానే వరదాచార్య శ్రీరఘోత్తమతీర్థర్ వద్దకువెళ్ళి ఆయనకు సాష్టాంగ నమస్కారం చేసాడు. సంస్కారం, మంచితనం మూర్తీభవించిన శ్రీరఘోత్తమతీర్థర్, వరదాచార్యను క్షమించటమే కాకుండా ఉత్తరాది మఠంలో తొలితీర్థం తీసుకునే అవకాశం వరదాచార్యకు ఇవ్వాలని ఒక శాసనాన్ని జారీచేసాడు. "తనను అవమానించిన వాడినికూడా గౌరవించగల గొప్ప గుణం" శ్రీరఘోత్తమ తీర్థర్‌లో ఉన్నదని ఈ సంఘటన నిరూపించింది.

శ్రీరఘోత్తమతీర్థర్ మఠ నిర్వాహణను సంపూర్తిగా మార్చివేసాడు. మఠాధిపతికి సింహాసనము, కిరీటము, పల్లకి, తెల్లగొడుగు, వింజామరలు,

మకరతోరణం, కాగడాలు, జెండాలు, సంగీతవాయిద్యాలు ఉండేలా శాసనం చేసాడు. "ఉత్తరాది మఠాధిపతి అంటే ఒక రాజుకు తగ్గని వైభోగాన్ని కలిగి ఉంటాడని" లోకానికి తెలియజేసినవాడు శ్రీరఘోత్తమతీర్థర్ అంటే అతిశయోక్తికాదు.

ఒకసారి శ్రీరఘోత్తమతీర్థర్ తన మందీమార్బలంతో, శిష్యులతో ఒక అడవిగుండా ప్రయాణం చేస్తున్నాడు. శ్రీరఘోత్తమతీర్థర్ ఒక పల్లకిలో ప్రయాణిస్తున్నాడు. ఆ పల్లకీకి ముందు వెనక అనేకమంది శిష్యులు మరియు అనుచరులు నడుస్తున్నారు. ఆ బృందం అడవి మధ్యలోకి వచ్చేసమయానికి కొంతమంది దారిదోపిడి దొంగలు ఆ బృందాన్ని అటకాయించారు. అది చూసిన శ్రీరఘోత్తమతీర్థర్ ఆ పల్లకిలోనే ధ్యానం చెయ్యటం ఆరంభించారు. ఇంతలో హఠాత్తుగా ఆ దోపిడీ దొంగల చుట్టూ ఒక పెద్ద జపమాల తాడులాగా చుట్టుకున్నది. దాంతో ఆ దొంగలు శారీరకంగా బలహీనపడి స్వామివారిముందు సాగిలపడ్డారు. శ్రీస్వామివారు ఆ దోపిడీ దొంగల్ని క్షమించి వదిలిపెట్టారు.

కాలం గడిచిపోయింది. శ్రీఘోత్తమతీర్థర్ భౌతిక దేహాన్ని చాలించ వలసిన సమయం వచ్చింది.

"పంచకృష్ణ క్షేత్రము" అని ప్రసిద్ధికెక్కిన మానంపూండి (తిరుక్కోయిలూర్) అనే ప్రదేశంలో బృందావనంలో ప్రవేశించాలని (జీవ సమాధి) శ్రీరఘోత్తమతీర్థర్ నిర్ణయించుకున్నారు. ఆ తరువాత ఆయన, తిరువన్నామలై రాజ్యాన్ని పరిపాలిస్తున్న జమిందారుకి కలలో కనిపించి బృందావనం ఎక్కడ నిర్మించాలో తెలియజేసారు. ఆ తరువాత ఆ జమిందారు, శ్రీరఘోత్తమతీర్థర్ స్వప్నంలో చెప్పిన ప్రకారమే మానంపూండి వద్ద ఒక బృందావనాన్ని నిర్మింపచేసాడు.

క్రీ.శ.1595 వైకుంఠ ఏకాదశి రోజున శ్రీరఘోత్తమతీర్థర్ బృందావనంలో ప్రవేశించారు. దక్షిణ పినాకిని నది ఒడ్డున ఉన్న మానంపూండి అన్న ప్రదేశంలో నిర్మించబడిన బృందావనంలో (సమాధిలో) జీవ సమాధి అయ్యారు శ్రీరఘోత్తమతీర్థర్.

కుల, మత, లింగ విచక్షణ లేకుండా శ్రీరఘోత్తమతీర్థర్‌ని అభిమానించే భక్తులు ఎవరైనా సరే ఈ బృందావనంలో స్వయంగా స్వామిని పూజించవచ్చు.

శ్రీరఘోత్తమ తీర్థర్ జీవసమాధి పొందిన ప్రదేశాన్ని తిరుకోయిలూర్ లేదా మానంపూండి అనేపేర్లతో పిలుస్తారు. ఇప్పటికీ వేలాదిమంది భక్తులు మానంపూండిలో నిర్మించబడిన శ్రీరఘోత్తమ తీర్థర్ బృందావనాన్ని సందర్శించి ఆయన ఆశీస్సులను అందుకుంటున్నారు.

అద్భుత మహిమలుగల క్షేత్రంగా గుర్తించబడిన ఈ బృందావనానికి తూర్పుదిక్కులో ఒక ధాత్రీవృక్షము, దక్షిణదిక్కులో పినాకినీనది, పశ్చిమ దిక్కులో ఒక అశ్వర్థ వృక్షము, ఉత్తర దిక్కులో ఒక చింతచెట్టు ఉంటాయి. ఒక విచిత్రం ఏమంటే బృందావనానికి మూడు వైపులా మూడు మహా వృక్షాలు ఉన్నప్పటికీ ఆ చెట్లనీడ బృందావన నిర్మాణంపై పడదు.

ఈ బృందావనానికి దగ్గరలో శ్రీ తిరువిక్రమస్వామి ఆలయం కూడా ఉన్నది. ఈ బృందావన క్షేత్రానికి వచ్చిన భక్తులకు మఠంవారే బసచేయటానికి సౌకర్యాలు కల్పిస్తున్నారు.

తమిళనాడులోని విల్లిపురం జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని చేరుకోవటానికి తిరువన్నామలై-తిరుక్కోయిలూర్ మధ్యనడిచే రహదారిమీదుగా ప్రయాణించాలి. ఈ క్షేత్రం, తిరుక్కోయిలూర్ నుండి 2 కి.మీ. దూరంలోను, తిరువన్నామలై నుండి36 కి.మీ. దూరంలోను ఉన్నది. బెంగుళూరు పట్టణం నుండి 237 కి.మీ. దూరంలో మానంపూండి గ్రామం ఉన్నది.

బెంగుళూరు నుండి విల్లుపురం వెళ్ళే బస్సులు మానంపూండి గ్రామంలో ఆగుతాయి. ఇక తిరువన్నామలై నుండి మానంపూండికి విస్తృతంగా బస్సు సౌకర్యం ఉన్నది.

**సమాధి/బృందావనం**

మధ్వమత పీఠాధిపతులు భౌతిక దేహాన్ని చాలించిన తరువాత వారి దేహాలకు ఉప్పు, కర్పూరం పూసి ఆపై ఆ మృతదేహాన్ని సమాధిలో ఉంచి ఆ సమాధిని తులసి ఆకులతో నింపుతారు. ఆపై ఆ సమాధిని శాశ్వతంగా మూసివేస్తారు. ఈ సమాధినే "బృందావనం" అని పిలుస్తారు. సాధారణంగా మఠం లేదా మఠానికి సంబంధించిన ఆలయ పరిసరాలలో ఈ బృందావనాన్ని నిర్మిస్తారు. ఈ బృందావనంమీద, అందులో సమాధి చేయబడిన స్వామియొక్క జ్ఞాపకార్థం ఆయన విగ్రహంతో కూడిన ఒక

ఆలయాన్ని నిర్మిస్తారు. ఆ ఆలయంలో ప్రతిరోజూ పూజలు జరుగుతాయి. "పుణ్యతిధి" రోజున అనగా ఆ బృందావనంలోని స్వామి భౌతిక దేహాన్ని చాలించిన రోజున ప్రత్యేక పూజలు జరుగుతాయి. మంత్రాలయంలో ఉన్న శ్రీ రాఘవేంద్రస్వామివారి బృందావనం కూడా బృందావనాల్లో ఒకటిగా గుర్తించాలి.

**రఘోత్తమతీర్థర్ మహిమలు :**

భౌతికంగా రఘోత్తమతీర్థర్ తన భక్తులకు కనపడకపోయినప్పటికీ తాను జీవసమాధిలో ఉన్న బృందావనం నుండే తన భక్తులను కంటికి రెప్పలాగా కాపాడుతూ ఉంటాడని ఆయన భక్తులు తెలియజేస్తున్నారు. అలాంటి భక్తులు తెలియజేసిన కొన్ని అనుభవాలు ఇలా ఉన్నాయి...

నేను, శ్రీరఘోత్తమతీర్థర్‌ని త్రికరణ శుద్ధిగా పూజిస్తూ ఉంటాను. సంవత్సరానికి ఒకసారి ఆయన బృందావనాన్ని దర్శించి రావటం నాకు అలవాటు. దాదాపు 5 సంవత్సరాల క్రితం బహుశా 2009లో అనుకుంటా. నేను మరియు నా కుటుంబ సభ్యులు తిరుక్కోయిలూర్‌లో శ్రీరఘోత్తమతీర్థర్ బృందావనాన్ని దర్శించుకుని పూజలుచేసి ఆపై తీర్థ ప్రసాదాలు తీసుకుని కారులో బయలుదేరాం. స్వామివారి ప్రసాదంగా ఇవ్వబడిన కొబ్బరిచిప్ప, అక్షింతలు, బృందావనం ఫోటోలను మా కారు వెనకసీటు పైన పెట్టాను. నేను, మా అమ్మ, నా భార్య వెనక సీటులో కూర్చున్నాం. నా కొడుకు ముందు సీటులో కూర్చున్నాడు. మా డ్రైవర్ కారు నడుపుతున్నాడు. మేము చింతల్‌వాడి మార్గం ద్వారా త్రిచీకి ప్రయాణిస్తున్నాం. కారు చాలా వేగంగా వెళుతున్నది. ఇంతలో మేము కూర్చున్న వెనకసీటు పైన పెట్టిన బృందావనం ఫోటో, కారు విండోలోంచి బయటకు ఎగిరిపోయింది. నేను ఆ విషయం గమనించే సరికి కారు అరకిలోమీటరు దూరం వచ్చేసింది. దాంతో నేను కారు ఆపించి ఆ ఫోటో ఎక్కడైన దొరుకుతుందేమో అని చుట్టుప్రక్కల వెతికాను. కానీ దొరకలేదు. నేను చాలా నిరాశకు గురి అయ్యాను. ఆ తరువాత నీరసంగా నడుస్తూ కారు వద్దకు వచ్చాను. నేను కారువద్దకువచ్చే సరికి మా కారు డ్రైవర్ కారు బాయ్‌నెట్ తెరిచి పరిశీలిస్తున్నాడు. ఆ తరువాత అందరం కారు ఎక్కి ప్రయాణంప్రారంభించాం. కారు చాలా నిదానంగా వెళుతున్నది.

అప్పుడు మా కారు డ్రైవర్ తల వెనక్కి తిప్పి నాతో ఇలా అన్నాడు. "మీ స్వామి (శ్రీరఘోత్తమతీర్థర్) శక్తివంతుడేనా?". అప్పుడు నేను పెద్ద స్వరంతో ఇలా అన్నాను. "మా స్వామి చాలా శక్తివంతుడు. మమ్మల్ని రక్షించే శక్తి ఆయనకు ఉన్నది". అప్పుడు డ్రైవర్ చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు. "నిజమే ఆ స్వామే ఈ రోజు మనల్ని కాపాడాడు. ఎందుకంటే కారు విండోలోంచి ఎగిరిపోయిన బృందావనం ఫోటోకోసం మనం కారు ఆపకపోయిన ఉన్నట్లయితే మనం ఖచ్చితంగా పెద్ద ప్రమాదానికి గురి అయి ఉండేవాళ్ళం. ఎందుకంటే మనం కారు అక్కడ ఆపబోతున్న సమయానికి బ్రేకింగ్ సిస్టంలో ఆయిల్ అయిపోవటంవల్ల కారు బ్రేకులు అప్పుడప్పుడే ఫెయిల్ కాబోతున్నాయి. నేను కారు ఆపినప్పుడు ఆ విషయాన్ని గ్రహించాను. ఆపై ఆ సమస్యను పరిష్కరించాను. ఇప్పుడు మనకు ఏ ప్రమాదం లేదు".

డ్రైవర్ చెప్పిన వివరణ వినగానే నాకు ఒక్కసారిగా ఒళ్ళు పులకరించింది. "శ్రీరఘోత్తమతీర్థర్ తన భక్తుల్ని ఎలా ఆదుకోవాలో అలా ఆదుకుంటాడు. అది ఆయనకు మాత్రమే సాధ్యం" అనుకున్నాను నేను.

రఘోత్తమ తీర్థర్ జీవసమాధి అయిన మూలబృందావనాన్ని దర్శించిన వారికి ఎన్నో అద్భుతమైన మహిమలు అనుభవంలోకి వచ్చాయి. ఈ బృందావనాన్ని దర్శించిన ముగ్గురు మూగవాళ్ళు మాట్లాడగలిగారు. సంతానంలేని ఎందరో దంపతులు ఈ బృందావనం దర్శించి చక్కటి సంతానాన్ని పొందినట్లుగా తెలుస్తున్నది.



## 6. శివవాక్కియార్ సిద్ధర్ జీవిత విశేషములు?

తమిళనాడులోని 18 మంది సిద్ధపురుషులలో ప్రముఖుడిగా చెప్పడిన వాడు శివవాక్కియార్. శివ నామాన్ని జపిస్తూ జన్మించిన కారణంగా ఆ పసిబిడ్డకు 'శివవాక్కియార్' అన్నపేరు వచ్చింది. ఈ సిద్ధపురుషుడు దాదాపు నాలుగువేల సంవత్సరాలపాటు జీవించాడు.

శివవాక్కియార్, ఆనాటి సంఘంలోని బ్రాహ్మణ ఆధిపత్యాన్ని, ఆచారాలను తీవ్రంగా వ్యతిరేకించాడు. కులవ్యవస్థను, విగ్రహారాధనను, పూజాపునస్కారాలను ఖండించిన ఆధ్యాత్మిక విప్లవవాది ఈ సిద్ధయోగి.

ప్రాచీన తమిళ సాహిత్యంలో శివవాక్కియార్ వ్రాసిన పద్య కావ్యాలకు ఈనాటికీ ఎంతో ప్రాముఖ్యత ఉన్నది. శివవాక్కియార్ వేదాలను నేర్చుకున్న తరువాత దక్షిణ భారతదేశం నుండి ఉత్తర భారతదేశంలో ఉన్న కాశీ పట్టణానికి చేరుకున్నాడు. అక్కడ చెప్పులుకుట్టే వృత్తిలో ఉన్న ఒక సిద్ధ పురుషుడిని చూసి అతడిని తనకు గురుదీక్ష ఇవ్వమని కోరాడు. కాశీలోని ఆ సిద్ధపురుషుడు (చర్మకారుడు), శివవాక్కియార్ యొక్క మహాత్మ్యాన్ని కొంతవరకు అర్థంచేసుకున్నప్పటికీ అతడిని ఇంకా పరీక్షించి ఆపై అతడికి గురు దీక్ష ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు. ఆ తరువాత ఆ సిద్ధపురుషుడు కొంచెం డబ్బుని శివవాక్కియార్‌కి ఇచ్చి ఆ డబ్బుని తన చెల్లెలయిన గంగానదికి అందజేయమని చెప్పాడు. అంతేకాకుండా రెండు పెద్ద కాకరకాయలు శివవాక్కియార్ చేతిలో పెట్టి ఆ కాయలనుండి చేదుని తొలగించమని అడిగాడు.

ఆ సిద్ధపురుషుడు పెట్టిన రెండు పరీక్షలలో నెగ్గితేనే తనకు గురుదీక్ష లభిస్తుంది అన్నవిషయం అర్థంచేసుకున్న శివవాక్కియార్ ఆ సిద్ధపురుషుడు (చర్మకారుడు) ఇచ్చిన డబ్బు మరియు చేదు కాకరకాయలు తీసుకుని వెంటనే గంగానది ఒడ్డుకి వెళ్ళాడు. ఆ తరువాత శివవాక్కియార్, గంగానది ఒడ్డున నుంచుని నదిలోకి పరిశీలనగా చూసాడు. అప్పుడు నదిలో నుండి ఒక అందమైన స్త్రీ హస్తం నీటిపైకి వచ్చి అరచేయి జాపింది. శివవాక్కియార్ మరేమీ ఆలోచించకుండా తాను తెచ్చిన డబ్బును ఆ చేతిలో ఉంచాడు. డబ్బు చేతిలో పడగానే ఆ స్త్రీ హస్తం మరల నది లోపలికి వెళ్ళిపోయింది. ఆ తరువాత శివవాక్కియార్ తన వద్ద ఉన్న రెండు కాకరకాయలను గంగానది నీళ్ళల్లో కడిగి ఆపై వాటిని తీసుకుని సిద్ధపురుషుడి వద్దకు వెళ్ళాడు."ఆ కాకరకాయలు తియ్యగా ఉన్నాయి".

తాను పెట్టిన రెండు పరీక్షలలో శివవాక్కియార్ గెలిచాడు అని అర్థంచేసుకున్న ఆ సిద్ధపురుషుడు, శివవాక్కియార్‌ని ఇంకా పరీక్షించాలి అనుకున్నాడు. అప్పుడు ఆ సిద్ధపురుషుడు ఒక చిన్న సంచిని శివవాక్కియార్

చేతిలో ఉంచి ఆపై అతడితో ఇలా చెప్పాడు. "నీవు ఈ సంచిని గంగానది ఒడ్డుకి తీసుకువెళ్ళి ఇందాక నువ్వు గంగాదేవికి ఇచ్చిన డబ్బును మళ్ళీ తీసుకుని ఈ సంచిలో పెట్టుకుని రా". శివవాక్కియార్ మరేమీ ఆలోచించకుండా ఆ సిద్ధపురుషుడు ఇచ్చిన సంచిని తీసుకుని గంగానది ఒడ్డుకి వెళ్ళి పెద్ద స్వరంతో ఇలా అన్నాడు. "ఇందాక నేను ఇచ్చిన డబ్బును తిరిగి ఇచ్చెయ్". అప్పుడు నదిలో నుండి ఒక స్త్రీ హస్తం పైకి వచ్చింది. ఆ చేతిలో డబ్బు ఉన్నది. శివవాక్కియార్ ఆ డబ్బు తీసుకుని తన వద్ద ఉన్న సంచిలో పెట్టుకుని వెనక్కి తిరిగి వచ్చి సిద్ధపురుషుడికి ఆ సంచి ఇచ్చాడు. శివవాక్కియార్ యొక్క ఏకాగ్రతకు, కర్తవ్యదీక్షకు, ధైర్యానికి ఎంతో మెచ్చుకున్న ఆ సిద్ధపురుషుడు, శివవాక్కియార్‌ని కటాక్షించాలి అనుకున్నాడు.

ఆ తరువాత ఆ సిద్ధపురుషుడు కొంచెం ఇసుకను, ఒక సొరకాయను శివవాక్కియార్ చేతికి ఇచ్చి ఆపై ఇలా అన్నాడు. "నేను సమాధి అయ్యే వరకు నీవు సంసారిగా గృహస్థ జీవితం గడపాలి. నీవు వివాహం చేసుకోవటానికి నీకు తగిన ఒక కన్య కావాలి. నీవు ఇక్కడి నుండి బయలుదేరి నీ తీర్థయాత్రలు కొనసాగించు. మార్గ మధ్యంలో ఏ కన్య, ఇప్పుడు నేను నీకు ఇస్తున్న ఇసుకను మరియు సొరకాయను వండుతుందో ఆమే నీకు తగిన భార్య అని గుర్తించు. ఆపై ఆమెను వివాహం చేసుకో".

ఆ తరువాత శివవాక్కియార్, ఆ సిద్ధపురుషుడివద్ద సెలవు తీసుకుని తన తీర్థయాత్రను కొనసాగించాడు. మార్గమధ్యంలో ఒకచోట ఆయనకు కొంతమంది దేశదిమ్మరుల గుంపు (జిప్సీలు/దొమ్మరులు) కనిపించింది. వారు, శివవాక్కియార్‌ని ఎంతో ఆదరంతో పలకరించారు. ఆ సమయంలో ఆ గుంపులో ఉన్న ఒక అమ్మాయి, శివవాక్కియార్ వద్దకు వచ్చి ఆయనతో ఇలా అన్నది. "మీకు సేవ చెయ్యటానికి నేను ఎంతో సంతోషిస్తాను". అప్పుడు శివవాక్కియార్ తన సంచిలో ఉన్న ఇసుకను మరియు సొరకాయను ఆ అమ్మాయి చేతికిచ్చి "నీవు ఈ రెండింటినీ వండగలవా?" అన్నాడు. ఆ అమ్మాయి ఏమాత్రం సంకోచం లేకుండా ఆ రెండింటినీ తీసుకుని అక్కడకి కొంచెం దూరంగా ఉన్న ఒక గుడిసెలోకి వెళ్ళింది. ఆ తరువాత కొంతసేపటికి ఆ అమ్మాయి ఒక పళ్ళెంలో వరి అన్నము మరియు సొరకాయ కూర పెట్టుకుని శివవాక్కియార్ వద్దకు వచ్చింది. "ఇసుకను

అన్నంగాను, సొరకాయను కూరగాను చేసిన ఆ అమ్మాయే తనకు తగిన భార్య" అని అర్థంచేసుకున్న శివవాక్కియార్ ఆ దేశదిమ్మరుల బృందం పెద్దల అనుమతితో ఆ అమ్మాయిని వివాహం చేసుకున్నాడు. అయితే ఆ అమ్మాయి సోదరుడు శివవాక్కియార్‌కి ఒక షరతు పెట్టాడు. అది ఏమిటంటే వాళ్ళు ఏ ఊరు వెళితే ఆ ఊరు శివవాక్కియార్ కూడా వెళ్ళాలి. వాళ్ళు ఎక్కడ మకాం వేస్తే శివవాక్కియార్ కూడా వారితోపాటు అక్కడే మకాం వెయ్యాలి. శివవాక్కియార్ అందుకు అంగీకరించాడు. అయితే శివకాక్కియార్ వాళ్ళతో ఒకమాట చెప్పాడు. అది ఏమిటంటే...

"నేను ప్రతిరోజూ ధ్యానం చేసుకుంటూ ఉంటాను. దానికి మీరు అడ్డు చెప్పకూడదు". వారు అందుకు అంగీకరించారు. శివవాక్కియార్‌కి ఆ అమ్మాయితో వివాహం జరిగింది. శివవాక్కియార్ ఆ దేశదిమ్మరులతో కలిసి ఊరూరా తిరుగుతూ కాలం గడపసాగాడు. ఒకసారి ఆ బృందం ఒక అటవీ ప్రాంతానికి వెళ్ళింది. ఒక సమయంలో ఆ బృందానికి కావలసిన వంట చెయ్యటంకోసం వంటచెరుకు కావాల్సి వచ్చింది. శివవాక్కియార్ వంటచెరుకు తేవటానికి అడవి మధ్యలోకి వెళ్ళాడు. అక్కడ ఎండిపోయిన ఒక చెట్టు కనపడింది. శివవాక్కియార్ ఒక గొడ్డలితో ఆ చెట్టును నరకటం ప్రారంభించాడు. ఇంతలో ఆ చెట్టు నుండి బంగారు రజను తళ తళా మెరుస్తూ రాలటం మొదలయ్యింది. అదిచూసిన శివవాక్కియార్ గొడ్డలిని అవతల పడవేసి "యముడు వచ్చేసాడు" అని పెద్దగా అరుస్తూ తన బృందంవైపు పరుగెత్తుకు వచ్చాడు. అప్పుడు ఆ బృందం పెద్ద, శివవాక్కియార్ వద్దకు వచ్చి "ఏం జరిగింది? ఎందుకు అలా అరుచుకుంటూ పరుగెత్తుకు వచ్చావ్?" అని అడిగాడు. తాను నరికిన చెట్టు నుండి బంగారు రజను రాలుతున్నదని అందుకే అక్కడ నుండి పరుగెత్తుకుని వచ్చానని శివవాక్కియార్ ఆ బృందం పెద్దకి చెప్పాడు.

ఈ విషయం విన్న ఆ బృందంలోని నలుగురు మనుషులు గోతాలు తీసుకుని అడవి మధ్యలోకి వెళ్ళారు. అక్కడ ఒక చెట్టు నుండి రాలుతున్న బంగారు రజను కనపడింది. వాళ్ళు వెంటనే ఆ రజను ఎత్తి తమ వద్ద ఉన్న గోతాలలో నింపటం ఆరంభించారు. ఆ గోతాలు అన్నీ నిండే సరికి చీకటి పడిపోయింది. వాళ్ళకి బాగా ఆకలి వెయ్యటం ప్రారంభించింది.

అప్పుడు ఆ నలుగురిలో ఒకడు మిగిలిన వారితో ఇలా అన్నాడు. "మనలో ఇద్దరు ప్రక్కనే ఉన్న ఊళ్ళోకి వెళ్ళి అన్నం తీసుకురావాలి. మిగిలిన ఇద్దరూ ఇక్కడే ఉండి ఈ బంగారు సంచులకు కాపలా కాయాలి". "సరే" అంటే "సరే" అనుకున్నారు ఆ నలుగురు. ఆ తరువాత ఇద్దరు అన్నం తీసుకురావటానికి ప్రక్కనే ఉన్న గ్రామానికి వెళ్ళారు. ఇద్దరు ఆ బంగారు గోతాలకు అక్కడే ఉండి కాపలా కాయటం మొదలుపెట్టారు.

అన్నం తేవటానికి వెళ్ళిన ఇద్దరూ ఇలా మాట్లాడుకున్నారు. "రేయ్! జాగ్రత్తగా విను. అడవిలో బంగారానికి కాపలా ఉన్న ఇద్దరినీ చంపేస్తే ఆ మొత్తం బంగారం మన ఇద్దరికే వస్తుంది. అప్పుడు నాలుగు వాటాలు వెయ్యాల్సిన పనిలేదు" అన్నాడు మొదటివాడు. అప్పుడు రెండవ వాడు ఇలా అన్నాడు. "సరే! అందుకు నేను అంగీకరిస్తాను. కానీ వాళ్ళని ఎలా చంపగలం?". అప్పుడు మొదటివాడు ఇలా అన్నాడు. "ఇందులో పెద్ద కష్టం ఏముంది. మనం తీసుకువెళ్ళే అన్నంలో బాగా విషం కలుపుదాం. ఆ తరువాత ఆ అన్నం వాళ్ళకి ఇద్దాం. వాళ్ళు అది తిని చనిపోతారు. ఆ తరువాత మనం హాయిగా ఆ బంగారాన్ని రెండు వాటాలుగా పంచుకుందాం". రెండవవాడు ఆనందంగా అందుకు అంగీకరించాడు.

ఇక ఆ అడవిలో బంగారానికి కాపలా కాస్తున్న ఇద్దరూ ఇలా నిర్ణయించుకున్నారు. అది ఏమిటంటే "అన్నం తీసుకువచ్చిన ఇద్దరినీ కత్తులతో పొడిచి చంపివెయ్యాలి. ఆ తరువాత హాయిగా ఆ అన్నం తిని, ఆపై ఆ బంగారాన్ని రెండు వాటాలుగా పంచుకోవాలి".

కొంచెం సేపు గడిచిన తరువాత ఊళ్ళోకి వెళ్ళినవాళ్ళిద్దరూ అన్నం తీసుకుని అడవిలో ఉన్న వాళ్ళ వద్దకు వచ్చారు. "వాళ్ళు ఎప్పుడు అన్నం తిని చనిపోతారా?" అని ఎదురు చూస్తున్నారు. ఇంతలో బంగారానికి కాపలాగా ఉన్న ఇద్దరూ హఠాత్తుగా రెండు కత్తులుతీసి, అన్నం తెచ్చిన ఇద్దరినీ దారుణంగా పొడిచి చంపేసారు. ఆ తరువాత శుభ్రంగా చేతులు కడుక్కుని వాళ్ళు తెచ్చిన అన్నాన్ని కడుపు నిండా తిని త్రేన్చారు. పది నిమిషాలు గడిచే సరికి అన్నం ద్వారా వాళ్ళ కడుపులోకి చేరిన విషం తన ప్రభావాన్ని చూపింది. ఫలితంగా ఆ ఇద్దరూ దారుణ బాధ అనుభవిస్తూ నెత్తురు కక్కుకుని చనిపోయారు.

మర్నాడు ఉదయం శివవాక్కియార్ అడవిలోకి వెళ్ళిచూడగా అక్కడ నాలుగు బంగారు మూటలు, వాటి ప్రక్కనే చచ్చిపడి ఉన్న నలుగురు వ్యక్తులు కనిపించారు. ఆ దృశ్యంచూసి శివవాక్కియార్ ఇలా అన్నాడు. "అయ్యో! నిన్న నాకు కనిపించిన యముడు (నెద్దు నుండి రాలిన బంగారు రజను) నా బృందానికి చెందిన నలుగురిని బలి తీసుకున్నది".

శివవాక్కియార్‌కి కొంగనార్ అనే ఒక సిద్ధయోగి స్నేహితుడుగా ఉండేవాడు. తన స్నేహితుడు మరియు మహాసిద్ధపురుషుడు అయిన శివవాక్కియార్ ఎక్కడో ఊరు చివర పేదరికంలో మగ్గిపోవటం చూసిన కొంగనార్‌కి చాలా బాధవేసింది. ఒకరోజున కొంగనార్ తన స్నేహితుడు అయిన శివవాక్కియార్ ఇంటికి వెళ్లాడు. ఆ సమయంలో శివవాక్కియార్ ఇంట్లో లేడు. ఆయన భార్య ఉన్నది. "తన స్నేహితుడికి ఎలాగైనా సంపద రావాలి" అని ఆశపడుతున్న కొంగనార్ కాసేపు ఆలోచించి ఆ తరువాత శివవాక్కియార్ భార్యతో ఇలా అన్నాడు. "మీ ఇంట్లో ఏదైనా ఇనుప ముక్క ఉండే నాకు తెచ్చి ఇవ్వు". అప్పుడు శివవాక్కియార్ భార్య తన ఇంట్లో మూలగా పడి ఉన్న ఒక పెద్ద ఇనుప ముక్క తెచ్చి కొంగనార్ చేతిలో పెట్టింది. అప్పుడు కొంగనార్ తన యోగశక్తితో ఆ ఇనుప ముక్కను బంగారంగా మార్చి శివవాక్కియార్ భార్య చేతిలో ఉంచి "ఈ బంగారంతో మీకు కుటుంబాన్ని హాయిగా గడుపుకోండి" అన్నాడు.



శివవాక్కియార్ సిద్ధర్

ఆ తరువాత కొంగనార్ అక్కడ నుండి వెళ్ళిపోయాడు. కొద్దిసేపు గడిచిన తరువాత శివవాక్కియార్ ఇంటికి తిరిగి వచ్చాడు. అప్పుడు ఆయన భార్య ఒక పెద్ద బంగారం ముక్కని ఆయనకు చూపించి ఆపై ఆయనతో ఇలా చెప్పింది. "ఇందాక నీ మిత్రుడు కొంగనార్ ఇక్కడకు వచ్చి మన ఇంట్లో ఉన్న ఇనుప ముక్కను బంగారంగా మార్చి నాకు ఇచ్చాడు". అప్పుడు

శివవాక్కియార్ పరిశీలనగా భార్య ముఖంలోకి చూస్తూ "నీకు బంగారం మీద ఆశ ఉన్నదా?". అప్పుడు అతని భార్య ఇలా అన్నది. "నీ ప్రేమకన్నా నాకు ఏదీ ఎక్కువ కాదు". అప్పుడు శివవాక్కియార్ చిరునవ్వు నవ్వుతు ఇలా అన్నాడు. "అలా అయితే నీవు ఈ బంగారు ముక్కని మన పెరట్లో ఉన్న బావిలో పడేసెయ్". ఎన్నో లక్షల రూపాయల విలువైన బంగారాన్ని తృణప్రాయంగా భావించిన శివవాక్కియార్ భార్య ఆ బంగారాన్ని మనస్ఫూర్తిగా బావిలో వదిలేసింది.

మొదట్లో శివవాక్కియార్ నాస్తికుడిగా ఉండేవాడు. కాలక్రమంలో ఆయన శైవ మతంలోకి మారాడు. ఆ తరువాత 'వీర వైష్ణవ' మతంలోకి మారాడు. ఆయన తమిళనాడులోని కుంభకోణం వద్ద సమాధి అయ్యాడు. ఇప్పటికీ ప్రతినెలా పౌర్ణమి రోజున శివవాక్కియార్ సమాధికి ప్రత్యేక పూజలు జరుగుతూ ఉంటాయి. ఆ సమాధిని దర్శించి శివవాక్కియార్‌ని ప్రార్థించిన వారికి అన్నిరకాల మానసిక సమస్యలు, ఆందోళనలు తొలగిపోతాయని చెబుతారు.

కొంతమంది వ్యక్తుల జాతకాలలో చంద్రగ్రహ దోషం ఉంటుంది. అలాంటివారు సోమవారం రోజున తెల్లటి దుస్తులను ధరించి శివవాక్కియార్ సన్నిధిని తెల్లపూలతో పూజిస్తే చంద్రగ్రహ దోషం తొలగి పోతుంది అని చెబుతారు.

శివవాక్కియార్ విగ్రహారాధనను తీవ్రంగా ఖండించాడు. కానీ 'మనిషి తన హృదయాన్నే ఆలయంగా చేసుకుని అందులోనే దేవుడిని ప్రతిష్టించుకుని పూజించాలని" ఉద్ఘాటించాడు. ఇతర సిద్ధయోగుల లాగానే శివవాక్కియార్ కూడా "సమస్త మానవులు సమానులే" అని ప్రబోధించాడు.



## 7. పట్టినాథర్ జీవిత విశేషములు?

ప్రాచీన తమిళదేశంలో జన్మించిన సిద్ధపురుషులలో ఒకడుగా చెప్పబడిన పట్టినాథర్ మానవ జాతికి అపూర్వమైన దైవ సంబంధ జ్ఞానాన్ని అందించాడు. పరమశివుని భక్తుడిగా పేరుపొందిన పట్టినాథర్ రచించిన

గ్రంథాలలో కనపడే వేదాంతం ఆకాశదీపంలా ప్రకాశిస్తూ అజ్ఞానాంధ కారంలో కొట్టుకుపోతున్న మానవులకు జ్ఞానమార్గాన్ని సూచిస్తుంది. ఈ పట్టినాథర్‌కే "తిరువెంకాడర్" అనే ఇంకొక పేరుకూడా ఉన్నది.

పట్టినాథర్, తమిళనాడులోని తంజావూర్ జిల్లాలో ఉన్న తిరువిడదైమరుదూర్ అనే పట్టణంలో సంపన్న వ్యాపారిగా పేరుపొందిన శివనేశన్‌చెట్టియార్ అనే శివభక్తుడికి కుమారుడుగా జన్మించాడు. పుట్టినప్పుడు పట్టినాథర్‌కి తండ్రి పెట్టినపేరు శ్వేతారణయార్ (శ్వేతరణేశ్వర్ ఆలయంలో పూజలందుకునే పరమశివుని పేరు శ్వేతరణేశ్వర్. ఆ స్వామి భక్తుడైన శివనేశన్‌చెట్టియార్, శివుడి వరంతో జన్మించిన తన కుమారుడికి శ్వేతరణేశ్వర్ అన్న పేరు పెట్టాడు). పట్టినాథర్ తల్లిపేరు జ్ఞానకళైఆచ్చి.

నోట్ : ఎ) (సిర్‌కాషి పట్టణానికి దగ్గరలో ఉన్న తిరువెంగాడు అనే చిన్న పట్టణంలో శ్వేతారణ్యేశ్వరర్ (తెల్లటి అరణ్యానికి ప్రభువు) అనేపేరుగల పరమశివుడు వెలసిన ఒక శివాలయం ఉన్నది. ఈ క్షేత్రంలోని అమ్మవారిపేరు "బ్రహ్మవిద్య అంబాల్". ఈ క్షేత్రంలో వెలసిన పరమశివుడు, అఘోరామూర్తి రూపంలో ఉంటాడని తెలుస్తున్నది.)

బి) (ఇరువిడదైమరుదూర్ అనే పట్టణం తమిళనాడులోని తంజావూరు జిల్లాలో ఉన్నది. కుంభకోణం పట్టణానికి ఈశాన్యదిశలో 9 కి.మీ. దూరంలో ఉన్న ఈ క్షేత్రంలో పరమశివుడు, "మహాలింగస్వామి" అనేపేరుతో అవతరించాడు. ప్రముఖ శైవ యోగి అయిన పట్టినాథర్ ఈ తిరువిడదై మరుధూర్‌లోనే జన్మించాడు. ఉన్మాదంతో బాధపడేవారు, ప్రేతాత్మలచేత పీడించబడేవారు ఈ మహాలింగస్వామి ఆలయంచుట్టూ ప్రదక్షణాలు చేస్తే ఆ సమస్యలు తొలగిపోతాయని చెబుతారు.)

ఆరోజుల్లో సింహాసనాన్ని అధిష్టించే ప్రభువులకు ఆ రాజ్యాలలో ఉండే అత్యంత సంపన్నుల్లో ఒకడు తన చేతులతో కిరీటాన్ని అలంకరించి పట్టాభిషేకం చేసేవాడు. అలాంటి అరుదైన గౌరవాన్ని పొందిన ఘనత శివనేశన్‌చెట్టియార్ వంశానికి దక్కింది. ఈ వంశంలోనివారు చేర, చోళ, పాండ్య మరియు పల్లవ రాజులకు రాజ్యాభిషేకం జరిగినపుడు ఆ రాజులకు కిరీటాన్ని అలంకరింపచేసేవారు. పట్టినాథర్ ముందు మూడు తరాలవారు

ఆ ఘనతను సొంతం చేసుకున్నారు. పట్టినాధర్ వంశస్తులు ఎంతటి సంపన్నులో ఈ అంశాన్ని బట్టి అర్థంచేసుకోవచ్చు.

పట్టినాధర్ వంశస్తులు కేవలము భారతదేశంలోనే కాకుండా విదేశాలలో కూడా వ్యాపారాలు చేసేవారు. ఓడలపై తమిళనాడు నుండి వివిధ రకాల సరుకులను విదేశాలకు తీసుకువెళ్ళి అక్కడ వాటిని అమ్మి ఆ తరువాత అక్కడ వచ్చిన లాభాలతో బంగారం, వెండి, రత్నాలు లాంటి అమూల్యమైన సంపదలను తెచ్చుకునేవారు. ఆనాడు చోళసామ్రాజ్యంలో ప్రముఖ రేవు పట్టణంగా గుర్తించినబడిన కావేరిపూంపట్టణానికి తన నివాసాన్ని మార్చుకున్నాడు శివనేశన్‌చెట్టియార్. అప్పటికే పట్టినాధర్ జన్మించాడు.

(ప్రాచీనకాలంలో చోళరాజ్యంలో ఉన్న కావేరిపూంపట్టణానికి పురాతన కాలంలో "పూంపుహార్" అనే ఇంకొక పేరు ఉండేది.)

మహాసంపన్నుడిగా పేరుపొందిన శివనేశన్‌చెట్టియార్‌కి శ్వేతారణయార్(పట్టినాధర్)తో పాటుగా ఒక ఆడపిల్లకూడా పుట్టింది. చిన్నతనం నుండి శ్వేతరణయార్ తన సమయాన్ని అంతా ఆటపాటలతో గడుపుతూ ఉండేవాడు. అతనికి చదువు పేరు చెబితేనే చిరాకు పుట్టేది. ఎంతో సంపన్నుడిగా మరియు అంతర్జాతీయస్థాయి వ్యాపారిగా పేరుపడ్డ తనకు, చదువు అంటే ఇష్టంలేని శ్వేతారణయార్ పుట్టటంతో శివనేశన్‌చెట్టియార్‌కి ఎంతో ఆందోళన కలిగింది. తన వారసుడిగా తన తరువాత తన వ్యాపారాన్ని చూసుకోవలసిన శ్వేతారణయార్ చదువుకోకుండా ఉండిపోవటంతో శివనేశన్‌చెట్టియార్‌కి ఎంతో బాధ కలిగింది. "పెద్దస్థాయి వ్యాపారాన్ని నిర్వహించాలి అంటే చదువు సంధ్యలు కావాలి. అవి లేకుండా తన బిడ్డ శ్వేతారణయార్ భవిష్యత్తులో వ్యాపారాన్ని ఎలా నిర్వహించగలడు?" అని శివనేశన్‌చెట్టియార్ ప్రతిరోజూ బాధపడుతూ ఉండేవాడు. అతని బాధను గ్రహించిన అతని భార్య జ్ఞానకళైఆచ్చి అతనితో ఇలా అన్నది:

"మనకి పది తరాలవారు తిన్నా తరగని సంపద ఉన్నది. మన అబ్బాయి శ్వేతారణయార్ చదుకోకపోతే వచ్చిన ఇబ్బంది ఏమున్నది?. మీరు వాడి గురించి ఏమాత్రం విచారించవొద్దు. అంతాచక్కబడుతుంది".

ఇక చేసేదిలేక శివనేశన్‌చెట్టియార్ తన పని తాను చూసుకోసాగాడు. కొద్ది సంవత్సరాలు గడిచాయి. ఒకరోజున శివనేశన్‌చెట్టియార్ మరణించాడు. దాంతో ఆయన భార్య జ్ఞానకళైఆచ్చి రంగంలోకి దిగి తమ వ్యాపారాన్ని చూసుకోవటం మొదలుపెట్టింది. ఆ సమయంలో ఆమె అన్నయ్య కూడా అక్కడకు వచ్చి ఆమెకు వ్యాపారంలో సహాయంగా ఉండ సాగాడు. అప్పటికి యుక్తవయస్కుడైన శ్వేతరణయార్ తన తండ్రిలాగానే ప్రతిరోజూ శివభక్తులకు అన్నదానం చేస్తూ ఉండేవాడు.

"వారసత్వం విచిత్రమైనది. ఒక మనిషి వొద్దన్నాసరే పూర్వీకుల లక్షణాలు అతడి రక్తంలో భాగంగా ఉంటాయి. సమయం వచ్చినప్పుడు ఆ లక్షణాలు బయటపడతాయి". శ్వేతరణయార్ విషయంలో కూడా ఇదే జరిగింది. అనేక తరాలుగా సముద్ర వ్యాపారంలో ఆరితేరిన చెట్టియార్ వంశంలో పుట్టిన శ్వేతరణయార్‌లో కూడా వ్యాపారకళ అంతర్గతంగా దాగి ఉన్నది. ఒక సమయంలో అతడు తన తల్లివద్దకువచ్చి ఆమెతో "అమ్మా! నేను కూడా వ్యాపారం చెయ్యాలనుకుంటున్నాను. ఇక్కడ వ్యాపారాలు నువ్వు చూసు కుంటావు కనుక నేను ఓడలమీద విదేశాలువెళ్ళి అక్కడ వ్యాపారంచేసి వస్తాను. దయచేసి నాకు అనుమతిని ఇవ్వు". తల్లి అంగీకరించింది. అప్పటికి అతడి వయస్సు 16 సంవత్సరాలు. ఆ రోజుల్లో చిన్న వయసులోనే పెళ్ళిళ్ళు జరిగేవి. అతడికి పెళ్ళిచేస్తే తన బాధ్యత తీరిపోతుంది అని భావించిన అతని తల్లి అతనికి శివకళై అనే ఒక బాలికను ఇచ్చి ఘనంగా వివాహం చేసింది.

కొన్నేళ్ళు గడిచాయి. శ్వేతరణయార్ అన్ని వ్యాపారాలలో అనుభవం గడించి సమర్థుడైన వ్యాపారిగా పేరుపొందాడు. అప్పటి నుండి ఆ ప్రాంతంలోని ప్రజలు అతడిని పట్టినాథుచెట్టి లేదా పట్టినాథర్ అని పిలవటం మొదలుపెట్టారు.

పట్టినాథర్ మధ్యవయస్సులోకి వచ్చాడు. అప్పటికి అతని సంపద విపరీతంగా పెరిగిపోయింది. కానీ అతనికి సంతానం కలుగలేదు. భార్యతో కలిసి అనేక పుణ్యక్షేత్రాలు దర్శించి ఆయా క్షేత్రాలలో వెలసిన దైవాలకు పూజలు చేసాడు. అయినా సంతానం కలుగలేదు. ఒకరోజు రాత్రి పట్టినాథర్‌కి ఒక కల వచ్చింది. ఆ కలలో ఇద్దరు వృద్ధదంపతులు

కనపడ్డారు. అలా కనపడిన ఆ వృద్ధ దంపతులు, పట్టినాథర్‌తో ఇలా అన్నారు. "మాకు చాలా ఆలస్యంగా ఒక బిడ్డ పుట్టాడు. ఆ బిడ్డకు కొద్ది సంవత్సరాలు వచ్చేసరికే మేము వృద్ధులం అయిపోయాం. అందువల్ల ఆ బిడ్డను పెంచలేకపోతున్నాం. మాకు పరమశివుడు స్వప్నంలో కనిపించి మా బిడ్డను నీకు ఇమ్మని చెప్పాడు. నీవు తిరువిడదైమరుధూర్‌కి వచ్చినట్లయితే మా బిడ్డను నీకుఇస్తాం. వాడిని నువ్వే పెంచుకో". మర్నాడు ఉదయం నిద్ర లేవగానే పట్టినాథర్ తనకు వచ్చిన కల గురించి తన భార్య శివకళైకి చెప్పాడు. పిల్లలకోసం అలమటించిపోతున్న ఆమె ఈ విషయం గురించి వినగానే ఎంతో సంతోషించి ఆపై పట్టినాథర్‌తో "మనం వెంటనే తిరువిడదైమరుదూర్ వెళ్ళి ఆ బిడ్డను తెచ్చుకుందాం" అన్నది ఆత్రంగా. పట్టినాథర్ అంగీకరించాడు.

మర్నాడు ఉదయం వాళ్ళిద్దరూ తిరువిడదైమరుదూర్ చేరుకున్నారు. అక్కడ ఉన్న ఒక శివాలయం వద్ద నిన్నరాత్రి కలలో కనిపించిన వృద్ధ దంపతులు, పట్టినాథర్‌కి కనిపించారు. వారినిచూసి పట్టినాథర్ ఎంతో సంతోషించి వారి బిడ్డకోసం తాను వచ్చిన విషయం వారికి చెప్పాడు. అప్పుడు ఆ వృద్ధదంపతులు, పట్టినాథర్‌తో ఇలా అన్నారు. "అయ్యా! మా బిడ్డను నీకు ఇచ్చేస్తాం. నీవు ఆ బిడ్డ బరువుకి సమానమైన బంగారాన్ని మాకు ఇవ్వాలి. అంతేకాదు మేము ఇంకా ఎంతకాలం బ్రతుకుతామో అంతకాలంపాటు మాకు కావలసిన ఖర్చుఅంతా నీవే భరించాల్సి ఉంటుంది". పట్టినాథర్ దంపతులు సంతోషంగా అందుకు అంగీకరించారు. సాక్షాత్తు పార్వతీపరమేశ్వరులే ఆ వృద్ధదంపతుల రూపంలో తమకు బిడ్డను ప్రసాదిస్తున్నారని శివకళై ఎంతగానో పొంగిపోయింది. పట్టినాథర్ ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ఆ తరువాత పట్టినాథర్ దంపతులు, ఆ వృద్ధదంపతులను వెంటపెట్టుకుని కావేరిపూంపట్టణానికి తిరిగి వచ్చారు. పట్టినాథర్ ఆ వృద్ధదంపతులకు మంచి గృహాన్ని మరియు అపారమైన ధనాన్ని ఇచ్చి వారిని ఆనందపరచాడు. ఆ తరువాత ఆ బిడ్డని శాస్త్రోక్తంగా దత్తత తీసుకోవటానికి ఒక మంచి ముహూర్తాన్ని పురోహితుడి చేత ఏర్పాటుచేయించాడు పట్టినాథర్. సరిగ్గా అప్పుడే ఒక తీవ్ర సమస్య పట్టినాథర్ జీవితంలో మొదలయ్యింది. అది ఏమిటంటే "పట్టినాథర్‌కి పిల్లలు లేరు కనుక అతడి సంపద అంతా తన బిడ్డలకే వస్తుందని" పట్టినాథర్

చెల్లెలు ఎంతకాలంగానో ఆశలు పెంచుకుంటూ ఉన్నది. ఇప్పుడు పట్టినాథర్ ఎవరో బిడ్డనుతెచ్చి పెంచుకుని ఆ బిడ్డను తన వారసుడిగా ప్రకటిస్తే ఆస్తి అంతా ఆ బిడ్డకు వెళ్ళిపోతుంది. తనకి ఖాళీచిప్ప మిగులుతుంది అని పట్టినాథర్ చెల్లెలు ఆగ్రహంతో ఊగిపోయింది. ఆ బిడ్డను పెంచుకోవటానికి వీలులేదని ఆమె పట్టినాథర్‌తో తగాదా ఆడింది. పట్టినాథర్‌ని నానాతిట్లు తిట్టింది.

ఈ దత్తత వెనకాల పట్టినాథర్ భార్య శివకళై హస్తం ఉన్నదని శివకళైని కూడా తీవ్రంగా నిందించింది. పట్టినాథర్, తన చెల్లెలు శాపనార్థాలను ఏమాత్రం పట్టించుకోలేదు. దత్తత కార్యక్రమాన్ని అత్యంత వైభవంగా పూర్తిచేయించాడు. పట్టినాథర్ దంపతులు తమ పెంపుడు బిడ్డకు "మరుధవనన్" అన్నపేరు పెట్టారు. తమ కడుపున పుట్టకపోయినప్పటికీ ఆ బిడ్డను తమ సొంత బిడ్డలాగానే పెంచుకున్నారు పట్టినాథర్ దంపతులు.

అపర కుబేరుడు అయిన పట్టినాథర్ కుటుంబంలో పడిన ఆ బిడ్డ ఒక యువరాజులాగా పెరగటం మొదలుపెట్టాడు. లేత పచ్చికబైళ్ళలో లేగ ఆవుదూడ ఎంత స్వేచ్ఛగా, ఆనందంగా గడ్డిమేస్తూ కాలం గడుపుతుందో అంత సంతోషంగా ఆ బిడ్డ పెరగసాగాడు. ఒక విచిత్రం ఏమంటే పట్టినాథర్ పెంపుడు బిడ్డ "మరుధవనన్" కూడా చదువు సంధ్యల్ని పట్టించుకోకుండా ఎల్లప్పుడూ ఆట పాటలతో కాలం గడుపుతూ ఉండేవాడు. ఇది చూసిన పట్టినాథర్‌కి ఎంతో బాధకలిగింది. "నా వంశంలో ఎవరికీ సరిగ్గా చదువు రావటంలేదు ఇది బహుశా మా వంశానికి ఉన్న శాపంలా ఉన్నది. ఇప్పుడు నేను పెంచుకుంటున్న బిడ్డకు కూడా చదువు రావటంలేదు. మా వంశంలో ఎవరికీ చదువు రాదేమో?" అనుకున్నాడు పట్టినాథర్.

కొంతకాలం గడిచిన తరువాత పట్టినాథర్ తన కొడుక్కి వ్యాపార సంబంధమైన మెళుకువలను నేర్పించటం మొదలుపెట్టాడు. చదువు నేర్చుకోలేకపోయినా, వ్యాపార కళను మాత్రం ఔపోసన పట్టాడు "మరుధవనన్". కాలం గడిచిపోతున్నది. "మరుధవనన్" యుక్తవయస్సులోకి వచ్చాడు. ఒకరోజు "మరుధవనన్" తన తండ్రి పట్టినాథర్‌వద్దకు వచ్చి "తండ్రీ! నాకు విదేశాల్లో వ్యాపారం చెయ్యాలని అనిపిస్తున్నది. ఇప్పటి

వరకు నీవు చేస్తున్న ఆ వ్యాపారాన్ని ఇకపై నేను నిర్వహిస్తాను. నాకు అనుమతినివ్వు" అన్నాడు. అచ్చు తనలాగానే తన కొడుకు కూడా సముద్ర వ్యాపారంపట్ల ఇష్టం ప్రదర్శించటం చూసి పట్టినాథర్‌కి ఎంతో సంతోషం వేసింది. తన కొడుకు విదేశ వ్యాపారం చెయ్యటానికి అనుమతించాడు. ఆ తరువాత కొద్ది రోజులకే "మరుధవనన్" ఓడల్లో సరుకులు వేసుకుని విదేశాల్లో వ్యాపారం చెయ్యటానికి వెళ్ళిపోయాడు. కొద్ది నెలలు గడిచాయి. ఒకరోజు "మరుధవనన్" తన ఓడలో కావేరిపూంపట్టణానికి తిరిగి వచ్చాడు.

చాలా నెలల తరువాత తన కొడుకుని చూడబోతున్నానన్న ఆనందం పట్టినాథర్‌ని పట్టి ఊపింది. తన కొడుక్కి స్వాగతం చెప్పటానికి తానే స్వయంగా ఓడరేవుకి వెళ్ళాడు. "మరుధవనన్" ఓడదిగి తన తండ్రిని గాఢంగా కౌగలించుకుని ఆపై తండ్రితో ఇలా అన్నాడు. "నేను బ్రహ్మాండంగా వ్యాపారం చేసాను. ఆ వ్యాపారంలో వచ్చిన లాభాలతో ఎన్నో విలువైన వస్తువుల్ని కొని మూటలు కట్టించాను. ఇప్పుడు ఆ మూటల్ని ఇంటికి తీసుకువెళదాం". ఆ తరువాత పట్టినాథర్ తన పనివాళ్ళని పిలిచి వాళ్ళతో ఇలా అన్నాడు. "ఓడలో ఉన్న బస్తాలన్నింటినీ తీసుకువెళ్ళి మా ఇంటిలో పెట్టండి". పట్టినాథర్ ఆజ్ఞమేరకు అతని పనివాళ్ళు ఓడలోంచి బస్తాలను క్రిందకు దింపుతున్నారు. వాటిని చూడగానే పట్టినాథర్ మనసులో ఏదో అనుమానం తొంగిచూసింది. "విలువైన బంగారం, వెండి, రత్నాలను ఎవరైనా మంచి పెట్టెలలో పెట్టి తీసుకువస్తారు. నా కొడుకు వాటిని బస్తాలలో మూటలుగా కట్టి తీసుకువస్తున్నాడు. అసలు ఈ బస్తాలలో పనికొచ్చేవి ఏమైనా ఉంటాయా?" లాంటి ప్రశ్నలు పట్టినాథర్‌ని వేధించాయి.

పనివాళ్ళు బస్తాలను క్రిందకి దింపుతున్న సమయంలో "మరుధవనన్" తండ్రితో ఇలా అన్నాడు. "నేను నాయనమ్మనుచూసి చాలా రోజులు అయ్యింది. కనుక నేను వెంటనే ఆమె వద్దకు వెళ్ళిపోతాను. నీవు ఇక్కడే ఉండి ఈ బస్తాలన్నింటినీ జాగ్రత్తగా ఇంటికి చేర్పించు". తండ్రితో ఈ మాట చెప్పి "మరుధవనన్" తుర్రుమని అక్కడ నుండి నాయనమ్మ ఇంటి వైపు పరుగుతీసాడు. పట్టినాథర్ ఒకసారి నిట్టూర్చి ఆ తరువాత పని వాళ్ళు ఓడ నుండి దింపుతున్న బస్తాలలో ఒక బస్తాను తెరిచి చూసాడు. ఏమున్నది ఆ బస్తాలో? "ఆవు పేడ పిడకలు మరియు ఊక". వాటిని చూసి పట్టినాథర్ తీవ్రమైన ఆగ్రహానికి గురిఅయ్యాడు.

సముద్ర వ్యాపారంలో బాగా సంపాదించి రత్నాలు, బంగారం తెస్తాడనుకున్న తన కొడుకు పనికిమాలిన పిడకలు తెచ్చేసరికి పట్టినాధర్‌కి సహనం నశించిపోయింది. అతడు వెంటనే తన తల్లి జ్ఞానకళై ఇంటికి వెళ్ళాడు. అక్కడ "మరుధవనన్" ఏదో తీపి పదార్థం తింటూ తన నాయనమ్మ జ్ఞానకళైతో కులాసాగా కబుర్లు చెబుతున్నాడు. పట్టినాధర్ పూర్తిగా ఇంట్లోకి వెళ్ళకుండానే వాకిట్లో నుంచుని తన కొడుకు "మరుధవనన్"ని పెద్ద స్వరంతో నిందించటం ప్రారంభించాడు. బయట నుండి వినపడుతున్న తన కొడుకు పట్టినాధర్ కంఠ స్వరాన్ని గుర్తుపట్టిన జ్ఞానకళై ఇంట్లోంచి బయటకు వచ్చి ఆపై పట్టినాధర్‌ని విచిత్రంగా చూస్తూ నుంచున్నది. అప్పుడు పట్టినాధర్ పెద్ద గొంతుతో ఇలా అన్నాడు. "చూసావా! నీ మనుమడు ఏం సంపాదించుకువచ్చాడో? పేడ, ఊక...ఇవి వీడు విదేశాల నుండి సంపాదించుకు వచ్చినవి". ఇంతలో రేవు నుండి బస్తాలను తీసుకువచ్చిన పనివాళ్ళు ఆ బస్తాలను జ్ఞానకళై ఇంటి అరుగుమీద పేర్చారు. వాటిని చూసిన పట్టినాధర్‌లో కోపం రెట్టింపు అయ్యింది. దాంతో అతడు చిరాకుగా ఒక బస్తావద్దకు వచ్చి దాన్ని బలంగా కాలుతో తన్నాడు. అంతే! అప్పుడు ఒక అద్భుతం జరిగింది.

పట్టినాధర్ తన్నటంతో పగిలిపోయిన ఆ బస్తాలో బంగారు పిడకలు, బంగారు రజను కనిపించాయి. ఆ దృశ్యం చూసిన పట్టినాధర్ మహదానందంతో పొంగిపోయాడు. తన కొడుకు "మరుధవనన్" నిజంగానే గొప్ప సంపద సంపాదించి తీసుకువచ్చాడని అర్థంచేసుకున్నాడు.

కొడుకు సాధించిన విజయానికి పట్టినాధర్ ఆనందిస్తున్నాడు. అప్పుడు అతడి తల్లి అతని వద్దకువచ్చి ఆపై ఒక చిన్నపెట్టెను పట్టినాధర్ చేతిలో ఉంచి అతనితో ఇలా చెప్పింది. "నీ కొడుకు పట్టినాధర్ ఈ పెట్టెను నీకు ఇవ్వమన్నాడు. తాను ఆడుకోవటానికి వెళుతున్నానని తనకోసం వెదక వద్దని నీకు చెప్పమన్నాడు". పట్టినాధర్ ఆ పెట్టెను తెరిచి చూసాడు. ఆ పెట్టెలో ఒక సూదిముక్క (బెజ్జం లేని సూదిముక్క) మరియు ఒక చిన్న తాటియాకు ముక్క కనిపించాయి. పట్టినాధర్ ఆ తాటియాకును చేతిలోకి తీసుకుని చదివాడు. అందులో ఇలా వ్రాసి ఉన్నది. "ఈ బెజ్జంలేని సూది ముక్క ఎందుకూ పనికిరాదు. దీనిని అమ్మాలని బజారుకి తీసుకువెళ్ళటం

వృధా. నువ్వు ఈ లోకాన్ని వదిలి వెళ్ళేటప్పుడు ఈ పనికిరాని సూదిముక్క కూడా నీ వెంటరాదు".

తాటియాకు ముక్కలో కనపడిన వాక్యాలను చదివిని పట్టినాధర్ తల గిర్రున తిరిగింది. "తనముందు ఉన్నవి అన్నీ ఒక భ్రమ" అని అతనికి అనిపించింది. అశాశ్వతమైన సంపదకోసం తాను ఇంతవరకు ఆరాట పడ్డానని పట్టినాధర్‌కి అర్ధమయ్యింది. ఆ పెట్టెను తనకు ఇమ్మని చెప్పిన "మరుధవనన్" పార్వతీపుత్రుడైన కార్తికేయుడిలా కనిపించాడు. ఆ పెట్టెను తనకు ఇచ్చిన తన తల్లి పార్వతీదేవిలా కనిపించింది. "ఈ ప్రపంచంలో ప్రతిదీ ఒక భ్రమే అని, మనిషి ఈ భ్రమలలో చిక్కుకున్నంతకాలం ఆశ నిరాశలలో ఊగిసలాడుతూ ఉంటాడని" పట్టినాధర్‌కి అర్ధమయ్యింది.

అప్పటి నుండి పట్టినాధర్‌లో వేదాంతం పాతాళగంగలా పెల్లుబికింది. ఆయనలో ఈలోకంపట్ల పరిపూర్ణమైన వైరాగ్యం ఏర్పడింది. ఆ తరువాత ఆయన తన భార్య శివకళైవద్దకువెళ్ళి ఆమెతో ఇలా అన్నాడు. "నేను సన్యాసం తీసుకోవాలని అనుకుంటున్నాను. నాకు సెలవు ఇవ్వు". పట్టినాధర్ నోటి వెంట ఈ మాటలు వినాగానే శివకళై పెద్దగా రోదించింది. అతడు తనను వదిలిపెట్టి వెళ్ళటానికి ఆమె అంగీకరించలేదు. అయినప్పటికీ ఆమెను తన జ్ఞానపూరితమైన బోధనలతో అంగీకరింపచేసాడు. అప్పుడు ఆమె, పట్టినాధర్‌తో ఇలా అన్నది.

"మీరు సన్యాసిగామారి లోకం అంతా సంచరించండి. నేను ఈ గృహంలోనే నా చరమ జీవితాన్ని సన్యాసినిలా గడుపుతాను. ఆ తరువాత పట్టినాధర్ తన పూర్వీకులు ఎన్నాళ్ళుగానో పూజిస్తున్న దుస్తులు ఉన్న పెట్టెను చేతిలోకి తీసుకున్నాడు. ఆ తరువాత పట్టినాధర్ తన రధాన్ని త్యజించి కాలినడన నడుస్తూ తన తల్లి ఇంటి వద్దకు చేరుకున్నాడు. "తాను సన్యాసిని అవుతున్నాను" అన్న విషయం ఆమెకు తెలియజేసాడు. ఆమె చాలా ప్రశాంతంగా ఇలా అన్నది. "నేను నీ నిర్ణయం గురించి ఏమాత్రం ఆశ్చర్య పోవటంలేదు. నువ్వు సన్యాసం తీసుకుంటావని ముందునుంచీ ఊహిస్తున్నాను". మా పూర్వీకులు ఈ పెట్టెలో ఉంచి పూజిస్తున్న కాషాయ వస్త్రాలను ఇక నుండి నేను ధరిస్తాను అని పట్టినాధర్ తల్లితో చెప్పాడు. ఆ తరువాత పట్టినాధర్ తన పూర్వీకులు ఇచ్చిన పెట్టెను తెరిచి చూసాడు.

అందులో ఎలాంటి ప్రత్యేకమయిన దుస్తులు లేవు. కేవలం ఆరు గోచీ గుడ్డలు మాత్రమే ఉన్నాయి. అప్పుడు పట్టినాథర్ తల్లి నిర్వికారమైన స్వరంతో ఇలా అన్నది.

"ఆ ఆరు గోచీ గుడ్డలు నా మామగారి ఆస్తి. సన్యాసికి ఎక్కువ వస్త్రాలను ధరించటం కూడా భారమే అవుతుంది. వాటిని ఉతకటం ఒక శ్రమ అవుతుంది. అందువల్లే నా మామగారు గోచీ గుడ్డల్ని మాత్రమే సన్యాసి ధరించాలని భావించారు".

అప్పుడు పట్టినాథర్ ఆ గోచీ గుడ్డల్ని తీసుకుని ఒక గదిలోకి వెళ్ళి ఆపై తన ఒంటిమీద ఉన్న దుస్తుల్ని విసర్జించి ఒక గోచీని ధరించి బయటకు వచ్చాడు. అప్పుడు అతడి తల్లి అతనితో ఇలా అన్నది. "మీ తాతగారు సన్యాసం స్వీకరించిన తరువాత గురువుల వద్ద నుండి బోధనలు పొందారు. నీవు కూడా అదేవిధంగా గురువుల వద్ద నుండి ఆశీస్సులుపొంది ఆపై నీ సన్యాసి జీవితాన్ని కొనసాగించు". ఆ తరువాత అతని తల్లి ఒక చిన్న మూటను తీసుకువచ్చి అతని నడుముకు కట్టి ఆపై అతనితో ఇలా అన్నది. "ఈ మూట తానంతటతానే ఊడిపోయినప్పుడు నీవు నా దగ్గరకు తిరిగిరా. ఈ మూట ఊడిపోయింది అంటే నేను జీవితాన్ని చాలించబోతున్నాను అనిఅర్థం. నీవు ఆ సమయంలో వచ్చి నన్ను చూడు". ఆ తరువాత పట్టినాథర్ గురుకులానికి బయలుదేరాడు. నిజానికి ఆ గురుకులాన్ని పట్టినాథర్ పూర్వీకులు నిర్మించారు. వారు నియమించిన ప్రతినిధులు దీనిని నిర్వహిస్తున్నారు. అయితే పట్టినాథర్ ఏనాడూ ఆ గురుకులానికి వెళ్ళి ఉండలేదు. ఈనాడు సన్యాసిగా మారిన తరువాత అతడు గురుకులానికివెళ్ళి అక్కడ ఉన్న గురువుల వద్ద ఆశీస్సులనుపొంది బయటకు వచ్చాడు. అతడు బయటకు వచ్చేముందు అక్కడ ఉన్న ఒక గురువు ఒక భిక్షా పాత్రను పట్టినాథర్‌కి ఇచ్చాడు. సన్యాసి ఏ రోజుకి ఆరోజు తాను ఉన్న ప్రదేశంలో ఉన్న గృహాలలో భిక్షాటనచేసి జీవించాలి.

"ఈ ప్రపంచంలో ప్రతిదీ ఆ దైవం పెట్టిన భిక్షే" అని సూచించటానికి గుర్తుగా సన్యాసులు గృహస్తుల నుండి భిక్షను స్వీకరిస్తూ ఉంటారు. ఆ తరువాత పట్టినాథర్ నేరుగా తన తల్లివద్దకు వెళ్ళాడు. తనకు భిక్ష వెయ్యమని ఆమెను అర్థించాడు. అప్పుడు ఆమె, పట్టినాథర్‌తో "నాయనా! నీవు ఇంకా

సంపన్నుడవే" అన్నది. ఆమె విన్న పట్టినాథర్ ఎంతో ఆశ్చర్యపోయాడు. ఒంటిమీద ఒక గోచీ, చేతిలో ఒక భిక్షా పాత్ర తప్ప ఇంకేమీలేని తనను సంపన్నుడవని తన తల్లి అనటం పట్టినాథర్‌కి విచిత్రంగా అనిపించింది. కొడుకు ముఖంలో కనిపిస్తున్న ఆశ్చర్యాన్ని గమనిస్తున్న అతని తల్లి చిరునవ్వు నవ్వుతూ అతనితో ఇలా అన్నది.

"నాయనా! నీవు, నీకు ఉన్న సమస్త సంపదల్ని వదులుకున్నావు అన్న మాట నిజమే. కానీ ఇప్పుడు నీకు సొంతంగా ఒక భిక్షా పాత్ర ఉన్నది. ఒక సన్యాసికి అదికూడా ఉండదు. ఆ విధంగా చూస్తే నీవు ఒక సన్యాసి కన్నా కూడా నీవు సంపన్నుడవే కదా!".

అప్పటికి పట్టినాథర్‌లో జ్ఞానం పరిపూర్తిగా వికసించింది. దాంతో ఆయన తన చేతిలో ఉన్న భిక్షా పాత్రను అవతలకు విసిరివెయ్యబోయాడు. అప్పుడు అతని తల్లి అందుకు అడ్డంపడి ఆపై అతనితో ఇలా అన్నది. "నాయనా! దాన్ని అవతల పారవెయ్యకు. దాన్ని వాడుకో. ఎప్పుడైనా అది పోతే దానికోసం వెతక్కు. నీది కానిదానికి నీవు ఎలా ఆశించవో అదేవిధంగా పోయిన నీ భిక్షపాత్ర గురించి మరల పొందాలని ఆశించకు". సన్యాసి అన్నవాడు ఎంత ఆశారహితంగా ఉండాలో తల్లి మాటలద్వారా పట్టినాథర్‌కి అర్థం అయ్యింది.

ఆ తరువాత అతని తల్లి తొలి భిక్షను అతని భిక్షా పాత్రలో వేసింది. ఆ తరువాత అతడు మెల్లిగా నడుస్తూ తన చెల్లెలు ఇంటికి వెళ్ళాడు. అతని చెల్లెలు అతడిని లోపలికి ఆహ్వానించి చిరునవ్వుతో విందుభోజనం వడ్డించే ప్రయత్నం చేసింది. పట్టినాథర్ నేలమీద కూర్చుని ఆ భోజనం తినాలని అనుకుంటున్నాడు. ఇంతలో పట్టినాథర్ చెల్లెలు అతని వద్దకు వచ్చి అతనితో ఇలా అన్నది. "నీ వెలాగూ సన్యాసివి అయిపోయావు. కనుక నీ ఆస్తిని కాగితంమీద వ్రాసి నాకు ఇచ్చేసావంటే తరతరాలుగా మా కుటుంబం నిన్ను దేవుడిలా పూజిస్తుంది". దురాశతో కూడిన చెల్లెలు మాటలతో పట్టినాథర్ మనసు వికలమైపోయింది. భోజనం చేద్దామని ఆకుముందు కూర్చున్న పట్టినాథర్, అన్నంలో చెయ్యిపెట్టకముందే చెల్లెలు అన్నమాటతో ఎంతో కలత చెంది ఆపై అక్కడ నుండి లేచి ఇవతలికి

వచ్చేసాడు. ఇకపై భిక్షాటనకు కూడా ఈ ఇంటికి రాకూడదని బలంగా నిర్ణయించుకున్నాడు.

అయితే పట్టినాధర్ చెల్లెలు అంత తేలిగ్గా పట్టినపట్టు వదిలే రకం కాదు. కొంతమంది గూఢచారులను పిలిపించి అతను ఎక్కడకు వెళితే అక్కడకు వారిని పంపి అతను ఏంచేస్తున్నాడో కనుక్కోమని వారితో చెప్పింది. ఇలా కొన్ని రోజులు గడిచాయి. ఒక రోజున ఆమె తన బిడ్డల్ని తన దగ్గరకు పిలిచి వారి చేతిలో రెండు అప్పాలను ఉంచి ఆపై వారితో ఇలా చెప్పింది. "మీరు ఊరి చివర చెట్టుక్రింద ఉన్న మీ మామయ్య వద్దకువెళ్ళి ఆయనకు ఈ అప్పాలను ఇచ్చి తినిపించండి". ఆ బిడ్డలకి సహజంగానే పట్టినాధర్ అంటే చాలా అభిమానం. ఆ అప్పాలను తీసుకుని మెల్లిగా నడుస్తూ ఊరి చివరికి వెళ్ళారు ఆ బిడ్డలు. చెట్టుక్రింద కూర్చుని ఏదో ఆలోచిస్తున్న పట్టినాధర్ వారికి కనిపించాడు. అతడిని చూడగానే ఆ బిడ్డలలో ప్రేమ పొంగి పొరలింది. వాళ్ళు "మామా! అని పెద్దగా అరుస్తూ పట్టినాధర్ మీదకు దూకారు'. పట్టినాధర్‌కి కూడా ఆ బిడ్డలమీద ఎంతో అభిమానం ఉంది. ఆయన ఆ బిడ్డల్ని దగ్గరకు తీసుకుని ముద్దుచేసాడు. ఆ తరువాత ఆ బిడ్డలు తాము తెచ్చిన అప్పాలను పట్టినాధర్ చేతికి ఇచ్చి అతడితో ఇలా అన్నారు. మామా! మా అమ్మ నీకోసం స్వయంగాచేసి ఈ అప్పాలను పంపించింది. నువ్వు వీటిని తినాలి". ఆ తరువాత కొంతసేపటికి ఆ బిడ్డలు అక్కడి నుండి తమ ఇంటికి బయలుదేరారు. వారు వెళ్ళిన తరువాత పట్టినాధర్ ఆ అప్పాలను తినాలని అనుకుని ముందుగా ఒక అప్పాన్ని వాసన చూసాడు. అది గంధకపువాసన వస్తున్నది. విషపూరితమైన గంధకాన్ని అప్పాలలో ఉంచి తనకు ఇచ్చి పంపిన తన చెల్లియొక్క దుర్మార్గం పట్టినాధర్‌కి స్పష్టంగా అర్ధమయ్యింది. (విషపూరితమైన ఆ అప్పాలను తిని పట్టినాధర చనిపోతాడని ఆమె పధకం వేసింది) ఆయన వెంటనే ఆ అప్పాలను తీసుకుని నేరుగా తన చెల్లెలు ఇంటి దగ్గరకు వెళ్ళాడు. ఆ తరువాత ఆ అప్పాలను ఇంటి కప్పుమీద పడేలా విసిరాడు. ఆ తరువాత ఇలా పాడుకుంటూ అక్కడ నుండి ఇవతలికి వచ్చేసాడు.

"ఒకడు చేసిన పాపం వాడిని ఎలా దహించివేస్తుందో, అలాగే ఈ అప్పాలు ఈ ఇంటిని దహించివేస్తాయి".

పట్టినాథర్ పాడిన పాట శాపంగామారింది. మర్నాడు ఉదయమే ఆ ఇంటిమీద పడ్డ అప్పాలలో ఉన్న గంధకం కారణంగా మంటలు చెలరేగి ఆ ఇల్లు మొత్తం అగ్నికి ఆహుతి అయిపోయింది.

ఆ తరువాత పట్టినాథర్ అక్కడికి దగ్గరలో ఉన్న అనేక పట్టణాలకు వెళ్ళి అక్కడ ఉన్న అనేక శివాలయాలలో వెలసిన పరమశివుడిని కీర్తిస్తూ భక్తిపూరితమైన పాటలను అశువుగా పాడుతూ ఉండేవాడు. ఒక రోజు ఉదయం పట్టినాథర్, తిరువిడదైమరుదూర్ క్షేత్రంలో ఉండగా అతని నడుముకు ఉన్న మూట (గతంలో తల్లి ఇచ్చినది) దానంతట అదే ఊడిపోయి కిందపడిపోయింది. తన తల్లికి మరణం ఆసన్నంఅయి ఉంటుందని గ్రహించిన పట్టినాథర్ వెంటనే తల్లిని చూడటానికి బయలు దేరాడు. తనబిడ్డ పట్టినాథర్ వచ్చేవరకు అతని తల్లి ప్రాణాలను ఉగ్గపట్టుకుని జీవించి ఉన్నది. పట్టినాథర్ తనవద్దకు వచ్చిన తరువాత అతని చేతుల్లో ప్రాణాలు వదిలింది ఆ తల్లి. తన తల్లి తనని చిన్నతనం నుండి ఎలా పెంచి పెద్దచేసిందో ఒక్కసారి పట్టినాథర్ కళ్ళముందు మెదిలింది. ఆ జ్ఞాపకాల కారణంగా పట్టినాథర్ ఒక పసిబిడ్డలాగా వెక్కివెక్కి ఏడ్చాడు.

బంధువులు ఎవరూ సహకరించకపోవటంతో పట్టినాథర్ స్వయంగా తన తల్లి మృతదేహాన్ని తీసుకుని శ్మశానానికి వెళ్లాడు. శవ దహనానికి కావలసిన ఎండు కట్టెలు ఆ సమయంలో లభ్యం కాలేదు. అప్పుడు పట్టినాథర్ ఆ శ్మశానికి దగ్గరలో ఉన్న అరటిచెట్లవద్దకువెళ్ళి ఆ చెట్ల కాండాలకు ఉన్న పచ్చిబెరడును (అరటి దొప్పలు) తీసుకువచ్చి వాటితో చితిని పేర్చి ఆపై ఆ చితిమీద తల్లి శవాన్ని ఉంచాడు. పచ్చి అరటిదొప్పలు ఎలా మండుతాయి? అతని తల్లి అంత్యక్రియలు ఎలా జరుగుతాయి? అని ఆ శ్మశానంలో ఉన్న కాటికాపరి ఆశ్చర్యంగా అనుకుంటున్నాడు. అప్పుడు పట్టినాథర్ తన ఇష్టదైవం అయిన పరమశివుడిని తలచుకుని ఈవిధంగా పాట పాడాడు.

"పరమశివుని మూడవ కంటి నుండి పుట్టిన అగ్ని త్రిపురాసురుల రాజ్యాన్ని దహించివేసింది".

"హనుమంతుడి తోకచివర ఉన్న అగ్ని లంకానగరాన్ని దహనం సంది".

"ఇప్పుడు నేను నా చేతిలో ధరించిన అగ్ని నా తల్లి శరీరాన్ని దహించి వేయుగాక".

సిద్ధపురుషుడు అయిన పట్టినాథర్ ఆవిధంగా పాడగానే ఒక అద్భుతం జరిగింది. పచ్చిగా ఉన్న ఆ అరటి దొప్పలు భగ, భగా తగలపడి అతని తల్లి మృతదేహాన్ని సంపూర్తిగా దహనం చేసాయి. ఆవిధంగా తన తల్లి అంత్యక్రియలు పూర్తి అయిన తరువాత పట్టినాథర్‌లో మళ్ళీ తీవ్రమైన వైరాగ్యం ఆవరించింది. అతడు తనలో తాను ఇలా అనుకున్నాడు.

"ఈ లోకంలో పుట్టటమే ఒక మహాపాపం. ఈ లోకంలో పుట్టటం వల్ల ప్రతి మనిషీ ఎన్నటికీ తప్పించుకోలేని బంధాలలో చిక్కుకుంటున్నాడు".

ఆ తరువాత పట్టినాథర్ ఇలా పాడుకుంటూ తన ప్రయాణాన్ని కొనసాగించాడు.

"ఒక బిడ్డకు జన్మని ఇచ్చి తల్లి అలిసిపోయింది, ఒక తల్లి గర్భం నుండి ఇంకొక తల్లి గర్భానికి నడిచి నడిచీ (మళ్ళీ మళ్ళీ జన్మలు ఎత్తుతూ) నా కాళ్ళు అలిసిపోయాయి". మళ్ళీ మళ్ళీ జీవులను సృష్టిస్తూ బ్రహ్మదేవుడు అలసిపోయాడు. ఓ పరమేశ్వరా! నేను మళ్ళీ ఇంకొక గర్భంలో ప్రవేశించ కుండా ఉండే వరాన్ని ప్రసాదించు. (నాకు పునర్జన్మ లేకుండా చెయ్యి)".

ఆ తరువాత కొంతకాలం పట్టినాథర్ ఒకే ప్రదేశంలో కొంతకాలం పాటు సంచరిస్తూ ఉండిపోయాడు. పట్టినాథర్‌ని చంపాలని తాను చేసిన ప్రయత్నంవల్ల తన ఇల్లు మొత్తం తగలపడిపోయినా అతని చెల్లెలికి బుద్ధి రాలేదు. ఆమె ఆ తరువాత కూడా పట్టినాథర్‌ని అనేక రకాల సమస్యలకు గురిచేసింది. తనకు ఆస్తి ఉన్నంత వరకు తన చెల్లెలు తనని వదిలి పెట్టదు అని అర్ధంచేసుకున్న పట్టినాథర్ తన ఆస్తి మొత్తాన్ని ఇరుప్పెయూర్ శివాలయానికి వ్రాసి ఇచ్చేసాడు.

ఆ తరువాత ఉజ్జయినీ క్షేత్రానికి వెళ్ళి అక్కడ ఉన్న మహాకాళిని దర్శించు కోవాలని నిర్ణయించుకున్నాడు. ఆ తరువాత అక్కడ నుండి బయలు దేరాడు. పట్టినాథర్, ఉజ్జయినీ చేరుకుని ఆపై కాళీదేవిని దర్శించుకున్నాడు. కొంతకాలంపాటు అక్కడే ఉండాలని నిర్ణయించుకున్నాడు. ప్రతిరోజూ ఉజ్జయినీ నగరంలోని వీధుల్లో తిరుగుతూ కాలక్షేపం చేస్తూ ఉండేవాడు.

ఒకరోజున ఉజ్జయినీ రాజైన భద్రగిరి తన భటులతో కలిసి అటువైపుగా వచ్చాడు. రాజుగారు తమ ముందునుంచి వెళుతున్నప్పుడు అక్కడ ఉన్న ప్రజలు అందరూ వినయంగా రాజుగారికి నమస్కరించారు. కానీ ఆ సమయంలో అక్కడే ఉన్న పట్టినాథర్ మాత్రం రాజుకి నమస్కారం చెయ్యలేదు. "నా అంతటివాడు బయటకు వచ్చినప్పుడు ప్రతివాడు నాకు తల వంచి నమస్కారం పెడుతున్నారు. మరి, ఈ గోచీపెట్టుకున్న ఈ బైరాగి నాకు ఎందుకు దణ్ణం పెట్టలేదు?" అని ఆ రాజుగారు మనసులో ఎంతగానో కలవరపడ్డాడు.

తన మనసులోని అనుమానాన్ని అణుచుకోలేని ఆ రాజు, "నీవు నాకు ఎందుకు నమస్కారం చెయ్యలేదు?" అని పట్టినాథర్‌ని ప్రశ్నించాడు. అప్పుడు పట్టినాథర్ నిర్వికారమైన స్వరంతో ఇలా అన్నాడు. "నేను పర దైవం అయిన ఆ పరమశివునికి తప్ప మరెవ్వరికీ నమస్కరించను".

పట్టినాథర్ అన్నమాట రాజుకి విపరీతమైన ఆగ్రహం తెప్పించింది. దాంతో ఆయన ఆగ్రహం ధ్వనిస్తున్న స్వరంతో ఇలా అన్నాడు. "నీవు మాట్లాడుతున్నది ఈ రాజ్యపు రాజుతో అన్నవిషయం నీకు తెలుసా?". అప్పుడు పట్టినాథర్ గంభీరమైన స్వరంతో ఇలా అన్నాడు. "ఆ తెలుసు. అందుకే నీ మాటలకు సమాధానం ఇస్తున్నాను. నేను సమాధానం ఇస్తున్నది నీలో ఉన్న పరమశివుడికి అని అర్థంచేసుకో". పట్టినాథర్ అన్న వేదాంత పూరితమైన మాటలకు ఆశ్చర్యపోయిన ఆ రాజు మరేమీ మాట్లాడకుండా ముందుకు సాగిపోయాడు.

ఆ రోజు రాత్రి పట్టినాథర్ మరికొంతమంది సన్యాసులు ఉజ్జయినీ మహాంకాళి ఆలయానికి దగ్గరలో ఉన్న ఒక సత్రంలో కూర్చుని మాట్లాడు కుంటున్నారు. ఆ సమయంలో పట్టినాథర్ తన గతజీవితం గురించి మరియు అప్పటి వరకు తాను ఎదుర్కొన్న చేదు మరియు తీపి అనుభవాల గురించి వివరించాడు. ఆ సమయంలో ఒక వ్యాపారి కూడా అనుకోకుండా అక్కడికి వచ్చాడు. పట్టినాథర్ చెప్పిన మాటలు అతనుకూడా విన్నాడు. ఆ తరువాత ఆ వ్యాపారి, పట్టినాథర్‌తో ఇలా అన్నాడు.

"ఈలోకం మిధ్య అనే భావంతో నీవు నీ సంపదలను, సుఖాలను వదిలిపెట్టి సన్యాసిగా మారావు. నీవు చేసింది చాలా పెద్ద తప్పు. జీవితంలో

ప్రతి నిమిషాన్ని ఆనందంగా అనుభవించాలి. సుఖాలను, భోగాలను వదులు కోవటం నపుంసకుల లక్షణం. అంతేకాదు సంపద మరియు అందమైన స్త్రీల పొందుకన్నా మనిషికి ఈ లోకంలో కావలిసింది ఏముంది?. నీకోసం మాత్రమే ఆలోచించే నీ భార్యకన్నా ఎవరూ ఎక్కువకాదు. అలాంటి వాటినన్నింటినీ వదిలిపెట్టి సన్యాసిగామారి దేశాలు పట్టుకుని తిరుగుతున్న నీవు ఎంత మూర్ఖుడివి?".

ఆ వ్యాపారి అన్న మాటలను శ్రద్ధగా విన్న పట్టినాథర్ ఆపై ఇలా అన్నాడు. "పురుషుడిలాగానే స్త్రీకి కూడా అనేక రకాల ఆలోచనలు ఉంటాయి. ఒక ఆడది ఎల్లప్పుడూ భర్త గురించి మాత్రమే ఆలోచిస్తుందని ఎన్నడూ అనుకోవద్దు. ఒక అమ్మాయి తన పెళ్ళికి ముందు ఎంతోమంది అందమైన యువకులనుచూసి మనసు పారేసుకుంటుంది. కేవలం ఒక్క యువకుడిని మాత్రమే ప్రేమించి ఊరుకోదు". పట్టినాథర్ చెప్పిన చేదైన వాస్తవాలు ఆ వ్యాపారికి ఆందోళన కలిగించాయి. అప్పుడు ఆ వ్యాపారి ఇలా అన్నాడు. "అందరు స్త్రీలు అలా ఉండరు". అప్పుడు పట్టినాథర్ చిరునవ్వు నవ్వి ఈ లోకంలో పుట్టిన స్త్రీలు అందరూ అలాంటి మనస్తత్వాన్నే కలిగి ఉంటారు అన్నాడు. అప్పుడు ఆ వ్యాపారి తన మారువేషం తొలగించి పట్టినాథర్ ముందు నిలుచున్నాడు. ఆ వ్యాపారి మరెవరోకాదు పొద్దున పట్టినాథర్‌కి ఎదురుపడిన మహారాజు భద్రగిరి. అప్పుడు మహారాజు, పట్టినాథర్‌తో ఇలా అన్నాడు. "ఈ లోకంలోని స్త్రీలందరూ ఒక్క పురుషుడికే అంకితం కారు అని నీవు అన్నావు. కానీ, ఈ దేశ మహారాణి అయిన నా భార్య చాలా ఉత్తమురాలు. ఆమె నా గురించి తప్ప మరే ఇతర పురుషుడి గురించి పొరపాటున కూడా ఆలోచించదు".

రాజుగారు అన్నమాటలకు పట్టినాథర్ పక, పకా నవ్వి ఆపై రాజుగారితో "రాజా! నీ భార్యకు కూడా అనేక మనసులు ఉన్నాయి. (అనేక మంది పురుషులను మనసులో ఇష్టపడుతుంది)". పట్టినాథర్ నిర్మొహమాటంగా అలా అనేసరికి రాజుగారి కోపం తారాస్థాయికి చేరింది. ఆపై రాజుగారు ఇలా అన్నాడు. "మర్యాదగా నీ మాటలు వెనక్కుతీసుకుని క్షమాపణ కోరుకో". పట్టినాథర్ ఏమాత్రం జంకకుండా ఇలా అన్నాడు. "నేను చెప్పింది వాస్తవం. నీ భార్య కేవలము నీ ఒక్కడి గురించి మాత్రమే

ఆలోచించవదు". పట్టినాథర్ మొండిగా అలా అనేసరికి రాజుగారు మరింత ఆగ్రహించి ఆపై క్రోధపూరిత స్వరంతో ఇలా అన్నాడు.

"నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావ్. ఇందుకు తగిన ఫలితం నీవు అనుభవిస్తావు. రేపు ఉదయం నీ సంగతి తేలుస్తాను. సిద్ధంగా ఉండు". రాజుగారి బెదిరింపు మాటలువిని పట్టినాథర్ చిరునవ్వు నవ్వి ఆపై రాజుగారితో "రాజా! ఈ లోకంలో అన్నిటినీ త్యాగంచేసి సన్యాసిగా మారిన నాకు జీవితం అంటే ఒక గడ్డిపరకతో సమానం. కనుక నాకు ఏ శిక్ష పడ్డా నేను ఏమాత్రం లెక్కించను". పట్టినాథర్ వేదాంత స్వభావాన్ని వేరేగా అర్థం చేసుకొన్న ఆ రాజు, పట్టినాథర్‌ని దురహంకారిగా భావించి అక్కడి నుండి వెళ్ళిపోయాడు. మర్నాడు ఉదయం కొంతమంది భటులు ఆ సత్రానికి వచ్చి పట్టినాథర్‌ని తీసుకువెళ్ళి కొరత స్తంభం దగ్గరకు తీసుకువచ్చారు. (ఒక మొనతేలిన ఒక చెట్టు లేదా ఇనుప స్తంభానికి బాగా నూనెపూసి ఆపై దానిమీద నేరస్తుడిని కూర్చో పెడతారు. ఫలితంగా ఆ స్తంభం మొన లేదా చెట్టుమొన ఆ నేరస్తుడి ఆసనంగుండా మెల్లిమెల్లిగా లోపలికి వెళ్ళిపోతుంది. ఫలితంగా ఆ నేరస్తుడు నరకయాతన అనుభవిస్తూ మెల్లి, మెల్లిగా ప్రాణాలు కోల్పోతాడు). ఇంకా కొద్ది నిమిషాలలో తనని కొరత వేస్తారు అనగా పట్టినాథర్ ఇలా గానంచేసాడు.


పట్టినాథర్

"ఓ ఈశ్వరా! నేను ఏ పాపమూ చేయలేదు. ఈ శరీరంతో ఈలోకంలోకి వచ్చిన తరువాత నాకు తెలిసి ఏ తప్పు చెయ్యలేదు. ఇది నీ నిర్ణయం అని నేను అర్థంచేసుకున్నాను. గతజన్మలో నేను చేసుకున్న పాపాల ఫలితంగా ఇప్పుడు నా జీవితం ఈ శిక్షతో అంతం కాబోతున్నది".

ఈవిధంగా శివుడిని ప్రశ్నిస్తూ తీవ్రమైన ఉద్వేగానికి గురై పట్టినాథర్ నేలపైపడి

మూర్ఛపోయాడు. ఇంతలో ఆ కొరత స్తంభం హఠాత్తుగా పెద్ద మంటలలో మండిపోవటం ప్రారంభించింది. ఈ విచిత్రాన్ని చూసిన భటులు ఆ విషయాన్ని రాజుగారికి తెలియజేసారు. కొరత స్తంభం తానంతట తానే మండిపోయిన వార్త విన్న రాజుగారు తీవ్రమైన దిగ్భ్రమకు గురై ఆపై రాణివద్దకువెళ్ళి విచారంగా కూర్చున్నాడు. అప్పుడు రాణిగారు ఒక వెండి పాత్రలో మద్యాన్ని తెప్పించి రాజుగారికి ఇచ్చి త్రాగమన్నది. అంతేకాదు కొంతమంది సేవకులను అక్కడికి పిలిపించి రాజుగారికి కావలసిన సమస్త సుఖాలను (మగువను, మద్యాన్ని) నిరంతరమూ అందివ్వమని ఆజ్ఞాపించింది.

ఫలితంగా ఆ రాజు మద్యం మత్తులో జోగుతూ అందమైన వేశ్యలతో తనివితీరా రమిస్తూ కాలక్షేపం చెయ్యసాగాడు. ఈ లోగా రాణిగారు, పట్టినాథర్ వద్దకువెళ్ళి అతడితో ఇలా అన్నది. “ఈ రాణి చాలామంచిది అని లోకానికి చెప్పు నిన్ను వెంటనే ఇక్కడి నుండి క్షేమంగా బయటకు పంపించివేస్తాను”.

పట్టినాథర్, రాణిగారు అన్నమాటలకు తల అడ్డంగా ఊపుతూ “నేను చావనైనా చస్తానుకానీ, నువ్వు మంచిదానివి అని చెప్పనుగాక చెప్పను” అన్నాడు. పట్టినాథర్ మొండిగా మాట్లాడేసరికి రాణిగారికి తీవ్ర ఆగ్రహం వచ్చింది. ఆపై ఆమె కళ్ళు ఎర్రగాచేసి ఇలా అన్నది. “మొన్న నిన్ను కొరత వెయ్యబోయినప్పుడు జరిగిన అద్భుతం ఈసారి జరక్కుండా ఏర్పాట్లు చేస్తాను”. (అనగా “మొన్న ఏదో అద్భుతం జరిగి కొరత స్తంభం మండిపోయింది అందుకే నువ్వు చావు తప్పించుకున్నావు. ఈసారి అన్ని జాగ్రత్తలు తీసుకుని నిన్ను శిక్షిస్తాను. ఈసారి నీకు చావు తప్పదు” అని రాణి మాటలకు అర్థం).

కొద్ది రోజులు గడిచాయి. రాజుగారు ఎల్లవేళలా మద్యం మత్తులో ఉండిపోయాడు. ఒకరోజున దైవ సంకల్పంవల్ల రాజుగారికి బాగా స్పృహ వచ్చింది. దాంతో ఆయన తన మందిరం నుండి బయటకువచ్చి రాణిగారి మందిరంవైపు నడిచాడు. లోపల నుండి ఏవో మాటలు వినపడటంతో రాజుగారికి ఏదో అనుమానం కలిగింది. దాంతో ఆయన రాణిగారి

మందిరంలోకి వెళ్ళకుండా కిటికీ దగ్గర నుంచుని లోపల ఏం జరుగుతుందో చూద్దామని ప్రయత్నించాడు.

రాణిగారు తన మందిరంలో ఉన్న తన శయ్యమీద వికారంగా మరియు బలిష్టంగా ఒక యువకుడితో కలిసి నగ్నంగా పడుకుని ఉన్నది. ఆమె ఆ యువకుడితో ఇలా అంటున్నది. "ఎలాగైనా సరే నీవు ఆ సన్యాసి (పట్టినాధర్)ని చంపు. ఆ తరువాత వీలుచూసుకుని రాజుగారిని కూడా సంహరించు. ఆ తరువాత నువ్వు ఈ రాజ్యానికి రాజువి అవుతావు. నేను నీ కొత్తరాణిని అవుతాను". కొంచెం పరిశీలనగా చూసిన మీదట ఆ రాణిగారి ప్రక్కన శయనించి ఉన్నది ఆమె రథం నడిపే వ్యక్తి అని రాజుగారికి అర్థమయ్యింది. "నా రాణి మహాపతివ్రత అని భ్రమపడి ఇంతకాలం బ్రతికాను. నిజం చెప్పిన ఆ సన్యాసిని కొరతవేసి చంపించాలని ప్రయత్నించాను. కానీ ఆ సన్యాసి చెప్పిందే నిజం అయ్యింది. ప్రపంచంలోని స్త్రీలు అందరూ ఒకేరకంగా ఉంటారని ఈ రాణి నిరూపించింది" అని రాజుగారు మనసులో అనుకున్నాడు. తాను ఎంతగానో ప్రేమించిన తన రాణి తనకు ఇంత ద్రోహం చెయ్యటంతో ఆ రాజుగారికి జీవితంమీద పూర్తిగా విరక్తిపుట్టింది. ఆ తరువాత ఆయన, కారాగారంలో ఉన్న పట్టినాధర్ వద్దకువెళ్ళి అతని పాదాలపైపడి తనను క్షమించమని వేడుకున్నాడు. అంతేకాదు తనని శిష్యుడిగా స్వీకరించి సన్యాసి దీక్ష ఇవ్వమని అతనిని వేడుకున్నాడు.

పట్టినాధర్ అంగీకరించాడు. ఫలితంగా అప్పటివరకు ఉజ్జయినీ రాజ్యాన్ని పరిపాలించిన భద్రగిరి ఆ క్షణం నుండి సన్యాసిగా మారిపోయాడు. ఆ తరువాత ఆ గురుశిష్యులు ఇద్దరూ (పట్టినాధర్ మరియు భద్రగిరి) అక్కడ నుండి దక్షిణ భారతదేశంవైపు ప్రయాణం ప్రారంభించారు. మార్గమధ్యంలో వారు తమకు కనిపించిన గ్రామాలలో భిక్షాటన చేస్తూ కడుపు నింపుకునేవారు. ఒక్కోసారి రెండు మూడు రోజులకు సరిపడా ఆహారం లభించేది. ఒక్కోసారి రెండు మూడు రోజులకు కూడా ఆహారం లభించేదికాదు. ఈవిధంగా కాలాన్ని గడుపుతూ ఆ సన్యాసులు ఇద్దరూ తమ ప్రయాణాన్ని కొనసాగించారు.

ఒక రోజున భద్రగిరికి ఒక భిక్షాపాత్ర దొరికింది. దాన్ని అతడు తీసుకున్నాడు. అప్పుడు పట్టినాథర్ ఇలా అన్నాడు. "సన్యాసికి సొంతంగా ఏదీ ఉండకూడదు. అందువల్ల నీవు ఆ భిక్షాపాత్రను అవతల పారెయ్".

అప్పుడు భద్రగిరి ఇలా అన్నాడు. "మనకి ఎప్పుడూ ఆహారం దొరకదు. అందువల్ల ఆహారం దొరికినప్పుడే కొంత తిని, కొంత ఈ భిక్షా పాత్రలో దాచుకున్నట్లయితే మనకి భిక్ష దొరకనప్పుడు ఈ ఆహారం ఉపయోగ పడుతుంది. అదీకాక మనం పూజించే పరమశివుడికి కూడా ఒక భిక్షా పాత్ర ఉన్నది". భద్రగిరి మాటలను మౌనంగా విన్న పట్టినాథర్ ఒకసారి నిట్టూర్చి "సరే, నీ ఇష్టం" అన్నాడు.

ఆ తరువాత వారిద్దరూ మరికొంతదూరం ముందుకు నడిచారు. దారిలో ఒకచోట భద్రగిరికి ఒక చిన్న సంచి దొరికింది. భద్రగిరి దాన్ని కూడా చేతిలోకి తీసుకున్నాడు. అది గమనించిన పట్టినాథర్ చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు. "చూసావా నువ్వు సొంత ఆస్తులను పోగు చేసుకోవటం మొదలుపెట్టావు". అప్పుడు భద్రగిరి ఇలా అన్నాడు. "ఈ సంచి ఎవరికీ పనికిరాదు. అందుకే ఇక్కడ పారేసారు. దీన్ని మనం ఎందుకు వాడుకోకూడదు". "సరే, నీ ఇష్టం" అన్నాడు పట్టినాథర్. వారు అలా ముందుకు నడుస్తున్నారు. ఇంతలో మార్గంలో ఒకచోట వారికి బలహీనంగా ఉన్న ఒక చిన్న కుక్కపిల్ల నేలమీద పడుకుని కనిపించింది.

భద్రగిరి దాన్నిచూసి చాలా జాలిపడ్డాడు. చాలా రోజులుగా తిండి లేక నీరసంగా ఉన్న ఆ కుక్కపిల్లకి తనవద్ద ఉన్న ఆహారంపెట్టి దాని తల నిమిరాడు. ఆ తరువాత దాన్ని తన చేతిలోకి తీసుకుని బయలుదేరాడు. అది గమనించిన పట్టినాథర్ గంభీరమైన స్వరంతో ఇలా అన్నాడు. "నువ్వు మళ్ళీ బంధాలకు గురి అవుతున్నావు. ఈ కుక్కపిల్లని నీతోపాటుతీసుకు రావటంవల్ల మళ్ళీ నీలో మానవ బంధాల పట్ల ఆసక్తి మొదలవుతుంది జాగ్రత్త!". పట్టినాథర్ అన్న మాటలు విన్న భద్రగిరి ఇలా అన్నాడు.

"సన్యాసి అయినంత మాత్రాన దయాదాక్షిణ్యాలను త్యజించాల్సిన పనిలేదు. బలహీనంగా ఉన్న మానవుల పట్ల, జంతువుల పట్ల దయ చూపించటం మానకూడదు". భద్రగిరి వాదనను శ్రద్ధగా విన్న పట్టినాథర్ చిరునవ్వు నవ్వి "సరే, నీ ఇష్టం" అన్నాడు. ఆ తరువాత వారు ముందుకు

ప్రయాణించారు. కొద్ది రోజులు గడిచాయి ఒక రోజున వారికి రోజంతా తిరిగినా ఎవరూ భిక్ష వెయ్యలేదు. రాత్రి అయ్యింది. ఒక చిన్న ఇంటి అరుగుమీద పట్టినాథర్ నడుము వాల్చాడు. అతని కొంచెం దూరంలో భద్రగిరి తన కుక్కపిల్ల, సంచి మరియు భిక్షా పాత్రతో కూర్చున్నాడు. కొంతసేపు గడిచింది. అర్ధరాత్రి అయ్యింది. ఆ సమయంలో ఒక భిక్షగాడు పట్టినాథర్ వద్దకువచ్చి ఏదైనా ఆహారం ఉంటే పెట్టమని అడిగాడు. అప్పుడు పట్టినాథర్ నిర్వికారమైన స్వరంతో "నాయనా! నేను సన్యాసిని నీకు పెట్టటానికి నా దగ్గర ఏమీలేదు. అదిగో అక్కడ కూర్చున్నాడే అతడు ఒక సంసారి. అతడి దగ్గరకు వెళ్ళి అడుగు నీకు ఏమైనా తింటానికి పెడతాడు" అన్నాడు భద్రగిరిని చూపిస్తూ. పట్టినాథర్ అన్నమాటలతో భద్రగిరికి జ్ఞానోదయం అయ్యింది. అప్పుడు భద్రగిరి తనలో తాను ఇలా అనుకున్నాడు. "నేను అన్నీ వదిలిపెట్టి సన్యాసం స్వీకరించాను. కానీ ఈ కుక్కపిల్ల, భిక్షాపాత్ర మరియు సంచి నా వద్ద ఉన్న కారణంగా నన్ను సంసారి అని తన గురువు అన్నాడు. నేను వీటిని వదుల్చుకుంటేగాని మళ్ళీ నిజమైన సన్యాసిని కాలేను".

ఈ ఆలోచన రాగానే భద్రగిరి వెంటనే తన దగ్గర ఉన్న భిక్షాపాత్రను, సంచిని దూరంగా విసరివేసాడు. ఆ తరువాత కుక్కపిల్లను కూడా ఎదురుగుండా ఉన్న గోడవైపు విసిరాడు. అలా విసరడంతో ఆ కుక్కపిల్ల గోడకేసి గుద్దుకుని ఆపై భద్రగిరికేసి జాలిగాచూసి ప్రాణాలు వదిలింది. చనిపోయే ముందు ఆ కుక్కపిల్ల తనకేసి అలా జాలిగా ఎందుకు చూసిందో భద్రగిరికి అర్థంకాలేదు. ఇంతలో భిక్షగాడు, భద్రగిరి వద్దకువచ్చి తన అసలు రూపం చూపాడు. ఆ భిక్షగాడు సాక్షాత్తు పరమశివుడు అని భద్రగిరికి అర్థమయ్యింది. సాక్షాత్తు పరమశివుడే, భద్రగిరికి బ్రహ్మజ్ఞానాన్ని బోధించి అదృశ్యం అయిపోయాడు. ఆ తరువాత కాలంలో భద్రగిరి, తిరువిడదైమరుదూర్ క్షేత్రంలో భౌతికదేహం చాలించాడు.

తన శిష్యుడైన భద్రగిరి తనువు చాలించిన తరువాత కూడా పట్టినాథర్ కొంతకాలం జీవించాడు. ఆయన చివరగా తిరుఒట్రియూర్ ప్రాంతానికి చేరుకున్నాడు. అక్కడ కొంతకాలంపాటు కాలంగడిపాడు. ఆ సమయంలో ఆయన అక్కడ ఉండే పశువులుకాసే పిల్లలతో అప్పుడప్పుడు ఆడుకుంటూ ఉండేవాడు. ఆ ఆట ఎలా ఉండేది అంటే......?

తనను ఒక గోతిలోపెట్టి పైన మట్టి కప్పమని ఆ పిల్లలకు చెప్పేవాడు. వాళ్ళు అలాగే చేసేవారు. కొద్దిసేపు గడిచిన తరువాత పట్టినాథర్ ఆ గొయ్యికి కొంచెం దూరంలో ఉన్న నేల నుండి బయటకు వచ్చేవాడు. ఒకచోట పాతిపెట్టబడ్డ మనిషి ఇంకోచోటు నుండి బయటకు రావటం ఆ పిల్లలకు అద్భుతంగా అనిపించేది.

కాలం గడిచిపోతున్నది. తనకి భౌతికదేహం చాలించే సమయం ఆసన్నమైనదని పట్టినాథర్‌కి అర్థమయ్యింది. ఆయన ఎప్పటిలాగానే అక్కడ ఆడుకుంటున్న తన వద్దకు పిలిచి తనను ఒక గోతిలోపెట్టి మట్టి కప్పమని చెప్పాడు. వాళ్ళు అలాగే చేసారు. రెండు, మూడు గంటలు గడిచినా పట్టినాథర్ భూమిలోంచి బయటకు రాలేదు. దాంతో ఆ పిల్లలకు భయం వేసింది. వాళ్ళు ఖంగారుగా గోతివద్దకువెళ్ళి దానిమీద ఉన్న మట్టినితీసి గోతిలోకి చూసారు. ఆ గోతిలో పట్టినాథర్ లేడు. ఆ స్థానంలో అత్యంత ప్రకాశవంతంగా కనిపిస్తున్న ఒక శివలింగం ఉన్నది. పట్టినాథర్ ప్రాణాలు వదిలిన మరుక్షణమే ఆయన భౌతికదేహం శివలింగంగా మారిపోయిందని చెబుతారు.

పట్టినాథర్ శివలింగంగా మారిపోయిన ఆ ప్రదేశం నేడు తిరువోట్టియూర్ అని పిలువబడుతున్నది. చెన్నై నగర పొలిమేరల్లో ఈ క్షేత్రం ఉన్నది.

**పట్టినాథర్ ఆలయం :**

తమిళనాడులోని చెన్నై నగర ఉత్తరదిక్కు పొలిమేరల్లో తిరుఒట్రియూర్ ఉన్నది. సముద్రతీరంలో ఉన్న ఈ గ్రామంలో అనాదికాలం నుండి మానవులు నివాసం ఉంటున్నట్లుగా తెలుస్తున్నది. మద్రాసు నగరం నుండి తిరుఒట్టియూర్‌కి ప్రభుత్వం నడిపే సిటీ బస్సులు విస్తారంగా నడుస్తున్నాయి. తిరుఒట్టియూర్‌కి ఒక రైల్వేస్టేషన్‌కూడా ఉన్నది. చెన్నై సెంట్రల్-గుమ్మిడిపూండి రైలుమార్గంలో తిరుఒట్టియూర్ రైల్వేస్టేషన్ తగులుతుంది. ఈ మార్గంలో లోకల్ ట్రైన్స్ నడుస్తాయి.

తిరుఒట్టియూర్‌లోని పట్టినాథర్ ఆలయంలో ప్రధానదైవంగా పట్టినాథర్ శివలింగం పూజలు అందుకుంటుంది. ఈ ఆలయం

బంగళాఖాతం అనే సముద్రం ఒడ్డున ఉన్నది. ఈ ఆలయ నిర్మాణం 5 శతాబ్దాల క్రితం జరిగినట్లుగా తెలుస్తున్నది.



పట్టినాథర్ శివలింగంపైన నిర్మించబడిన ఆలయం ఇది.

వివిధ రకాల సమస్యల్లో ఉన్న భక్తులు ఈ క్షేత్రానికి వచ్చి తమ సమస్యలు తీర్చమని పట్టినాథర్‌కి ప్రార్థనలు చేస్తారు. ఒక విచిత్రం ఏమంటే ఈ క్షేత్రానికి వచ్చినవారు పట్టినాథర్‌కి తమపని పూర్తి అయితే ఏదైనా సమర్పిస్తామని మొక్కుకున్నట్లయితే ఆ పని పూర్తికాదు సరికదా వాళ్ళు మరికొన్ని కొత్త సమస్యల్లో ఇరుక్కోవటం జరుగుతుంది. అందుకు కారణం ఏమంటే పట్టినాథర్ ఒక సన్యాసి. అందువలన ఆయనకు మొక్కుబడి రూపంలో ఆశపెట్టాలని చూడకూడదు. పనిపూర్తి అయిన తర్వాత ఎవరైనా తాము ఇవ్వాలనుకున్న కానుక ఆ స్వామికి సమర్పించుకోవచ్చు.



# 8. సొరకాయస్వామి జీవిత విశేషములు?

ఆంధ్రదేశంలోని చిత్తూరుజిల్లాలోని పుత్తూరు పట్టణానికి చాలా దగ్గరలో ఉన్న నారాయణవనం అనే ప్రదేశంలో ఒక సిద్ధపురుషుడు జీవ సమాధి పొందాడు. ఆయనపేరు శ్రీసొరకాయస్వామి. (ఆంధ్రదేశంలో సొరకాయను ఆనపకాయ అనేపేరుతోకూడా పిలుస్తారు. సొరకాయ బాగా ముదిరిపోయి ఎండిపోయిన తరువాత దాంట్లో ఉన్న కండను మరియు గింజల్ని బయటకు తీసివేసి ఆపై ఆ సొరకాయలో నీళ్ళుపోసుకుని త్రాగుతారు. ఒకరకంగా చెప్పాలంటే దాన్ని "సొరకాయ వాటర్‌బాటిల్" అని పిలువవచ్చు. గ్రామ్య భాషలో దానిని సొరకాయబుర్ర అని పిలుస్తారు.) ఒక 'సొరకాయ బుర్ర'ను ఆహారం తీసుకోవటానికి మరియు నీళ్ళు త్రాగటానికి ఉపయోగించుకున్న కారణంగా ఈ స్వామికి సొరకాయస్వామి అన్నపేరు వచ్చింది అని చెబుతారు. క్రీ.శ. 1875వ సంవత్సరంలో పుట్టిన ఈ సిద్ధపురుషుడు 1902, ఆగష్టు 9వ తేదీన జీవ సమాధి పొందాడు.

ప్రస్తుతం నారాయణవనంలో ఉన్న పాత కళ్యాణవెంకటేశ్వరస్వామి వారి ఆలయానికి ఎదురుగా శ్రీసొరకాయస్వామివారి సమాధి ఉన్నది. మహాయోగిగా గుర్తించబడిన ఈ సొరకాయస్వామి జీవించి ఉన్న కాలంలో ఒక మతిచెడిన భిక్షకుడిగా సంచరిస్తూ ఉండేవాడు.

నల్లటి శరీరఛాయతో పొట్టిగా ఉండే ఆకారంలో ఉండే సొరకాయ స్వామి మొదట్లో చిత్తూరు జిల్లాలోని అనేక ప్రాంతాలలో భిక్షకుడిగా సంచరించాడు. చివరగా ఆయన నారాయణవనంకి చేరుకుని అక్కడే శాశ్వతంగా స్థిరపడ్డాడు.

ఈయన తలపై వెంట్రుకలు అట్టలుకట్టి ఉండేవి. దానిపై ఒక తలపాగా ఉండేది. ఈయన తనలోతాను మాట్లాడుకుంటూ ఆ ప్రాంతంలోని ఒక్కోఇంటికివెళ్ళి భిక్షాటన చేస్తూ ఉండేవాడు. దట్టంగా పెరిగిపోయిన బూడిదరంగు గడ్డంలో దాగిన ఆయన ముఖమండలంలోని రెండు నేత్రాలూ ఒకవిధమైన దివ్యతేజస్సుతో మెరిసి పోతూ ఉండేవట. ఆయన సమస్త జీవులపట్ల ఒకేవిధమైన ఆదరాన్ని చూపేవాడు. ఆయన నారాయణవనం

ప్రాంతానికి ఎప్పుడు వచ్చాడు? అన్న విషయం ఇప్పటికీ ఎవరికీ తెలియదు. ఎవరైనా వ్యక్తి ఆయనకు నమస్కరించి ఆయన ఆశీస్సులు పొందినట్లయితే ఆ వ్యక్తి మరియు అతని కుటుంబ సభ్యులకు కూడా ఎంతో మేలు జరిగేదట. కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం ఈ స్వామి, మేకలుకాసే కులానికి చెందినవాడని తెలుస్తున్నది. 1875, ఏప్రియల్ నెలలో ఈ ప్రాంతానికి చెందిన చెంగల్వరాయ మొదలియార్ (తమిళనాడుకి చెందిన పద్మశాలి కులానికి చెందిన వ్యక్తి) సొరకాయస్వామియొక్క మహత్యాన్ని గ్రహించిన తొలి వ్యక్తి అని చెబుతారు.


శ్రీసొరకాయస్వామి–నారాయణవనం.

కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం మొదట్లో ఆయన మేకల్ని కాస్తూ ఉండేవాడని, ఆ సమయంలో ఆయనకు ఒక యోగి కనిపించి ఆయనకు యోగశాస్త్రాన్ని బోధించాడని, ఫలితంగా ఆయనకు సిద్ధవిద్యలు లభించాయని తెలుస్తున్నది.

మరికొంతమంది అభిప్రాయం ప్రకారం శ్రీసొరకాయస్వామి, తిరుపతికి దగ్గరలో ఉన్న ఒక గ్రామంలో జన్మించాడని బాలుడుగా ఉన్నప్పుడే ఆయన దివ్యశక్తుల్ని పొంది ఆపై భిక్షాటనచేస్తూ జీవించేవాడని, కొంతకాలం తరువాత తమిళనాడులోని చెంగల్పట్ జిల్లాలో ఉన్న తిరువళ్ళూర్ గ్రామానికి వలస వెళ్ళిపోయాడని ఆపై అక్కడ వీధులలో భిక్షాటనచేస్తూ కాలక్రమంలో సిద్ధపురుషుడిగా మారాడని చెబుతారు.

శ్రీ సొరకాయస్వామి జీవించి ఉన్న రోజుల్లో ఉన్నత వర్గాలకు చెందిన ఎందరో వ్యక్తులు శ్రీస్వామిని దర్శించి ఆయనకు తమ బాధలను చెప్పుకునేవారు. ఆయన ఆశీస్సులతో వారి బాధలు తొలగిపోయేవి. ఆ

స్వామి పాదాలను తాకటం ఎంతో గొప్పవిషయంగా ఆనాటి ఉన్నత వర్గాలకు చెందిన స్త్రీలు భావించేవారని తెలుస్తున్నది.

నారాయణవనంలో శ్రీకళ్యాణవెంకటేశ్వరస్వామివారి ఆలయం ఉన్నది. శ్రీ వెంకటేశ్వరస్వామికి ఇక్కడే పద్మావతిదేవితో కళ్యాణం జరిగిందని చెబుతారు. వివాహంకానివారు ఈ కళ్యాణవేంకటేశ్వరస్వామికి మ్రొక్కుకుంటే అతి త్వరలోనే వివాహం యోగం పొందుతారు. ఈ నారాయణవనంలో అధిక సంఖ్యలో శిల్క్‌నేత పనివాళ్ళు ఉన్నారు. ఒకరకంగా చెప్పాలంటే ఈ ప్రాంతం శిల్క్ ఉత్పత్తికి ఎంతో పేరుపొందింది.

సొరకాయస్వామి ఏమి మాట్లాడుతున్నాడో ఆయన భక్తులకు అర్థమయ్యేదికాదు. అయినప్పటికీ ఆయన తమను ఆశీర్వదిస్తున్నాడని వాళ్ళకి స్పష్టంగా అర్థమయ్యేది. కొన్నిసార్లు ఆయన వద్దకు వచ్చిన రోగులకు వనమూలికలతో చేసిన లేపనాలను పూసి వారి రోగాలు నయంచేస్తూ ఉండేవాడు. సమస్త జీవులపట్ల కనికరాన్ని ప్రదర్శించాలని శ్రీసొరకాయస్వామి తన భక్తులకు బోధిస్తూ ఉండేవాడు.

శ్రీసొరకాయస్వామి జీవసమాధి పొందిన తరువాత కొంతకాలానికి ఆయన సమాధిమీద ఒక ఆలయం నిర్మించబడింది. ఈ ఆలయంలో ఇప్పటికీ ప్రతిరోజూ పూజలు జరుగుతూ ఉంటాయి. ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాల నుండి మరియు తమిళనాడు నుండి ప్రతిరోజూ అనేకమంది భక్తులు శ్రీసొరకాయస్వామి సమాధిని దర్శించి ప్రార్థనలు చేస్తూ ఉంటారు. ఆయన సమాధిని దర్శించినవారికి తప్పనిసరిగా కోరిన కోర్కెలు తీరతాయని చెప్పుకుంటూ ఉంటారు.

**ఈ క్షేత్రానికి ఎలా చేరాలి?**

మద్రాస్ రైల్వే విభాగానికి చెందిన ఈశాన్య రైలుమార్గంలో తగిలే పుత్తూరు రైల్వేస్టేషన్‌కి 3 కి.మీ. దూరంలో నారాయణవనం ఉన్నది. తిరుపతి పట్టణానికి 35 కి.మీ. దూరంలో నారాయణవనం ఉన్నది. తిరుపతి నుండి నారాయణవనానికి విస్తారంగా బస్సు సౌకర్యం ఉన్నది. తిరుపతి నుండి చెన్నై వెళ్ళే రైలుమార్గంలో పుత్తూర్ రైల్వేస్టేషన్ తగులుతుంది. అక్కడ రైలుదిగి అక్కడ నుండి ప్రైవేటు వాహనాలలో ఈ క్షేత్రానికి చేరుకోవచ్చు.



# 9. తిరునావుక్కరసు నాయనారు జీవిత విశేషాలు?

అప్పార్ లేదా తిరునావుక్కరసు అని పిలువబడిన ఒక మహా శివయోగి క్రీ.శ. 7వ శతాబ్దంలో నాటి తమిళదేశంలో జీవించాడు. ఆనాడు తమిళ రాజ్యంలో ప్రబలంగా ఉన్న జైన మతాన్ని రూపుమాపి శైవమతాన్ని స్థాపించటంలో ప్రముఖపాత్ర పోషించాడు ఈ తిరునాఉక్కరసు. శైవమత ఆచార్యులలో ప్రముఖంగా పేర్కొనబడిన నలుగురిలో తిరునాఉక్కరసు ఒకడని చెబుతారు.

తిరునాఉక్కరసు నాటి తమిళదేశంలోని తిరుమునైపడినాడు అనే ప్రాంతంలో ఉన్న తిరువామూరు అనే గ్రామంలో జన్మించాడు. ఈయన తండ్రిపేరు పూకల్‌నార్, తల్లిపేరు మాతినియార్. పుట్టినప్పుడు తిరునా ఉక్కరసుకు తండ్రిపెట్టినపేరు "మరుల్‌నీకియార్". ఈ పేరుకి అర్థం "చీకట్లను పారద్రోలేవాడు/అజ్ఞానాన్ని అంతమొందించేవాడు" అని.

మరుల్‌నీకియార్ చాలా చిన్నతనంలోనే సమస్త శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. మరుల్‌నీకియార్‌కి తిలకవతి అనే ఒక అక్కకూడా ఉండేది. ఈ తిలకవతికి 12వ సంవత్సరం రాగానే ఆమె తండ్రి పూకలనార్ ఆమెకు వివాహం చెయ్యాలని సంకల్పించాడు. ఆనాటి పల్లవ సైన్యంలో సేనాధిపతిగా పనిచేస్తున్న కలైపహాయార్ అనే పేరుగల ఒక యువకుడితో పుణ్యవతికి వివాహం నిశ్చయించాడు ఆమె తండ్రి. వివాహం ఇంకా కొద్ది రోజుల్లో జరగబోతుంది అనగా కొన్ని అనుకోని పరిస్థితుల్లో కలైపహాయార్ యుద్ధానికి వెళ్ళవలసి వచ్చింది. ఆ యుద్ధంలో కలైపహాయార్ మరణించాడు.

తన కుమార్తెకు జరగవలసిన పెళ్ళి ఆగిపోవటంతో పూకల్‌నార్ జబ్బుపడి ఆపై దిగులుతో చనిపోయాడు. భర్త చనిపోవటంతో విరక్తి చెందిన పూకల్‌నార్ భార్య మాతినియార్ భర్త చితిమీదకు చేరుకుని సతీసహగమనం చేసి తనువు చాలించింది. తనకు కాబోయే భర్త కలైపహాయార్ చనిపోవటంతో తిలకవతి ఎంతో విచారానికి గురైంది. అంతలోనే ఆమె తల్లి, తండ్రి కూడా ఈ లోకాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోవటంతో ఆమె తీవ్ర వేదనకు గురై తానుకూడా మరణించాలని నిర్ణయించుకున్నది. అప్పుడు

మరుల్‌నీకియార్ ఆమెతో ఇలా అన్నాడు. "ఇప్పుడు మన కుటుంబానికి పెద్ద దిక్కులేకుండా పోయింది. నీవు మాత్రమే మిగిలావు. ఇప్పుడు నీవు కూడా మరణిస్తే మన కుటుంబం దిక్కులేనిది అయిపోతుంది. ఇంతవరకు అక్కగా ఉన్న నీవు ఇకపై మన కుటుంబానికి తల్లిలా ఉండాలి. మన కుటుంబాన్ని రక్షించాలి. నీవు ఆత్మహత్య చేసుకునే ప్రయత్నాన్ని మానక పోతే నేను కూడా బలన్మరణం పొందుతాను".

తమ్ముడికోసం ఎంతో విచారించిన పుణ్యవతి తన ఆత్మహత్యా ప్రయత్నాన్ని మానుకుని ఆపై శివయోగినిగామారి శివుడిని ధ్యానిస్తూ జీవించాలని నిర్ణయించుకున్నది. అప్పటికి 10 సంవత్సరాల బాలుడైన మరుల్‌నీకియార్‌ని ఎంతో శ్రద్ధతో పెంచటం ప్రారంభించింది పుణ్యవతి.

మరుల్‌నీకియార్ వయస్సులో చిన్నవాడైనప్పటికీ అతడు ఈ ప్రపంచం యొక్క వాస్తవాన్ని గ్రహించాడు. "ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతంకాదని" అర్థంచేసుకున్నాడు. దానధర్మాలుచేస్తూ ఉండేవాడు. ఆనాడు తన ప్రాంతంలో ఉన్న మతాలలో ఏ మతం గొప్పదా? అని విచారించాడు. ఆనాడు తమిళ ప్రాంతంలో ప్రబల మతంగా ఉన్న జైనమతం చాలా గొప్పదని మరుల్‌నీకియార్ అభిప్రాయపడ్డాడు. ముఖ్యంగా అహింసా సిద్ధాంతాన్ని ప్రధానసూత్రంగా పాటించే జైనమత విధానాలు మరుల్‌నకియార్‌కి బాగా నచ్చాయి. జైనమతంలో చేరితే తనకు ముక్తి లభిస్తుందని భావించాడు. ఫలితంగా ఆయన జైన మతాన్ని స్వీకరించి ఆపై దక్షిణ ఆర్కాట్ జిల్లాలో ఉన్న పాటలీపుత్రం అనే పట్టణానికి చేరుకుని అక్కడ ఉన్న జైనమత విద్యాలయంలో విద్యార్థిగా చేరాడు. కొన్ని సంవత్సరాలపాటు జైనమత సిద్ధాంతాలను క్షుణ్ణంగా అభ్యసించి గొప్ప పండితుడిగా మారాడు. జైనమత గురువులు మరుల్‌నీకియార్‌కి "ధర్మసేనుడు" అనే ఒక కొత్తపేరు పెట్టారు.

తరతరాలుగా శివుడిని ఆరాధిస్తూ శైవమతాన్ని పాటిస్తున్న తమ కుటుంబంలోని మరుల్‌నీకియార్ జైనమతంలో చేరిపోవటం అతడి సోదరి పుణ్యవతికి ఎంతమాత్రం నచ్చలేదు. దాంతో ఆమె ఎంతో ఆవేదనచెంది తన ప్రాంతాన్ని విడిచి తిరువడిగాయ్‌విరాట్టనాం అనే శైవ క్షేత్రానికి చేరుకుని అక్కడ ఉన్న శైవ మఠంలో చేరింది. ఆ క్షేత్రంలో వెలసిన విరాట్టనేశ్వరుడిని

పూజించటం మొదలుపెట్టింది. జైనమతంలో చేరిన తన సోదరుడు మరుల్‌నకియార్ ఏనాటికైనా మళ్ళీ శివభక్తుడిగా మారాలని ఆమె మనస్ఫూర్తిగా వాంఛిస్తూ ఉండేది. మరుల్‌నకియార్ శైవమతంలోకి మారేలా చెయ్యమని విరాట్టనేశ్వరుడిని ప్రతిరోజూ ప్రార్థిస్తూ ఉండేది పుణ్యవతి. ఒకరోజు రాత్రి విరాట్టనేశ్వరుడు, పుణ్యవతికి కలలో కనిపించి ఆమెతో ఇలా చెప్పాడు. "నీ సోదరుడు గతజన్మలో నా గురించి ఎంతో తీవ్ర తపస్సుచేసాడు. విధివిలాసం వల్ల అతడు జైనమతంలో చేరాడు. అతడిని తీవ్రవ్యాధికి గురిచేసి అతని మనస్సును మారుస్తాను. అతడు మళ్ళీ నా భక్తుడికి మారేలా చేస్తాను. నీవేమీ విచారించకు".

శివసంకల్పంవల్ల మరుల్‌నీకియార్‌కి అతిదారుణమైన కడుపునొప్పి వ్యాధి మొదలయ్యింది. జైనమత గురువులు ఎన్ని ఔషధాలు ఇచ్చినా మంత్రాలు ప్రయోగించినా మరుల్‌నీకియార్‌కి ఆ వ్యాధి తగ్గలేదు. దాంతో మరుల్‌నీకియార్‌కి జైనమతంమీద నమ్మకం పోయింది. తన అక్క పుణ్యవతి గుర్తుకు వచ్చింది. శ్రేష్టమైన శైవ మతాన్ని వదిలిపెట్టి వేదవిహిత మార్గాలను అనుసరించే జైన మతాన్ని పుచ్చుకున్నందువల్ల తనకు ఈ భయంకర వ్యాధి వచ్చిందని తిరుల్‌నకియార్‌కి అనిపించింది. దాంతో ఆయన అప్పటి వరకు తను ధరించిన జైనమత సంబంధ వస్త్రాలను త్యజించి ఒక ధోతీ ధరించి ఆపై తన అక్క పుణ్యవతి వద్దకువెళ్ళి ఆమె కాళ్ళపైపడి తనను రక్షించమని వేడుకున్నాడు. పుణ్యవతి చాలా ఆశ్చర్యపడింది. తన సోదరుడిని మార్చటంకోసమే పరమశివుడు ఈ లీలను జరుపుతున్నాడని పుణ్యవతికి అర్థమయ్యింది. అప్పుడు ఆమె, తిరుల్‌నకియార్‌ని ఓదార్చి ఆపై కొంచెం విభూతిని చేతిలోకి తీసుకుని "ఓం నమఃశ్శివాయ" పంచాక్షరీ మంత్రాన్ని జపించి ఆపై ఆ విభూతిని తిరుల్‌నకియార్ నుదుటను అద్దింది. దాంతో తిరుల్‌నకియార్‌లో జైనమత స్వీకరణ కారణంగా ఏర్పడిన పాపం నశించి పోయింది. ఆ తరువాత పుణ్యవతి, తిరుల్‌నకియార్‌ని తీసుకుని విరాట్టనేశ్వర ఆలయానికి వెళ్ళింది. అక్కడ తిరుల్‌నకియార్ ఆ ఆలయం చుట్టూ ప్రదక్షిణలుచేసి ఆపై ఆలయంలోకివచ్చి ఆ ఆలయ గర్భగుడిలో వేంచేసి ఉన్న విరాట్టనేశ్వరుడిని కళ్ళారాచూస్తూ ఆయన మహాత్మ్యాన్ని కీర్తిస్తూ ఒక అద్భుత గీతాన్ని ఇలా ఆలపించాడు.

"మహాదేవుడవు అయిన నిన్ను కాదని పాషండ మతమైన జైనమతాన్ని స్వీకరించి చాలా తప్పుచేసాను. గోదావరి తీరంలో శివభక్తులైన ఋషులతో వాదించి శైవమతం అల్పమైనదని, జైనమతం గొప్పదని ప్రచారంచేసాను. నేను చేసిన ఈ శైవమత అపచారం కారణంగా ఆ యముడే ఈ కడుపు నొప్పి రూపంలో నావద్దకువచ్చి నన్ను చిత్రహింసలకు గురిచేస్తున్నాడు. ఓ పరమేశ్వరా! నీవే నా రక్షకుడవు. నీవే నన్ను ఈ వ్యాధి నుండి రక్షించాలి".

తిరుల్‌నకియార్, శివుడిని ప్రార్థిస్తూ పాడినపాట పూర్తి అయ్యిందో లేదో కొంతకాలంగా అతడిని వేధిస్తున్న కడుపునొప్పి వ్యాధి విచిత్రంగా అదృశ్యం అయిపోయింది. అప్పుడు ఒక అదృశ్యవాణి ఇలా పలికింది. "ఇకపై నీవు తిరునాఉక్కరసు అనేపేరుతో పిలువబడతావు. నీ పేరు ఈ దేశమంతా ప్రాకిపోతుంది". (తిరునావుక్కరసు అనగా "వాక్‌కి అధిపతి" అని అర్థం). ఈ తిరునావుక్కరసుకే "వాగీశుడు" అనే ఇంకొకపేరుకూడా ఉన్నది. వాగీశుడు అనగా వాక్కుకి అధిపతి అనిఅర్థం.

ఎప్పుడైతే పరమశివుడు తన వ్యాధిని తగ్గించాడో అప్పటి నుండి తిరునావ్కరసుకి శివుడిమీద అచంచలమైన భక్తి విశ్వాసాలు ఏర్పడ్డాయి. నిరంతరమూ పంచాక్షరీ మంత్రాన్ని జపిస్తూ శివుడే లోకంగా జీవించటం ప్రారంభించాడు. అప్పటివరకు జైనమతానికి వెన్నుముకగా ఉన్న ధర్మసేనుడు (తిరునావుక్కరసు) హఠాత్తుగా శైవమతంలోకి మారిపోయే సరికి ఆ ప్రాంతంలోని జైనమత గురువులకు ఆందోళన కలిగింది. తాము ధర్మసేనుడికి వచ్చిన కడుపునొప్పిని తగ్గించలేకపోయామని, దాంతో అతడు పరమశివుడిని ప్రార్థించి కడుపు నొప్పిని తగ్గించుకుని ఆపై పరమశివుడి భక్తుడిగామారి శైవమతంలోకి తిరిగి వెళ్ళిపోయాడని ఆ జైనమత గురువులకు అర్థమయ్యింది. ధర్మసేనుడు, శైవమతంలోకి వెళ్ళిపోయిన విషయం తెలిస్తే ఆ ప్రాంతాన్ని పాలిస్తున్న మహారాజుకి జైనమతంమీద విశ్వాసం పోతుందని, పైగా అప్పటివరకు జైన మతాన్ని పోషిస్తున్న ఆ మహారాజుకూడా శైవమతంలోకి వెళ్ళే ప్రమాదం ఉన్నదని ఆ జైనమత గురువులు ఊహించారు. దాంతో వాళ్లు ఒక ఎత్తు వేసారు.

ఆ ఎత్తు ప్రకారమే కొందరు జైనమత గురువులు, మహారాజువద్దకు వెళ్ళి ఆయనతో ఇలా చెప్పారు. "ధర్మసేనుడు మీకు ద్రోహం చెయ్యాలని

కుట్రపన్నాడు. అతడు మిమ్మల్ని ఏదోవిధంగా పదవి నుండి తప్పించాల ప్రయత్నిస్తున్నాడు". తన పదవికి ముప్పు వస్తుందని భావించిన మహారా వెంటనే తన భటుల్ని పిలిచి ధర్మసేనుడు (తిరునాఉక్కరసు) ఎక్కడ ఉన్న వెంటనే పట్టి తీసుకురమ్మని చెప్పాడు. ఆ భటులు మరియు కొంతమం జైనమతస్తులు, తిరువతికాయ్‌లో ఉంటున్న తిరునాఉక్కరసు వద్దకువెళ్ళి అతడిని వెంటనే బయలుదేరి తమతోపాటు రమ్మని అతడితో చెప్పార అప్పుడు తిరునావుక్కరసు వారితో ఇలా అన్నాడు.

"నేను మీ మహారాజుగారి ప్రజలలో ఒకడినికాదు. నేను పరమశివుని చెందిన వాడిని. ఆయనే నాకు అధిపతి. రాజుగారి ఆజ్ఞను ధిక్కరించట ఆయన ప్రజలకు తగదు. కానీ నేను ఆ రాజు రక్షణలో బ్రతకటంలేదు సర్వ లోకాలకు అధిపతి అయిన ఆ ఈశ్వరుడి రక్షణలో జీవిస్తున్నాన అందు వలన నేను మీ రాజుగారి మాటలు గౌరవించి మీత రావాల్సినపనిలేదు. సాక్షాత్తు యమధర్మరాజునే భస్మంచేసిన పరమశివు భక్తుడిని అయిన నాకు ఏ రాజునుచూసి భయపడవలసిన పనిలేదు".

ధర్మసేనుడు (తిరునావుక్కరసు) ఇదివరకటి మనిషి కాదన్ని శివకటాక్షాన్ని పొందిన మహాత్ముడని ఆ రాజభటులకు మరియు ఆ భటులత పాటు వచ్చిన జైనులకు స్పష్టంగా అర్థమయ్యింది. అప్పుడు వార తిరునావుక్కరసుతో ఇలా అన్నారు. "ఓ పూజ్యుడా! నీవు మా వెంట రానిక మేము కూడా తిరిగివెళ్ళం. నీవుకూడా మాతోపాటువచ్చి మా మహారాజు కూడా శివుని గొప్పతనాన్ని తెలియజేయి". జైన మతాన్ని పోషిస్తున్న మహారాజుని శైవంలోకి మార్చినట్లయితే జైనమతం తొందరగ నశించిపోతుంది అని అర్థంచేసుకున్న తిరునావుక్కరసు మరేమీ అడ్డుచెప్పకుండా ఆ భటుల వెంట బయలుదేరి మహారాజు వద్దకు వెళ్ళాడు

తిరునావుక్కరసుని చూడగానే మహారాజు ఆగ్రహంతో రంకెలు వేసాడు "రాజద్రోహానికి మరియు జైనమతద్రోహానికి పాల్పడిన ఈ దుర్మార్గుడి తగిన శిక్ష విధించండి" అని జైనమత గురువుల్ని కోరాడు ఆ మహారాజు. తమ కంట్లో నలుసులాగా తయారయిన తిరునావుక్కరసుని శిక్షించే అవకాశం రాజుగారు తమకు ఇవ్వటంతో ఆ జైనమత గురువులు ఎంతో పొంగిపోయారు. ఆ తరువాత వాళ్ళు భటుల్ని పిలిచి వారితో ఇలా చెప్పారు

"ఈ తిరునావుక్కరసుని ఏడు రోజులపాటు సున్నపు బట్టీలో పడవేయండి". ఆ భటులు తిరునావుక్కరసుని తీసుకువెళ్ళి సున్నపు బట్టీలో వేసారు.

సున్నపు బట్టీలో పుట్టే వేడికి తిరునావుక్కరసు ఉడికిపోయి చనిపోతాడని జైనమత గురువులు భావించారు. శివుడినే తన రక్షకుడిగా భావించిన తిరునావుక్కరసు ఆ సున్నపుబట్టీలో పద్మాసనంలో కూర్చుని శివపంచాక్షరీ జపిస్తూ సమాధిలోకి వెళ్ళిపోయాడు. ఏడు రోజులు పూర్తి అయిన తరువాత సున్నపుబట్టీ తలుపు తెరిచి చూడగా తిరునావుక్కరసు క్షేమంగా కనిపించాడు. అదిచూసి మహారాజు ఎంతగానో ఆశ్చర్యపోయాడు. అప్పుడు ఆ జైనమత గురువులు మహారాజుతో ఇలా అన్నారు. "జైనమతంలో ఉన్నప్పుడు అతడు నేర్చుకున్న విద్యల మహత్యం కారణంగా అతడు సున్నపుబట్టీలో ఉన్నా క్షేమంగా ఉన్నాడు. అతడు చెబుతున్నట్లుగా అతడిని శివుడిని కాపాడలేదు".

జైనమత గురువుల మాయమాటలు నమ్మాడు ఆ మహారాజు. మరి ఈ తిరునావుక్కరసుని ఎలా శిక్షించాలి అని ఆ మహారాజు, జైనమత గురువుల్ని అడిగాడు. తిరునావుక్కరసుకి కాలకూట విషం త్రాగిస్తే అతడు తప్పక చనిపోతాడని జైనమత గురువులు అన్నారు. ఆ తరువాత జైనమత గురువులు ఒక పాత్రనిండా భయంకరమైన విషాన్ని తెప్పించి తిరునావుక్కరసుని త్రాగమని కోరారు. సమస్త లోకాల్ని నశింపచేయగల కాలకూట విషాన్ని తన గరళంలో దాచుకున్న ఆ గరళకంతుడి భక్తుడైన తిరునావుక్కరసు ఎంతో ధైర్యంతో ఆ విషాన్ని త్రాగాడు. శివ మహాత్యం కారణంగా ఆ విషం, తిరునావుక్కరసుని ఏమీ చెయ్యలేకపోయింది. అది చూసి మహారాజు మరింతగా ఆశ్చర్యపడ్డాడు. రాజుగారు, తిరునావుక్కరసును ఆదరిస్తాడేమో అని భయపడిన జైనమత గురువులు మహారాజుతో ఇలా అన్నారు. "ఈ తిరునావుక్కరసు జైనమతంలో ఉన్నప్పుడు చేసిన సాధన కారణంగా అతడికి విషంవల్ల ఏ ప్రమాదమూ కలుగలేదు".

ఆ తరువాత జైనమత గురువులు, తిరునావుక్కరసుని ఒక మదపుటేనుగుచేత త్రొక్కించి చంపుతామని ప్రయత్నించారు. శివమహత్యం కారణంగా ఆ ఏనుగు తిరునావుక్కరసుని త్రొక్కలేదు సరికదా ఆయన ముందు శిరస్సువంచి ఆయనకు తన తొండంతో అభివాదం చేసింది.

ఇది చూసిన మావటీలు ఏనుగుని అంకుశాలతో పొడిచి తిరునావుక్కరసుని త్రొక్కి చంపమని ఏనుగుని బలవంతం చేసారు. దాంతో ఏనుగు మావటి వాళ్ళను మరియు ఆ సమయంలో అక్కడ ఉన్న కొంతమంది జైనమత గురువుల్ని తన కాళ్ళతో త్రొక్కి చంపివేసింది, దాంతో అక్కడ చావకుండా మిగిలిన కొందరు జైనమత గురువులు అక్కడ నుండి ప్రాణభయంతో పరుగులు తీసారు. ఇన్ని జరిగినా జైనమత గురువులు తమ ప్రయత్నాల విరమించలేదు. తిరునావుక్కరసుని ఒక పెద్ద బండరాయికి కట్టి అతడి ఆ బండరాయితో సహా సముద్రంలో పడవేసారు.

తిరునావుక్కరసు, శివపంచాక్షరీ జపిస్తూ ఉండిపోయాడు. ఆ మంత్ర బలం వల్ల సముద్రంలో మునిగిపోతున్న బండరాయి బెండులాగా నీళ్ళ తేలింది. అంతే కాకుండా అది నీళ్ళపై తేలుతూ తిరుప్పాలియూర్ ఒడ్డుకి చేరుకున్నది. ఆ ప్రాంతంలో ఉన్న అనేకమంది శివభక్తులు సముద్ర తీరానికి చేరుకుని అక్కడ బండరాయికి కట్టివేయబడి ఉన్న తిరునావుక్కరసు కట్లు విడదీసి ఆయనకు ఘనస్వాగతంచెప్పి గ్రామంలోకి తీసుకు వెళ్ళారు. పరమ శివుడి మహత్యం కారణంగానే తాను సముద్రంలో పడ్డా క్షేమంగా బయటకు వచ్చానని తిరునావుక్కరసు భావించాడు. మానవులు తనని సంహరించాలని చూసినా పరమేశ్వరుడు తనని రక్షిస్తున్న కారణంగానే తాను ప్రాణాలతో ఉన్నానని తిరునావుక్కరసు ఒక గీతరూపంలో పాడాడు.



ఆ తరువాత తిరునావుక్కరసు ఆ ప్రాంతంలోని అనేక దేవాలయాలను, పుణ్య క్షేత్రాలను దర్శిస్తూ చివరిగా తిరువత్తికాయ్ అనే క్షేత్రానికి చేరాడు.

అప్పటి వరకు జైనమత గురువుల ప్రభావంలో ఉండి తిరునావుక్కరసును సంహరించటానికి అనేక ప్రయత్నాలు చేయించిన పల్లవరాజుకి తిరునావుక్కరసు క్షేమంగా ఉన్నాడని సమాచారం అందింది. తిరునావుక్కరసు గొప్ప శివభక్తుడని ఆ పల్లవరాజుకి అర్థమయ్యింది. తిరునావుక్కరసు ఎంతటి మహత్యం గలవాడో పల్లవరాజు స్వయంగా తెలుసుకున్నాడు. ఆ తరువాత పల్లవరాజు స్వయంగా తిరువత్తికాయ్ గ్రామానికివెళ్ళి అక్కడ నివసిస్తున్న తిరునావుక్కరసు పాదాలపై పడి క్షమాపణలు కోరాడు. అప్పుడు తిరునావుక్కరసు, పల్లవరాజును గాఢాలింగనం చేసుకుని ఆదరించాడు. ఆ క్షణంలోనే నుండి పల్లవరాజు శైవమతంలోకి మారిపోయాడు.

ఆ తరువాత పల్లవరాజు తిరువత్తికాయ్‌లో పరమశివుడికి ఒక అద్భుతమైన ఆలయాన్ని నిర్మించాడు. ఆ ఆలయంలో తిరునావుక్కరసు కొంతకాలంపాటు శివారాధనచేసాడు. ఆపై తిరునావుక్కరసు అనేక ప్రాంతాలలో పర్యటించి శైవమతంయొక్క గొప్పతనాన్ని ప్రచారంచేసాడు. 'శివుడే పరదైవం' అనే సత్యాన్ని అన్ని వర్ణాల ప్రజలలో వ్యాపింపచేసాడు. కొంతకాలం గడిచింది. తిరునావుక్కరసులో ఒక ఆలోచన మొదలయ్యింది. అది ఏమిటంటే "తాను గతంలో కొంతకాలంపాటు తిరుత్తూంగానైమావడన్ అనే క్షేత్రంలో కొంతకాలంపాటు జైనులతో కలిసి ఉండి వారితో సహపంక్తి భోజనాలు చేసాడు. ఫలితంగా తన శరీరంలో అపవిత్రత ఏర్పడింది. కొంతకాలంగా శివారాధనలో ఉన్న కారణంగా ఆ అపవిత్రతలో చాలా భాగం నశించి పోయింది. కానీ ఇంకా కొంత అపవిత్రత తన శరీరంలో దాగి ఉన్నది. పూర్తి పవిత్రత లేకుండా శివుడిని పూజించటం భావ్యంకాదని" భావించిన తిరునావుక్కరసు తనకు శివదీక్షను ప్రసాదించమని శివుడిని వేడుకున్నాడు.

అప్పుడు పరమేశ్వరుడు తన సేవకులలో అత్యంత ఉత్తముడైన ఒకడిని పిలిపించి అతడిని తిరునావుక్కరసువద్దకు వెళ్ళి తిరునావుక్కరసుకి శివదీక్ష ఇవ్వమని ఆజ్ఞాపించాడు. ఆ శివసేవకుడు, తిరునావుక్కరసు వద్దకు వచ్చి తిరునావుక్కరసు భుజాలమీద త్రిశూలము మరియు నంది చిహ్నాలను ముద్రించాడు. ఆవిధంగా శివదీక్ష లభించటంతో తిరునావుక్కరసు పరమ పవిత్రుడుగా మారిపోయాడు. ఆ తరువాత తిరునావుక్కరసు తిరువత్తర,

కనకసభ లాంటి దివ్య క్షేత్రాలను దర్శించి ఆపై చిదంబర క్షేత్రానికి చేరుకున్నాడు. చిదంబర క్షేత్రంలో వెలసిన నటరాజస్వామిని చూసి తన్మయత్వం చెందిన తిరునావుక్కరసు సమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు.

కొన్నాళ్ళు చిదంబరంలో ఉండి నటరాజస్వామిని తనివితీరా దర్శించుకున్నాడు. ఆ సమయంలోనే తిరునావుక్కరసుకి బాలయోగి అయిన తిరుజ్ఞానసంబంధర్ గురించి తెలిసింది. సాక్షాత్తు పార్వతీదేవియొక్క స్తనపానాన్ని చేసిన ఆ బాలయోగిని కళ్ళారాచూసి తరించాలని భావించిన తిరునావుక్కరసు, షియాలి గ్రామానికి చేరుకున్నాడు. మహాయోగిగా గుర్తించ బడిన తిరునావుక్కరసు తనకోసం వస్తున్నాడని ముందుగానే తెలుసుకున్న తిరుజ్ఞాన సంబంధర్, తిరునావుక్కరసుకి ఎదురువెళ్ళి స్వాగతం చెప్పాడు. తిరుజ్ఞానసంబంధర్, తిరునావుక్కరసుకి సాష్టాంగదండ ప్రమాణంచేసాడు. తిరునావుక్కరసు కూడా తిరుజ్ఞాన సంబంధర్‌కి పాదాభివందనం చేసాడు. ఇద్దరు మహాయోగులు పరస్పరం ఎలా గౌరవించుకుంటారో ఈ ఇద్దరు శివయోగులు నిరూపించారు.

తిరుజ్ఞానసంబంధర్ ఎంతో ఆదరంతో తిరునావుక్కరసును "అప్పారే" అని పిలిచాడు. అప్పారే అనగా "తండ్రి" అని అర్ధం. ఆ తరువాత తిరునావుక్కరసు, తిరుజ్ఞానసంబంధర్‌ని వెంటపెట్టుకుని నటరాజస్వామి ఆలయానికి వెళ్ళాడు. సంబంధర్ కోరికమీద తిరునావుక్కరసు, పరమేశ్వరుడిని కీర్తిస్తూ ఒక అద్భుతమైన గీతాన్ని ఆలపించాడు. ఆ తరువాత ఆ ఇద్దరు మహాయోగులు, తిరుక్కోరక ఆలయాన్ని దర్శించారు. ఆ తరువాత తిరునావుక్కరసు, తిరుజ్ఞానసంబంధర్‌కి వీడ్కోలుపలికి తానుమాత్రం అనేక దేవాలయాను సందర్శిస్తూ చివరగా తిరువావదుతురై క్షేత్రానికి చేరుకున్నాడు. ఆ క్షేత్రంలోనే తిరునావుక్కరసు తీవ్ర వైరాగ్య స్థితికి చేరుకున్నాడు. తనకు ఈ లోకం నుండి మరియు జనన మరణ చక్రం నుండి విముక్తి కలిగించమని ఆ పరమశివుడిని వేడుకున్నాడు. ఆ తరువాత తిరునావుక్కరసు, సత్తిమూలం క్షేత్రానికి వెళ్ళి ఆ క్షేత్రంలో వెలసిన ఈశ్వరుడిని ఇలా ప్రార్ధించాడు.

"ఓ మహాదేవా! నేను ఈ శరీరం త్యజించేలోగా నీపాద పద్మాలను నా శిరస్సుపై ఉంచు". అప్పుడు పరమశివుడు, తిరునావుక్కరసుతో ఇలా

అన్నాడు. "నీవు తిరునల్లూర్‌కి రా. అక్కడ నీ కోరిక తీరుతుంది". ఆపై తిరునావుక్కరసు అక్కడ నుండి తిరునల్లూర్ క్షేత్రానికి చేరుకున్నాడు. ఆ క్షేత్రంలో పరమశివుడు తన పవిత్ర పాదాలను తిరునావుక్కరసు శిరస్సుపై కొద్దిసేపు ఉంచాడు.

ఆ తరువాత తిరునావుక్కరసు, తింగలూర్ అనే ప్రదేశానికి చేరుకున్నాడు. ఆ సమయంలో అక్కడ అప్పూడిఎడిగళ్‌నయనార్ అనే ఒక శివభక్తుడు నివసిస్తున్నాడు. ఆయనకు తిరునావుక్కరసుమీద ఎనలేని భక్తిశ్రద్ధలు ఉన్నాయి. ఆ కారణంగానే ఆయన తన బిడ్డలందరికీ "వాగీశుడు" అన్నపేరు పెట్టాడు. (తిరునావుక్కరసు అన్నా, వాగీశుడు అన్నా అర్థం ఒకటే. తిరునావుక్కరసు తమిళ భాషాపదం కాగా, వాగీశుడు సంస్కృత భాషాపదం అని గుర్తించాలి.) అంతేకాకుండా ఆయన త్రవ్వించిన చెరువులకు, కట్టించిన ధర్మసత్రాలకు "వాగీశుని ధర్మంతో లేదా ఆర్థిక సహాయంతో కట్టబడ్డాయని వ్రాయించాడు. తిరునావుక్కరసును అంతగా అభిమానించే అప్పూడిఎడిగళ్‌నయనార్, తిరునావుక్కరసుని తన ఇంటికి విందు భోజనానికి ఆహ్వానించాడు. భోజనం చెయ్యటానికి అవసరం అయిన అరిటాకులను కోసుకురమ్మని తన పెద్ద కుమారుడైన పెద్ద వాగీశుడిని అరటి తోటకు పంపాడు అప్పూడిఎడిగళ్‌నయనార్.

ఆ అబ్బాయి అరిటాకులు కోస్తూ ఉన్న సమయంలో ఒక త్రాచుపాము అతడిని కరిచింది. ఆ అబ్బాయి పాముకాటు బాధను ఎలాగో తట్టుకుని అరిటాకులుతెచ్చి తండ్రికి ఇచ్చి ఆపై ప్రాణాలు వదిలాడు. ఆ అబ్బాయి పాముకాటుతో చనిపోయిన విషయం తెలిస్తే తిరునావుక్కరసు భోజనం చెయ్యడని భయపడిన అప్పూడిఎడిగళ్‌నయనార్ దంపతులు ఏమీ జరగనట్లుగా ప్రవర్తిస్తూ తిరునావుక్కరసును భోజనానికి రమ్మని సాదరంగా ఆహ్వానించారు. దివ్యదృష్టి ద్వారా జరిగిన విషయాన్ని తెలుసుక్ను తిరునావుక్కరసు గంభీరమైన స్వరంతో ఇలా అన్నాడు.

"చనిపోయిన మీ బిడ్డ మృతదేహాన్ని తీసుకుని శివాలయం వద్దకు రండి". ఆ తరువాత అప్పూడిఎడిగళ్‌నయనార్ తన కుమారుడి మృతదేహాన్ని తీసుకుని శివాలయంలో ఉన్న తిరునావుక్కరసు వద్దకు వచ్చాడు. అప్పుడు తిరునావుక్కరసు, చనిపోయిన ఆ బిడ్డను బ్రతికించమని పరమ

శివుడిని ప్రార్థించాడు. ఫలితంగా ఆ బిడ్డ నిద్ర నుండి లేచినట్లుగా లేచి కూర్చున్నాడు. చనిపోయిన తన బిడ్డ మళ్ళీ బ్రతకటంతో అప్పూడిఎడిగళ్ నయనార్ ఆనందంతో పొంగిపోయాడు. ఆ తరువాత తిరునావుక్కరసు అందరితో కలిసి అప్పూడిఎడిగళ్‌నయనార్ గృహంలో విందుభోజనం ఆరగించాడు.

ఆ తరువాత తిరునావుక్కరసు అన్ని క్షేత్రాలను దర్శిస్తూ తిరువారూర్ అనే శైవ క్షేత్రానికి చేరుకున్నాడు. తిరువారూర్‌లో ఉండే శివభక్తులు, తిరునావుక్కరసుకి ఘనస్వాగతం చెప్పారు. ఆ తరువాత తిరునావుక్కరసు తిరువారూర్‌లోని శివాలయంలో శివుడిని ప్రార్థించాడు. అక్కడ పరమ శివుడు తిరునావుక్కరసుకి దర్శనమిచ్చాడు. శివదర్శనంతో ఉప్పొంగి పోయిన తిరునావుక్కరసు ఆ ఆలయంలో నృత్యం చేసాడు. ఆ తరువాత తిరునావుక్కరసు అనేక దేవాలయాలు సందర్శిస్తూ తిరువూకలూరు క్షేత్రానికి చేరుకున్నాడు. అక్కడ తిరునావుక్కరసు, రెండవసారి తిరుజ్ఞాన సంబంధర్‌ని కలుసుకున్నాడు. ఆ తరువాత ఆ ఇద్దరు భక్తులు కొంతకాలం పాటు తిరువూకలూరులో నివసించారు. ఆ సమయంలో అనేకమంది శివభక్తులు ఇక్కడికివచ్చి ఈ ఇద్దరు శివయోగుల్ని దర్శించుకున్నారు.

ఆ తరువాత తిరునావుక్కరసు మరియు తిరుజ్ఞానసంబంధర్ కలసి తిరునీజిమలై అనే గ్రామానికి వెళ్ళారు. ఆ సమయంలో ఆ గ్రామంలో తీవ్రమైన కరువు పరిస్థితులు నెలకొని ఉన్నాయి. ఆ సమయంలో అక్కడి ప్రజలు పడుతున్న బాధలను చూడలేక ఆ ఇద్దరు శివయోగులు చలించి పోయారు. ఆ ప్రజల కష్టాలను తీర్చమని పరమశివుడిని ప్రార్థించారు. అప్పుడు పరమశివుడు ఆ ఊరులోని శివాలయంలో ఉన్న పశ్చిమద్వారం బలిపీఠంమీద ఒక బంగారు నాణెం, తూర్పుద్వారం బలిపీఠంమీద ఒక బంగారునాణెం ఉంచి వాటితో ప్రజలకు కావలసిన ఆహారాన్ని కొనిపెట్టమని చెప్పాడు. అంతేకాదు ఇంకా కొద్ది రోజులుపాటు ప్రతిరోజూ అలాగే రెండు నాణాలను ఇస్తానని ఆ ఇద్దరు శివయోగులకు చెప్పాడు.

శివుడు ప్రసాదించిన బంగారు నాణాల కారణంగా ఆ ప్రాంత ప్రజల కరువు సంపూర్తిగా తీరిపోయింది. ఆ శివయోగులు పరమశివుడికి కృతజ్ఞతలను తెలియజేసుకున్నారు. ఆ తరువాత వారు ఇద్దరూ

"తిరుమలైకాడు" అనే దివ్య శైవ క్షేత్రానికి చేరుకున్నారు. ఈ క్షేత్రానికే "వేదారణ్యం" అనే ఇంకొకపేరుకూడా ఉన్నది. పూర్వం ఈ క్షేత్రంలో వేదాలు పరమశివుడిని పూజించేవి. అప్పట్లో ఆ ప్రాంత ప్రజలు కూడా వేదాలను పఠిస్తూ ఉండేవారు. కొంతకాలం గడిచిన తరువాత ఆ ప్రాంతం ప్రజలు వేదాలను చదవటం మానివేసారు. ఫలితంగా వేదాలు ఆ క్షేత్రంలోని శివుడిని పూజించటం మానివేసాయి. ఒక విశేషం ఏమంటే ఈ వేదారణ్యం క్షేత్రంలోని ఆలయానికి రెండు ప్రవేశ ద్వారాలు ఉండేవి. అందులో ఒక ద్వారం ద్వారా వేదాలు ఆ శివాలయంలోకి ప్రవేశించేవి. ఇంకొక ద్వారం ద్వారా భక్తులు ఆలయంలోకి ప్రవేశించేవారు.

వేదాలు ఆ ఆలయంలోకి రావటం మానివేసిన కారణంగా ఆ ద్వారం మూసివేయబడింది. ఇతర భక్తులు ఇంకో ద్వారం ద్వారా ఆలయంలోకి వెళుతూ ఉండేవారు. ఆ ఆలయం దగ్గరకు చేరుకున్న తిరునావుక్కరసు మరియు జ్ఞానసంబంధర్‌లు మూసి ఉన్న ద్వారం ద్వారా ఆలయంలోకి వెళ్ళాలనుకున్నారు. కానీ ఆ ద్వారాలను తెరవటం మానవ మాత్రులవల్ల కాదని వారికి తెలుసు. అందుకే వారు ఆ ద్వారం ముందు నుంచుని పరమశివుడిని కీర్తిస్తూ ఒక గీతం ఆలపించారు. ఫలితంగా ఆ ద్వారం తలుపులు వాటంతట అవే తెరుచుకున్నాయి. ఆపై ఆ ఇద్దరు భక్తులు లోపలికివెళ్ళి పరమశివుడిని పూజించుకున్నారు. ఆ తరువాత ఆ భక్తులు ఇద్దరూ బయటకువచ్చి మళ్ళీ శివుడిని శ్లాఘిస్తూ ఒక గీతం పాడారు. ఫలితంగా ఆ ద్వారం తలుపులు మళ్ళీ యధాతధంగా మూసుకుపోయాయి.

ఒకరోజు రాత్రి పరమశివుడు, తిరునావుక్కరసు కలలో కనిపించి అతడిని తిరువాయిమూర్‌కి రమ్మని ఆహ్వానించాడు. మర్నాడు ఉదయం తిరునావుక్కరసు, తిరువాయిమూర్ వైపు నడక ప్రారంభించాడు. తిరునావుక్కరసుకి కొంచెం ముందుగా పరమశివుడు నడుస్తూ కనిపించాడు. తిరునావుక్కరసు ఎంత ప్రయత్నించినా శివుడి ప్రక్కకి వెళ్ళలేకపోయాడు. ముందు శివుడు నడుస్తూ ఉండగా తిరునావుక్కరసు ఆయనను అనుసరిస్తూ వెనకాలే నడుస్తున్నాడు. అలా కొంతసేపు నడిచిన తరువాత అక్కడ ఒక ప్రదేశంలో ఉన్న ఒక ఆలయంలోకి వెళ్ళి అదృశ్యం అయిపోయాడు. తిరునావుక్కరసు ఆలయంలోకి వెళ్ళి చూడగా అక్కడ శివుడు కనిపించలేదు.

ఇది ఇలా ఉండగా తిరునావుక్కరసు, తిరువాయిమూర్‌వైపు నడవటం గమనించిన సంబంధర్ తానుకూడా తిరునావుక్కరసు వెనకాలే నడవటం ప్రారంభించాడు. కొద్దిసేపటికి సంబంధర్‌కూడా ఆ ఆలయంలోకి ప్రవేశించాడు. అక్కడ విచారంగా ఉన్న తిరునావుక్కరసు కనిపించాడు. అప్పుడు పరమశివుడు ఆ ఇద్దరు శివయోగులకు దర్శనమిచ్చాడు.

ఆ ఇద్దరు శివయోగులు అక్కడి నుండి తిరువాయిమూర్‌కి వెళ్ళారు. ఆ తరువాత అక్కడి నుండి తిరుమలైకాడ (వేదారణ్యం)కు తిరిగివచ్చారు. ఆ సమయంలోనే నాటి పాండ్యదేశపు మహారాణి మంగయార్‌కారసియార్ మరియు మహామంత్రి కులాచిరాయ్‌నాయనార్ తమ రాజ్యంలో జైనమత గురువులు చేస్తున్న దుర్మార్గాల గురించి జ్ఞానసంబంధర్‌కి వర్తమానం పంపారు. తిరుసంబంధర్ తానే స్వయంగా పాండ్యదేశ రాజధానికి వెళ్ళి అక్కడ అకృత్యాలకు పాల్పడుతున్న జైనమత గురువుల్ని ఓడించాలని నిర్ణయించుకున్నాడు. అప్పుడు తిరునావుక్కరసు, జైనమత గురువులయొక్క దుర్మార్గపు స్వభావాన్ని జ్ఞానసంబంధర్‌కి తెలియజేయటమే కాకుండా అతడిని పాండ్యరాజ్యానికి వెళ్ళవొద్దని కోరాడు. అయితే సంబంధర్ పాండ్యరాజ్యానికి వెళ్ళితీరతానని తిరునావుక్కరసుకి గట్టిగా చెప్పాడు.

పసిబాలుడైన జ్ఞానసంబంధర్‌ని ఎంతో అభిమానించే తిరునావుక్కరసుకి, జ్ఞానసంబంధర్ చిక్కుల్లోపడటం ఇష్టంలేని కారణంగానే అతడిని పాండ్యరాజ్యానికి వెళ్ళవొద్దని కోరాడు. జైనమత వ్యాప్తిని అరికట్టి శైవమతాన్ని పునరుద్ధరించటంకోసం తాను పాండ్యరాజ్యానికి వెళ్ళక తప్పదని జ్ఞానసంబంధర్, తిరునావుక్కరసుకి నచ్చచెప్పాడు. చేసేదిలేక తిరునావుక్కరసు అంగీకరించాడు. అప్పుడు జ్ఞానసంబంధర్ మధురకు ప్రయాణం మొదలుపెట్టాడు.

జ్ఞానసంబంధర్ వెళ్ళిపోయిన తరువాత తిరునావుక్కరసు, తిరువావదుతురాయ్ క్షేత్రానికి వెళ్ళాడు. ఆ తరువాత అక్కడ నుండి పజిహైయరాయ్ క్షేత్రానికి వచ్చాడు. ఈ క్షేత్రంలో ఉన్న వడతలాయ్ ఆలయాన్ని బయట నుండే దర్శించి శివుడిని పూజించాడు. ఒకప్పుడు అది శివాలయంగా ఉండేది. అయితే జైనులు ఆ ఆలయాన్ని ఆక్రమించి అందులో ఉండే శివలింగాన్ని ఎక్కడకో తీసుకువెళ్ళి దాచిపెట్టి ఆపై ఆ

శివాలయాన్ని జైనమత ఆలయంగా మార్చివేసారు. శివలింగంలేని ఆలయంలోకి వెళ్ళటానికి ఇష్టపడని తిరునావుక్కరసు ఆ ఆలయం బయటే ఒకచోట కూర్చుని తన మనసులో శివుడిని ఇలా ప్రార్థించాడు.

"ఈశ్వరా! నీ లింగరూపము కనపడని ఈ ఆలయంలోకి నేను రాలేను. ఈ ఆలయంలో ఆ లింగము కనపడేవరకు నేను అన్నాహారాలు లేకుండా ఇక్కడే నిన్ను ధ్యానిస్తూ ఉండిపోతాను". అలా రెండు రోజులు గడిచాయి అప్పుడు పరమశివుడు ఆ ప్రాంతాన్ని పరిపాలించే మహారాజు కలలో కనిపించి అతనితో ఇలా చెప్పాడు. "ఓ రాజా! నా భక్తుడైన తిరునావుక్కరసు నా దర్శనంకోసం నా ఆలయం బయట రెండు రోజులుగా నిరాహార దీక్ష చేస్తున్నాడు. నీవు వెంటనే ఆ ఆలయం వద్దకువెళ్ళి ఆ ఆలయాన్ని ఆక్రమించి ఉన్న జైన మతస్తుల్ని అక్కడ నుండి తరిమివెయ్". తన లింగాన్ని జైనులు ఎక్కడ దాచిపెట్టారు? అన్న విషయాన్ని కూడా పరమశివుడు ఆ మహారాజుకి స్వప్నంలో తెలియజేసాడు. మర్నాడు ఉదయం ఆ మహారాజు కొంతమంది భటులతో కలిసి ఆలయం వద్దకువెళ్ళి ఆపై ఆ ఆలయంలో పూజలు చేసుకుంటున్న జైనమతస్తుల్ని బయటకు తరిమివేసాడు. ఆ తరువాత జైనులు ఎక్కడో రహస్యంగా దాచిపెట్టిన శివలింగాన్ని తెచ్చి ఆలయ గర్భ గుడిలో ప్రతిష్టింపచేసాడు. శివలింగం మళ్ళీ కనిపించటంతో తిరునావుక్కరసు ఎంతో సంతోషించి ఆపై ఆలయంలోకి ప్రవేశించి శివుడిని మనసారా పూజించాడు.

ఆ తరువాత తిరునావుక్కరసు తన తీర్థయాత్రను కొనసాగించాడు. అందులో భాగంగా ఆయన తిరుపెయిన్‌జీలి అనే ప్రదేశానికి దగ్గరలో ఉన్నప్పుడు ఆయనకు విపరీతమైన ఆకలివేసింది. తననే సర్వంగా భావించే తిరునావుక్కరసుకి ఆకలివేస్తున్న విషయం గ్రహించిన పరమశివుడు అతడి ఆకలిని తీర్చటానికికోసం ఒక చక్కటి తోటను మరియు అమృతం వంటి నీరు ఉన్న ఒక చెరువును సృష్టించాడు. అప్పటికే బాగా నడచి నడచి అలసి పోయిన తిరునావుక్కరసుకి శివుడు సృష్టించిన తోట కనిపించింది. వెంటనే ఆయన వేగంగా నడుస్తూ ఆ తోటలోకి ప్రవేశించాడు. ఆపై ఆ తోటలో ఉన్న చెరువులో ఉన్న చల్లటి నీటిని కడుపునిండా త్రాగి ఆ తరువాత ఆ తోటలో ఉన్న ఒక చెట్టునీడలో విశ్రమించాడు. అప్పుడు పరమశివుడు

ఒక బ్రాహ్మణ వృద్ధుడి రూపం ధరించి, కొన్ని పాత్రలలో ఆహార పదార్థాలను తీసుకుని తిరునావుక్కరసు వద్దకు వచ్చాడు.

తిరునావుక్కరసు ఆ ఆహార పదార్థాలను తిని ఎంతో తృప్తిచెందాడు. తనకు ఆహారం ఇచ్చింది మారువేషంలో ఉన్న పరమశివుడు అని తిరునావుక్కరసు గ్రహించలేకపోయాడు. "మీరు ఎక్కడికి వెళుతున్నారు?" అని బ్రాహ్మణ వేషంలో ఉన్న శివుడిని ప్రశ్నించాడు తిరునావుక్కరసు". "నేను తిరుప్పైయిన్‌జీలికి వెళుతున్నాను" అని సమాధానం ఇచ్చాడు ఆ బ్రాహ్మణుడు. కొంతసేపు గడిచిన తరువాత ఆ బ్రాహ్మణుడు మరియు తిరునావుక్కరసు, తిరుప్పైయిన్‌జీలి వైపు నడక ప్రారంభించారు. ఇంకా కొద్ది నిమిషాలలో తిరుప్పైయిన్‌జీలి గ్రామం వస్తుంది అనగా ఆ బ్రాహ్మణుడు హఠాత్తుగా అదృశ్యం అయిపోయాడు. అలా అదృశ్యం అయిపోయింది సాక్షాత్తు మారువేషంలో వచ్చిన పరమశివుడే తిరునావుక్కరసుకి అప్పుడు అర్థమయ్యింది. తన ఆకలితీర్చి, తనకు తోడుగా నడచి వచ్చిన శివుడిని గుర్తుపట్టలేకపోయిన తన అజ్ఞానానికి ఎంతగానో విచారించాడు తిరునావుక్కరసు.

ఆ తరువాత ఆయన తిరువన్నామలై, కంచి క్షేత్రాలను దర్శించాడు. ఆపై ఆంధ్రదేశంలోని కాళహస్తి క్షేత్రానికివెళ్ళి ఆ క్షేత్రంలో వెలసిన కాళహస్తీశ్వరుడిని పూజించాడు. ఒకసారి కాళహస్తి క్షేత్రంలో మోక్షాన్ని పొందిన కన్నప్ప అనే ఒక ఆటవిక భక్తుడి చరిత్రను గుర్తుచేసుకుంటూ ఒక అద్భుతమైన గీతాన్ని ఆ క్షేత్రంలో ఆలపించాడు తిరునావుక్కరసు. ఆ తరువాత ఆయనకు పరమశివుడు నివాసం ఉండే కైలాసానికి వెళ్ళాలని కోరిక కలిగింది. కైలాసం హిమాలయాలలో ఉంటుందని తిరునావుక్కరసు భావించాడు. దాంతో ఆయన ఉత్తరభారతదేశంవైపు తన ప్రయాణాన్ని ఆరంభించాడు. మార్గమధ్యంలో ఆయన అతి దట్టమైన అరణ్యాలగుండా నడిచాడు. ఆ అరణ్యాలలో అప్పుడప్పుడూ ఆయనకు ఎదురైన క్రూర మృగాలు ఆయనను చూడగానే సాధు జంతువులుగా మారిపోయేవి. అనేక రోజులపాటు నడిచి నడిచి కాశీ క్షేత్రానికి చేరుకుని ఆ క్షేత్రంలో వెలసిన విశ్వనాధుడిని దర్శించుకున్నాడు. ఆ తరువాత ఆయన కాశీ నుండి హిమాలయాలవైపు నడక ఆరంభించాడు. విపరీతంగా నడిచిన కారణంగా

ఆయన పాదాలు పుళ్ళతో నిండిపోయాయి. ఆపై నడవలేక చేతులతో మరియు మోకాళ్ళతో ప్రాకుతూ ముందుకు ప్రయాణించాడు. కొద్దిరోజులు ప్రయాణించేసరికి చేతులు, మోకాళ్ళ నుండి నెత్తురుకారటం మొదలయ్యింది. మోకాళ్ళలోని ఎముకలు విరిగిపోయాయి. అయినప్పటికీ తిరునావుక్కరసు మొండిపట్టుదలతో అలా ప్రాకుతూనే ముందుకు సాగిపోయాడు.

కైలాసానికి చేరుకుని తన జీవితాన్ని ముగించుకోవాలని తిరునావుక్కరసు భావించాడు. అతడు ఇంకా కొంతకాలంపాటు భూమిమీదే ఉండి తనపై ఎన్నో అద్భుత గీతాలు పాడాలని పరమశివుడు సంకల్పించాడు. ఆ తరువాత పరమశివుడు, ఒక వృద్ధ సాధువు రూపంలో తిరునావుక్కరసు ముందు ప్రత్యక్షం అయి అతడితో ఇలా అన్నాడు.

“ఓ మిత్రుడా! ఆ కైలాసం మానవ మాత్రులకు కనపడదు. అందువల్ల నీవు వెనుతిరిగి వెళ్ళిపో”. అప్పుడు తిరునావుక్కరసు దృఢమైన స్వరంతో ఇలా అన్నాడు. “ఈ శరీరం ఉన్నంత వరకు కైలాసానికి వెళ్ళే ప్రయత్నం మానను”. తిరునావుక్కరసు ఆ మాట అనగానే ఆ వృద్ధసాధువు చిరునవ్వు నవ్వి అదృశ్యం అయిపోయాడు. తనకు మారువేషంలో కనిపించింది పరమశివుడే అని తిరునావుక్కరసుకి వెంటనే అర్ధమయ్యింది. అప్పుడు తిరునావుక్కరసు, పరమశివుడిని ఇలా ప్రార్ధించాడు.

“ఓ ఈశ్వరా! నా ఈ ప్రస్తుత దేహం తీవ్రంగా గాయపడింది. కైలాసానికి చేరుకోవటానికి సహకరించే ఒక బలమైన నూతన దేహాన్ని నాకు ప్రసాదించు”. అప్పుడు పరమశివుడు, తిరునావుక్కరసుతో ఇలా చెప్పాడు. “నాయనా! అదిగో అక్కడ కనిపిస్తున్న చెరువులో స్నానంచేసిరా. ఆపై నీవు నా నివాసం అయిన కైలాసాన్ని చూడగలవు”. శివుడి మాట వినగానే తిరునావుక్కరసుకి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. వెంటనే ఆయన మోకాళ్ళపై ప్రాకుతూ ఆ చెరువులో ప్రవేశించి స్నానంచేసాడు. ఆ తరువాత ఆ చెరువు లోంచి బయటకు వచ్చి చూడగా తాను తిరువయ్యూర్ క్షేత్రంలో ఉన్న చెరువు గట్టుమీద ఉన్నట్లుగా అర్ధమయ్యింది. తిరువయ్యూర్‌కి కొన్నివందలమైళ్ళ దూరంలో ఉన్న చెరువులో మునిగిన తాను తిరువయ్యూర్ లో తేలటం తిరునావుక్కరసుకి ఎంతో ఆశ్చర్యాన్ని

కలిగించింది. చెరువు గట్టునుండి ఇవతలికివచ్చి అక్కడ ఉన్న శివాలయంలోకి వెళ్ళాడు. ఆ శివాలయంలో ఆయనకు కైలాస పర్వతం మరియు ఆ పర్వతంమీద ఒకచోట పార్వతీదేవితో కలిసి కూర్చుని ఉన్న పరమశివుడు మరియు ఆయన చుట్టూ కొలువై ఉన్న ప్రమధ గణాలు కనిపించాయి. ఆ అద్భుత దృశ్యాన్ని చూసిన తిరునావుక్కరసుకి శరీరమంతా పులకరింతలు వచ్చాయి. ఆయన ఆనందంతో ఆ ఆలయంలో నృత్యం చేసాడు.

ఆ తరువాత కాలంలో తిరునావుక్కరసు నివసించటంకోసం తిరుపూనుతురాయ్‌లో ఒక మఠం నిర్మించబడింది. ఆ మఠంలో తిరునావుక్కరసు శివధ్యానం చేస్తూ కాలం గడుపుతున్నాడు. ఇంతలో పాండ్యరాజ్యంలో అరాచకాలు సృష్టిస్తున్న జైనులను అణచి మరల శైవ మతాన్ని స్థాపించి తిరుజ్ఞానసంబంధర్, తిరుపూర్ తురాయ్‌కి తిరిగి వస్తున్నాడు అన్న విషయం తిరునావుక్కరసుకి తెలిసింది. జ్ఞానసంబంధర్‌కి స్వాగతం ఇవ్వటంకోసం తిరునావుక్కరసు ఎదురు వెళ్ళాడు. ఒక ముత్యాల వల్లకిలో ఊరేగుతూ వస్తున్న జ్ఞానసంబంధర్‌ని చూసి ఎంతో సంతోషించిన తిరునావుక్కరసు ఆ పల్లకి వద్దకువెళ్ళి తానుకూడా ఆ పల్లకిని మోయటం ప్రారంభించాడు. ఆ పల్లకి తిరుపూనమ్‌తురాయ్‌కి చేరుకున్నది. తాను ప్రయాణిస్తున్న పల్లకిని తిరునావుక్కరసు కూడా మోసాడు అన్న విషయం జ్ఞానసంబంధర్‌కి అప్పుడు తెలిసింది.



తిరునావుక్కరసు

సాక్షాత్తు శివుడి దర్శనాన్ని ఎన్నోసార్లు పొందిన తిరునావుక్కరసు లాంటి మహనీయుడు తన పల్లకిని మోయటం తిరుజ్ఞానసంబంధర్‌కి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. తిరునావుక్కరసు ప్రదర్శించిన నమ్రతకు జ్ఞానసంబంధర్ ఎంతగానో చలించిపోయాడు. ఆపై జ్ఞానసంబంధర్, తిరునావుక్కరసు పాదాలపైపడి నమస్కరించాడు. అప్పుడు తిరునావుక్కరసు, జ్ఞానసంబంధర్‌ని పైకి లేవదీసి తన హృదయానికి ఆదరంతో హత్తుకున్నాడు.

కొంతకాలం గడిచింది. పాండ్యరాజ్యంలో శైవమతం పరిస్థితి ఎలా ఉందో స్వయంగా తెలుసుకోవాలని భావించిన తిరునావుక్కరసు, పాండ్య రాజ్య రాజధాని నగరమైన మధురైకి వెళ్ళాడు. తిరుజ్ఞానసంబంధర్ మహత్యం కారణంగా జైనమతాన్ని వదిలిపెట్టి శైవమతాన్ని స్వీకరించిన పాండ్యరాజు నిన్రాషీర్‌నెడుమారనాయనార్ తన రాణి మంగయార్ కారసియార్ మరియు మహామంత్రి కులాచిరాయ్‌నాయనార్‌లతో సహా తిరునావుక్కరసుకి ఘన స్వాగతం పలికి తన భవనంలోకి ఆహ్వానించాడు. తిరునావుక్కరసు అక్కడే కొన్నాళ్ళు ఉండి మధురై క్షేత్రంలో వెలసిన పరమశివుడిని పూజించాడు.

ఆ తరువాత ఆయన అక్కడ నుండి రామేశ్వరం లాంటి శివ క్షేత్రాలను దర్శించి చివరగా తిరుపూకనూర్‌కి చేరుకున్నాడు. ఆ సమయంలో కూడా పరమశివుడు, తిరునావుక్కరసుని పరీక్షించాలి అనుకున్నాడు. ఒకరోజున తిరునావుక్కరసు, తిరుపూకనూర్‌లోని శివాలయంలో శివుడిని ప్రార్థిస్తున్న సమయంలో ఆయనముందు అపారమైన బంగారము మరియు రత్నాలను ఉంచాడు. వాటినిచూసి తిరునావుక్కరసు ఆశపడతాడని పరమశివుడు భావించాడు. ఈ లోక సంపదలను గడ్డిపరకగా భావించిన తిరునావుక్కరసు గుడిలో కనిపించిన బంగారాన్ని మరియు రత్నాలను ఒక చెత్తలాగా భావించి వాటిని ఒక బుట్టలోకి ఎత్తి ఆలయం ప్రక్కన ఉన్న చెరువులో పడవేసాడు. ఇంకొక సమయంలో అద్భుతమైన సౌందర్యంగల కొంతమంది యువతులను తిరునావుక్కరసు ముందుకు పంపించాడు పరమశివుడు.

ఆ యువతులు ఎన్నివిధాలుగా రెచ్చకొట్టినా తిరునావుక్కరసు ఏమాత్రం చలించలేదు. ఆయన దృష్టి అంతా పరమశివునిమీదే లగ్నం అయి ఉన్నది. ఈవిధంగా పరమశివుడు పెట్టిన అన్ని కఠిన పరీక్షలలో

తిరునావుక్కరసు గెలుపు సాధించాడు. కొన్నేళ్ళు గడిచాయి. తన 81వ ఏట తిరునావుక్కరసు భౌతిక దేహాన్ని చాలించి పరమశివుడిలో లీనం అయిపోయాడు.

ఒక విశేషం ఏమంటే బాలుడైన తిరుజ్ఞానసంబంధర్‌ని వయోవృద్ధుడు అయిన తిరునావుక్కరసు తనతో సమానుడిగా భావించటం తిరునావుక్కరసు యొక్క మనోపరిణతికి మరియు జ్ఞానానికి ప్రతీక అని చెప్పటం అతిశయోక్తికాదు.

## 10. సిద్ధపురుషుడు కొంగనార్ జీవిత విశేషాలు?

మహాసిద్ధపురుషుడిగా పేర్కొనబడిన భోగర్‌యొక్క శిష్యుడే ఈ కొంగ నావర్ అనే సిద్ధయోగి(సిద్ధర్). ఈయన తన చరమ దశలో తిరుమల కొండమీద సజీవ సమాధి అయ్యాడని చెబుతారు. ఈ కొంగనావర్ సమాధి మీదే ఈనాటి తిరుమల ప్రధాన ఆలయం నిర్మించబడిందని కొందరు పరిశోధకులు తెలియజేస్తున్నారు. అద్భుతమైన మహత్యాలను ప్రదర్శించిన ఈ కొంగనావర్ జీవిత విశేషాలను క్లుప్తంగా తెలియజేస్తాను.

ఒక రోజు కొంగనావర్ ఒక చెట్టుక్రింద కూర్చుని ధ్యానం చేసుకుంటున్నాడు. ఆ సమయంలో పైన ఒక కొమ్మమీద నుంచున్న ఒక కొంగ హఠాత్తుగా చెట్టుక్రింద కూర్చుని ఉన్న కొంగనావర్ ఒడిలో రెట్ట వేసింది. దాంతో కొంగనావర్‌కి ధ్యాన భంగమై తలపైకెత్తి చూసాడు. ఆయన చూపు పడటంతోనే ఆ కొమ్మపైన నుంచుని ఉన్న కొంగ కన్నుమూసి తెరిచేలోగా కాలిబూడిద అయిపోయి నేలమీద పడింది. ఆ దృశ్యం చూసిన కొంగనావర్ తనలో తాను ఇలా అనుకున్నాడు. "ఆహా! నా తపస్సు ఎంత గొప్పది. నా ఒడిలో రెట్టవేసిన ఆ కొంగకేసి నేను కొంచెం కోపంగా చూడగానే ఆ కొంగ బూడిద అయిపోయింది. నాకు మహాశక్తులు వచ్చేసాయ్. నేను గొప్ప తపఃసంపన్నుడిని".

కొంగనావర్ ప్రతిరోజూ సూర్యోదయం నుండి మిట్టమధ్యాహ్నం వరకు ఊరి బయట ఉన్న చెట్టుక్రింద ధ్యానం చేసుకుని ఆ తరువాత

ఊరిలో ఉన్న ఇంటింటికీ వెళ్ళి భిక్షంతీసుకుని దానిని ఎక్కడో ఒకచోట పెట్టుకుని ఆరగించి, ఆపై మళ్ళీ ఊరిబయటకు వెళ్ళిపోతూ ఉండేవాడు. ఈరోజు కూడా కొంగనావర్ మిట్టమధ్యాహ్నం సమయంలో భిక్షకోసం గ్రామంలోకి బయలు దేరాడు. మొదటగా ఆయన ఆగ్రామంలో ఉన్న తిరువళ్ళువార్ అనే ఒక మహాకవి ఇంటికి వెళ్ళాడు. (తిరుక్కురల్ మహా గ్రంథాన్ని ప్రాచీన తమిళ భాషలో వ్రాసిన ఈ తిరువళ్ళువార్ అనే పద్య కవిని ఈనాటికీ తమిళ ప్రజలు తమ జ్ఞాన దైవంగా చెప్పుకుంటారు.)

అప్పటికే మధ్యాహ్నం కావటంతో తిరువళ్ళువార్ తన ఇంటి మధ్య గదిలో కూర్చుని భోజనం చేస్తున్నాడు. ఆయన భార్య వాసుకి కొంచెం ప్రక్కకి నిలబడి ఆయనకు కావలసినవి ఆకులో వడ్డిస్తున్నది. ఇంతలో కొంగనావర్ ఆ ఇంటిముందు నిలబడి "తల్లీ! బాగా ఆకలిగా ఉన్నది. వెంటనే కాస్త అన్నంపెట్టు" అన్నాడు. మహాపతివ్రత అయిన వాసుకికి వాకిట్లో నుంచుని భిక్షం అడుగుతున్న కొంగనార్ కనిపించాడు. తాను ఇప్పుడు భిక్షం వెయ్యటంకోసం బయటకు వెళితే తన భర్తకు భోజనంలో ఏమైనా వడ్డించాల్సి వస్తే ఎలా?. అందుకే వాసుకి పెద్ద గొంతుతో కొంగనార్‌కి వినిపించేలా ఇలా అన్నది. "అయ్యా! నా భర్త భోజనం చేస్తున్నాడు. ఆయన భోజనం ఇంకొద్దిసేపట్లో అయిపోతుంది. నా యందు దయయుంచి కొంచెం సేపు అక్కడే వేచి ఉండు. నేను వచ్చి నీకు భిక్ష వేస్తాను". ఆ మాటలు విన్న కొంగనార్‌కి కొంచెం చిరాకు వేసింది. ఆపై ఆయన తనలో తాను ఇలా అనుకున్నాడు. "ఈ గృహిణికి నా తపోశక్తి సంగతి తెలిసినట్లు లేదు. నేను ఒక్కసారి కోపంగా చూస్తే ఒక కొంగ బూడిద అయిపోయింది. నా చూపుకు ఉన్న శక్తి ఆమెకు తెలిసి ఉన్నట్లయితే నేను భిక్ష అడగగానే ఆమె వెంటనే బయటకు వచ్చి నాకు భిక్ష వేసి ఉండేది. నన్ను కాసేపు వేచి ఉండమని అడిగేది కాదు".

పది నిమిషాలు గడిచాయి. వాసుకి ఒక పాత్రలో అన్నం మరియు రెండు మూడు కూరలు వేసుకుని బయటకు వచ్చింది. అక్కడ కొంగనార్ కోపంతో చూస్తున్నాడు. విచిత్రం ఏమంటే కొంగనార్ ఎంత కోపంతో చూసినా వాసుకికి ఏమీ కాలేదు. "నా కోపపు చూపుపడి ఆ కొంగ బూడిద అయిపోయింది. మరి నేను ఎంతో కోపంగా ఈ గృహిణి వైపు చూస్తున్నా

ఈమెకు ఏమీ కాలేదేంటి? చాలా విచిత్రంగా ఉన్నదే?" అనుకున్నాడు కొంగనార్. వాసుకి, కొంగనార్ ముఖాన్ని పరిశీలనగాచూసి ఆపై అతని మనస్సుని చదివినట్లుగా అతనితో ఇలా అన్నది. "కొక్కు ఎంద్రు ఎన్నినాయో కొంగనవా?". (ఈ తమిళ వాక్యానికి అర్థం ఏమంటే "నన్ను కొంగగా అనుకుంటున్నావా? నన్ను నీ చూపుతో బూడిద చెయ్యవచ్చు అనుకుంటున్నావా?).

"ఒక సాధారణ గృహిణి, ఎక్కడో ఊరి చివర ఉన్న చిట్టడవిలోని ఒక చెట్టు క్రింద జరిగిన సంగతి ఎలా తెలుసుకున్నది?. అంటే ఎక్కడ ఏం జరిగినా తెలుసుకోగల "దివ్యదృష్టి" ఈ గృహిణికి ఉన్నది అన్నమాట". ఇలా వివిధ ఆలోచనలు మనసులోకి రావటంతో కొంగనార్ పశ్చాత్తాప పడ్డాడు. "నేను మహర్షిని, తపఃసంపన్నుడిని, నా చూపులతో జీవుల్ని భస్మం చెయ్యగలను అని ఇప్పటి వరకు అనుకుంటున్నాను. కానీ ఈ సామాన్య గృహిణి నేను ఎక్కడో అడవిలో చేసిన పనిని ఇంట్లో ఉండే తెలుసుకున్నది. అంటే నా కన్నా ఈమె శక్తివంతురాలు అన్నమాట". ఈ ఆలోచన రాగానే కొంగనార్ శిరస్సువంచి ఆ గృహిణికి నమస్కరించి ఆపై ఆమెతో "తల్లీ! కొద్ది నిమిషాల క్రితం అడవిలో నేను ఒక కొంగని నా చూపుతో భస్మం చేసాను. అక్కడికి ఎంతో దూరంలో ఉన్న ఈ ఇంట్లో ఉన్న నీకు ఆ విషయం ఎలా తెలిసింది?. నీకు ఆ శక్తి ఎలా వచ్చింది? దయచేసి చెప్పు" అన్నాడు.

అప్పుడు ఆమె చిరునవ్వు నవ్వుతూ కొంగనార్‌తో "అయ్యా! నీవు ఈ గ్రామానికి అటువైపున ఉన్న ఒక గూడెంలో ఉంటున్న ఒక కసాయి వాడిని కలుసుకో. అతడే నీకు ఏర్పడిన ఈ సందేహానికి తగిన సమాధానం చెబుతాడు" అన్నది. ఆమె చెప్పిన మాటలు విన్న కొంగనార్‌కి చాలా ఆశ్చర్యం వేసింది. జంతువుల్ని చంపి వాటిని ముక్కలు ముక్కలుగా కోసి అమ్ముకునే ఒక కసాయివాడు తపోఃరహస్యాల గురించి ఎలా చెబుతాడు అనుకున్నాడు మనసులో. ఏది ఏమైనా ఆ గృహిణి చెప్పింది కనుక ఆ కసాయి వాడి వద్దకు వెళ్ళి తీరాలి అని నిర్ణయించుకున్నాడు కొంగనార్. ఆ తరువాత కొంగనార్ ఆ కసాయివాడి ఇంటికి వెళ్ళాడు. కొంగనార్ అక్కడకు వెళ్ళే సరికి ఆ కసాయివాడు తన వాకిట్లో ఒక కొయ్యమీద

కొంచెం మాంసాన్ని ఒక కత్తితో కస,కసా మని ముక్కలుగా నరుకుతున్నాడు. ఆ దృశ్యం చూసిన కొంగనార్‌కి చాలా అసహ్యం కలిగింది. దాంతో అతడు ఇంట్లోకి వెళ్ళకుండా అక్కడే నిలుచుండిపోయాడు. అప్పుడు ఆ కసాయివాడు మాంసం కొట్టటం ఆపి ఆపై పెద్ద గొంతుతో ఇలా అన్నాడు. "అయ్యా! ఆ గృహిణి పంపిస్తే నా వద్దకు వచ్చారు. మీరు, నేను చేసే పనిని చూసి అసహ్యించుకుంటే నా ఇంట్లోకి ఎలా రాగలరు? మీ మనసులోని సందేహానికి నేను సమాధానం ఎలా చెప్పగలను?". కసాయివాడి మాటలు విన్న కొంగనార్‌కి ఆశ్చర్యంతో కొంతసేపు నోరు పెగలలేదు. "ఎక్కడో గ్రామంలో ఒక గృహిణి తనతో అన్న మాటలు ఇక్కడ గూడెంలో ఉన్న కసాయివాడికి ఎలా తెలిసాయి?. ఒక సామాన్య గృహిణి, ఉదరపోషణకోసం మాంసం కొట్టి అమ్ముకునే ఒక కసాయివాడు ఇంత మహత్యాన్ని ఎలా ప్రదర్శిస్తున్నారు? వీళ్ళకి ఎక్కడో జరిగిన విషయాలు ఎలా తెలుస్తున్నాయి?". అని మనసులో వితర్కించు కున్నాడు కొంగనార్. ఏది ఏమైనా సరే ఈ కసాయివాడి దగ్గరకు వెళ్ళి అతడికి మరియు గ్రామంలోని గృహిణికి ఎక్కడో జరిగిన విషయాలు తెలుసుకునే శక్తి ఎలా వచ్చిందో తెలుసుకుని తీరాలి అని నిర్ణయించుకున్న కొంగనార్ ఆపై ఏ సంకోచం లేకుండా కసాయివాడి ఇంట్లోకి వెళ్ళాడు.



ఆ తరువాత కొంతసేపటికి ఆ కసాయివాడు, కొంగనార్‌కి తన ఇంట్లో మంచి భోజనం పెట్టాడు. తాను యోగి అయినప్పటికీ కొంగనార్ ఆ విషయాన్ని మర్చిపోయి నిమ్నకులస్తుడు అయిన కసాయి వాని ఇంట్లో నిరభ్యంతరంగా భోజనం చేసాడు. ఆ తరువాత కసాయి వాని ఇంటి వాకిట్లో అరుగుమీద వేయబడిన ఒక చాపమీద హాయిగా విశ్రమించాడు. అప్పుడు కొంగనార్ తన మనసులోని సందేహాన్ని ఆ కసాయివాడికి

స్పష్టంగా వివరించాడు. అప్పుడు ఆ కాసాయివాడు చిరునవ్వు నవ్వుతూ కొంగనార్‌తో "అయ్యా! నాకు కాని, ఆ గ్రామంలో ఉన్న గృహిణికి కానీ ఎలాంటి శక్తులూ లేవు. మేము నీ లాగా ఎలాంటి తపస్సులు చెయ్యలేదు. మేము మా గురించి ఎలా అనుకుంటామో, ఇతరుల గురించి అలాగే అనుకుంటాము. మేము చెయ్యవలసిన పనులను మా శక్తికొద్ది చేస్తాము. అంతకుమించి మేము ఏ తపస్సులు చెయ్యము. బహుశా మా ధర్మాన్ని సక్రమంగా నిర్వహించబట్టే మాకు ఎక్కడో జరిగిన విషయాలు తెలుసుకునే శక్తి వచ్చింది అనుకుంటున్నాను" అన్నాడు. కసాయివాడి మాటలతో కొంగనార్‌కి జ్ఞానోదయం అయ్యింది. అప్పుడు ఆయన, ఆ కసాయివాడి పాదాలపై పడి అతడితో "అయ్యా! నీవు నాకు గురుతుల్యుడివి. తపస్సు చేసుకోవటమే గొప్ప అని గర్వించే నాకు జ్ఞానాన్ని ప్రసాదించావు. ఎవరి పనిని వాడు సక్రమంగా చెయ్యటమే తపస్సు. అంతేకాని, ఏ పనులు చెయ్యకుండా తపస్సులు, పూజలు చెయ్యటం మానవ ధర్మకాదు అన్న విషయం నాకు స్పష్టంగా అర్థమయ్యేలా చేసావు. నిన్ను ఎప్పటికీ మర్చిపోను" అన్నాడు.

తన చివరి దశలో కొంగనార్ తిరుమల కొండకి చేరుకున్నాడు. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం సిద్ధయోగులలో ప్రముఖుడు అని పేర్కొనబడిన భోగర్ యొక్క కుమారుడే కొంగనార్ అని తెలుస్తున్నది. తమిళనాడులోని కొండగునాడు అనే ప్రదేశంలో ఉన్న కొంగన గిరివద్ద ఈ కొంగనార్ చాలాకాలంపాటు జీవించాడని పరిశీలకులు భావిస్తున్నారు. ఈయన తన జీవిత కాలంలో 40కి పైగా గ్రంథాలు వ్రాసాడు. ఈ గ్రంథాలలో రసవాదం మరియు నిత్య యవ్వన సంజీవనీ ఔషధం గురించి విస్తృతంగా చర్చించాడు. ఈయన వేదాంతం, వైద్యం మరియు ఆధ్యాత్మిక అంశాలపై ఎంతో లోతైన సమాచారాన్ని తన గ్రంథాలలో అందించినట్లుగా తెలుస్తున్నది.



## 11. కరైక్కాల్ అమ్మయ్యారు జీవిత విశేషాలు?

తమిళ భాషలో పరమశివునిపై శ్లోకాలు వ్రాసిన తొలి కవయిత్రి కలైక్కాల్అమ్మయార్ అని చెబుతారు. దక్షిణ భారతదేశంలో శైవమతానికి ఎంతో సేవచేసిన 63మంది నాయనార్లలలో ఒకరు కరైక్కాల్ అమ్మయార్ తొలి తమిళ సాహిత్యంలో ఈమె రచనలు ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తాయి. ఈమె క్రీ.శ. 6వ శతాబ్దానికి చెందినది అని చరిత్రకారులు ఊహిస్తున్నారు.

ప్రాచీన తమిళదేశంలోని భాగమైన చోళరాజ్యంలో ఉన్న కరైక్కల్ అనే గ్రామంలో ధనదత్తనార్ అనే ఒక వైశ్య సంపన్నుడు ఉండేవాడు. అతడికి శివ అనుగ్రహం వల్ల ఒక ఆడపిల్ల పుట్టింది. ఆమెకు తల్లిదండ్రులు పెట్టినపేరు పుణ్యవతి. కొంచెం ఊహ తెలిసినవ్పటి నుండి పుణ్యవతి పరమశివుడిని పూజిస్తూ, శివభక్తులకు తనకు తోచిన సేవలుచేస్తూ కాలం గడుపుతూ ఉండేది. తన చిన్నతనంలోనే ఇసుకతో శివలింగాన్ని తయారుచేసి దాన్ని మిక్కిలి భక్తిశ్రద్ధలతో పూజిస్తూ ఉండేది. అపారమైన ఆమె శివభక్తి కారణంగానే ఆమె ఇసుకతో శివలింగాన్ని తయారు చెయ్యగలిగేది అని ఆ కాలంనాటి భక్తులు చెప్పుకునేవారు.



భర్తకి మామిడిపండు వడ్డిస్తున్న పుణ్యవతి.

యుక్తవయస్సుకి వచ్చిన తరువాత ఆమెకు వివాహం చెయ్యాలని ఆమె తండ్రి ధనదత్తనార్ నిర్ణయించుకున్నాడు. వారికి ఒకేఒక కుమార్తె ఉన్న

కారణంగా ఆమెను దూరంగా పంపించటం ఇష్టంలేక నాగపట్టణంలో ఒక సంపన్న యువకుడైన పరమదత్తన్‌కి ఆమెను ఇచ్చి వివాహం చేసాడు. ఆ తరువాత కరైక్కాల్ లోని తన భవనం ప్రక్కనే ఇంకొక భవనాన్ని కట్టించి అందులో తన కూతురు పుణ్యవతిని మరియు అల్లుడిని ఉంచాడు. అతని అల్లుడుకూడా కరైకాల్ లోనే వ్యాపారం ప్రారంభించి కొద్ది రోజుల్లోనే బాగా సంపాదించటం ప్రారంభించాడు.

సంపన్నుడైన తండ్రి, అంతకుమించిన సంపన్నుడైన భర్త ఉన్నప్పటికీ పుణ్యవతి ఏమాత్రం అహంకారాన్ని పెంచుకోకుండా ఎల్లప్పుడూ శివుడిని పూజిస్తూ, శివభక్తుల్ని ఆదరిస్తూ తమ పేరుకు తగినట్లు పుణ్యాలు చేస్తూ ఉండేది.

కొద్ది రోజులు గడిచాయి. మధ్యాహ్నం భోజనంకోసం పుణ్యవతి వంట చేస్తున్నది. ఇంతలో పరమదత్తన్ రెండు మామిడిపండ్లను ఒక పనివాడి ద్వారా ఆమెకు పంపించాడు. ఆమె, ఆ రెండు మామిడిపండ్లను మధ్యాహ్న భోజనంలో భర్తకు వడ్డిద్దామని వాటిని ఒకచోట ఉంచింది. సరిగ్గా అదే సమయంలో ఒక పేద శివభక్తుడు ఆమె ఇంటిముందు నిలబడి "తల్లీ! ఆకలికి ప్రాణాలు పోతున్నాయి. కాస్త అన్నంపెట్టు" అన్నాడు. వంట ఇంకా పూర్తికాకపోవటంతో పుణ్యవతి తాను దాచిన రెండు మామిడిపండ్లలలో ఒకదానిని వాకిట్లో నుంచుని ఉన్న శివభక్తుడి చేతిలో ఉంచి "అయ్యా! ఇంకా వంట పూర్తికాలేదు. కనుక ప్రస్తుతానికి ఈ మామిడిపండు తిని నీ ఆకలి తీర్చుకో" అన్నది. ఆ శివభక్తుడు ఎంతో సంతోషంతో ఆ మామిడి పండును కళ్ళకద్దుకుని అక్కడ నుండి వెళ్ళిపోయాడు. మరి కొంచెంసేపు గడిచిన తరువాత పుణ్యవతి భర్త మధ్యాహ్న భోజనం చెయ్యటంకోసం దుకాణం నుండి ఇంటికి వచ్చాడు.

రాగానే అతడికి భోజనం వడ్డించింది పుణ్యవతి. భోజనం చివర అతనికి మామిడిపండు వడ్డించింది. ఆమె భర్త ఆ పండును ఎంతో ఇష్టంగా తిన్నాడు. ఆ మామిడిపండు చాలా రుచికరంగా ఉండటంతో అతనికి

ఇంకో పండుకూడా తినాలనిపించింది. దాంతో అతడు భార్యను పిలిచి ఆమెతో "ఇందాక నేను రెండు మామిడిపండ్లు నీకు పంపించాను. ఒకపండు వేసావు. చాలా బాగుంది. రెండవ పండుకూడా వడ్డించు. అదికూడా తింటాను" అన్నాడు.

కొద్దిసేపటి క్రితమే ఆ రెండవ పండును శివభక్తునికి ఇచ్చేసింది పుణ్యవతి. ఇప్పుడు భర్తకి మామిడిపండు ఎక్కడ నుండి తెచ్చి ఇవ్వాలో ఆమెకు అర్థంకాలేదు. దాంతో ఆమె పూజామందిరంలోని శివలింగం వద్దకు వెళ్ళి ఆయనను ప్రార్థించింది. తన భక్తురాలైన పుణ్యవతిని కరుణించిన పరమశివుడు ఆమెకు ఒక మామిడిపండును ప్రసాదించాడు. అప్పుడు పుణ్యవతి తేలిగ్గా నిట్టూర్చి ఆ మామిడిపండును తీసుకువెళ్ళి భర్త ఆకులో వడ్డించింది. ఆ పండుకూడా తినటం ప్రారంభించాడు ఆమె భర్త. సాక్షాత్తు పరమశివుడిచేత ప్రసాదించబడిన ఆ పండుయొక్క రుచి అత్యంత అద్భుతంగా ఉన్నది. పుట్టిన తరువాత ఇంతవరకు ఇంత రుచిగల మామిడి పండు అతడు ఎన్నడూ తినలేదు. దాంతో అతడు పుణ్యవతిని పిలిచి ఆమెతో "ఇలాంటి మామిడిపండు భూమిమీద దొరుకుతుందని నేను అనుకోను. నిజం చెప్పు. ఈ మామిడిపండు నీకు ఎక్కడ నుండి వచ్చింది?" అన్నాడు. పుణ్యవతి క్లిష్ట పరిస్థితిలో పడింది. అది ఏమిటంటే ఆమె భర్తకి దేవుడు అంటే పూర్తిగా నమ్మకంలేదు. అలాంటి వాడికి శివుడు మామిడి పండు ఇచ్చాడు అని చెబితే నమ్మడు సరికదా ఎగతాళి చేస్తాడు. "భక్తుడు కానివాడికి భగవంతుని లీల గురించి చెప్పటం తప్పు" అని ఒక నియమం ఉన్నది. "భర్త అడిగినప్పుడు నిజం చెప్పటం భార్య ధర్మం" అనే ఇంకొక నియమం కూడా ఉన్నది. దాంతో ఆమె రెండవ నియమానికి విలువ ఇచ్చి భర్తతో "మీరు పంపిన రెండు మామిడిపండ్లలలో ఒక పండు ఒక భక్తుడికి దానంచేసాను. రెండవ పండు మీకు వడ్డించాను. మీరు మళ్ళీ అడిగే సరికి శివుడిని ప్రార్థించి ఆయన ద్వారా మామిడిపండును సంపాదించి మీకు ఇప్పుడు వడ్డించాను" అన్నది.

పుణ్యవతి మాటలు విన్న ఆమె భర్త విచిత్రంగా నవ్వి "నువ్వు చెప్పిన మాట యదార్థమే అయితే ఆ శివుడిని అడిగి ఇంకో పండుకూడా తీసుకురా అన్నాడు. ఇప్పుడు ఇంకోపండు తీసుకురాకపోతే శివుడి మహాత్మ్యం అబద్ధమని తన భర్త వాదిస్తాడు. అందుకోసం ఆమె శివుని ప్రార్థించి ఇంకో పండు ప్రసాదించమని ఆయనను వేడుకున్నది. పరమశివుడు ఆమెను అనుగ్రహించి ఆమెచేతిలో ఒక మామిడిపండు ఉండేలా చేసాడు. ఆమె ఆ పండును తీసుకువెళ్ళి భర్త చేతిలో ఉంచింది. అతడు ఆ పండును తీసుకుని పరిశీలించే లోగానే అది అదృశ్యం అయిపోయింది. ఆ అద్భుతాన్ని చూసిన ఆమె భర్తకు తల తిరిగిపోయింది. తన భార్య పుణ్యవతి మహా భక్తురాలని, అలాంటి పుణ్యాత్మురాలితో కాపురం చెయ్యటం మహాపాపమని మనసులో నిర్ణయించుకున్న ఆమె భర్త మరేమీ మాట్లాడకుండా మరేమీ మాట్లాడకుండా దుకాణానికి వెళ్ళిపోయాడు. రెండురోజుల తరువాత పాండ్యరాజ్యంలో కొత్త వ్యాపారం చెయ్యటానికి వెళుతున్నానని ఆమెకు చెప్పి పడవ నిండా వ్యాపారం సరుకులు వేసుకుని కరైక్కాల్ నుండి పాండ్య రాజ్యంలోని ఒక పెద్ద పట్టణానికి వెళ్ళాడు. కొద్ది రోజులు గడిచిన తరువాత అక్కడే ఒక అమ్మాయినిచూసి వివాహం చేసుకున్నాడు. కొద్ది నెలల తరువాత అతనికి ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ ఆడపిల్లకి అతడు "పుణ్యవతి" అనే పేరు పెట్టుకున్నాడు.

భర్త వ్యాపారం పనిమీద పాండ్యరాజ్యానికివెళ్ళి రెండు సంవత్సరాలు గడిచినా అతని సమాచారం పుణ్యవతికి ఏమాత్రం తెలియలేదు. చివరికి ఒకరోజున ఎవరి ద్వారానో ఆమె భర్త పాండ్యరాజ్యంలో ఒక పట్టణంలో వ్యాపారం చేసుకుంటున్నాడని తెలిసింది. అప్పుడు ధనదత్తనార్ తన కుమార్తెను ఒక పల్లకిలో కూర్చోపెట్టి ఆమెను ఆమె భర్త అయిన పరమదత్తనార్ ఇంటికి తీసుకువెళ్ళాడు. రెండు సంవత్సరాల తరువాత తనకు కనిపించిన భర్తను చూసి పుణ్యవతి ఆనందంతో పొంగిపోయింది. కానీ ఆమె ఆనందం కొద్ది క్షణాలపాటుకూడా నిలువలేదు. కారణం ఆమె భర్త పరమదత్తనార్ తన రెండవ భార్య మరియు కూతురుతో సహా ఆమె

కాళ్ళపైపడి ఆమె ఆశీస్సులు కోరుకున్నారు. ఆ దృశ్యంచూసి ధనదత్తనార్ ఎంతగానో విచారించి ఆపై అల్లుడితో "నాయనా! నీ భార్యకు నువ్వు సాష్టాంగ నమస్కారం చెయ్యటం చాలా తప్పు. ఎందుకు అలా చేసావు?" అన్నాడు. అప్పుడు పరమదత్తనార్ వణుకుతున్న స్వరంతో మామగారితో ఇలా అన్నాడు. "పుణ్యవతి సాధారణ మానవ స్త్రీ కాదు. ఆమె మహత్యం ఏమిటో నేను స్వయంగా చూసాను. అంతటి మహాత్మురాలితో కాపురం చెయ్యటం ఇష్టంలేక నేను దూరంగా వచ్చేసాను. ఆమెను భార్యగాచూసి పాపం చెయ్యలేను నన్ను క్షమించండి".

భర్త సంతోషం కోసం తాను చేసిన పని (శివుడి నుండి మామిడిపండు పొందటం) తన భర్తకు తనమీద ప్రేమ బదులు భక్తిని కలిగించింది. తన భర్త తనని భార్యగా చూడలేకపోతున్నాడు. ఆ భర్తకోసమే నేను అందంగా ఉండాలని కోరుకున్నాను. ఆ భర్తకే తాను అవసరం లేనప్పుడు తనకు ఆ అందం అనవసరం అనిపించింది పుణ్యవతికి. అప్పుడు ఆమె పెద్ద స్వరంతో ఇలా అన్నది. "ఓ పరమేశ్వరా! నా భర్తకి అవసరంలేని నా సుందర రూపం తొలగించు. నాకు అతి భయంకరమైన పిశాచి రూపాన్ని ప్రసాదించు". ఆమె ప్రార్థనను ఆలకించిన పరమశివుడు ఆమెకు పరమ వికారమైన రూపాన్ని ప్రసాదించాడు. ఇప్పుడు ఆమె రూపం ఎలా ఉన్నదంటే.....


వికృతరూపంలోకి మారిపోయిన పుణ్యవతి.

అతి సుందరమూర్తి అయిన పుణ్యవతి దేహం అస్థిపంజరంగా మారిపోయింది. ఆమె శరీరంలోని మాంసం అంతా అదృశ్యం అయి

పోయింది. బలిష్టంగా, పెద్దవిగా ఉండే ఆమె వక్షోజాలు వడిలిపోయి మాంసం ముద్దల్లా వ్రేలాడాయి. కళ్ళు అదృశ్యం అయిపోయి ఆ స్థానంలో గుంటలు ఏర్పడ్డాయి. తెల్లటి పండ్లు బయటపడ్డాయి, రెండు కోరలు మొలిచాయి. శరీరంమీద చర్మం అస్థిపంజరానికి అంటుకుపోయి వ్రేలాడ సాగింది. నల్లటి ఆమె జుట్టు ఎరుపురంగులోకి మారిపోయింది. పొట్ట లోపలికి అంటుకుపోయింది.

ఆమె ప్రదర్శించిన మహత్యానికి సంతోషించిన దేవతలు పై నుండి ఆపై పూలవర్షం కురిపించారు. కళ్ళారా ఆమె మహత్యాన్ని చూసిన ఆమె తండ్రి ధనదత్తనార్ మరియు ఆ సమయంలో అక్కడ ఉన్న కొందరు పెద్దలు నిర్ఘాంతపోయారు. ఆమె ఎంతటి శివభక్తురాలో వారికి స్పష్టంగా అర్థమయ్యింది. ఇక తనకు ఆత్మీయులు ఎవరూ లేరని పుణ్యవతికి అర్థమయ్యింది.

పిశాచి రూపంలో ఉన్న తాను ఇక మానవుల మధ్యలో ఉండటం భావ్యంకాదని భావించిన పుణ్యవతి అలంగాడు అడవులలోకి వెళ్ళిపోయింది. "అలంగాడు" అనగా మర్రిచెట్ల వనం అనిఅర్థం. తంజావూరు పట్టణానికి 40 కి.మీ. దూరంలో అలంగాడు ఉన్నది. అక్కడ ఒక మర్రిచెట్టు క్రింద కూర్చుని పరమశివుడి గురించి అద్భుతమైన శ్లోకాలను అశువుగా పాడటం ప్రారంభించింది. అలా కొంతకాలం గడిచిన తరువాత ఆమెకు పరమశివుడిని దర్శించుకోవాలని అనిపించింది. దాంతో ఆమె మానవ మాత్రులకు అతీతమైన వేగంతో పరుగెడుతూ కైలాస పర్వత పాదం వద్దకు చేరుకున్నది. (హిమాలయ పర్వతాలలో కైలాస పర్వతం ఉంటుందని దానిమీద పరమశివుడు పార్వతీ సహితుడై కొలువైఉంటాడని హైందవ పురాణాలలో చెప్పబడి ఉన్నది).

అప్పుడు అక్కడ ఉన్న కొందరు మహర్షులు ఆమెతో ఇలా అన్నారు. "పరమ పవిత్రమయిన ఈ కైలాస పర్వతాన్ని కాళ్ళతో ఎక్కకూడదు". అప్పుడు పుణ్యవతి తన తలను కిందకు, కాళ్ళను పైకి ఉంచి తలతో

నడుస్తూ కైలాస పర్వతంమీదకి చేరుకున్నది. అక్కడ పార్వతీ సమేతుడై పరమశివుడు ఆమెకు దర్శనం ఇచ్చాడు. తన ఇష్టదైవం అయిన పరమశివుని దర్శనంతో పుణ్యవతి ఎంతగానో పొంగిపోయింది. అప్పుడు ఆమె, పరమశివుడిని ఇలా ప్రార్థించి.

"ఈశ్వరా! నాకు పునర్జన్మ లేకుండా చెయ్యి. ఒకవేళ నేను మళ్ళీ జన్మించటం నీ ఉద్దేశమైతే ఆ జన్మలో కూడా నాకు నీమీద అపారమైన భక్తి ఉండేలా నన్ను అనుగ్రహించు". అప్పుడు పరమశివుడు ఆమెకు ఆ వరాన్ని ప్రసాదించి ఆపై ఆమెతో ఇలా అన్నాడు. "నీవు ఇక్కడ నుండి దక్షిణ భారత దేశంలో ఉన్న తిరువాలంగాడు క్షేత్రానికివెళ్ళి అక్కడ నా నృత్యాన్ని చూస్తూ తరించు". శివుని ఆజ్ఞ ప్రకారమే పుణ్యవతి అక్కడ నుండి తమిళనాడు లోని తిరువాలంగాడు వెళ్ళి అక్కడ శివుని నృత్యం చూస్తూ తన మిగిలిన జీవితాన్ని గడిపింది. కరైక్కాల్ అమ్మయార్ భౌతిక దేహాన్ని కరైక్కాల్ గ్రామంలో చాలించిన తరువాత ఆమె దేహాన్ని ప్రస్తుతం ఆమె ఆలయంలో ఉన్న ఆమె విగ్రహం వెనక ఉన్న ప్రదేశంలో సమాధి చేసారు.

ప్రస్తుతం కరైక్కాల్ పట్టణం మధ్యభాగంలో ఉన్న భారతీయార్ వీధిలో కరైక్కాల్ అమ్మయార్ ఆలయం ఉన్నది. ఈ ఆలయాన్ని 1929వ సంవత్సరంలో మలైపెరుమాళ్ అనే వ్యక్తి నిర్మించాడు. ఈ క్షేత్రంలో పుణ్యవతి ప్రధాన దేవతగా పూజలందుకుంటున్నది. ఈమెకే కరైక్కాల్ అమ్మయార్ అన్న ఇంకొకపేరుకూడా ఉన్నది. ప్రతి సంవత్సరం జ్యేష్ఠ మాసంలో (జూన్-జూలై) వచ్చే పౌర్ణమినాడు ఈ ఆలయంలో "మాంగాని తిరునాళ్" జరుగుతుంది. మాంగానితిరునాళ్ అనగా మామిడిపండ్ల ఉత్సవం అని అర్థం. ఆ సమయంలో ఈ ఆలయంలో పెరుగు అన్నం మరియు మామిడిపండు ఇక్కడకు వచ్చిన భక్తులకు ఇస్తారు. ఆలయాన్ని ఆనుకుని ఉన్న ఒక పెద్ద మందిరంలో ఈ ఉత్సవం జరుగుతుంది.



# 12. మహాయోగి ఇడైకడర్ జీవిత విశేషాలు?

ఇడైకడర్ ఎప్పుడు జన్మించాడు అన్న విషయం స్పష్టంగా తెలియటం లేదు. ఏది ఏమైనప్పటికీ ఆయన క్రీ.పూ. 2-3 శతాబ్దాల మధ్య జన్మించి ఉంటాడని కొందరు పరిశీలకులు భావిస్తున్నారు. ఈయన దాదాపు 600 సంవత్సరాలపాటు జీవించాడని చెబుతారు.

ప్రాచీన తమిళదేశంలో నివసించారు అని చెప్పబడుతున్న 18మంది సిద్ధయోగులలో ఒకడు శ్రీఇడైకడర్ సిద్ధర్. ఆయన శ్రీమహావిష్ణువుయొక్క అంశతో జన్మించాడని చెబుతారు. తమిళనాడులోని తొండైనాడు ప్రాంతానికి చెందిన ఈ సిద్ధయోగి "కాయకల్ప" చికిత్సా విధానాన్ని కనిపెట్టాడని తెలుస్తున్నది. (తొండైనాడు ప్రాంతంలోని తిరువన్నామలై అనే ప్రదేశంలో పరమశివుడు, అగ్నిలింగంగా పూజించబడుతున్నాడు.)

కాయకల్ప చికిత్స విధానం అపూర్వమైనదిగా చెప్పబడుతున్నది. ఈ విధానంలో శరీరంలోని దోషాలను తొలగించి, ఆపై వివిధ రకాల ఔషధ మూలికలతో శరీరాన్ని సంపూర్ణ ఆరోగ్యవంతంగా మరియు పటిష్టంగా తయారుచేయటం జరుగుతుంది.

ఈయన, శ్రీకృష్ణపరమాత్మ జన్మించిన యాదవ కులంలో జన్మించాడని భావిస్తారు. ఈయన పశువుల్ని కాసేవాడని తెలుస్తున్నది. ఈయన వ్రాసిన భక్తి గీతాలలో "తాండవ కోనె" అనే పదం తరచుగా కనిపిస్తూ ఉంటుంది. తమిళనాడులో జీవించే యాదవ కులస్తులను "కోనె" అన్నపదం సూచిస్తుందని, అందువలన ఇడైకడర్, యాదవ కులస్తుడని భావిస్తున్నారు.

ఇడైకడర్ సిద్ధర్ చేసిన ఇంకొక ముఖ్యమైన అద్భుతం ఏమంటే నవగ్రహాలను వృత్తాకారంలో అమర్చే విధానాన్ని ఈ సిద్ధయోగే కనిపెట్టాడు. అంతకుపూర్వం ప్రతి గ్రహమూ ఇంకొక గ్రహానికి అభిముఖంగా ఉండేలా నవగ్రహాలను ఏర్పాటుచేసేవారు. ఆ విధానంలో ఒక తీవ్రనష్టం

మానవులకు కలిగేది. అది ఏమిటంటే ఒక మనిషి ఒక గ్రహపీడ కారణంగా కష్టాలను ఎదుర్కొంటూ ఉండేవాడు. అప్పట్లో ఈ గ్రహాలు ఒకదానికి ఒకటి ఎదురుగా ఉన్న కారణంగా ఒక గ్రహం పీడించిన తరువాత వెంటనే దాని ఎదురుగా ఉన్న గ్రహం కూడా ఆ మనిషిని పీడించటం ప్రారంభించేది. ఫలితంగా ఆ వ్యక్తికి నిరంతరమూ గ్రహపీడ ఉండేది. గ్రహాలు ఎదురెదురుగా ఉండటంవల్ల మానవులు నిరంతరమూ గ్రహబాధలను ఎదుర్కొంటున్నారు అన్న విషయాన్ని గ్రహించిన ఇడైకడర్, నవగ్రహాలను వృత్తాకారంలో అమర్చే విధానాన్ని కనిపెట్టాడు. ఈ విధానంలో గ్రహాలు పరస్పరం చూసుకునే అవకాశం లేకుండా పోయింది. ఇడైకడర్, నవగ్రహాలను వృత్తాకారంలో ప్రతిష్టించటం వెనకాల ఒక ఆసక్తికరమైన వృత్తాంతం ఉన్నది. అది ఏమిటంటే....

సామాన్య యాదవ కుటుంబంలో జన్మించిన ఇడైకడర్ వినయం, విధేయత కలిగిన ఒక పశువుల కాపరిగా జీవించాడు. ఉదయంపూట తన పశువులను పచ్చికమైదానంలోకి తీసుకువెళ్ళి సాయంత్రం వరకు వాటిని అక్కడమేపి, ఆపై సాయంత్రం అయిన తరువాత వాటిని ఇంటికి తీసుకువచ్చేవాడు. ఒకరోజు ఉదయం ఇడైకడర్ తన గుడిసెలో కూర్చుని ఉండగా ఒక యోగి ఆయన వద్దకు వచ్చాడు. పెద్దల పట్ల గౌరవాదరాలు పుష్కలంగా కలిగిన ఇడైకడర్, ఆ యోగికి కూర్చోవటానికి ఒక గడ్డి చాపను వేసి ఆపై ఆయనకు త్రాగటానికి చిక్కటి పాలను ఇచ్చాడు. అప్పుడు ఆ యోగి ఆ పాలను త్రాగి ఆపై ఇడైకడర్‌తో ఇలా అన్నాడు.

"బిడ్డా! ఈనాటి ప్రపంచంలోని ప్రజలు తమను తాము పొగుడుకుంటూ భౌతిక సంపదలపట్ల విపరీతమైన వ్యామోహంతో జీవిస్తున్నారు. నీవుకూడా వారిలాగానే జీవించవొద్దు. ఈ ప్రపంచాన్ని సరైన మార్గంలో నడిపే ఉన్నత లక్ష్యంవైపు నీవు పయనించాలి". ఆ తరువాత ఆ యోగి, ఇడైకడర్‌కి మంత్రోపదేశం చేసాడు. ఇడైకడర్ ఆ సాధనలో ఎంతో లోతుకువెళ్ళాడు. ఫలితంగా ఆయన కంటిదృష్టి మసకబారింది. క్రమ క్రమంగా ఆయన మనోనేత్రం తెరుచుకోవటం ఆరంభం అయ్యింది. ఫలితంగా ఆయన

# 12. మహాయోగి ఇడైకడర్ జీవిత విశేషాలు?

ఇడైకడర్ ఎప్పుడు జన్మించాడు అన్న విషయం స్పష్టంగా తెలియటం లేదు. ఏది ఏమైనప్పటికీ ఆయన క్రీ.పూ. 2-3 శతాబ్దాల మధ్య జన్మించి ఉంటాడని కొందరు పరిశీలకులు భావిస్తున్నారు. ఈయన దాదాపు 600 సంవత్సరాలపాటు జీవించాడని చెబుతారు.

ప్రాచీన తమిళదేశంలో నివసించారు అని చెప్పబడుతున్న 18మంది సిద్ధయోగులలో ఒకడు శ్రీఇడైకడర్ సిద్ధర్. ఆయన శ్రీమహావిష్ణువుయొక్క అంశతో జన్మించాడని చెబుతారు. తమిళనాడులోని తొండైనాడు ప్రాంతానికి చెందిన ఈ సిద్ధయోగి "కాయకల్ప" చికిత్సా విధానాన్ని కనిపెట్టాడని తెలుస్తున్నది. (తొండైనాడు ప్రాంతంలోని తిరువన్నామలై అనే ప్రదేశంలో పరమశివుడు, అగ్నిలింగంగా పూజించబడుతున్నాడు.)

కాయకల్ప చికిత్స విధానం అపూర్వమైనదిగా చెప్పబడుతున్నది. ఈ విధానంలో శరీరంలోని దోషాలను తొలగించి, ఆపై వివిధ రకాల ఔషధ మూలికలతో శరీరాన్ని సంపూర్ణ ఆరోగ్యవంతంగా మరియు పటిష్టంగా తయారుచేయటం జరుగుతుంది.

ఈయన, శ్రీకృష్ణపరమాత్మ జన్మించిన యాదవ కులంలో జన్మించాడని భావిస్తారు. ఈయన పశువుల్ని కాసేవాడని తెలుస్తున్నది. ఈయన వ్రాసిన భక్తి గీతాలలో "తాండవ కోనె" అనే పదం తరచుగా కనిపిస్తూ ఉంటుంది. తమిళనాడులో జీవించే యాదవ కులస్తులను "కోనె" అన్నపదం సూచిస్తుందని, అందువలన ఇడైకడర్, యాదవ కులస్తుడని భావిస్తున్నారు.

ఇడైకడర్ సిద్ధర్ చేసిన ఇంకొక ముఖ్యమైన అద్భుతం ఏమంటే నవగ్రహాలను వృత్తాకారంలో అమర్చే విధానాన్ని ఈ సిద్ధయోగే కనిపెట్టాడు. అంతకుపూర్వం ప్రతి గ్రహమూ ఇంకొక గ్రహానికి అభిముఖంగా ఉండేలా నవగ్రహాలను ఏర్పాటుచేసేవారు. ఆ విధానంలో ఒక తీవ్రవనష్టం

మానవులకు కలిగేది. అది ఏమిటంటే ఒక మనిషి ఒక గ్రహపీడ కారణంగా కష్టాలను ఎదుర్కొంటూ ఉండేవాడు. అప్పట్లో ఈ గ్రహాలు ఒకదానికి ఒకటి ఎదురుగా ఉన్న కారణంగా ఒక గ్రహం పీడించిన తరువాత వెంటనే దాని ఎదురుగా ఉన్న గ్రహం కూడా ఆ మనిషిని పీడించటం ప్రారంభించేది. ఫలితంగా ఆ వ్యక్తికి నిరంతరమూ గ్రహపీడ ఉండేది. గ్రహాలు ఎదురెదురుగా ఉండటంవల్ల మానవులు నిరంతరమూ గ్రహబాధలను ఎదుర్కొంటున్నారు అన్న విషయాన్ని గ్రహించిన ఇడైకడర్, నవగ్రహాలను వృత్తాకారంలో అమర్చే విధానాన్ని కనిపెట్టాడు. ఈ విధానంలో గ్రహాలు పరస్పరం చూసుకునే అవకాశం లేకుండా పోయింది. ఇడైకడర్, నవగ్రహాలను వృత్తాకారంలో ప్రతిష్టించటం వెనకాల ఒక ఆసక్తికరమైన వృత్తాంతం ఉన్నది. అది ఏమిటంటే....

సామాన్య యాదవ కుటుంబంలో జన్మించిన ఇడైకడర్ వినయం, విధేయత కలిగిన ఒక పశువుల కాపరిగా జీవించాడు. ఉదయంపూట తన పశువులను పచ్చికమైదానంలోకి తీసుకువెళ్ళి సాయంత్రం వరకు వాటిని అక్కడమేపి, ఆపై సాయంత్రం అయిన తరువాత వాటిని ఇంటికి తీసుకువచ్చేవాడు. ఒకరోజు ఉదయం ఇడైకడర్ తన గుడిసెలో కూర్చుని ఉండగా ఒక యోగి ఆయన వద్దకు వచ్చాడు. పెద్దల పట్ల గౌరవాదరాలు పుష్కలంగా కలిగిన ఇడైకడర్, ఆ యోగికి కూర్చోవటానికి ఒక గడ్డి చాపను వేసి ఆపై ఆయనకు త్రాగటానికి చిక్కటి పాలను ఇచ్చాడు. అప్పుడు ఆ యోగి ఆ పాలను త్రాగి ఆపై ఇడైకడర్‌తో ఇలా అన్నాడు.

"బిడ్డా! ఈనాటి ప్రపంచంలోని ప్రజలు తమను తాము పొగుడుకుంటూ భౌతిక సంపదలపట్ల విపరీతమైన వ్యామోహంతో జీవిస్తున్నారు. నీవుకూడా వారిలాగానే జీవించవొద్దు. ఈ ప్రపంచాన్ని సరైన మార్గంలో నడిపే ఉన్నత లక్ష్యంవైపు నీవు పయనించాలి". ఆ తరువాత ఆ యోగి, ఇడైకడర్‌కి మంత్రోపదేశం చేసాడు. ఇడైకడర్ ఆ సాధనలో ఎంతో లోతుకువెళ్ళాడు. ఫలితంగా ఆయన కంటిదృష్టి మసకబారింది. క్రమ క్రమంగా ఆయన మనోనేత్రం తెరుచుకోవటం ఆరంభం అయ్యింది. ఫలితంగా ఆయన

భూత, భవిష్యత్, వర్తమానాలు తెలుసుకునే అపూర్వమైన శక్తి ప్రాప్తించింది. త్వరలో తాను ఉన్న ప్రాంతంలో తీవ్రమైన కరువు రాబోతున్నదని ఇద్రైకదర్‌కి దివ్యదృష్టి ద్వారా తెలిసింది. దాంతో ఆయన తన పశువులకు "ఇరుక్కు" అనే చెట్లను ఆహారంగా తీసుకోవటం అలవాటు చేసాడు. (ఇరుక్కు అనే చెట్టు, నీరు లభించని ఎడారుల్లాంటి ప్రదేశాలలో చాలా తేలిగ్గా జీవిస్తుంది. ఈ చెట్టు ఆకుల నుండి పాల లాంటి ద్రవం కారుతుంది.). ఆ తరువాత వరి మరియు జొన్నగింజలు బంకమట్టిలో కలిపి ఆ తరువాత ఆ మట్టిని తన గుడిసె గోడలకు పూతలాగా పూసాడు.

కొంతకాలం గడిచింది. ఆ ప్రాంతంలో భయంకరమైన కరువు పరిస్థితులు ఏర్పడ్డాయి. చెట్లు, పంటలు నీళ్ళులేక నశించి పోయాయి. చివరికి మనుషులకు త్రాగటానికి కూడా నీళ్ళు దొరకని పరిస్థితులు ఏర్పడ్డాయి. ఫలితంగా మానవులు కూడా ఆకలిదప్పులతో గుంపులు గుంపులుగా చనిపోవటం మొదలయ్యింది.

ఇక, ముందు జాగ్రత్తతో ఇద్రైకదర్ తన పశువులకు ఇరుక్కు మొక్కలను తినటం నేర్పించాడు కనుక అతని పశువులకు ఆహారం కొరత లేకుండా పోయింది. ఫలితంగా అవి బలిష్టంగా మారాయి. ఒక విశేషం ఏమంటే ఇరుక్కు మొక్కలను తినటంవల్ల అతని పశువులకు వాటి శరీరాలమీద దురదలు మొదలయ్యాయి. ఆ దురదను తీర్చుకోవటంకోసం అతని పశువులు అతడి గుడిసె చుట్టూ ఉన్న మట్టి గోడలకు తమ శరీరాలను బలంగా రుద్దుకునేవి. పశువులు గోడలకు రుద్దుకోవటంతో ఆ గోడలలలో ఏనాడో అమర్చబడిన ధాన్యపు గింజలు క్రిందకు రాలుతూ ఉండేవి. ఇద్రైకదర్ ఆ ధాన్యపు గింజల్ని ఏరుకుని తిని ఆ తరువాత తాను పెంచుకుంటున్న మేకల పాలుత్రాగి కడుపునింపుకోవటం ఆరంభించాడు. నెలలు గడిచినా కరువు పరిస్థితులు తొలగలేదు. సంవత్సరాలు గడిచాయి. కరువు రక్కసి కారణంగా ఆ ప్రాంతంలోని సమస్త మానవులు, జంతువులు కానరాని లోకాలకు వెళ్ళిపోయారు. కానీ ఇద్రైకదర్ మరియు అతని పశువులు మరియు మేకలు బలిష్టంగా మరియు కులాసాగా జీవించసాగాయి.

ఈ విశేషాన్ని చూసిన నవగ్రహాలు ఎంతో ఆశ్చర్యపోయాయి. "మా ప్రభావానికి సమస్త మానవులు, జంతువులు సర్వనాశనం అయిపోయినా ఈ ఇడైకడర్ ఇంత క్షేమంగా ఎలా ఉన్నాడో?" వారికి అర్థంకాలేదు. ఇది ఎలా జరిగిందో ఇడైకడర్ ద్వారానే తెలుసుకోవాలని నవగ్రహాలు ఆకాశం నుండి భూలోకానికి దిగి ఆపై ఇడైకడర్ గుడిసె వద్దకు వచ్చారు. సాక్షాత్తు నవగ్రహాలు తనవద్దకు రావటంతో ఇడైకడర్ ఎంతో సంతోషించి ఆపై వారికి తినటానికి కొద్దిగా ధాన్యం, త్రాగటానికి కొంచెం మేకపాలు ఇచ్చారు. నవగ్రహాలు వాటిని ఎంతో ప్రీతిగా ఆరగించారు. ఆ తరువాత వారికి నిద్రపట్టింది. దాంతో వారు ఆ గుడిసెలోనే కునుకుతీసారు. నవగ్రహాలు నిద్రపోవటం గమనించిన ఇడైకడర్ వెంటనే తన పెట్టెలో దాచిన నవగ్రహాల బొమ్మల్ని బయటకుతీసి వాటిని తన గుడిసె బయట ఒక ప్రదేశంలో వృత్తాకారంలో అమర్చి వాటికి ప్రాణప్రతిష్ట చేసాడు.



గ్రహాలను వృత్తాకారంలో అమర్చిన కారణంగా అప్పటి నుండి ఏ గ్రహమూ ఇంకొక గ్రహాన్ని ముఖాముఖి చూసే వీలు కలగలేదు. ఫలితంగా ఆ ప్రాంతంపై ఇంతకాలం పడుతున్న చెడుగ్రహదృష్టి తొలగిపోయింది. మరుక్షణమే ఆకాశంలో కారుమబ్బులు కమ్మాయి. కుంభవృష్టి కురిసింది. భూమిమీద ఉన్న సమస్త చెరువులు, నదులు నీటితో నిండిపోయాయి. ఫలితంగా మొక్కలు మొలిచాయి. జంతువులు మళ్లీ పుట్టాయి. కరువు తీరిపోయింది. ప్రజలు మళ్ళీ ఆనందంగా జీవించటం ఆరంభించారు.

సాక్షాత్తు నవగ్రహాలనే తన శక్తితో వృత్తాకారంలో ప్రతిష్టించి మానవుల కరువు కాటకాలను తీర్చిన ఇడైకడర్‌యొక్క శక్తి ఆ ప్రాంతంలోని ప్రజలందరికీ స్పష్టంగా తెలిసిపోయింది. ఫలితంగా ఆ ప్రాంతంలోని ప్రజలు అతని గుడెసెవద్దకు వచ్చి అతడిని దర్శించుకుని పూజించటం ప్రారంభించారు. తనని దైవంలాగా చూస్తున్న ఆ ప్రజలకు ఇడైకడర్ ఇలా చెప్పాడు. "ఓ బిడ్డలారా! ఇదంతా ఆ శ్రీకృష్ణపరమాత్మ మహత్యం. మీ పొగడ్తలన్నీ ఆయనకే చెందాలి. దైవాన్ని నమ్ముకుని ప్రార్థించండి. ఆయనే మీ కష్టాలను, కన్నీళ్ళను తొలగిస్తాడు. ఫలితం గురించి ఆశించకండి. మీ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించండి. అప్పుడు తప్పనిసరిగా విజయాలు మీవే అవుతాయి".

తన జీవితాంతమూ ప్రజల మేలుకోసం ఎన్నో మహత్తర కార్యాలను నిర్వహించిన ఇడైకడర్, "అగ్నిస్థలము" అని పేర్కొనబడిన తిరవన్నామలై దివ్యక్షేత్రంలో మహాసమాధి పొందాడు. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం సిద్ధయోగి ఇడైకడర్ సమాధిమీదే తిరువన్నామలై లోని ప్రధాన అగ్నిలింగం ప్రతిష్టించబడిందని తెలుస్తున్నది. మరికొంతమంది అభిప్రాయం ప్రకారం ఇడైకడర్ జీవ సమాధి పొందినది ప్రస్తుత ప్రధాన లింగం వెనకాల ఉన్న ప్రదేశంలో అని భావించబడుతున్నది.

## 13. సిద్ధయోగి నటనగోపాల నాయకిస్వామి జీవిత విశేషాలు?

19వ శతాబ్దంలో జీవించిన ఆధునిక సిద్ధయోగి నటనగోపాల నాయికి స్వామి. ఈయన తమిళనాడులోని మధురై పట్టణంలో 1843, జనవరి 9వ తేదీన జన్మించారు. ఈయన తండ్రిపేరు రెంగారియర్. తల్లిపేరు లక్ష్మీఅమ్మాళ్. నటనగోపాలస్వామికి తల్లిదండ్రులు పెట్టిన పేరు రామభద్రన్. దైవాంశ సంభూతుడైన రామభద్రన్ చిన్నతనం నుండి తన ప్రత్యేకతను ప్రదర్శిస్తూ ఉండేవాడు. ఆయన తన చిన్నతనంలో తనతోటి పిల్లలతో

ఆడుకోకుండా ఎక్కడో ఒక మూలగా కూర్చుని దీర్ఘాలోచనలో ఉండేవాడు. ఆయనను చిన్నతనంలో పాఠశాలలో చేర్చినప్పటికీ ఆయన చదువుపట్ల ఎలాంటి శ్రద్ధ ప్రదర్శించలేదు. ఆయన 10 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు ఒక దుకాణంలో లెక్కలు రాసే పనిలో చేర్చబడ్డాడు. అక్కడ కూడా ఆయన తన పనిపట్ల ఏవిధమైన శ్రద్ధా ప్రదర్శించేవాడుకాదు. దాంతో ఆ దుకాణ యజమాని, రామభద్రన్‌ని బయటకు పంపించివేసాడు.

ఆ తరువాత రామభద్రన్ తల్లిదండ్రులు అతడిని తమ కులవృత్తి అయిన నేతపనిలో చేర్చాలని ప్రయత్నించారు. రామభద్రన్ రోజులో అప్పుడప్పుడూ వస్త్రాలు నేస్తూ మిగిలిన సమయంలో దైవధ్యానం చేస్తూ కాలం గడిపేవాడు. కొన్నిసార్లు వస్త్రాలు నేస్తూ కూడా ధ్యానం చేసుకుంటూ ఉండేవాడు. చేస్తున్న పనిమీద శ్రద్ధ చూపించని రామభద్రన్‌మీద కోప గించిన ఆయన తండ్రి రామభద్రన్‌ని తీవ్రంగా నిందించాడు. తండ్రి నిందలకు విచారించిన రామభద్రన్ ఇల్లువదిలి బయటకు వచ్చేసాడు. అప్పుడు ఆయన వయస్సు కేవలం 16 సంవత్సరాలు.

ఆ తరువాత ఆయన ప్రఖ్యాత సుబ్రహ్మణ్య క్షేత్రం అయిన "తిరుప్పరన్‌కుంద్రం"కి చేరుకుని అక్కడ ఉన్న మురుగన్ ఆలయానికి వెనకాల ఉన్న పర్వతమార్గంపై ఒకచోట ఉన్న గుహలో దీర్ఘమైన తపస్సు ప్రారంభించాడు. నేడు ఆ గుహని "కుక్కాశ్రమ్" అనేపేరుతో పిలుస్తున్నారు.

ఆ గుహలో కొద్ది సంవత్సరాలపాటు రామభద్రన్ తన తపస్సు కొనసాగించాడు. తన కొడుకు రామభద్రన్, తిరుప్పరన్‌కుంద్రం క్షేత్రంలో ఉన్న ఒక గుహలో తపస్సు చేసుకుంటున్నాడని తెలుసుకున్న అతని తల్లి లక్ష్మీఅమ్మాళ్ అతడిని వెతుక్కుంటూ ఆ గుహలోకి వెళ్ళింది. తపస్సు మానేసి తనతోపాటు ఇంటికివచ్చి, ఒక మంచి అమ్మాయిని పెళ్ళిచేసుకుని హాయిగా జీవించమని రామభద్రన్‌కి నచ్చచెప్పాలని ఆయన తల్లి ఎంతగానో ప్రయత్నించింది. అయితే ఇంటికి తిరిగి రావటానికి రామభద్రన్ తిరస్కరించాడు. అప్పుడు రామభద్రన్, తల్లితో ఇలా అన్నాడు. "నీకు నామీద

అంత ప్రేమ ఉంటే నీ చేతులతో నాకు ఒక భిక్షాపాత్ర ఇవ్వు. భవిష్యత్తులో ఆ పాత్రలోనే నేను భిక్షను స్వీకరిస్తాను". ఇక చేసేదిలేక లక్ష్మీ అమ్మాళ్ ఒక గిన్నెను రామభద్రన్‌కి ఇచ్చి ఆపై తన గ్రామానికి తిరిగి వెళ్ళిపోయింది.

రామభద్రన్ ఆ గుహలోనే తన తపస్సును మరికొన్నేళ్ళపాటు సాగించాడు. కుక్కాశమ్ గుహలో దాదాపు 12 సంవత్సరాలపాటు తపస్సు చేసాడు రామభద్రన్. అప్పటికి రామభద్రన్‌కి 28 సంవత్సరాల వయస్సు వచ్చింది. ఆ సమయంలో ఆయన తన మానసిక గురువు అయిన నాగలింగ అడిగళ్‌ని కలుసుకోవటంకోసం పరాంకుటి అనే ప్రదేశానికి వెళ్ళాడు. తన గురువు వద్ద మంత్రోపదేశంపొంది కేవలం 18 రోజులలోనే మంత్ర సిద్ధిని పొందాడు రామభద్రన్. రామభద్రన్ యొక్క మహత్యాన్ని గుర్తించిన నాగలింగఅడిగళ్, రామభద్రన్‌కి "సదానందసిద్ధర్" అన్న కొత్తపేరుని ప్రసాదించాడు. ఆ తరువాత సదానందసిద్ధర్ తన గురువు వద్ద సెలవు తీసుకుని పరమకుటి నుండి బయలుదేరి రామ్‌నాడ్ ప్రాంతం గుండా తన ప్రయాణాన్ని కొనసాగించాడు. ఆ సమయంలో రామ్‌నాడ్ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న సేతుపతి అనే రాజు, సదానంద సిద్ధర్‌ను ఎంతగానో గౌరవించాడు.

ఆ తరువాత ఆయన శివగంగ ప్రాంతానికి చేరుకున్నాడు. ఆ సమయంలో ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న శివగంగరాజు, సదానంద సిద్ధర్‌ని హృదయపూర్వకంగా తన రాజ్యంలోకి ఆహ్వానించాడు. సదానంద సిద్ధర్ వ్యక్తిత్వం ఎలాంటిదో పరీక్షించాలని శివగంగరాజు నిశ్చయించుకున్నాడు. అందుకోసం ఆయన ఒక ఉపాయం పన్నాడు. అది ఏమిటంటే సదానంద సిద్ధర్ బసచేసిన మందిరంలోకి ఒక అందమైన నాట్యగత్తెను పంపించాడు. 'సదానందసిద్ధర్ నిజమైన యోగి అయితే ఆ నాట్యగత్తెకి లొంగిపోడు' అని శివలింగరాజు అనుకున్నాడు. తన మందిరంలోకి వచ్చిన ఆ నాట్యగత్తెలో ఒక మాతృమూర్తిని దర్శించాడు సదానందసిద్ధర్. దాంతో ఆ నాట్యగత్తె సదానందసిద్ధర్ మహా యోగి అని గుర్తించి ఆయనకు నమస్కరించి అక్కడ నుండి వెళ్ళిపోయింది.

సదానందసిద్ధర్ సాధారణంగా కొన్నిసార్లు రోజులపాటు సమాధిలో ఉండిపోతాడు. సదానందసిద్ధర్ నిజంగా అన్నిసార్లు సమాధిలో ఉంటున్నాడా అన్న అనుమానం శివలింగరాజుకి కలిగింది. ఆ విషయం కూడా పరీక్షించాలి అని శివలింగరాజు అనుకున్నాడు. ఆ తరువాత సదానంద సిద్ధర్ అనుమతిమీద భూమిలోపల ఒక గదిని నిర్మింపచేసాడు శివలింగరాజు. ఆ తరువాత చాలామంది ప్రజలు చూస్తూ ఉండగా సదానంద సిద్ధర్ ఆ గదిలోకి ప్రవేశించాడు. ఆ తరువాత ఆయన అనుమతి మీదే రాజభటులు ఆ గది పై భాగాన్ని మూసివేసారు. ఆ తరువాత ఆ పై భాగాన్ని సిమెంట్ చేసారు. ఇప్పుడు ఆ గది భూమి అడుగున ఉన్నది. ఆ గదిలోకి ఏవిధమైన గాలి లేదా వెలుతురు వెళ్ళే అవకాశమే లేదు.

ఒక భటుడు ఆ సమాధి గదికి కాపలాగా ఉంచబడ్డాడు. 40 రోజులు గడిచాయి. ఒకరోజు ఉదయం ఏదో పెద్దశబ్దంతో ప్రేలినట్లుగా వినిపించటంతో శివగంగరాజు ఆత్రంగా తన భవనంలోంచి బయటకు వచ్చిచూసాడు. అప్పుడు ఆయనవద్దకు ఒక భటుడు వచ్చి ఆయనతో ఇలా చెప్పాడు. “సదానంద సిద్ధర్‌ని సమాధిలో ఉంచిన గది పైభాగం పెద్ద శబ్దంతో కొద్ది నిమిషాలక్రితం ప్రేలిపోయింది. ఆ ప్రేలుడు తరువాత సదానంద సిద్ధర్ ఆ గదిలోంచి భూమిమీదకి వచ్చి మధురై పట్టణంవైపు నడుచుకుంటూ వెళ్ళిపోయాడు”. ఈ సంఘటనతో సదానంద సిద్ధర్‌కి సిద్ధశక్తులు ఉన్న మహాయోగి అన్న పేరు వచ్చింది. సిద్ధయోగుల్ని ఎవరూ బంధించి ఉంచలేరు. వారు తమ ఇష్టప్రకారం ఎక్కడ నుండి అయినా బయటకు రాగలరు.

అలా శివగంగ రాజ్యం నుండి మధురైకి చేరుకున్న సదానందసిద్ధర్ మధురైలో కొంతకాలం నివసించాడు. ఆయన మధురైలో నివసించే సమయంలో ప్రతిరోజూ “ఉంఛవృత్తి” చేసి పొట్టపోసుకుంటూ ఉండేవాడు. (ఉంఛవృత్తి అనగా ఇంటింటికీ వెళ్ళి ఆహారం భిక్షగా తీసుకోవటం). తన తల్లి ఇచ్చిన పాత్రలోనే సదానందసిద్ధర్ భిక్షాటన చేసేవాడు. మధురైలో

నెల రోజులు గడిపిన తరువాత సదానందసిద్ధర్ మధురై దక్షిణ భాగానికి కాలి నడకన చేరుకున్నాడు. అప్పటికే ఆయనను అనుసరించే శిష్యుల అనేకమంది ఏర్పడ్డారు. ఆ తరువాత ఆయన ఆళ్వార్ తిరునగరి చేరుకుని వటపత్ర రాయర్ (వటపత్రసాయి=శ్రీకృష్ణుడు) అనే ఒక వైష్ణవమత గురువును కలుసుకున్నాడు.

వటపత్రరాయర్ ఎంతో సంతోషంతో సదానంద సిద్ధర్‌ని తన గృహానికి ఆహ్వానించి ఆపై ఒక శుభ ముహూర్తంలో సదానంద సిద్ధర్‌కి చక్రాంకితాలు చేసి వైష్ణవదీక్ష ఇచ్చాడు. అంతేకాకుండా సదానంద సిద్ధర్‌కి "నటనగోపాల్" అనే వైష్ణవ నామాన్ని ప్రసాదించాడు. అప్పటి నుండి నటనగోపాల్ వైష్ణవ మత కావ్యమయిన "దివ్య ప్రబంధాన్ని" నేర్చుకున్నాడు. తనకు పంచ సంస్కారాలు చేసి వైష్ణవభక్తునిగా మార్చిన తన గురువు వటపత్ర రాయర్‌ని తన రచనలలలో అనేకసార్లు స్మరించుకున్నాడు నటనగోపాల్.



ఆ తరువాత నటనగోపాల్ వైష్ణవ దివ్యదేశమయిన శ్రీవిల్లిపుత్తూర్ చేరుకుని ఆ క్షేత్రంలో వెలసిన ఆండాళ్ (గోదాదేవి) ఆరాధించి ఆ తరువాత అక్కడి నుండి శ్రీరంగం చేరుకున్నాడు. ఆ క్షేత్రంలో, నిద్రిస్తున్న భంగిమలో దర్శనమిచ్చిన రంగనాధుని సౌందర్యాన్నిచూసి ఆనంద సాగరంలో మునిగి పోయిన నటనగోపాల్ పట్టలేని ఆనందంలో రంగనాధుడిని కీర్తిస్తూ నృత్యం

చేసాడు. నటనగోపాల్, రంగనాధస్వామిపట్ల చూపించిన భక్తి, ఒక స్త్రీ తన భర్తపట్ల చూపించే ప్రేమను పోలి ఉండటం గమనించిన ఆనాటి శ్రీరంగం జియర్‌స్వామి, నటనగోపాల్‌ని ఎంతగానో మెచ్చుకుని ఆపై ఆయనకు "నటనగోపాల నాయకి" అన్నపేరును పెట్టాడు.

ఆ తరువాత నటనగోపాల నాయకి తిరుపతి, కాంచీపురం వంటి శ్రీవైష్ణవ దివ్యక్షేత్రాలను దర్శించాడు. ఆ తరువాత ఇతర పట్టణాలలో ఉన్న వైష్ణవ క్షేత్రాలను కూడా కళ్ళారా చూసి మురిసిపోయాడు. ఆ తరువాత ఆయన తిరుపతికి చేరుకుని అక్కడి నుండి బయలుదేరి తమిళనాడులోని కుంభకోణం పట్టణానికి దగ్గరలో ఉన్న 'తిరుపువనం' అనే ప్రాంతానికి వచ్చాడు. ఆ ప్రాంతంలో నివసిస్తున్న ఒక స్త్రీ, నటనగోపాల నాయకిని ఎంతో భక్తితో తన ఇంటికి తీసుకువెళ్ళి పూజించి ఆపై నటనగోపాల నాయకికి ఒక సిల్క్‌చీర మరియు కొన్ని ఆభరణాలను సమర్పించింది. అప్పుడు నటనగోపాలనాయకి ఆ చీరెను కట్టుకుని ఆ ఆభరణాలను పెట్టుకుని ఆపై రంగనాధుడికి మనసులోనే నమస్కరించాడు.

ఆ తరువాత ఆయన మధురైకి తిరిగి వచ్చాడు. అప్పటి నుండి ఆయన ప్రవర్తన స్త్రీలాగా మారిపోయింది. స్త్రీలాగా నడుస్తూ మధురై వీధులలో భిక్షాటన చేస్తూ ఉండేవాడు. ఆ సమయంలో ఆయన అనేకమంది భక్తులతో కలిసి భజనలు, కీర్తనలు ఆలపిస్తూ ఉండేవాడు.

అది 1912వ సంవత్సరం ఆ రోజు తిథి వైకుంఠ ఏకాదశి. అప్పటికి నటనగోపాల స్వామికి 69 సంవత్సరాలు వచ్చాయి. అప్పటికే సిద్ధయోగిగా గుర్తించబడిన నటనగోపాల నాయికి స్వామిని ఆయన భక్తులు ఒక పల్లకిలో ఎక్కించి మధురై వీధులలో ఘనంగా ఊరేగించారు. ఆ తరువాత సంవత్సరం వచ్చిన వైకుంఠ ఏకాదశి రోజున స్వామిని ఒక గుర్రపు బండిలో మధురై వీధులలో ఊరేగించారు. తన భక్తులు తనపట్ల చూపిస్తున్న భక్తికి పరవశించిన నటనగోపాల నాయకిస్వామి చిరునవ్వు నవ్వుతూ తన భక్తులతో ఇలా అన్నాడు.

గత సంవత్సరం నా ఊరేగింపు "దండి(పల్లకి)"లో జరిగింది. ఈ సంవత్సరం "బొండి(గుర్రపుబండి)" జరుగుతున్నది. వచ్చే సంవత్సరం

"ఖండి(పాడె)" మీద జరుగుతుంది. తన మరణం వచ్చే సంవత్సరం రాబోతున్నదని ముందుగానే తెలుసుకున్న సిద్ధపురుషుడు నటనగోపాల నాయకి అనటంలో అతిశయోక్తిలేదు.

అది 1914, జనవరి 8వ తేది. ఆ రోజు వైకుంఠ ఏకాదశి. ఒక విచిత్రం ఏమంటే నటనగోపాల నాయకి స్వామి జన్మించినపుడు ఏ నెల, ఏ వారం, ఏ నక్షత్రం జరుగుతున్నదో అదే రోజు ఆయన భౌతికదేహాన్ని చాలించాడు.

నటనగోపాల నాయకి స్వామి అనేక అద్భుత,విష్ణు సంబంధ గీతాలను తమిళం మరియు సౌరాష్ట్ర భాష (గుజరాత్‌కు సంబంధించిన ప్రాంతీయ భాష)లలో రచించాడు.

అజగర్ పర్వతాలకు వెళ్ళే దోవలో యానైమలై అన్న ప్రదేశంలో ఉన్న నరసింహపెరుమాళ్ ఆలయానికి ఎదురుగా నటనగోపాలస్వామి సమాధి ఉన్నది.



## 14. సిద్ధపురుషుడు పంబన్‌స్వామి జీవిత విశేషాలు?

ప్రాచీన తమిళనాడు రాష్ట్రంలో ప్రసిద్ధికెక్కిన మహాయోగులలో "పంబన్" ఒకరు. క్రీ.శ. 1848లో నేటి రామేశ్వరం జిల్లాలో ఉన్న పంబన్ అనే గ్రామం(దీవి)లో ఒక శైవమతస్తుల కుటుంబంలో ఈ మహాయోగి జన్మించాడు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టినపేరు "అప్పావు". ఆయన కుటుంబం "పంబన్ దీవి"లో ఉన్న కారణంగా ఆయనకు "పంబన్‌స్వామి" అన్నపేరు వచ్చింది. ఈయన పుట్టినప్పటి నుండి అనేక అతీంద్రియ శక్తులను కలిగి ఉండేవాడని చెబుతారు. విద్యార్థి దశలో ఆయన ఎంతో మేధస్సుని ప్రదర్శించాడు. తమిళ మరియు ఇంగ్లీషు భాషల్లో ఆయనకు చక్కటి ప్రావీణ్యం ఉండేది.

ఆయనకు 13వ సంవత్సరం జరుగుతున్నప్పుడు ఒక శుక్రవారం సూర్యోదయ సమయంలో ఆయనకు ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో

కుమార గురువు (సుబ్రహ్మణ్యస్వామి) ఆయనకు కనిపించి తనపై పద్యాలు వ్రాయమని అడిగాడు. ఆ తరువాత కొంతసేపటికే ఆయనకు మెళుకువ వచ్చింది. వెంటనే ఆయన ఒక తాటాకును తీసుకుని (తాళపత్రం) దానిపై ఘంటంతో ఒక పద్యాన్ని వ్రాసాడు. ఆ తరువాత ఆయన ప్రతిరోజూ మధ్యాహ్న భోజనానికి ముందు ఒక పద్యాన్ని వ్రాస్తూ పోయాడు. వంద రోజులు గడిచాయి. వంద పద్యాలు వ్రాసాడు. ఆయన పద్యాలలోని విశేషం ఏమంటే ప్రతి పద్యమూ ఆయన మానసిక గురువు అయిన అరుణగిరి నాథర్‌పేరుతో ముగుస్తుంది. (ఉదాహరణకి వేమన వ్రాసిన వేమన శతకంలో ప్రతిపద్యం చివర "విశ్వదాభిరామ వినురవేమ" అని ఉంటుంది. అదేవిధంగా పంబన్ వ్రాసిన పద్యాల చివర "అరుణగిరినాథర్" అని ఉంటుంది.)

ఆ తరువాత బాలుడైన అప్పావు ఆ పద్యాలను తీసుకువెళ్ళి ఆ ప్రాంతంలో ఉన్న సెద్దుమాధవఅయ్యార్ అనే ఒక పూజారికి చూపించాడు. ఆ పూజారి ఆ పద్యాలను చదివి ఆపై వాటిని వ్రాసిన బాలకవి అప్పావుని ఎంతగానో మెచ్చుకున్నాడు. ఆ పద్యాలలో అప్పావుకి తమిళభాషమీద ఉన్న పట్టు మరియు మురుగన్‌మీద (సుబ్రహ్మణ్యస్వామి) ఉన్న భక్తి స్పష్టంగా కనిపిస్తాయి.

ఆ తరువాత ఒక విజయదశమి పర్వదినం నాడు సముద్రతీరంలో ఉన్న రామేశ్వరం ఆలయం ప్రక్కన ఉన్న అగ్నితీర్థం అనే ప్రదేశంలో అప్పావుకి ఒక గురువుచేత "షష్ఠాక్షరి మంత్రం" ఉపదేశించబడింది. అప్పావు మేధస్సును ముందుగానే అంచనావేసిన మాధవ అయ్యర్, అప్పావుకి సంస్కృత భాషను నేర్పించాడు.

అప్పావు చిన్నప్పటి నుండి ఆధ్యాత్మిక ఆలోచనలతో ఉండేవాడు. అతడిని ఇహలోక జీవితంలో గడిపేలా చెయ్యటంకోసం అతడి తల్లిదండ్రులు మరియు గురువు మాధవ్‌అయ్యర్, అప్పావుకి వివాహం చెయ్యాలని నిర్ణయించుకున్నారు. 1878లో అనగా, అప్పావుకి 30 సంవత్సరాల

వయస్సు ఉన్నప్పుడు కాలిముత్తమ్మి అనే కన్యతో వివాహం జరిగింది. ఆ దంపతులకు ఇద్దరుకుమార్తెలు, ఒక కుమారుడు జన్మించారు. వివాహం తరువాత కూడా అప్పావు సన్యాసి జీవితాన్ని గడుపుతూ ఉండేవాడు. రోజులో ఎక్కువభాగం పూజలతో గడిపేవాడు. తండ్రి మరణం తరువాత కుటుంబ బాధ్యతలు అప్పావుమీద పడ్డాయి. ఫలితంగా అప్పావు, తండ్రి చేస్తున్న వ్యాపారాన్ని చేపట్టాడు. దురదృష్టవశాత్తు ఆయన వ్యాపారంమీద అనేక కోర్టుకేసులు నడిచాయి. అయితే మురుగన్‌ని మనస్ఫూర్తిగా పూజించే అప్పావుకి ఆ కేసుల నుండి రక్షణ కలిగింది. ఆ కేసులన్నింటిలో గెలుపు సాధించాడు.

ఒకరోజు రాత్రి అప్పావు కుమార్తెకు తీవ్రమైన జబ్బుచేసింది. ఫలితంగా ఆ బాలిక ఏడవటం ప్రారంభించింది. అదిచూసిన అప్పావు భార్య అప్పావు వద్దకువెళ్ళి "మనబిడ్డ అనారోగ్యంతో బాధపడుతున్నది. ఆమెకు మీరు పూజలో పెట్టిన విభూతిని ప్రసాదంగా ఇవ్వండి. మన అమ్మాయికి నయం అవుతుంది" అన్నది. అప్పుడు అప్పావు తన భార్యతో ఇలా అన్నాడు. "నేను విభూతి ఇవ్వను. నీవే మురుగన్‌ని ప్రార్థించి నీ కూతురి అనారోగ్యం తగ్గించమని కోరుకో. ఆయనే ఆ సమస్యను పరిష్కరిస్తాడు".

అప్పావు భార్య మరేమీ మాట్లాడకుండా మురుగన్‌ని ప్రార్థించింది. కొంతసేపు గడిచింది. అప్పావు పూజా మందిరంలోంచి బయటకు వచ్చి ఆపై మంచంమీద పడుకుని ఉన్న తన కూతురుకేసి చూసాడు. ఆ బాలిక ఏడుపు ఆపేసి నిద్రలోకి జారుకున్నది. అప్పావు తన భార్యను పిలిచి ఆమెతో ఇలా అన్నాడు. "మన అమ్మాయికి రోగం తగ్గినట్లుగా కనిపిస్తున్నది. ఏం మందు వేసావు ఏమిటి?". అప్పుడు ఆమె ఇలా చెప్పింది. "మీరు చెప్పినట్లుగానే మురుగన్‌ని ప్రార్థించి నా కూతురు అనారోగ్యాన్ని తగ్గించమని ఆ స్వామిని వేడుకున్నాను. ఆ తరువాత కొంతసేపటికి ఒక యోగి మన ఇంట్లోకి వచ్చి మన అమ్మాయి నుదిటిమీద విభూతి బొట్టుపెట్టి వెళ్ళిపోయాడు. అప్పటి నుండి అమ్మాయికి నయం అయ్యింది. అందుకే

హాయిగా నిద్రపోతున్నది". తన కుమార్తెకు నుదుట విభూతి పెట్టింది మారువేషంలో వచ్చిన సుబ్రహ్మణ్యస్వామి అని అప్పావుకి అర్ధమయ్యింది.

కొద్ది నెలలు గడిచాయి ఒకరోజు ఉదయం ఒక మిత్రుడు, అప్పావు వద్దకువచ్చి "నేను మురుగన్ స్వామిని దర్శించటానికి పళని క్షేత్రానికి వెళుతున్నాను" అన్నాడు. పళని పేరు వినగానే అప్పావుకి కూడా ఆ క్షేత్రానికి వెళ్ళాలనిపించింది. వెంటనే ఆయనకూడా పళని క్షేత్రానికి తన మిత్రుడి వెంట వెళ్ళటానికి సిద్ధపడ్డాడు. అప్పుడు ఆ మిత్రుడు, అప్పావుతో ఇలా అన్నాడు. "నువ్వు పళని క్షేత్రం వెళ్ళటానికి నీ దైవం మురుగన్ అనుమతించాడా?". తాను మురుగన్ అనుమతిని తీసుకోకుండా వస్తున్న విషయం తన మిత్రుడికి తెలియకూడదని భావించిన అప్పావు, మిత్రుడితో ఇలా అన్నాడు. "ఆహా! నా దైవం అనుమతించాడు. అందుకే నీతోపాటు పళని వస్తున్నాను". ఇంకా కొద్దిసేపట్లో అప్పావు మరియు ఆయన మిత్రుడు పళనికి బయలుదేర బోతున్న సమయంలో పళనిమురుగన్, అప్పావు ముందు ప్రత్యక్షం అయి ఆయనతో ఇలా అన్నాడు. "నిన్ను నా పళని కొండకు రప్పించాలి అనుకుంటే ఆ పని ఎప్పుడో చేసేవాడిని. పళని వెళ్ళటానికి నేను అనుమతిచ్చాను అని అబద్ధం చెప్పాల్సిన అవసరం నీకులేదు. సమయం వచ్చినప్పుడు నేనే నిన్ను పళని క్షేత్రానికి పిలుస్తాను. అప్పటివరకు ఇహలోక బంధాలను విడిచిపెట్టి నా నామస్మరణతో కాలంగడుపు". పళని మురుగన్ అన్నమాటకి కట్టుబడిన అప్పావు తన చివరి దశ వరకు ఏనాడూ పళని కొండకు వెళ్ళలేదు. సాక్షాత్తు పళని మురుగన్ ఆహ్వానిస్తేనే ఆ క్షేత్రానికి వెళ్ళాలని అప్పావు నిర్ణయించుకున్నాడు.

అప్పటి నుండి అప్పావు, "పంబన్‌స్వామి అన్నపేరుతో పిలువబడ్డాడు. ఆనాటి నుండి ఆయన ఉప్పు, కారాలను, పులుపును తినటం మానివేసాడు. ప్రతిరోజూ అన్నంలో పెసరపప్పు, నెయ్యివేసుకుని భోజనం చెయ్యటం ఆరంభించాడు. అదికూడా రోజుకి ఒక్కసారిమాత్రమే తీసుకునేవాడు. ఏ రోజు అయినాసరే మధ్యాహ్నం 12గంటల లోపు భోజనం చెయ్యలేకపోతే

ఆరోజుకి ఇక భోజనంచేసేవాడు కాదు.

క్రీ.శ.1891లో పంబన్‌స్వామి 30 శ్లోకాలతో కూడిన "షణ్ముఖ కవచం" అనే అద్భుత గ్రంథాన్ని వ్రాసాడు. రోగబాధతో, శత్రుబాధతో దరిద్రబాధతో విలవిలలాడిపోయేవారు ఈ షణ్ముఖ కవచాన్ని పఠించినట్లయితే వారి బాధలు శీఘ్రమే తొలగిపోతాయని చెబుతారు. ఇప్పటికీ ఏ వ్యక్తి అయినా సరే త్రికరణశుద్ధిగా ఈ "షణ్ముఖ కవచాన్ని" పఠించినట్లయితే ఆశించిన ఫలితాలు చాలా శీఘ్రంగా వస్తాయని అనేకసార్లు ఋజువు అయ్యింది. అంతటి మహత్యాన్ని కలిగి ఉన్నది ఈ షణ్ముఖ కవచం.

క్రీ.శ.1891వ సంవత్సంలో ఆయన సుబ్రహ్మణ్యస్వామి మహత్యాన్ని తెలియజేసే "పంచామృతవర్ణం" అనే గ్రంథాన్ని వ్రాసాడు. సాక్షాత్తు సుబ్రహ్మణ్యస్వామి తిరుచ్చందూర్ క్షేత్రంలో ఒక వృద్ధురాలి రూపంలో పంబన్‌స్వామికి దర్శనమిచ్చి "నీవు వ్రాసిన పంచామృత వర్ణం గ్రంథంలోని శ్లోకాలను పఠించే ప్రదేశంలో నేను అదృశ్యరూపంలో సంచరిస్తూ ఉంటాను. ఎవరైతే మనస్సులో ఈ శ్లోకాలు తలచుకుంటారో వారికి సకల పుణ్యాలు లభిస్తాయి" అని చెప్పాడు.

ఒకసారి పంబన్‌స్వామి ముళ్ళతోకూడి ఉన్న ఒక ఎగుడు, దిగుడు మార్గంలో కాలినడకన చెప్పులు లేకుండా నడుస్తున్నాడు. ఆ సమయంలో ఆయన కాలిలో ఒక పదునైన ముల్లు లోతుగా దిగింది. ఆ ముల్లు దిగిన కారణంగా పంబన్‌స్వామికి విపరీతమైన బాధ కలిగింది. ఆ బాధ తట్టుకోలేని పంబన్‌స్వామి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. దాంతో ఆయన తన ఇష్టదైవం అయిన మురుగన్‌ని ప్రార్థించాడు. ఆ రోజు రాత్రి మురుగన్ అక్కడకు దగ్గరలో ఉన్న ఒక గ్రామంలో నివసిస్తున్న ఒక చర్మకారుడికి (తోలుచెప్పులుకుట్టే వృత్తివాడు) కలలో కనిపించి "పంబన్‌స్వామికి ఒక జత చెప్పులుకుట్టి ఇవ్వు" అని చెప్పాడు.

ఆ తరువాత పంబన్‌స్వామి తన ప్రయాణంలో భాగంగా మర్నాటి మధ్యాహ్నాన్నికి ఆ చర్మకారుడు ఉన్న గ్రామం నుండి నడుస్తున్నాడు. అప్పుడు ఆ చర్మకారుడు తాను కొంతసేపటి క్రితం తయారుచేసిన ఒక తోలుచెప్పుల జతను తీసుకువచ్చి పంబన్‌స్వామికి ఇచ్చి తొడుక్కోమన్నాడు. తాను అడక్కుండానే ఆ చర్మకారుడు తనకి చెప్పులు ఎలా ఇచ్చాడో? పంబన్‌స్వామికి అర్థంకాలేదు. "నాకు కలలో మురుగన్ కనిపించి ఒక చెప్పుల జతను తయారుచేసి మీకు ఇమ్మని చెప్పాడు" అని ఆ చర్మకారుడు, పంబన్‌స్వామికి తెలియజేసాడు. తన అవసరాన్ని గుర్తించి తనకు పాదరక్షలు ఏర్పాటుచేసిన మురుగన్ దయకు ఎంతగానో కదిలిపోయాడు పంబన్‌స్వామి.

సన్యాసి జీవితాన్ని గడుపుతూ ఇంట్లోనే ఉంటున్న పంబన్‌స్వామికి ఒకసారి తీవ్రమైన అతిసారవ్యాధి వచ్చింది. ఫలితంగా ఆయన బలహీనపడి మూర్ఛపోయాడు. తనభర్త అనారోగ్యంతో పడిపోవటం చూసిన పంబన్‌స్వామి భార్యకూడా మూర్ఛవచ్చి పడిపోయింది. అప్పుడు మురుగన్ బాలుడివేషంలో ఆ గృహంలోకి ప్రవేశించాడు. ఆ తరువాత తన చేతి కర్రతో పంబన్‌స్వామి భార్యను చిన్నగా తట్టాడు. ఆ స్పర్శతో పంబన్‌స్వామి భార్యకు స్పృహవచ్చింది. అప్పుడు మురుగన్, ఆమెతో ఇలా అన్నాడు. "నీవేమీ విచారించకు. నీ భర్త కోలుకుంటాడు. అక్కడ ఉన్న విభూతిని తెచ్చి నీ భర్త శరీరానికి అద్దు" అనిచెప్పి నిలుచున్నాడు.

పంబన్‌స్వామి భార్య ఆ సమయంలో బహిష్టులో ఉన్నది. దాంతో ఆమె పవిత్ర విభూతిని తాకటానికి వెనకాడింది. అప్పుడు బాలుడి వేషంలో ఉన్న మురుగన్ ఆమెతో ఇలా అన్నాడు. "అమ్మా! అత్యవసర సమయాలలో మడి మైల పాటించాల్సిన పనిలేదు. నీవు నిరభ్యంతరంగా ఆ విభూతినితెచ్చి నీ భర్తకు అద్దు". దాంతో పంబన్ భార్య, మురుగన్ పటం వద్దకువెళ్ళి అక్కడ ఉన్న విభూతిని తెచ్చి పంబన్‌స్వామి ముఖంమీద, శరీరంమీద పూసింది. ఫలితంగా పంబన్‌స్వామి అనారోగ్యం నయం అయ్యింది. ఆయన

లేచి కూర్చున్నాడు. అప్పటికే మారువేషంలో ఉన్న మురుగన్ అదృశ్యం అయిపోయాడు.

కొద్ది నెలలు గడిచాయి. ఒకరోజు ఒక పద్యకవి, పంబన్‌స్వామి వద్దకు వచ్చి ఆయనతో ఇలా చెప్పాడు. "నేను వంద పద్యాలు ఉండే ఒక గ్రంధాన్ని వ్రాయాలని ప్రయత్నిస్తున్నాను. అయితే రెండు నెలల నుండి ఆ ప్రయత్నం ముందుకు వెళ్ళటంలేదు. నా గ్రంథం అసంపూర్తిగా మిగిలిపోయింది. మీరు నాకేమైనా సహాయం చెయ్యగలరా?". ఆ కవి చెప్పిన మాటలు విన్న పంబన్‌స్వామి తానే స్వయంగా ఒక వంద పద్యాలు ఉండే గ్రంధాన్ని వ్రాయాలని నిర్ణయించుకున్నాడు. ఆ కవి ఎలాంటి గ్రంథం అయితే వ్రాయాలని ప్రయత్నిస్తున్నాడో అచ్చగా ఆవిధంగా ఉండేలా తన గ్రంధాన్ని వ్రాయాలని పంబన్‌స్వామి ఆశించాడు. వెంటనే ఆయన తన ఇష్ట దైవం అయిన మురుగన్‌ని స్మరించుకున్నాడు. మురుగన్ ఆశీర్వదించాడు. ఫలితంగా పంబన్‌స్వామి ఒక గంటలోపు 125 పద్యాలను శరవేగంతో వ్రాసాడు. ఇప్పటికీ ఏ కవి లేదా యోగి అంత వేగంగా అన్ని పద్యాలను వ్రాయలేకపోయారు. ఆ పద్యకావ్యంపేరు "తిరుఓరుమలై కొమగన్" ఈ గ్రంథంలోని మొదటి పద్యంలో ఉండే నాలుగు లైన్లలో మొత్తం 256 పదాలు ఉంటాయి. ప్రతి లైనులోను 64 పదాలు ఉంటాయి. కేవలం మురుగన్ దయ కారణంగానే తాను అంత వేగంగా అన్ని పద్యాలు వ్రాయగలిగాను అని పంబన్‌స్వామి చెప్పాడు.

ఒకసారి పంబన్‌స్వామి తమిళనాడులోని కాంచీపుర క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ నుండి ఆ క్షేత్రంలో ఉన్న కుమారకొట్టం అనే సుబ్రహ్మణ్య క్షేత్రానికి వెళ్ళాలని ప్రయత్నించాడు. కానీ ఆ ప్రయత్నం ఫలించలేదు. దాంతో ఆయన అక్కడ నుండి తన గ్రామానికి బయలుదేరాడు. ఆ సమయంలో సుబ్రహ్మణ్యస్వామి ఒక 30 సంవత్సరాల వయస్సు ఉన్న యువకుడి రూపంలో పంబన్‌స్వామికి దర్శనమిచ్చి ఆయనతో ఇలా అన్నాడు.

"కుమారకొట్టాం ఆలయంలో పూజారిగా పనిచేసిన కంచియప్ప శివైచారియర్, కుమారకొట్టం ఆలయంలో కందపురాణం (స్కాందపురాణం)

ప్రాసాడు. ఆ ఆలయాన్ని చూడకుండానే తిరిగి వెళ్ళిపోతున్నావా?". పంబన్ స్వామికి ఏమి మాట్లాడాలో అర్థంకాక మౌనం వహించాడు. అప్పుడు ఆ యువకుడి రూపంలో ఉన్న సుబ్రహ్మణ్యేశ్వరస్వామి స్వయంగా పంబన్ స్వామిని తీసుకువెళ్ళి కుమారకొట్టం ఆలయం వద్ద వదిలిపెట్టి అదృశ్యం అయిపోయాడు. ఆ తరువాత పంబన్‌స్వామి, కుమారకొట్టం ఆలయంలోని కుమారస్వామిని దర్శించుకుని పూజలు చేసుకున్నాడు. ఒక విచిత్రం ఏమంటే పంబన్‌స్వామి ఎక్కాల్సిన రైలు ఏ కారణంవల్లో సకాలానికి బయలుదేరలేదు. పంబన్‌స్వామి, కుమారకొట్టం ఆలయంలో కుమారస్వామిని దర్శించుకుని ఆ తరువాత రైల్వేస్టేషన్‌కి వెళ్ళాడు. కొన్ని గంటల క్రితమే వెళ్ళిపోవలసిన రైలు ఇంకా ఫ్లాట్‌ఫారంమీద ఆగి ఉండటంచూసి పంబన్‌స్వామి ఆశ్చర్య పోయాడు. బహుశా తనకోసమే మురుగన్ ఆ రైలును ఆలస్యం చేసాడని పంబన్‌స్వామి భావించాడు. ఆ తరువాత పంబన్‌స్వామి ఆ రైలు ఎక్కాడు. ఆయన రైలు ఎక్కిన రెండు నిమిషాలకే ఆ రైలు బయలుదేరింది.

1894వ సంవత్సరంలో పంబన్‌స్వామి తమిళనాడులోని రామ్‌నాడ్ పట్టణానికి దగ్గరలో ఉన్న పీరపన్ వాలసాయ్ అన్న ప్రదేశానికి వెళ్ళాడు. అక్కడ ప్రభుత్వ అధికారుల అనుమతి తీసుకుని అక్కడ ఉన్న శ్మశానంలో 3'x3'x3' కొలతలు గల ఒక గుంటను త్రవ్వించుకుని ఆపై ఆ గుంటపైన ఒక మూతను ఏర్పాటుచేయించాడు. తాను ఆ గుంటలో కూర్చున్న తరువాత ఆ గుంటపైన ఉన్న తలుపుమూసి దానికి తాళం వెయ్యమని తన శిష్యులకు చెప్పాడు. తనకి సాక్షాత్తు పళని మురుగన్ వచ్చి మంత్రోపదేశం చేసేవరకు తాను ఆ గుంటలోనే ధ్యానం చేసుకుంటూ ఉంటానని పంబన్‌స్వామి తన శిష్యులకు చెప్పాడు. వారు అందుకు అంగీకరించారు.

గుంటలో ధ్యానంలో ఉన్న పంబన్‌స్వామిని ఆ శ్మశానంలో ఉండే ఒక పిశాచం పట్టుకుని పీడించాలని ప్రయత్నించింది. ఆ పిశాచం గుంటలోకి ప్రవేశించాలని ప్రయత్నించినపుడు ఆ గుంట బయట ఉన్న పంబన్‌స్వామి దండం (కర్ర) చాలా విచిత్రంగా గాలిలోకిలేచి ఆ పిశాచాన్ని

అక్కడ నుండి తరిమికొట్టింది. 7వ రోజు రాత్రి ఒక అద్భుతమైన స్వరం పంబన్‌స్వామితో ఇలా చెప్పింది. "నువ్వు ఇప్పటిదాకా ఈ గుంటలో చేసిన తపస్సుచాలు. ఇక బయటకురా". అప్పుడు పంబన్‌స్వామి ఆ గుంటలో నుండే ఇలా చెప్పాడు. "పళని మురుగన్ స్వయంగా వచ్చి నాకు మంత్రోపదేశం చేసేవరకు ఈ గుంటలో నుండి బయటకు రాను. ఇక్కడే చనిపోవటానికి కూడా నేను సిద్ధంగా ఉన్నాను". అప్పుడు ఆ స్వరం ఇలా చెప్పింది. నువ్వు కోరినట్లుగానే పళని మురుగన్ ఇక్కడకు వచ్చాడు. నువ్వు గుంటలోంచి బయటకు వచ్చిచూడు". ఆ మాట వినగానే పంబన్‌స్వామికి పట్టలేని ఆనందం కలిగింది. ఆయన వెంటనే ఆ గుంట తలుపు తెరుచుకుని బయటకు వచ్చి చూసాడు. అక్కడ కనపబడిన దృశ్యం ఆయన తనువును పులకరింపచేసింది. ఏమిటా దృశ్యం? సాక్షాత్తు పళని మురుగన్ చేతిలో దండాన్ని ధరించి నుంచుని ఉన్నాడు. ఆయన ప్రక్కన ఇద్దరు మహర్షులు ఉన్నారు. తన ఇష్టదైవం అయిన పళని మురుగన్ తన ఎదురుగా ఉండటంతో పంబన్‌స్వామి ఆనందంతో పొంగిపోయాడు. అప్పుడు మురుగన్, పంబన్ స్వామిని తన దగ్గరకు పిలిచి ఆయన చెవిలో మంత్రోపదేశం చేసాడు. అ తరువాత మురుగన్ తనతోపాటు వచ్చిన మహర్షులతో కలిసి వెనక్కి తిరిగి పశ్చిమ దిక్కులో కొంతదూరం నడిచి అదృశ్యం అయిపోయాడు.

ఆ తరువాత పంబన్ స్వామి ఆ గుంటలోనే 28 రోజులపాటు నీరు, నిద్ర, ఆహారం లేకుండా ఆ మంత్రాన్ని ధ్యానిస్తూ ఉండిపోయాడు.

35వ రోజున ఒక స్వరం పంబన్‌స్వామికి ఇలా చెప్పింది. "నీవు వెంటనే ఆ గుంటలోంచి బయటకురా". అప్పుడు పంబన్ స్వామి ఆ గుంటలోనుండే ఇలా సమాధానం చెప్పాడు. "పళని మురుగన్ స్వయంగా వచ్చి పిలిస్తేకాని నేను బయటకురాను. అప్పుడు ఆ స్వరం ఇలా అన్నది. "నేనే మురుగన్‌ని. నీకోసం వచ్చాను. బయటకు రా". అప్పుడు పంబన్ స్వామి ఎంతో సంతోషంతో ఆ గుంట నుండి బయటకు వచ్చాడు.

ఆకాశంలో చైత్ర పౌర్ణమి ఆ సమయంలో చంద్రుడు ప్రకాశంతో మెరిసిపోతున్నాడు. మురుగన్, పంబన్‌స్వామికి దర్శనమిచ్చాడు.

అప్పటి వరకు పంబన్‌స్వామి నడుము వరకు ఒక వస్త్రాన్ని మాత్రమే ధరిస్తూ ఉండేవాడు. అప్పుడు ఆయన శిష్యులు ఆయనతో ఇలా చెప్పారు. "స్వామీ! ఇక నుండి మీరు నడుముకి ఒక వస్త్రం కట్టుకోండి, భుజాలపై ఒక ఉత్తరీయం కప్పుకోండి". పంబన్‌స్వామి ఏమీ మాట్లాడకుండా చిరునవ్వు నవ్వాడు. ఆ తరువాత ఆయన శిష్యులు ఆయనతో ఇలా అన్నారు. "ఇన్ని రోజులుగా ఈ గుంటలో తపో ధ్యానంలో మీకు ఎలాంటి ఆధ్యాత్మిక అనుభవాలు ఎదురయ్యాయో మాకు తెలియజేయండి". ఆయన తన అనుభవాలను తన శిష్యులకు క్లుప్తంగా తెలియజేసాడు. ఆనాడు పంబన్ స్వామి తపస్సుచేసిన గుంట వద్ద ఇప్పటికీ ప్రతిరోజూ ఒక దీపారాధన వెలిగిస్తూ ఉంటారు. రామ్‌నాడ్ పట్టణంలో ఉంటున్న పంబన్‌స్వామి భక్తులు ఈ దీపారాధన వెలిగిస్తూ ఉంటారు.

క్రీ.శ. 1895వ సంవత్సరంలో పంబన్‌స్వామి సన్యాసిదీక్ష తీసుకుని కుటుంబాన్ని వదిలిపెట్టి పంబన్ గ్రామాన్ని విడిచిపెట్టి దేశాటన ప్రారంభించాడు. ఒకరోజున ఆయనకు మురుగన్ స్వప్నంలో కనిపించి ఆయనను మద్రాసు వెళ్ళమని చెప్పాడు.

తనకి మద్రాసులో ఎవరూ తెలియరని, అందువలన అక్కడికి వెళ్ళటం తనకు ఇబ్బంది అవుతుందని మనసులో సంకోచించాడు పంబన్‌స్వామి. అయితే తన ఇష్టదైవం అయిన మురుగన్ ఆదేశించాడు కనుక మరేమీ మాట్లాడకుండా మద్రాసు చేరుకున్నాడు పంబన్‌స్వామి.

పంబన్‌స్వామి మొదట మద్రాసులోని ఎగ్మూర్ రైల్వేస్టేషన్‌లో రైలు దిగాడు. అప్పుడు ఒక జట్కా బండివాడు ఆయనవద్దకు వచ్చి తన బండిలో ఎక్కమని అడిగాడు. పంబన్‌స్వామి మరేమీ మాట్లాడకుండా ఆ జట్కా బండిలో కూర్చున్నాడు. ఆ జట్కాబండివాడు, పంబన్‌స్వామిని మద్రాసు

నగరంలోని సెయింట్ జార్జిటౌన్‌లో ఉన్న 'వైద్యనాథ్ ముదలి' వీధిలో ఉన్న 41వ ఇంటి వద్దకు తీసుకువెళ్లాడు. పంబన్‌స్వామి బండిదిగి నుంచున్నాడు. అప్పుడు ఆయనకు ఎదురుగా బంగారుఅమ్మాళ్ అనే ఒక వృద్ధ స్త్రీ కనపడింది. ఆమె రెండు చేతులూ జోడించి పంబన్‌స్వామికి నమస్కరించి ఆయనతో ఇలా అన్నది. "నిన్నరాత్రి స్వప్నంలో మురుగన్ కనిపించి నాతో ఇలా చెప్పాడు. రేపు ఉదయం నీ ఇంటికి ఒక యోగి వస్తాడు. అతడికి కావలసిన వసతి సౌకర్యాలు, భోజన సౌకర్యాలు కల్పించు". పంబన్‌స్వామి ఆ వృద్ధ స్త్రీ ఆతిధ్యం తీసుకోవటానికి అంగీకరించాడు.

క్రీ.శ.1896వ సంవత్సరంలో పంబన్‌స్వామి చిదంబరం క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ ఆయన "తగరాలయ రహస్యం" అనే ఒక ఉపనిషత్తును రచించాడు. "సుబ్రహ్మణ్యస్వామి, ప్రతి మానవ హృదయంలోను ఒక చిన్న జ్యోతి రూపంలో నివసిస్తూ ఉంటాడు". అన్న సందేశాన్ని ఈ ఉపనిషత్తు అందినస్తుంది. మురుగన్‌పై స్వచ్ఛమైన తమిళభాషలో 50 పద్యాలను వ్రాసిన ఘనత పంబన్‌స్వామికే దక్కుతుంది. తనకు తమిళం మరియు సంస్కృతం రెండు కళ్లులాంటివి అని ఆ రెండు భాషల్ని ఎవరు నిందించినా తనకు బాధ కలుగుతుందని పంబన్‌స్వామి తన భక్తులతో అన్నాడు.

ఒకసారి పంబన్‌స్వామి ఉత్తరభారతదేశంలో ఉన్న వారణాసి క్షేత్రానికి వెళ్ళాడు.


పంబన్ స్వామి-తమిళనాడు.

అక్కడ ఆయన "కుమారగురుపరర్" అనే మఠంలో బస చేసాడు. అక్కడ ఆయన చాలా సంతోషంగా కొంతకాలంపాటు కాలం గడిపాడు. ఒకరోజున ఆ మఠ నిర్వాహకుడు ఒక కాషాయ వస్త్రాన్ని పంబన్‌స్వామికి ఇచ్చి అప్పటి వరకు ఆయన ధరిస్తున్న తెల్లవస్త్రాన్ని వదిలివేయమని కోరాడు. అప్పటి వరకు పంబన్‌స్వామి నడుము వరకు మాత్రమే వస్త్రాన్ని ధరిస్తూ ఉండేవాడు. "ఏది ఏమైనా ఇది మురుగన్ ఆజ్ఞ" అని భావించిన పంబన్ స్వామి ఆ మఠ నిర్వాహకుడు ఇచ్చిన రెండు వస్త్రాలను తీసుకుని ఒకటి నడుముకి కట్టుకుని, రెండవది పైన వేసుకున్నాడు. అప్పటి నుండి ఆయన రెండు వస్త్రాలను ధరించటం ఆరంభించాడు.

పంబన్‌స్వామి తన జీవిత కాలంలో అనేక మహత్యాలను ప్రదర్శించాడు. అలాంటి వాటిలో ఒకటి షష్ఠిపూజ. ఆ సమయంలో జరిగిన అన్నదానంకోసం పంబన్‌స్వామి శిష్యులు వందమందికి సరిపడా అన్నాన్ని వండారు. అయితే ఆ అన్నం 4 వందల మందికి వడ్డించినా ఇంకా కొంచెం మిగిలే ఉన్నది. ఇది పంబన్‌స్వామి మహత్యానికి చిహ్నం అని చెబుతారు. ఒక విచిత్రం ఏమంటే వందమందికి వండిన అన్నం ఇంకా ఇంకా వస్తూనే ఉండగా కూరలు, సాంబారు, రసం మళ్లీ మూడుసార్లు వండాల్సి వచ్చింది.

పంబన్‌స్వామి మద్రాసులో ఉన్న సమయంలో ఆయనకు తన తల్లి మరియు తన పెద్దకుమారుడు మరణించబోతున్నారని ముందుగానే తెలిసింది. దాంతో ఆయన తన శిష్యులను పిలిచి వారితో ఇలా అన్నాడు. "నేను సన్యాసిని. నాకు ఏ బంధాలు లేవు. నన్ను ఎవరూ చికాకు పెట్టవొద్దు". అలా చెప్పి పంబన్‌స్వామి ధ్యానంచేసుకుంటూ ఉండిపోయారు. ఆయన అలా చెప్పిన గంటకే ఆయన కుటుంబ సభ్యుల మరణవార్తను ఒక టెలిగ్రామ్ మోసుకు వచ్చింది.

గొప్ప యోగిగా పేరుపొందిన పంబన్‌స్వామిని చూసి అనేకమంది దుర్మార్గులకు అసూయ మొదలయ్యింది. అలాంటి వారిలో ఒక క్షుద్ర మంత్రగాడుకూడా ఉన్నాడు. వాడు చిదంబరం క్షేత్రానికి దగ్గరలో ఉన్న

పినాధూర్ అనే ప్రదేశంలో ఉంటాడు. ఆ సమయంలో చిదంబరం క్షేత్రంలో ఉన్న పంబన్‌స్వామిని చంపటంకోసం ఆ మంత్రగాడు చేతబడి ద్వారా ఒక క్షుద్ర పిశాచిని ఆవాహనచేసుకుని ఆ పిశాచిని పంబన్‌స్వామి మీదకి ప్రయోగించాడు. ఆ పిశాచి, పంబన్‌స్వామి ముందు భయంకరమైన ఆకారంతో ప్రత్యక్షం అయ్యింది. అప్పుడు పంబన్‌స్వామి గంభీరమైన స్వరంతో ఆ పిశాచితో ఇలా అన్నాడు.

"నేను ఆ మంత్రగాడికి ఎలాంటి ద్రోహమూ చెయ్యలేదు. కానీ అతడు నన్ను చంపటానికి నిన్ను ప్రయోగించాడు. అది తప్పు. నిన్ను నా మీదకు పంపించిన వాడిమీదకి తిరిగివెళ్ళిపో". సిద్ధపురుషుడు అయిన పంబన్‌స్వామి మాటని ధిక్కరించలేని ఆ పిశాచి భయంకరంగా కేకలు వేస్తూ వెనక్కి తిరిగి తనను ప్రయోగించిన మంత్రగాడి మీదకు వెళ్ళింది. ఫలితంగా ఆ మంత్రగాడు నెత్తురు కక్కుకుని చనిపోయాడు.

శివుడి గురించి, శివ భక్తుల గురించి చెడు వార్తలు ప్రచురించిన పత్రికల వారిపై అనేకసార్లు కేసులుపెట్టి ఆ కేసులలో గెలిచాడు పంబన్‌స్వామి.

క్రీ.శ.1923, డిసెంబర్ నెలలో పంబన్‌స్వామికి మద్రాసు నగరంలోని తంబుశెట్టి వీధిలో ఒక యాక్సిడెంట్ జరిగింది. వేగంగా వస్తున్న ఒక జట్కా బండి చక్రం క్రింద పంబన్‌స్వామి పడ్డడు. ఫలితంగా ఆయన ఎడమకాలి చీలమండ విరిగిపోయింది. ఆయన భక్తులు ఆయన్ని ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్చారు. అక్కడి డాక్టర్లు విచార స్వరంతో ఆయనతో ఇలా అన్నారు. "స్వామీ! మీ కాలు తీసివేయవలసి వస్తుంది అని అనుకుంటున్నాం". ఈ విషయం తెలిసిన చిన్నస్వామి అనే భక్తుడు, పంబన్‌స్వామి రచించిన షణ్ముఖ కవచాన్ని అనేకమార్లు భక్తితో పఠించి పంబన్‌స్వామి కాలు బాగు అవ్వాలని సుబ్రహ్మణ్యస్వామిని వేడుకున్నాడు. ఒక వారం గడిచింది. విరిగిపోయిన పంబన్‌స్వామి కాలి చీలమండ యధాతథంగా అతుక్కుపోయింది. తాము పంబన్‌స్వామి కాలు తొలగించ

వలసి వస్తుంది అనుకుంటున్న సమయంలో ఆయన కాలు బాగు అయిపోవటం చూసిన ఆ హాస్పటల్ లోని బ్రిటీష డాక్టర్లు నిర్ఘాంత పోయారు.



పంబన్‌స్వామి హాస్పటల్ బెడ్‌మీద ఉన్న 11వ రోజున రెండు నెమళ్ళు తన బెడ్ ప్రక్కన రెక్కలువిప్పి ఆడటం ఆయనకు కనిపించింది. ఇంకొక విశేషం ఏమంటే ఆయన బెడ్‌మీద తన ప్రక్కన పసిబిడ్డ రూపంలో పడుకుని కున్న మురుగన్‌కూడా ఆయనకు కనిపించాడు.

1929వ సంవత్సరంలో ఒకరోజున పంబన్‌స్వామి తన శిష్యుడు అయిన చిన్నస్వామిని తనవద్దకు పిలిచి అతడితో ఇలా చెప్పాడు. "నాకు మరణ సమయం ఆసన్నమయ్యింది. నీవు తిరువన్‌మియూర్‌లో ఉన్న భూమిని జాగ్రత్తగా చూసుకో". ఆ తరువాత పంబన్‌స్వామి తన కాళ్ళతో భూమిని తొలిచి ఎంత భూమిని కొనాలో, అక్కడ ఏవిధమైన ఏర్పాట్లు చెయ్యాలో చిన్నస్వామికి చెప్పాడు. (ఆ ప్రదేశంలో తను జీవ సమాధి అవటంకోసం అవసరమైన నిర్మాణాన్ని చిన్నస్వామి ద్వారా ముందుగానే

ఏర్పాట్లు చేసుకున్నాడు పంబన్‌స్వామి) ఆయన చెప్పిన ప్రకారమే అన్ని ఏర్పాట్లు చేసాడు చిన్నస్వామి.

1929 మే నెల 30వ తేదీ ఉదయం 7.15 నిమిషాలకు పంబన్‌స్వామి తన శిష్యులందరినీ తన వద్దకు పిలిచి వారితో ఇలా చెప్పాడు. "మీరు ఎల్లప్పుడూ మురుగన్‌ని నమ్ముకోండి". ఆ తరువాత ఆయన బలంగా శ్వాసను తీసుకుని ఆపై ఆ శ్వాసను తన ఉదరంలో బంధించి సమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు.

పంబన్‌స్వామి, పరమశివుడిని పరబ్రహ్మగా భావించాడు. సుబ్రహ్మణ్య స్వామిని పరమశివునిలో ఒక భాగంగా గుర్తించాడు. పళని మురుగన్‌పట్ల పంబన్‌స్వామికి ఉన్న భక్తికి గుర్తింపుగా ఆయన భక్తులు ఆయనకు "కుమార గురుదాస స్వామిగళ్" అన్న బిరుదును ఇచ్చారు.

ఇప్పటికీ తమిళనాడులోని చెన్నై నగరంలో ఉన్న తిరువాన్‌మియూర్ అన్న ప్రదేశంలో పంబన్‌స్వామి సమాధి ఉన్నది.

## 15. బ్రహ్మర్షి కాగపుంజందర్ జీవిత విశేషాలు?

ఇప్పటివరకు చరిత్రకు తెలిసిన సిద్ధపురుషులలో అతి ప్రముఖుడు కాగపుజందర్ లేదా కాకపుజందర్. తమిళనాడులోని అనేకమంది హిందువులు కాగపుజందర్ సిద్ధర్‌ని 'దైవంగా' పూజిస్తున్నారు. ఆయన భక్తులు ఆయనను "అయ్యా" అని పిలుస్తారు. కాగపుజందర్ యొక్క గొప్పతనం ఏమిటంటే ఆయన ఎప్పుడో రాబోతున్న ప్రళయాన్ని (యుగాంతం) ముందుగానే దివ్యదృష్టితోచూసి తాళపత్రగ్రంథాలలో లిఖించాడు. భవిష్యత్తులో ఆయన శివుడిగా అవతరిస్తాడని చెబుతారు.

ఈ ప్రపంచంలో కొన్ని లక్షల సంవత్సరాలు గడిచిన ప్రతిసారీ ఒక మహాప్రళయం (యుగాంతం) వస్తూ ఉంటుంది. ఆ ప్రళయంలో అప్పటి

వరకు ఉన్న సమస్త జీవులు నశించిపోతాయి. ఆ తరువాత మళ్ళీ క్రొత్త సృష్టి ప్రారంభం అవుతుంది. ఈ సిద్ధపురుషుడు ఒక కాకిరూపంలో ఉండి ఎన్నో ప్రళయాలను చూసాడు. ఆ కారణంగానే ఈయనకు "కాగపుజందర్" అన్న పేరు వచ్చింది. తమిళ భాషలో "కగమ్" అంటే కాకి అని అర్ధం.

కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం కాగపుజందర్ దాదాపు 7,500 యుగాంతాలను లేదా ప్రళయాలను చూసాడని తెలుస్తున్నది.

ఒకప్పుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మధ్య ఒక తీవ్రమైన వివాదం చెలరేగింది. అది ఏమిటంటే వారి ముగ్గురిలో వయస్సులో ఎవరు పెద్దవాడు అని. అందరిలోకి నేను పెద్ద అని ఒకరు అంటే, కాదు నేనే పెద్ద అని ఇంకొకరు అనటం జరిగింది. ఎంత వాదించుకున్నా త్రిమూర్తులలో ఎవరు పెద్దవారో వారికి తేలలేదు. ఆ సమయంలో నారదమహర్షి వారి వద్దకు వచ్చి వారితో ఇలా అన్నాడు.

"మీరు ముగ్గురు వెంటనే భూలోకంలో ఉన్న కాగపుజందర్ మహర్షి వద్దకు వెళ్ళండి. ఆయన, మీ ముగ్గురిలో ఎవరు పెద్దవారో ఖచ్చితంగా చెబుతాడు". నారద మహర్షి చెప్పిన మాటలు విని త్రిమూర్తులు ఆశ్చర్య పోయారు. ఒక మనిషి ఎంత కాలం జీవిస్తాడు? కాకపుజందర్ ఎంత గొప్ప యోగి అయినప్పటికీ ఆయనకు మా ముగ్గురిలో ఎవరు పెద్దవాడో చెప్పగలిగే వయస్సు ఎలా ఉంటుంది? అని బ్రహ్మదేవుడు, నారద మహర్షిని ప్రశ్నించాడు. అప్పుడు నారదమహర్షి వారితో ఇలా అన్నాడు.

"ఒక యుగాంతం (ప్రళయం) పూర్తి అయిపోగానే క్రొత్త త్రిమూర్తులు ఆవిర్భవిస్తారు. కాగపుజందర్ ఇప్పటివరకు అనేక ప్రళయాలను చూసాడు. కనుక ఆయన మీ లాంటి ఎందరో త్రిమూర్తులను వరుసగా చూసి ఉన్నాడు. కనుక మీ ముగ్గురిలో ఎవరు పెద్దవాడో చెప్పటం ఆయనకు ఏమాత్రం కష్టంకాదు". కాగపుజందర్ యొక్క గొప్పతనాన్ని గురించి తెలుసుకున్న త్రిమూర్తులు కాగపుజందర్‌ని ఎంతగానో మెచ్చుకున్నారు.

ప్రతి ప్రళయం పూర్తి అయిన తరువాత మరల సృష్టి ప్రారంభం అవుతుంది. అప్పుడు కాగపుజందర్ క్రొత్త సృష్టికి అధిపత్యం వహించే ఒక కొత్త శివుడిని ఎన్నికచేసి అతడికి మంత్రోపదేశం చేస్తాడని చెబుతారు.

ప్రతి సృష్టి ప్రారంభ సమయంలోనూ కాగపుజందర్, సాక్షాత్తు పరమ శివుడికి మంత్రదీక్ష ఇస్తాడని చెబుతారు. శ్రీరాముని గురువు అయిన వశిష్ట మహర్షికి కూడా ఈ కాగపుజందరే గురుదీక్ష ఇచ్చాడని చెబుతారు. రోమఋషి అనే పేరుతో పిలువబడిన ఒక సిద్ధయోగి, కాగపుజందర్ యొక్క కుమారుడని తెలుస్తున్నది.

ప్రాచీన తమిళదేశంలో అతిశక్తివంతులైన 18 మంది సిద్ధయోగులలో కాగపుజందర్ ప్రముఖుడని చెబుతారు. ఆయనను ఒక దైవంలాగా ఆరాధించేవారు ఎంతోమంది ఉన్నారు. ఆయనను, ఆయన భక్తులు ఎంతో అభిమానంతో "అయ్యా" అని పిలుస్తారు. ఈయన క్రీ.శ.7వ శతాబ్దంలో జీవించాడని తెలుస్తున్నది.

మీరజ్దార్ మరియు చిన్నమాళ్ అమ్మయార్ అనే పుణ్యదంపతులకు కాగపుజందర్ జన్మించాడు. కాగపుజందర్ తమిళనాడులోని పుదుకొట్టై జిల్లాలో ఉన్న ఇడైయాత్తూర్ అనేగ్రామంలో అష్టమి తిథినాడు తన తల్లిదండ్రులకు 8వ సంతానంగా జన్మించాడు.

చిన్నమ్మాళ్ అమ్మయార్ నిండు గర్భిణిగా ఉన్న సమయంలో ఒకసారి ఆమె గ్రామంలో కుంభవృష్టి కొన్ని రోజులపాటు కురిసింది. ఇలాంటి పరిస్థితుల్లో ఆమె తమయొక్క పంట పొలాల పరిస్థితి ఎలాఉందో స్వయంగా తెలుసుకుందామన్న అభిప్రాయంతో ఆమె తమ పొలాలవైపు వెళ్ళింది. అలా వెళ్ళిన సమయంలో ఆమెకు హఠాత్తుగా తలతిరిగి మూర్ఛపోయింది. ఆమెకు స్పృహవచ్చి లేచి చూసేసరికి ఆమె ప్రక్కన అపరిమితమైన తేజస్సుతో వెలిగిపోతున్న పసిబిడ్డ కనిపించాడు. అనగా ఆమెకు స్పృహలేని సమయంలో ప్రసవం అయ్యింది అన్నమాట. ఆ బిడ్డకు 15 రోజులు నిండే వరకు కూడా వర్షాలు అలా కురుస్తూనే ఉన్నాయి.

ఈయన పుట్టిన సమయంలో తల్లిపాలు త్రాగటానికి ఇష్టపడలేదు. అప్పుడు ఆ ఇంట్లో పనిచేసే ఒక హరిజన స్త్రీ ఆ బిడ్డకి తన చనుపాలు ఇచ్చిందని చెబుతారు. అప్పటి నుండి ఆమె పాలు త్రాగి కాగపుజందర్ పెద్దవాడయ్యాడని తెలుస్తున్నది. ఆనాటి సిద్ధపురుషులలో ప్రముఖుడిగా చెప్పబడిన కలాంగినాధర్ స్వయంగా కాకపుజందర్ ఇంటికి వచ్చి అతడికి గురుదీక్ష ఇచ్చాడు. అప్పటికి కాగపుజందర్ వయస్సు కేవలం ఐదు సంవత్సరాలు కావటం విశేషం.

కాగపుజందర్ తన చిన్నతనం నుండి మానవుల పట్ల అపారమైన ప్రేమాభిమానాలను ప్రదర్శిస్తూ ఉండేవాడు.

సిద్ధయోగులు ఇప్పటికీ అదృశ్యరూపంలో ఈ ప్రపంచంలో సంచరిస్తూ ఉంటారని చెబుతారు. ఒక విశేషం ఏమంటే 60 మానవ సంవత్సరాలను ఒక "మహాసిద్ధ సంవత్సరం" అని పిలుస్తారు. గతంలో అనగా 11 సంవత్సరాల క్రితం వరకు "కొరక్కర్" అనే సిద్ధయోగి, నవ సిద్ధులకు అధిపతిగా ఉండేవాడు. మొత్తం 18 మంది సిద్ధయోగులలో 9 మందిని అతిశక్తివంతులైన నవసిద్ధులుగా వర్గీకరించారు. ఆ నవసిద్ధులలో ప్రతి ఒక్క సిద్ధుడూ 60 మహాసిద్ధ సంవత్సరాలపాటు, మిగిలిన 8 మంది సిద్ధులకు అధిపతిగా ఉంటాడు. ప్రస్తుతం కాగపుజందర్ ఈ సిద్ధులకు అధిపతిగా ఉన్నాడని చెబుతారు.

కాగపుజందర్ మంత్రము :

**॥ఓం శ్రీ బగులదేవి సమేత శ్రీ కాగపుజందర్ దేవాయ నమః॥**

**కాగపుజందర్ నాడి :**

తెలుగు దేశానికి చెందిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి రచించిన కాలజ్ఞానం మానవులయొక్క, దేశాలయొక్క భవిష్యత్తును ఏవిధంగా అయితే తెలియజేస్తుందో, అదేవిధంగా కాగపుజందర్ రచించిన నాడీగ్రంధాలు ప్రపంచ భవిష్యత్తును తెలియజేస్తాయి.

కాగపుజందర్ తమిళ భాషలో అనేక గ్రంధాలను తాళపత్రాలపై వ్రాసాడు. అయితే వాటిలో చాలా భాగం కాలగర్భంలో కలిసిపోయాయి. కొద్దిగా మిగిలిన గ్రంధాలలోని సమాచారాన్ని కొంతమంది మహాపండితుల సహకారంతో కాగితాలమీదకు మార్చటం జరిగింది. ఇలా తయారు చేయించబడిన గ్రంధాలలో భవిష్యత్తును తెలియజేసే నాడీ గ్రంధాలుకూడా ఉన్నాయి.

మానవుల భవిష్యత్తుని తెలియజేసే నాడీ శాస్త్రాలలో కాగపుజందర్ వ్రాసిన నాడీశాస్త్రంకూడా ఒకటి. ప్రపంచంలో ఇంతవరకు వచ్చిన మరియు రాబోతున్న అనేక రకాల ప్రకృతి విపత్తులు కాగపుజందర్ వ్రాసిన నాడీశాస్త్రంలో కనపడటం విశేషం.

కాగపుజందర్ చెప్పిన జోస్యాలలో కొన్ని ఇప్పటికే నిజం అయ్యాయి. మరికొన్ని భవిష్యత్తులో నిజం అవుతాయి అని అనేకమంది విశ్వసిస్తున్నారు. ఒక విశేషం ఏమంటే 2004వ సంవత్సరంల చెన్నై ప్రాంతాన్ని తాకిన సునామి గురించి కొన్నివేల సంవత్సరాల క్రితమే కాకపుజందర్ తన నాడీగ్రంధంలో పేర్కొన్నాడు.

చాలాకాలంపాటు వర్షాలు కురవని పరిస్థితులు ఏర్పడతాయని, ఆ తరువాత కుంభవృష్టి కురిసి, వరదలు వచ్చి దక్షిణ భారతదేశంలోని నగరాలను జలసమాధి చేస్తాయని కాగపుజందర్ పేర్కొన్నాడు.

ఒక దశలో యాంత్రిక వాహనాలను నడిపే ఇంధనం (ఫ్యూయల్) దొరక్క ఆ వాహనాలు ఎవరూ వాడని పరిస్థితి వస్తుందని, చివరికి పాత వాహనాలు (కార్లు, బైక్‌లు) తూకానికి అమ్మబడతాయని కాగపుజందర్ పేర్కొనటం విశేషం. వాహనాలు నడపటానికి కావలసిన డీజల్, పెట్రోల్‌ను సముద్ర గర్భాల నుండి బయటకు తీసే రిగ్గులు ఒక మహా భూకంపం కారణంగా నాశనం అయిపోతాయని ఫలితంగా యంత్రాలు నడపటానికి, వాహనాలు నడప టానికి అవసరమైన ఇంధనం దొరక్కుండా పోతుందని కొన్నివేల సంవత్సరాల క్రితమే కాగపుజందర్ తెలియజేయటం ఒక విచిత్రంగా భావించక తప్పదు.

కాగపుజందర్ చెప్పిన వివరాల ప్రకారం చూసినట్లయితే క్రీ.శ.2020 సంవత్సరంలో దక్షిణ భారతదేశంలో తీవ్రమైన ప్రకృతి ఉత్పాతాలు సంభవిస్తాయని, ఫలితంగా సముద్ర తీరంలో ఉండే చెన్నై, విశాఖపట్టణం లాంటి మహానగరాలలో చాలాభాగం సముద్రంలో మునిగిపోతాయని తెలుస్తున్నది. ఆ సమయంలో అంతరిక్షంలో సంచరించే ఉపగ్రహాలు పై నుంచి క్రిందకి పడిపోతాయని కాగపుజందర్ తెలియజేసాడు.



శ్రీ బగులదేవి సమేత శ్రీ కాగపుజందర్

భవిష్యత్తులో ఒక సమయంలో ఓజోన్ పొరను చీల్చుకుని ఒక విధమైన కాంతికిరణాలు భూమిమీద ఉండే మనుషులపై పడతాయని, ఆ కిరణాల ప్రభావం వల్ల మానవుల చర్మాలు కాలిపోతాయని అప్పుడు "సంజీవనీ తైలం" అనే నూనెను చర్మంపై పూసుకోవటం వల్ల ఆ విచిత్ర కిరణాల యొక్క చెడు ప్రభావం తొలగి పోతుందని, కర్నాటకలో ఉండే దట్టమైన అడవులలో దొరికే 18 రకాల వనమూలికలతో ఈ సంజీవనీ తైలం తయారుచెయ్యాలని కాగపుజందర్ తెలియజేసాడు.

భారతదేశంలో ఒక సమయంలో తీవ్రమైన భూకంపం సంభవిస్తుందని, ఆ తరువాత అతి భయంకరమైన ఒక తుఫాను వస్తుందని ఫలితంగా ఉత్తర భారతదేశంలో ఉన్న గంగానది, దక్షిణభారతదేశంలో

ఉన్న కావేరి నది కలిసిపోతాయని ఫలితంగా లక్షలాది మంది ప్రజలు జలసమాధి అవుతారని కాగపుజందర్ జోస్యం చెప్పాడు. ఆ సమయంలోనే భారతదేశం రెండు ద్వీపాలుగా విడిపోతుందని ఒక ద్వీపంలో ఉత్తర భారతదేశం, ఒక ద్వీపంలో దక్షిణ భారతదేశం ఉంటాయని కాగపుజందర్ తన నాడీ గ్రంథంలో పేర్కొన్నాడు. అయితే ఆయన చెప్పిన ప్రళయం 2020 సంవత్సరంలో వస్తుందా? లేక 2060లో వస్తుందా? అన్న విషయం స్పష్టంగా ఎవరికీ తెలియటంలేదు.

ఈయన తమిళనాడులోని త్రిచి పట్టణానికి దగ్గరలో ఉన్న "ఉరైయూర్" అనే ప్రదేశంలో సజీవ సమాధి అయ్యాడు.

## 16. మహావతార్ బాబాజీ చెప్పిన "విశ్వసర్పశ్వాస" వివరములు?

'ఈనాటికీ హిమాలయాలలో అదృశ్యరూపునిగా సంచరిస్తున్నాడు' అని చెప్పబడుతున్న మహావతార్‌బాబాజీ, మానవజాతి అభ్యుదయం కోసం అందించిన ఒక అపూర్వమైన వరం "క్రియాయోగం". 'క్రియాయోగం అంటే ఎవరిని వారు తెలుసుకోవటం' అనిఅర్థం. నిజానికి క్రియాయోగం ఒక సైన్స్ అని చెప్పాలి. ఈ క్రియాయోగంలో అత్యున్నత స్థాయికి చెందిన ఒక యోగప్రక్రియను "విశ్వ సర్ప శ్వాస ప్రక్రియ (కాస్మిక్ కోబ్రా బ్రీత్)" అని పిలుస్తారు. అతి పవిత్రమయిన మరియు అతి రహస్యమైన ఈ శ్వాస ప్రక్రియను మహావతార్‌బాబాజీ తన శిష్యులకు మొదటిసారిగా బోధించాడు. ఆ తరువాత కాలంలో ఆ శిష్యులు, తమ శిష్యులకు ఈ ప్రక్రియను అందజేసారు.

మానవశరీరంలో దాగిఉండే శృంగార సామర్థ్యాన్ని (ఊర్ధ్వరేతస్సు) కుండలిని శక్తిని నిద్రలేపటంకోసం ఉపయోగించే ఒక తాంత్రిక యోగమార్గాన్ని విశ్వసర్ప శ్వాస (కాస్మిక్ కోబ్రా బ్రీత్స్) అని పిలుస్తారు.

వేలాది సంవత్సరాలుగా భారతదేశానికి చెందిన ఎందరో మహర్షులు ఈ విధానం ద్వారా కుండలిని సాక్షాత్కారాన్ని పొందారని తెలుస్తున్నది. ఈ విధానంలో 7 స్థాయిలు ఉంటాయి. ఒక్క గురువు ద్వారా మాత్రమే ఈ శ్వాస విధానాన్ని నేర్చుకోవాలని తెలుస్తున్నది.

సాధారణ మానవులు శృంగారంలో పాల్గొన్నప్పుడు వారిలోని శృంగార శక్తి వీర్యంద్వారా బయటకు వెళ్ళిపోతుంది. ఫలితంగా మానవులు బలహీన పడతారు. అయితే యోగులు ఆ శృంగార శక్తిని తమ శరీరంలోని పై భాగాలకు పంపిస్తారు (దీనినే ఊర్ధ్వ రేతస్ అని పిలుస్తారు).

ఈ కాస్మిక్ కోబ్రా బ్రీత్ అనే ప్రక్రియ గురువు నుండి శిష్యుడికి తెలుస్తుంది. ఈ ప్రక్రియ ఎక్కడా వ్రాత రూపంలో కనపడదు. "కాస్మిక్ కోబ్రా బ్రీత్" అనే యోగ ప్రక్రియలో మొదటి స్థాయిలోనే మానవుడి నుదిటి భాగంలో ఉన్న "అజనచక్రాన్ని" (దీనినే మూడవ కన్ను అనికూడా పిలుస్తారు) చాలా వేగంగా తెరిచే విధానం నేర్పబడుతుంది. ఇక ఈ విశ్వ సర్ప శ్వాస ప్రక్రియలోని రెండవ స్థాయిలో మనిషిలో ఉండే స్త్రీ/పురుష శక్తులను సమతౌల్యంలోకి తీసుకువచ్చి ఆపై దిగువగా ఉండే మూడు శక్తి కేంద్రాలను (చక్రాలను) శుద్ధిచేసే పద్ధతి బోధించ బడుతుంది.



"కాస్మిక్ కోబ్రా బ్రీత్"

ఇక మానవునిలోని హృదయ ప్రాంతంలో మరియు కంఠ ప్రాంతంలో ఉండే 4, 5 చక్రాలను తెరచి, ఆపై వెన్నుముక గుండా వెళ్ళే కేంద్రమార్గాన్ని తెరచి ఆ మార్గం గుండా కుండలినీశక్తి పైకి వెళ్ళేలాచేసే ప్రక్రియను "కాస్మిక్

కోబ్రా బ్రీత్" మూడవ స్థాయిలో బోధిస్తారు.

నడినెత్తిన ఉండే ఏడవ చక్రాన్ని తెరచి ఆపై జీవాత్మతో పరమాత్మను కలిపే ప్రక్రియను "కాస్మిక్ కోబ్రా బ్రీత్" నాల్గవ స్థాయిలో నేర్పిస్తారు.

మొత్తం ఉన్న 7 స్థాయిలలో 4 స్థాయిలు గురువు ద్వారా నేర్చుకోవాలి. మిగిలిన మూడు స్థాయిలను శిష్యుడు తన వ్యక్తిగత సాధనల ద్వారా సాధించాల్సి ఉంటుంది.

మహావతార్ బాబాజీ ప్రబోధించిన "క్రియాయోగం"లో 5 విభాగాలు ఉంటాయి. అవి ఏమిటంటే....

1. క్రియా హఠయోగం 2. క్రియా కుండలినీ ప్రాణాయామం 3. క్రియా ధ్యానయోగం 4. క్రియామంత్రయోగం 5. క్రియా భక్తియోగం.



## 17. మహాయోగి సమర్థరామ్‌దాస్ స్వామి జీవిత విశేషములు?

మానవజాతిని జ్ఞానమార్గంవైపు మళ్ళించిన మహాపురుషులలో శ్రీ సమర్థరామ్‌దాస్ ఒకరు. ఈయన భౌతికదేహం చాలించి ఇప్పటికీ 4 శతాబ్దాలు గడిచినప్పటికీ ఆయన బోధనలు ఇప్పటికీ భారతదేశం అంతటా సజీవంగా ఉండటం విశేషం. ఆనాటి మహారాష్ట్ర ప్రజలలో చైతన్యాన్ని కలిగించిన శ్రీసమర్థరామ్‌దాస్ జీవితంలో అనేక అద్భుత సంఘటనలు జరిగాయి. సమర్థరామదాస్ ఆవిర్భవించేనాటికి మహారాష్ట్ర ప్రజలలో జ్ఞానం అడుగంటింది. అక్కడి ప్రజలు విధివ్రాతను నమ్ముతూ, ఏవిధమైన ప్రయత్నాలు చెయ్యకుండా అచేతనులుగా ఉన్నారు. అదేసమయంలో ఇస్లాంమత దురాక్రమణదారుల కారణంగా ఆ ప్రాంతంలో పెద్దస్థాయిలో మతమార్పిడీలు జరిగాయి. హిందూ మతానికి చాలా గడ్డురోజులు ఏర్పడ్డాయి. అలాంటి సమయంలో ఒక మహాపురుషుడు ఆ మరాఠా భూమిమీద ఆవిర్భవించాడు. అతడే శ్రీసమర్థ రామ్‌దాస్.

మహారాష్ట్రలోని గోదావరి నది ఒడ్డున ఉన్న జంబ్ (ఈ జంబ్‌గ్రామం నేడు మహారాష్ట్రలోని జల్నా జిల్లాలో ఉన్న అంబాద్ తాలూకాలో ఉన్నది.) అనే గ్రామంలో క్రీ.శ.1608వ సంవత్సరంలో చైత్రమాసంలో శ్రీరామనవమినాడు ఒక సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో ఈ సిద్ధపురుషుడు జన్మించాడు. ఈయన తండ్రి పేరు సూర్యాజిపంత్, తల్లిపేరు రాణుబాయ్. పుట్టినప్పుడు రామ్‌దాస్‌కి తల్లిదండ్రులు పెట్టినపేరు నారాయణ్ సూర్యాజి దోసర్.

నారాయణ్ సూర్యాజికి గంగాధర్ అనే అన్నకూడా ఉన్నాడు. నారాయణ్ వంశస్తులు తరతరాలుగా సూర్యుడిని మరియు రాముడిని ఆరాధిస్తూ ఉండేవారు. ఆ కారణంగానే రామ్‌దాస్‌కి ఆయన తండ్రి నారాయణ్ సూర్యాజి అన్నపేరు పెట్టటం జరిగింది.

బాల్యం నుండి నారాయణ్‌సూర్యాజి శరీరక వ్యాయామాలుచేస్తూ కఠినమైన శరీరబలం అవసరమైన కబాడి లాంటి ఆటలు ఆడుతూ తన శరీర సౌష్టవాన్ని బాగా అభివృద్ధి చేసుకున్నాడు. ఫలితంగా ఆయన బలిష్టమైన దేహాన్ని కలిగి ఉండేవాడు. ఆ బలానికి తగినట్లుగా చక్కటి మేధాశక్తికూడా ఆయనకు ఉండటం విశేషం. మొదటి నుండి నారాయణ్ దైవభక్తిని కలిగి ఉండేవాడు. నైతిక విలువల పట్ల ఆయనకు ఎంతో నిబద్ధత ఉండేది. ఆయన చిన్నతనం నుండి హనుమంతుడిని మరియు శ్రీరాముడిని పూజిస్తూ ఉండేవాడు.

నారాయణ్ సూర్యాజికి 11 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఒకరోజు శ్రీరాముడు స్వయంగా అతనికి దర్శనమిచ్చి ఇలా చెప్పాడు. "నీవు వెంటనే గోదావరీ నదీప్రాంతానికి చేరుకుని అక్కడ ధర్మాన్ని పునరుద్ధరించే కార్యక్రమాన్ని చేపట్టు. అతి త్వరలో శిశోదియా వంశంలో ఒక మహాపురుషుడు జన్మించ బోతున్నాడు. అతనికి మార్గదర్శకత్వం నీవే చెయ్యాల్సి ఉన్నది".

ఆ కాలంలో మగపిల్లలకి మరియు ఆడపిల్లలకి చాలా చిన్న వయస్సులోనే వివాహం చేసేవారు. ఆ సాంప్రదాయం ప్రకారమే నారాయణ్ సూర్యాజికి కూడా అతని 12వ సంవత్సరంలో వివాహ ప్రయత్నాలు ప్రారంభించారు. వివాహ తంతు ప్రారంభం అయ్యింది. పెళ్ళి ప్రమాణాల చెప్పే సందర్భంలో పురోహితుడు "సావధాన్" (జాగ్రత్త) అన్నపదం ప్రయోగించాడు. ఆ మాట వినగానే నారాయణ్ సూర్యాజికి ఒళ్ళు జలదరించింది. వివాహ బంధంతో కట్టుబడవద్దని, జాగ్రత్త పడమని ఆ భగవంతుడు తనని పురోహితుడు ద్వారా "సావధాన్" (జాగ్రత్త) అని చెప్పి హెచ్చరించాడని నారాయణ్ సూర్యాజికి అనిపించింది. దాంతో ఆయన పెళ్ళి పీటలమీద నుండి లేచి బయటకు పరుగెత్తాడు. అలా పరుగు ప్రారంభించిన నారాయణ్ సూర్యాజి నేరుగా గోదావరి తీరంలో ఉన్న పంచవటి క్షేత్రానికి (నేడు మహారాష్ట్రలోని నాసిక్ జిల్లాలో ఉన్నది) చేరుకున్నాడు. (త్రేతాయుగంలో తన వనవాస సమయంలో శ్రీరాముడు, సీత మరియు లక్ష్మణ సమేతుడై ఆ ప్రాంతంలోనే 13 సంవత్సరములపాటు కాలం గడిపాడని రామాయణ గ్రంథంలో చెప్పబడి ఉన్నది.) పంచవటీ క్షేత్రంలో కొద్ది రోజులపాటు ఉండి శ్రీరాముడిని ధ్యానించాడు. ఆ తరువాత అక్కడి నుండి నాసిక్ పట్టణానికి దగ్గరలో ఉన్న టాక్లీ అనే గ్రామానికి చేరుకున్నాడు. గోదావరి మరియు నందిని నదులు సంగమించే ప్రదేశంలో ఈ టాక్లీ గ్రామం ఉన్నది.

ఈ ప్రాంతంలో దాదాపు 12 సంవత్సరాలపాటు కాలంగడిపాడు నారాయణ్ సూర్యాజి. ఇక్కడ ఉన్న సమయంలో ఆయన ప్రతిరోజూ సూర్యోదయానికి ముందే నిద్రలేచి ఆపై శారీరక వ్యాయామంచేసి ఆ తరువాత ఆ నదీ సంగమంలో ఛాతీవరకు నీళ్ళలోదిగి ఆపై రామనామాన్ని జపిస్తూ మధ్యాహ్నందాకా నీళ్ళలోనే ఉండేవాడు. ఒకవిధంగా చెప్పాలంటే ఆయన జలతపస్సు చేసేవాడు అన్నమాట. ఆ తరువాత ఆయన నదిలోంచి బయటకువచ్చి అక్కడికి దగ్గరలో ఉన్న రామాలయానికి వెళ్ళి ఆధ్యాత్మిక

గ్రంధాలను పఠించేవాడు. సాయంత్ర సమయంలో ఆ ఆలయంలో జరిగే ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. రాత్రి సమయంలో ఆ ఆలయంలో జరిగే రామ భజనలను ఎంతో ప్రీతితో ఆలకించేవాడు. బాగా రాత్రి అయిన తరువాత శ్రీరాముడిని తలచుకుని నిద్రలోకి జారుకునేవాడు. ఈవిధమైన ఆధ్యాత్మిక జీవితాన్ని 12 సంవత్సరాలపాటు గడిపిన తరువాత ఒకరోజున శ్రీరాముడు ఆయనకు ప్రత్యక్షం అయి ఆయనను ఒక కొత్త మతాన్ని ప్రారంభించమని ఆజ్ఞ ఇచ్చాడు.

భగవంతుడు అయిన శ్రీరాముడిని తన భక్తితో ప్రత్యక్షం చేసుకున్న నారాయణ్ సూర్యాజిని ఎంతగానో అభిమానించిన ఆ ప్రాంతం ప్రజలు ఆయనను అప్పటి నుండి "సమర్ధరామదాస్" అని ఆప్యాయంగా పిలవటం ప్రారంభించారు.

ఆ తరువాత క్రీ.శ. 1632లో సమర్ధరామదాస్, టాక్లీ గ్రామాన్ని వదిలి పెట్టి అక్కడి నుండి తన ఆధ్యాత్మిక ప్రయాణాన్ని ప్రారంభించాడు. ఆ ప్రయాణంలో భాగంగా ఆయన భారతదేశం అంతటా విస్తృతంగా సంచరించాడు. దేశంలో ప్రజల్ని పీడిస్తున్న కరువు, కాటకాలను అంచనా వేసాడు. భారతదేశంలోని హైందవ ప్రజల్ని ఇస్లాం మతంలోకి మారమని వేధిస్తున్న ఇస్లాంమత దురాక్రమణదారుల్ని పరిశీలించాడు.

ఈ ప్రతికూల పరిస్థితులవల్ల ప్రజలలో ఆత్మవిశ్వాసం నశించింది. ప్రజలు ప్రతిదానికీ విధివ్రాతమీద, అదృష్టంమీద ఆధారపడే బలహీన స్థితికి చేరుకున్నారు. ఇలాంటి పరిస్థితిలో ఉన్న ప్రజల్ని ఉద్ధరించాలని నిర్ణయించుకున్నాడు సమర్ధరామదాస్. భగవంతుడు అయిన హనుమంతుని పై విశ్వాసం ఉంచి మానవులు తమ ధర్మాన్ని సమర్ధవంతంగా నిర్వహించాలని, అప్పుడే వారి జీవితాలలో వెలుగులు వస్తాయని, సంపదలు వస్తాయని సమర్ధరామదాస్ ప్రబోధించాడు.

ఆ తరువాత ఆయన గ్రామ గ్రామాన హనుమంతుడి ఆలయాలను నిర్మింపచేసాడు. శ్రీరామనవమి ఉత్సవాలు హైందవ జాతి ప్రజలు

సాముహికంగా జరుపుకునే ఉత్సవాలుగా మార్చాడు. గ్రామీణ ప్రాంతాలల్లో ఉండే యువకులకు శారీరక బలంయొక్క ప్రాధాన్యతను తెలియజేసి వారిచేత క్రమం తప్పకుండా వ్యాయామాలుచేయించాడు. "బలం ఉన్నవారు మాత్రమే తన శత్రువుని ఎదుర్కొని ఓడించగలడు. ఈనాడు మన ప్రజలపై బలవంతులైన ఇస్లాం దురాక్రమణవాదులు దాడులు చేస్తున్నారు. వాళ్ళ దుర్మార్గాలు ఎదుర్కోవాలంటే మనంకూడా శారీరకంగా బలంగా ఉండాలి" అని సమర్ధరామదాస్ ఆనాటి భారతీయ యువకుల్ని ఉత్తేజ పరచాడు.

మానవ సమాజంలో స్త్రీకి ఎంతో ప్రాధాన్యత ఉన్నదని సమర్ధరామదాస్ ఉద్ఘాటించాడు. స్త్రీలు అన్ని రంగాల్లోకీ వచ్చినప్పుడే దేశం అభివృద్ధి పథంలో పయనిస్తుందని ఒక్కాణించారు. ఆయనకు 18మంది సమర్ధులైన స్త్రీ శిష్యులు ఉన్నారు. వారిలో మీరజ్ మరియు అక్కాబాయ్ లాంటివారు ముఖ్యులని చెప్పవచ్చు.

సమర్ధ రామదాస్ కులవ్యవస్థను ఖండించాడు. "భగవంతుడి సృష్టిలో మానవులంతా సమానులే" అని ఆయన ఉద్ఘాటించారు. సమర్ధ రామదాస్ నిజమైన లౌకికవాది మరియు సమతావాది అని చెప్పటంలో సందేహం లేదు.

**గురుదత్తాత్రేయ దర్శనం :**

సమర్ధ సాంప్రదాయానికి మరియు దత్త సాంప్రదాయానికి విడదీయ లేని సంబంధం ఉన్నది. సమర్ధ సాంప్రదాయ సంస్థలో సభ్యుడు అయిన హనుమంత్ స్వామి తన గ్రంథంలో వ్రాసుకున్న సమాచారం ప్రకారం సమర్ధ రామదాస్‌కి దత్తాత్రేయ దర్శనం జరిగినట్లుగా తెలుస్తున్నది. ఆ వివరాలు ఇలా ఉన్నాయి......

ఒకసారి సమర్ధ రామదాస్ తన శిష్యులైన ఉద్ధవ్ మరియు కళ్యాణ్‌తో కలిసి శ్రీ దత్తాత్రేయ దర్శనంకోసం మహర్‌గడ్‌కి వెళ్ళాడు. ఆ సమయంలో అక్కడ ఉన్న ఆలయ పరిసరాలలో కొంతమంది బ్రాహ్మణులు ధ్యానం

చేస్తున్నారు. సమర్ధ రామదాస్ వారివద్దకువెళ్ళి వారిని ఇలా అడిగాడు. "మీరు ఏ కారణంచేత ఇక్కడ ధ్యానం చేస్తున్నారు?". అప్పుడు ఆ బ్రాహ్మణులలో ఒకడు ఇలా సమాధానం చెప్పాడు "మేము శ్రీ దత్తాత్రేయ దర్శనంకోసం ఇక్కడ ధ్యానం చేస్తున్నాము". ఆ మాట విన్న సమర్ధ రామదాస్‌కి ఎంతో ఆనందం వేసింది. తానుకూడా అక్కడ కూర్చుని ధ్యానం చేసినట్లయితే తనకి కూడా శ్రీదత్తాత్రేయ దర్శనం లభిస్తుందని భావించిన సమర్ధ రామదాస్ ఆ బ్రాహ్మణులకు కొంచెం దూరంలో కూర్చుని దత్తాత్రేయుడిని ధ్యానిస్తున్నాడు. సమర్ధ రామదాస్‌తో పాటు వచ్చిన ఆయన శిష్యులు ఇద్దరూ కూడా ఆయన ప్రక్కనే కూర్చుని దత్తదర్శనంకోసం ధ్యానం ప్రారంభించారు. అక్కడ కూర్చున్న అందరూ ధ్యానంలో నిమగ్నమై ఉన్నారు. చాలాసేపు గడిచిన తరువాత ఒక బోయవాడు తన భార్య, ముగ్గురు కుమారులు, ఆరు కోళ్ళు, తొమ్మిది మేకలు, ఒక దున్నపోతుతో కలిసి అక్కడికి వచ్చాడు. ఆ తరువాత ఆ బోయవాడు తన భార్యతో ఇలా అన్నాడు. "నాకు చాలా ఆకలిగా ఉన్నది. వెంటనే ఏదైనా వండిపెట్టు". బోయవాడు చెప్పినమాట విన్న అతని భార్య వెంటనే అక్కడే ఒక పొయ్యిపెట్టి దానిమీద ఒక పెద్ద గిన్నె పెట్టింది. ఆ తరువాత ఆ పొయ్యిక్రింద మంట పెట్టింది. భర్తకి వండిపెట్టటంకోసం తాము తెచ్చిన ఆరు కోళ్ళను కోసి ఆ గిన్నెలో వేసింది. ఆ తరువాత దాంట్లో ఒక బిందెడు నీళ్ళు పోసింది. ఆరు కోళ్ళు వేసినా ఆ గిన్నెకు సగానికికూడా రాలేదు. దాంతో ఆమె తన భర్తను ఇలా అడిగింది. "ఆరు కోళ్ళు వేసినా గిన్నె సగానికి కూడా లేవు". అప్పుడు ఆ బోయవాడు ఇలా అన్నాడు. "ఆ తొమ్మిది మేకల్నికోసి గిన్నెలో వేసెయ్". ఆమె అలాగే చేసింది. అయినా గిన్నె నిండలేదు. ఆమాటే భర్తతో చెప్పింది. అప్పుడు ఆ బోయవాడు ఇలా అన్నాడు. "ఆ దున్నపోతుని కూడా కోసి గిన్నెలో వేసెయ్". ఆమె అలాగే చేసింది. అయినా గిన్నె నిండలేదు. అప్పుడు ఆమె భర్తతో ఇలా అన్నది. "ఇంకా గిన్నె నిండలేదు. ఏం చెయ్యమంటావ్?". అప్పుడు ఆ బోయవాడు ఇలా అన్నాడు. "మన పిల్లలు ముగ్గురిని నరికి ఆ గిన్నెలో వెయ్". ఆమె ఏమాత్రం ఆలోచించకుండా భర్త చెప్పినట్లే చేసింది.

అయినా ఆ గిన్నె నిండలేదు. ఆమెకు చాలా విసుగు పుట్టింది. ఆపై ఆమె భర్తతో ఇలా అన్నది. "మనం తెచ్చినవన్నీ గిన్నెలో వేసాను. అయినా గిన్నె నిండలేదు. నన్ను ఏం చెయ్యమంటావ్?".

అప్పటివరకు జరుగుతున్న అక్కడ ఈ భీభత్స కార్యక్రమాన్ని అక్కడ ఉన్న బ్రాహ్మణులు మరియు సమర్ధ రామదాస్, అతని శిష్యులు ఆశ్చర్యంగా గమనిస్తున్నారు. తాము చేస్తున్న పనులను విచిత్రంగా చూస్తున్న వారిని చూసి ఆ బోయవాడు తమాషాగా నవ్వాడు. ఆ తరువాత బొంగురు గొంతుకతో తన భార్యతో ఇలా అన్నాడు. "అదిగో అక్కడ కూర్చుని మనకేసి చూస్తున్నారే ఆ ఆరుగురు బ్రాహ్మణులను నరికి గిన్నెలో వెయ్. ఈ సారి గిన్నె ఖచ్చితంగా నిండిపోతుంది". భర్త చెప్పిన ప్రకారమే చెయ్యాలని ఆ భార్య తన చేతిలో ఉన్న కత్తితో ఆ బ్రాహ్మణులవైపు వేగంగా నడిచింది. రక్తం ఓడుతున్న కత్తిని చేతిలో పట్టుకుని తమవైపు మృత్యుదేవతలా వస్తున్న ఆ బోయవాడి భార్యనుచూసి బ్రాహ్మణులు తమ చేతులలోని జపమాలలను దూరంగా పారవేసి, ఆపై ప్రాణభయంతో వణకిపోయి పెద్దగా అరుస్తూ అక్కడ నుండి పరుగెత్తారు. ఇంత జరుగుతున్నా సమర్ధ రామదాస్ మరియు ఆయన శిష్యులు ఏమాత్రం చలించకుండా ఆ ప్రదేశంలోనే కూర్చుని ఉన్నారు. అప్పుడు ఆ బోయవాడి భార్య తన చేతిలోని కత్తితో ఆ ముగ్గురిని నరకాలని వారివైపుకు వచ్చింది. వారు ముగ్గురూ ఏమాత్రం సంకోచించ కుండా తమ తలలు నరకమన్నట్లుగా తలలు వంచారు. అంతే, అప్పుడు ఒక అద్భుతం జరిగింది. అది ఏమిటంటే అప్పటి వరకు అక్కడ ఉన్న బోయవాడు, అతని భార్య మరియు అక్కడ పెట్టిన పొయ్యి మాయం అయిపోయాయి. ఆ ప్రదేశంలో పౌర్ణమి చంద్రుడి వెన్నెలను చిందిస్తున్న చిరునవ్వుతో దత్తాత్రేయుడు ప్రత్యక్షం అయ్యాడు.

సమర్ధరామదాస్, దత్తాత్రేయుడికి నమస్కరించి ఆపై ఆయనతో ఇలా అన్నాడు. "దత్తస్వామి! నీ దర్శనం కలిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది. కానీ నీ దర్శనంకోసం ధ్యానం ప్రారంభించిన ఆ బ్రాహ్మణులు నీ

దర్శనం పొందకుండానే నీ మాయ కారణంగా ఇక్కడి నుండి పారిపోయారు. వాళ్ళకి నీ దర్శనం కలగకపోవటం నాకు చాలా బాధను కలిగిస్తున్నది". అప్పుడు దత్తాత్రేయుడు చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు. "ఆ బ్రాహ్మణులు నా దర్శనం పొందటానికి అర్హులుకాదు. అందుకే నా మాయచేత వాళ్ళని భయపెట్టి ఇక్కడ నుండి పారిపోయేలా చేసాను. నీవు అంతగా పట్టుపడితే వాళ్ళకు కూడా నా దర్శనం ఇస్తాను". తనపట్ల దత్తాత్రేయుడు చూపిస్తున్న దయకు సమర్థ రామదాస్ ఎంతగానో పొంగి పోయాడు. ఆ తరువాత ఆయన తన శిష్యులను పిలిచి, పారిపోయిన ఆ బ్రాహ్మణులను తిరిగి తీసుకురమ్మని చెప్పాడు. ఆ శిష్యులు, బ్రాహ్మణుల్ని సమర్థ రామదాస్ వద్దకు తీసుకువచ్చారు. అప్పుడు సమర్థ రామదాస్, దత్తాత్రేయుడు వాళ్ళకు పరీక్ష పెట్టిన విషయం వాళ్ళకు తెలియజేసాడు.

"దత్తుడి దర్శనం పొందాలంటే ఆయన పెట్టే కఠిన పరీక్షల్లో నెగ్గాల్సి ఉంటుంది అని తెలిసి కూడా తాము ఆ బోయవాడి ఆర్భాటంచూసి భయపడి పారిపోయాం. అది మా తప్పు" అని ఆ బ్రాహ్మణులు, సమర్థ రామదాస్‌తో అన్నారు. అప్పుడు సమర్థ రామదాస్ వారికి దత్తాత్రేయ మంత్రాన్ని ప్రసాదించి ఆ మంత్రాన్ని శ్రద్ధతో సాధన చెయ్యమని, ఆపై దత్తాత్రేయ దర్శనం పొందమని వారితో చెప్పాడు. ఆ బ్రాహ్మణులు, సమర్థ రామదాస్ చెప్పిన ప్రకారమే నిశ్చల భక్తితో కొంతకాలంపాటు దత్తమంత్రాన్ని అదే ఆలయం వద్ద జపం చేసారు. చివరికి ఒకరోజున దత్తాత్రేయుడు వారికి ప్రత్యక్షం అయి వారిని అనుగ్రహించాడు.

సమర్థ రామదాస్, దత్తాత్రేయునిపై ఒక హారతి రచించాడు. అందుకు ఎంతగానో సంతోషించిన దత్తాత్రేయుడు తన పాదుకలను సమర్థ రామదాస్‌కి ప్రసాదించాడు. సాజన్‌ఘడ్‌లో ఉన్న సమర్థ రామదాస్ సమాధికి దగ్గరలో ఇప్పటికీ ఆ పాదుకలు భక్తులకు దర్శనమిస్తున్నాయి.

బోయవాడిరూపంలో దత్తుడు పెట్టిన పరీక్షకు అర్థం ఇలా ఉందని పండితులు తెలియజేస్తున్నారు....

పొయ్యిమీద ఉన్న గిన్నెలో, ఆరు కోళ్ళను నరికి వెయ్యమని బోయవాడు చెప్పటంలో అర్ధమేమంటే "అరిషడ్వర్గములను నశింప చేయమని. (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరం- అనే ఆరు భౌతిక దేహ సంబంధ దుర్గుణాలనే అరిషడ్వర్గములు అంటారు). దున్నపోతును నరికి గిన్నెలో వెయ్యి అంటే "అహం"ను నశింపచేయమని అర్థం. ముగ్గురు బిడ్డల్ని నరికివేయమని అంటే సత్వ, రజ, తమో గుణములను తొలగించుకుని గుణరహితుడుగా ఉండమని అర్థం. ఆరు మేకల్ని నరికివేయమని అంటే శరీర వ్యామోహాన్ని తొలగించుకోమని అర్థం. బోయవాడి భార్య "మాయ"కు ప్రతీక. ఈ మాయ మనిషిని కప్పి ఉన్నంత వరకు మనిషికి దైవంపై దృష్టి మళ్ళదు. "మనిషిని దైవానికి దూరంచేసే చెడుగుణాలను నశింపచేసుకున్నప్పుడే మనిషి దైవాన్ని చూడగలడు'' అని సూచించటం కోసమే దత్తాత్రేయుడు, ఈ మాయను ప్రదర్శించాడని గుర్తించాలి.



శ్రీ సద్గురు రామదాస్

మొగల్ చక్రవర్తుల దురాగతాలను ఎదుర్కొని హైందవ మతాన్ని పునరుద్ధరించిన ఘనత మరాఠా చక్రవర్తి అయిన శివాజీకి దక్కుతుంది. శ్రీ సమర్ధ రామదాస్ బోధనల కారణంగానే శివాజీలో హైందవ మతం పట్ల, భారత దేశం పట్ల అపారమైన భక్తి విశ్వాసాలు ఏర్పడ్డాయి. సమర్ధ రామదాస్‌ను తన గురువుగా భావించిన శివాజీ ఆయన పాదుకలను తన సింహాసనంమీద ఉంచి తాను ఆ సింహాసనానికి ప్రతినిధిగా మరాఠా సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. సమర్ధ రామదాస్ బోధనల

కారణంగానే శివాజి తన చిహ్నంగా కాషాయరంగు జెండాను ఎంచుకున్నాడు.

సమర్ధ రామదాస్ చాలా విచిత్రంగా ప్రవర్తిస్తూ ఉండేవాడు. పైకి ఒక పిచ్చివాడిలా ప్రవర్తించేవాడు. ఆయన దగ్గర ఒక చిన్న ధనస్సు ఉండేది. ఆయన భుజానికి ఉన్న సంచిలో చాలా పెద్ద సంఖ్యలో చిన్న చిన్న గులక రాళ్ళు ఉండేవి. ఆయన నడిచి వెళుతున్నప్పుడు దోవలో ఆయనకు కనిపించిన వస్తువులవైపో, పక్షులవైపో, కాయలవైపో తన ధనస్సుకి గులక రాళ్ళను గురిపెట్టి ప్రయోగించేవాడు. ఆయనను నిజమైన యోగిగా గుర్తించినవారికి ఆయన ఆశీస్సులు లభించేవి.

చాలాకాలంపాటు మహారాష్ట్రలో హైందవమత పునర్నిమాణానికి పాటు పడిన సమర్ధ రామదాస్ ఆ తరువాత కాలంలో కొన్నేళ్ళపాటు అనేక పుణ్య క్షేత్రాలను దర్శించాడు. మహారాష్ట్రలోని అనేక ప్రదేశాలలో హనుమాన్ ఆలయాలను నిర్మింపచేసాడు. అలాంటి సమయంలో ఒకవ్యక్తి, సమర్ధ రామదాస్ వద్దకు వచ్చి ఆయనతో ఇలా చెప్పాడు. "మీ తల్లి మిమ్మల్ని చూడాలని ఎంతగానో తల్లడిల్లిపోతున్నది. ఎప్పుడో చిన్నతనంలో మీరు ఆమెను వదిలిపెట్టి వచ్చేసారు. ప్రస్తుతం ఆమెకు కళ్ళు కనపడటంలేదు".

చాలా ఏళ్ళ తరువాత సమర్ధ రామదాసుకి తన తల్లి గుర్తుకు వచ్చింది. ఆయన వెంటనే తన గ్రామానికి వెళ్ళి తన తల్లిని కలుసుకున్నాడు. ఎన్నో ఏళ్ళ తరువాత తన వద్దకు వచ్చిన తన కుమారుడినిచూసి ఆమె ఎంతగానో సంతోషించింది. అప్పుడు సమర్ధ రామదాస్ తన చేతితో ఆమె కళ్ళను స్పృశించాడు. అంతే, ఆమెకు కొన్నేళ్ళక్రితం పోయిన కంటి చూపు మళ్ళీ తిరిగి వచ్చింది. సిద్ధపురుషుడు అయిన సమర్ధ రామదాస్‌కి ఒక వ్యక్తికి దృష్టి ప్రసాదించటం పెద్ద విషయం ఏమీ కాదని ఈ సంఘటన ఋజువు చేస్తుంది.

సమర్ధ రామదాస్ అద్వైత మతాన్ని ప్రచారం చేసాడు. సమర్ధ రామదాస్‌కి దాదాపు 11 వందలమంది శిష్యులుఉన్నారు. వారిలో మూడు

వందలమంది శిష్యురాళ్ళు కావటం విశేషం. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో హిందూ మతాన్ని వ్యాప్తి చెయ్యమని సమర్ధ రామదాస్ తన శిష్యులను పంపించాడు. సమర్ధరామదాస్ దక్షిణ భారతదేశంలోని తంజావూరు ప్రాంతంలో ఒక మఠాన్ని స్థాపింపచేసాడు. సమర్ధ రామదాస్ తంజావూరులోని తన మఠాన్ని సందర్శించినప్పుడు ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న వెంకోజి అనే రాజు సమర్ధ రామదాస్‌ను సందర్శించి ఆయనకు శిష్యుడుగా మారిపోయాడు. ఈ వెంకోజి సాక్షాత్తు ఛత్రపతి శివాజికి సవతి తమ్ముడు కావటం విశేషం.

సమర్ధరామదాస్, మరాఠి భాషా సాహిత్య రంగంలో చేసిన కృషి అసమానమైనది. ఆయన వ్రాసిన గ్రంథాలలో "దాసబోధ", "మనచేశ్లోక్", "ఆత్మరామ్", "మనపంచక్" ముఖ్యమైనవి.

సాధారణంగా సమర్ధ రామదాస్ అడవిలో జీవించటానికి ఇష్టపడుతూ ఉండేవాడు. "అడవులలో నా తపస్సు నిర్విఘ్నంగా కొనసాగుతుందని అని సమర్ధ రామదాస్ అప్పుడప్పుడు తన శిష్యులతో అంటూ ఉండేవాడు. ఛత్రపతి శివాజి తనకు కానుకగా ఇచ్చిన సాజన్‌ఘడ్ కోటలో క్రీ.శ. 1681 మాఘమాసం, నవమి తిథినాడు సమర్ధరామదాస్ భౌతిక దేహాన్ని చాలించాడు. ఈ కోట మహారాష్ట్రలోని సతారా పట్టణానికి దగ్గరలో ఉన్నది.

తన చివర శ్వాస వదిలే ముందు కూడా సమర్ధ రామదాస్ రామ నామాన్ని జపిస్తూనే ఉన్నాడు. ఆయన ప్రాణం పోయిన మరుక్షణమే అత్యంత ప్రకాశవంతమైన ఒక వెలుగు ఆయన శరీరం నుండి బయటకు వచ్చి ఆయనకు కొంచెం దగ్గరలో ఉన్న శ్రీరాముని విగ్రహంలో లీనం అయిపోయింది.



# 18. పంబత్తి సిద్ధర్ జీవిత విశేషాలు?

అష్టాదశ సిద్ధులలో అతిశక్తివంతుడు అని పేర్కొనబడిన పంబత్తి సిద్ధర్ తమిళనాడులోని ఒక పాములుపట్టేవారి కులంలో జన్మించాడు. ఈయన పూర్వీకులు హిమాలయాల నుండి తమిళనాడు అడవులకు వలస వచ్చారని చెబుతారు. పంబత్తిసిద్ధర్ ఆనాటి పాండ్యరాజ్యంలో లేదా పుదుక్కోటై పట్టణానికి దగ్గరలో ఉన్న తిరుక్కోకర్ణం అన్న ప్రదేశంలో జన్మించాడని చెబుతారు. కార్తీకమాసంలో వచ్చిన మృగశిరా నక్షత్రంలో ఈ సిద్ధయోగి జన్మించాడు. ఈయన సాక్షాత్తు పరమశివుని అవతారమని భావిస్తారు. ఇంకొక సిద్ధయోగి అయిన సత్తెముని ఈయనకు గురుదీక్ష ఇచ్చాడు. ఆ సమయంలో పంబత్తి పంచ భూతాలను 5 శిరస్సులుగల త్రాచుపాముగా మార్చాడు. అప్పటి నుండి ఆయనకు 'పంబత్తిసిద్ధర్' అన్న పేరు వచ్చింది. మరికొందరి అభిప్రాయం ప్రకారం పంబత్తిసిద్ధర్ తాను వ్రాసిన పద్యాలలో త్రాచుపాము గురించి తరచుగా చెప్పాడని, ఆ త్రాచుపాము కుండలినీ శక్తికి ప్రతీక అని, ఆ కారణంగానే ఆయనకు పంబత్తిసిద్ధర్ అనేపేరు వచ్చిందని తెలుస్తున్నది. నేటి కోయంబత్తూర్ పట్టణానికి దగ్గరలో ఉన్న మరుదమలై పర్వతంమీద దీర్ఘకాలంపాటు తపస్సుచేసిన పంబత్తిసిద్ధర్‌కి అష్టాదశసిద్ధులు లభించాయని తెలుస్తున్నది.



ఈ సిద్ధయోగికి "పరకాయప్రవేశ" విద్య తెలుసు. ఈయన వివిధ ప్రదేశాలలో విభిన్న సమయాలలో దాదాపు 15 మృతదేహాలలో ప్రవేశించి

ఆ మృతదేహాలు మళ్ళీ కొంత సమయంపాటు జీవించేలా చేశాడని చెబుతారు. ఈ సిద్ధయోగి శంకరన్‌కోయిల్ అనే ప్రదేశంలో జీవసమాధి పొందాడు. ఈయన సమాధి అద్భుతమైన మహత్యాలను కలిగి ఉన్నట్లుగా ఋజువు అయ్యింది. ఒకసారి తిరువడుత్తూరై పీఠాధిపతి తీవ్రమైన కడుపు నొప్పితో బాధపడుతూ ఈ పంబత్తిసిద్ధర్ సమాధి వద్దకు వచ్చాడు. అప్పుడు ఆయన ఈ సమాధికి నమస్కరించి ఆ సమాధిమీది మట్టిని ఒక చిటికెడు తీసుకుని నోట్లోవేసుకున్నాడు. విచిత్రంగా, ఆయనకు కడుపునొప్పి తగ్గిపోయింది. ఇప్పటికీ ఈ సమాధిమీద ఉన్న మట్టిని ప్రసాదంగా భావించి తమ ఇళ్ళకు తీసుకువెళుతున్నారు. ఈ సమాధి సమీపంలో ఉన్న తులసి పుష్కరిణిలో ఉన్న నీటిని త్రాగినట్లయితే అనేక రోగాలు నివారణ అవుతాయని చెబుతారు.

కుజదోషంతో బాధపడేవారు, వక్రశని పీడవల్ల బాధపడేవారు, సంతానం లేక బాధపడేవారు, నిరుద్యోగంతో విచారించేవారు ఈ పంబత్తి సిద్ధర్ సమాధిని దర్శించినట్లయితే వారి బాధలు చాలా శీఘ్రంగా తొలగి పోతాయని అనేకమంది భక్తులు విశ్వసిస్తున్నారు.

## 19. భవిష్యత్తులో వాయుదేవుడిగా అవతరించబోతున్న మహాయోగి వడిరాజరు జీవిత విశేషములు?

వైష్ణవ తత్వానికి చెందిన మధ్వమత పరంపరలో అత్యంత మహిమాన్వితుడిగా గుర్తించబడిన అవతారపురుషుడు శ్రీ వడిరాజతీర్థ. మధ్వమతాచార్యులలో ప్రముఖులుగా గుర్తించబడిన శ్రీజయతీర్థ, శ్రీవ్యాసతీర్థ మరియు శ్రీరాఘవేంద్రతీర్థ(మంత్రాలయ రాఘవేంద్రస్వామి). లాంటి మహాపురుషులతో సమానమైన స్థానం శ్రీవడిరాజతీర్థకి ఇవ్వబడింది.

సిద్ధయోగిగా గుర్తించబడిన ఈ వడిరాజతీర్థకి అనేక మహాశక్తులు ఉన్నాయని చెబుతారు. ఈయన కేవలం ఒక మహాయోగి మాత్రమే కాకుండా

గొప్ప రచయిత, వేదాంతి, సంస్కరణవాదికూడా కావటం విశేషం.

శ్రీవడిరాజతీర్థ క్రీ.శ. 1480-1600 సంవత్సరాల మధ్య జీవించారు. అనగా ఈయన 120 ఏళ్ళు ఈ భూమిపై సంచరించారు అన్నమాట. ఈయన 8 ఏళ్ళ వయస్సువచ్చే వరకు కుటుంబ జీవితంలో ఉండి అప్పటి నుండి సమాధి అయ్యేవరకు అనగా 112 సంవత్సరాలపాటు సన్యాసిగా జీవించారు. ఈయనకూడా శ్రీ రాఘవేంద్రస్వామిలాగానే సజీవంగా బృందావనంలో (సమాధిలో) ప్రవేశించారు. ఈయన తన జీవితకాలంలో రెండుసార్లు భారతదేశమంతటా పర్యటించారు. ధర్మస్థలంలోని మంజునాథ ఆలయాన్ని వైదికమార్గంలోకి మళ్ళించిన ఘనత వడిరాజతీర్థకే దక్కుతుంది.

కర్నాటక రాష్ట్రంలోని ఉడిపి పట్టణానికి ఉత్తరంగా 25 కి.మీ. దూరంలో ఉన్న హూవినకేరె అనే గ్రామంలో రామభట్ట మరియు గౌరీదేవి అనే బ్రాహ్మణ దంపతులు ఉండేవారు. వారికి ఎంతకాలం గడిచినా సంతానం కలగలేదు. అలాంటి సమయంలో అనగా క్రీ.శ. 1480లో శ్రీ వాగీశతీ అనే మధ్వాచార్యుడు విధిప్రేరేపణవల్ల ఆ దంపతులవద్దకు వచ్చాడు. ఆ దంపతులు ఆయనను పూజించి ఆపై ఆయనను తమకు సంతానభాగ్యం కలిగేలా చెయ్యమని వేడుకున్నారు. అప్పుడు ఆయన వారితో ఇలా అన్నాడు. "మీకు తప్పనిసరిగా సంతానం కలుగుతుంది. అయితే మీకు మొదట మగ బిడ్డ పుట్టినట్లయితే మీరు అతడిని చిన్నతనంలోనే మా మధ్వమతానికి ఇచ్చివెయ్యాలి. మీరు అందుకు అంగీకరిస్తే మీకు సంతానం కలుగుతుంది".

లేక, లేక తమకు పుట్టబోయేది మగబిడ్డ అయితే అతడిని మధ్వాశ్రమానికి ఇవ్వటానికి ఆ దంపతులు ఇష్టపడలేదు. వారిని మరీ బాధపెట్టటం ఇష్టంలేని వాగీశతీర్థ తాను వారికి విధించిన షరతుకు ఒక మినహాయింపు ఇచ్చాడు. అది ఏమిటంటే వారికి పుట్టేబిడ్డ ఇంటి లోపల పుడితే ఆ బిడ్డ వారికే దక్కుతాడు. అలా కాకుండా ఇంటి బయట పుడితే ఆ బిడ్డని మధ్వాశ్రమానికి ఇచ్చివెయ్యాలి. ఈ షరతుకి ఆ దంపతులు మనస్ఫూర్తిగా అంగీకరించారు. ఎలాగైనాసరే ప్రసవ సమయంలో గౌరీదేవి ఇంట్లోనే ఉన్నట్లయితే ఆమెకు పుట్టిన బిడ్డను తానే ఉంచుకోవచ్చు రామభట్ట

అనుకున్నాడు. ఆయన భార్యకూడా అలాగే అనుకున్నది.

కొద్ది రోజులు గడిచాయి భగవత్ కటాక్షం కారణంగా గౌరీదేవి గర్భవతి అయ్యింది. దాంతో ఆ దంపతులు పట్టలేని సంతోషంతో పొంగిపోయారు. ఆమెకు పుట్టేబిడ్డ ఇంట్లో పుడితేనే తనకు దక్కుతాడని తెలిసి ఉన్న రామభట్ట పొరపాటునకూడా తన భార్యకు ప్రసవం అయ్యేవరకు ఆమె బయటకు వెళ్ళకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు. రామభట్ట దంపతులు ఒక చిన్న వరిపొలం మధ్యలో నిర్మించబడిన ఒక చిన్న గుడిసెలో జీవిస్తూ ఉండేవారు. ఆ పొలం చాలా చిన్నదిగా ఉండటంతో రామభట్ట ఒక ప్రక్క పొలం పనులుచూస్తూ, ఇంకొక ప్రక్క గుడిసెలో ఉన్న భార్య గుడిసెలో నుంచి బయటకువచ్చే అవసరంలేకుండా ఆమెకు కావలసినవన్నీ సమకూరుస్తూ ఉండేవాడు. తొమ్మిది నెలలు గడిచాయి. ఏ క్షణంలో అయినా ఆమెకు ప్రసవం అవ్వవచ్చు. ఆ రోజు సాధనద్వాదశి. రామభట్టు గుడిసెలో కూర్చుని భోజనం చేస్తున్నాడు. నిండు గర్భిణిగా ఉన్న గౌరీదేవి ఆ గుడిసె పెరటిలో తులసిచెట్టుకు పూజచేస్తున్నది. సరిగ్గా అదే సమయంలో కొన్ని ఆవులు వాళ్ళ చిన్న పొలంలో ఏపుగా పెరిగిన వరి పంటను తినటానికి పొలంలో ప్రవేశించి ఆ పంటను తినివెయ్యటం ప్రారంభించాయి. ఆ దంపతులకు జీవనాధారం ఆ కొద్ది పొలంలో వచ్చే పంటమాత్రమే కావటంతో గౌరీదేవి ఎంతో ఆందోళనకు గురి అయ్యింది. తాను వెంటనే పొలంలోకి వెళ్ళి ఆ ఆవుల్ని అవతలికి తోలకపోతే అవి పంటను మొత్తం తినివేస్తాయని, ఫలితంగా తమకు కొద్దినెలల దాకా తిండి ఉండదని గుర్తించిన గౌరీదేవి ఒక కర్రపుల్లను తీసుకుని ఆ ఆవుల్ని తోలటానికి పొలంలోకి వెళ్ళింది. ఆమె తన గుడిసెను వదిలి పొలంలోకి ప్రవేశించిన మరుక్షణమే ఆమెకు నొప్పులు మొదలయ్యాయి. కొద్ది నిమిషాలలోనే ఆమెకు ప్రసవం అయి ఒక మగబిడ్డ జన్మించాడు.

"మనిషి తాను అనుకున్నట్టుగా అన్నీ చేయలేడు. మనిషి ఎన్ని అనుకున్నా చివరికి భగవంతుడు నిర్ణయించినదే జరుగుతుంది. ఇది ఎప్పటికీ మారదు". గౌరీదేవికి పుట్టిన బిడ్డ ఒక సన్యాసి కావాలని, ఆ సన్యాసివల్ల

మానవజాతికి ఎంతో మేలు జరగాలని ఆ భగవంతుడు నిర్ణయించాడు. ఆ బిడ్డ సన్యాసి కావాలంటే ఆ బిడ్డ తల్లికి ఆ గుడిసెలో ప్రసవం కాకూడదు. అందువల్లే ఆమె దైవ ప్రేరణ కారణంగా ఆవుల్ని తోలటానికి పొలంలో ప్రవేశించి అక్కడే బిడ్డను ప్రసవించింది.

ఏదిఏమైనా శ్రీవాగేశతీర్థ అనుగ్రహంవల్ల తమకు బిడ్డ పుట్టటంవల్ల ఆయనకు ఆ విషయం తెలియజేయటం తమ బాధ్యత కనుక రామభట్ట దంపతులు ఆ విషయాన్ని ఒక వ్యక్తిద్వారా వాగేశతీర్థకు తెలియజేసారు. ఈ విషయం తెలుసుకుని ఎంతగానో సంతోషించిన వాగేశతీర్థ ఒక బంగారు పళ్ళాన్ని రామభట్ట దంపతుల వద్దకు పంపించి కొద్ది నిమిషాల క్రితం పుట్టిన బిడ్డను ఆ బంగారు పళ్ళెంలోపెట్టి తన మఠానికి పంపించమని చెప్పాడు. ఆ బిడ్డ మఠానికి చేరేవరకు ఆ బిడ్డ నేలను తాకరాదని వాగేశతీర్థ రామభట్ట దంపతులకు సందేశం పంపించాడు.

ఆవిధంగా ఆ బిడ్డ పుట్టిన కొద్ది గంటలకే ఒక బంగారు పళ్ళెంలో పెట్టబడి తన తల్లిదండ్రులద్వారా మధ్వమఠానికి చేర్చబడ్డాడు. ఆ బిడ్డయొక్క తేజస్సును మరియు జాతకాన్ని పరిశీలించిన వాగేశతీర్థ ఎంతో ఆనందించారు. ఆ తరువాత ఆయన ఆ బిడ్డ తండ్రి అయిన రామభట్టతో ఇలా చెప్పాడు. "నీ బిడ్డ సామాన్యుడుకాదు. ఇతడు తప్పనిసరిగా సన్యాసి అవుతాడు". ఆ తరువాత వాగేశతీర్థ, తాను పూజించే దైవానికి నైవేద్యంగా పెట్టిన పాలను తీసుకువచ్చి ఆ బిడ్డకు త్రాగించాడు. ఆ తరువాత ఆ బిడ్డకు "వరాహాచార్య" అన్నపేరు పెట్టమని రామభట్ట దంపతులకు సూచించారు. ఆ తరువాత వాగీశతీర్థ ఆ బిడ్డను మరల రామభట్ట దంపతులకు ఇచ్చి కొన్ని సంవత్సరాల తరువాత ఆ బిడ్డను తిరిగి తీసుకువచ్చి తనకు అప్పగించమని చెప్పాడు.

ఆనాడు గౌరీదేవి బిడ్డను ప్రసవించిన వరి పొలాన్ని ఈనాడు "గౌరీగద్దె" అని పిలుస్తున్నారు. అక్కడ ఒక చిన్న ఆలయం నిర్మించబడింది.

ఆ బిడ్డకు 8 సంవత్సరాలు దాటిన తరువాత రామభట్ట దంపతులు ఆ బిడ్డను మధ్వ మఠానికి అప్పగించారు. కారణజన్ముడైన ఆ బిడ్డకు

(వరాహాచార్యులు) "వడిరాజ" అన్న కొత్తపేరునుపెట్టి అతనికి సన్యాసాన్ని ప్రసాదించారు శ్రీవాగేతీర్థ. శ్రీవాగేశతీర్థ మరణించేవరకు ఆయనవద్ద విద్యాభ్యాసంచేసాడు వడిరాజ. ఆ తరువాత తన గురువుగారి అంత్య క్రియలను మరియు ఆరాధనలను అత్యంత ఘనంగా నిర్వహించి ఆపై తన విద్యాభ్యాసాన్ని కొనసాగించటంకోసం హంపిలోని శ్రీవ్యాసతీర్థవద్దకు వెళ్ళాడు.

15-16 శతాబ్దాల మధ్య "హంపి" పట్టణం విజయనగర సామ్రాజ్యానికి రాజధానిగా ఉండేది. హంపిలో వడిరాజ విద్యాభ్యాసం చేసిన సమయంలో అనేక ముఖ్యమైన మరియు అనూహ్యమైన సంఘటనలు జరిగాయి. అక్కడే వ్యాసతీర్థ, విజయేంద్రతీర్థ, పురందరదాసు మరియు కనకదాసు లాంటి మహాత్ముల్ని వడిరాజ కలుసుకున్నాడు.

వడిరాజయొక్క వ్యక్తిత్వాన్ని మరియు పాండిత్యాన్నిచూసి ఎంతగానో పరవశించిన నాటి విజయనగర ప్రభువైన శ్రీకృష్ణదేవరాయలు వడిరాజకు "ప్రసంగ ఆభరణ తీర్థ" అన్న బిరుదును సమర్పించాడు. ఆ తరువాత కొంతకాలానికి వడిరాజ మరల ఉడిపికి తిరిగి వచ్చాడు.

**హయగ్రీవ ఆరాధనలో వడిరాజతీర్థ.**

నాటి కర్నాటక సముద్రతీర ప్రాంతాలలో వేలకొద్దీ కంసాలిపనివారు (బంగారు ఆభరణాలు తయారుచేసేవారు) నివసిస్తూ ఉండేవారు. వారు చేసే ఆభరణాలను అన్ని కులాలవారు ఎంతో ఆదరంతో ధరించేవారు కానీ ఆ కులస్తుల్ని చాలా తక్కువగా చూసేవారు. అలాంటి సమయంలో ఒక అద్భుతం జరిగింది. అది ఏమిటంటే ఒకసారి ఒక కంసాలి, గణపతి విగ్రహాన్ని తయారుచేయటంకోసం పంచలోహాలను కరిగించి అచ్చులో పోశాడు. కొంత సమయం గడిచిన తరువాత అచ్చును తెరిచిచూడగా అందులో గణపతి విగ్రహానికి బదులు గుర్రపుతలతో, నాలుగు చేతులతో ప్రకాశిస్తున్న హయగ్రీవ విగ్రహం కనపడింది. ఇంకొక విశేషం ఏమంటే సాధారణంగా అచ్చులోపోసిన పంచలోహాల మిశ్రమం పూర్తిగా చల్లారిపోయి ఆరిపోయిన తరువాతే గట్టిపడి విగ్రహంగా తయారవుతుంది. కానీ ఆ

కంసాలి తయారుచేసిన విగ్రహం ఆరిన తరువాతకూడా ఇంకా ఎర్రటి ఎరుపులో భగ, భగ మని మండుతున్నట్టుగా చాలా వేడిగా కనిపించింది. దాంతో ఆ కంసాలి ఆ మర్నాటి ఉదయం ఆ విగ్రహాన్ని కరిగించి మళ్ళీ గణపతి బొమ్మను తయారుచేయాలని నిర్ణయించుకున్నాడు.

ఆ రోజు రాత్రి నిద్రపోతున్న ఆ కంసాలికి స్వప్నంలో ఒక దైవ వాక్కు ఇలా చెప్పింది. "నీచేత తయారుచేయబడిన ఆ హయగ్రీవ విగ్రహాన్ని మళ్ళీ కరిగించవొద్దు. దానిని తీసుకువెళ్ళి ఉడిపి పీఠంలో ఉన్న వడిరాజతీర్థకు అప్పగించు". ఒక విచిత్రం ఏమంటే ఆ కంసాలికి స్వప్నం వస్తున్న సమయంలోనే ఒడిరాజకు కూడా ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో ఒక దైవ వాక్కు ఇలా చెప్పింది. "రేపు ఉదయం ఒకవ్యక్తి నీ వద్దకువచ్చి నీకు ఒక అపూర్వమైన హయగ్రీవ విగ్రహాన్ని తీసుకువచ్చి ఇస్తాడు. దానిని తీసుకుని శ్రద్ధగా పూజించు".

తెల్లవారుఝామున నిద్రలేచిన వడిరాజకు అంతకుముందు తనకు వచ్చిన స్వప్నంలో తెలిసిన విశేషం ఎంతో ఆనందం కలిగింది. సహజంగా ఆయన అప్పటికే హయగ్రీవ స్వామిని గాఢభక్తితో ఆరాధిస్తున్నాడు.

బాగా తెల్లవారిన తరువాత ఆ కంసాలి తన దగ్గర ఉన్న హయగ్రీవ విగ్రహాన్ని తీసుకుని, ఆపై తన కులానికి చెందిన కొందరు పెద్దలతో కలిసి వడిరాజతీర్థవద్దకువచ్చి ఆయనకు ఆ విగ్రహాన్ని అందజేసాడు. "నేను గణపతి విగ్రహాన్ని తయారుచేయాలి అనుకుంటే అది హయగ్రీవ విగ్రహంగా మారి పోయింది. అది మీకు చేరాలని ఆ భగవంతుడు నిర్ణయించాడు. అందుకే దాన్ని మీకు ఇస్తున్నాను" అన్నాడు ఆ కంసాలి. వడిరాజతీర్థ ఆ హయగ్రీవ విగ్రహాన్ని కళ్ళకు అద్దుకుని తీసుకున్నాడు. ఆ తరువాత ఆ కంసాలి, వడిరాజతీర్థతో ఇలా అన్నాడు. "స్వామీ! మా కులంవారికి హిందూ సమాజంలో గౌరవస్థానంలేదు. మమ్మల్ని అందరూ తక్కువగా చూస్తున్నారు. మాకు ఎలాగైనా ఒక గౌరవ స్థానాన్ని కల్పించండి". "ఈ భగవంతుని సృష్టిలో పుట్టిన మానవులందరూ సమానులే. కానీ కొందరు

కులతత్వవాదులు ఈ మానవుల్ని అనేక కులాలుగా విభజించి ఆపై కొన్ని కులాలు గొప్పవని, కొన్ని కులాలు తక్కువని ముద్రవేసారు. ఏదిఏమైనా ఇకపై మీ కులంవారికి హైందవ సమాజంలో మంచిస్థానం నేను కల్పిస్తాను" అన్నాడు వడిరాజతీర్థ.

ఆ తరువాత ఒక శుభముహూర్తంలో వడిరాజతీర్థ, ఆ ప్రాంతంలో ఉన్న కంసాలి కులస్తులందరికీ చక్రాంకితాలుచేసి భాగవత ధర్మమైన ద్వైత మతంలోకి మార్చివేసాడు. అప్పటి నుండి ఆ కంసాలి కులస్తులు "దైవజ్ఞ బ్రాహ్మణులు" అన్నపేరుతో గుర్తించబడి కన్నడ హైందవ సమాజంలో ఒక గౌరవనీయ కులస్తులుగా గౌరవించబడ్డారు. సమాజంలో తమకు ఒక మంచి స్థానాన్ని కల్పించిన వడిరాజతీర్థను ఆ కులస్తులవారు తమ గురువుగా భావించుకున్నారు. ఆనాడు సమాజంలో తక్కువ కులస్తులుగా భావించబడిన "కోటేశ్వర బ్రాహ్మణులను"కూడా చక్రాంకితాల ద్వారా ద్వైత మతంలోకిమార్చి ఆ కులస్తులకు కూడా సమాజంలో ఉన్నత స్థానాన్ని కల్పించాడు వడిరాజతీర్థ.

ఒక పర్యాయం ఉడిపి పీఠానికి అధిపతిగా పనిచేసిన తరువాత ఆయన భారతదేశంలోని వివిధ పుణ్య క్షేత్రాలను దర్శించాడు. తాను చూసిన వివిధ పుణ్య క్షేత్రాలయొక్క ప్రత్యేకతలను ఆయన ఒక గ్రంథరూపంలో సమాజానికి అందించాడు. ఎంతో ప్రమాణికమైన గ్రంథంగా గుర్తించబడిన ఆ గ్రంథం పేరు "తీర్థప్రబంధము" ఆయన తాను పర్యటించిన ప్రదేశాలలో ఉన్న అన్ని ముఖ్య కేంద్రాలలోనూ విద్వత్ సభలు (పండిత సభలు) నిర్వహించాడు. ఆ సభల సందర్భంలో తనయొక్క జ్ఞానాన్ని ప్రదర్శించి ద్వైతమతసిద్ధాంతం యొక్క గొప్పతనాన్ని దేశమంతటా తెలిసేలా చేసాడు.

ఒక సమయంలో వడిరాజతీర్థ తిరుమల క్షేత్రానికి వెళ్ళాడు. మహా భక్తుడైన ఆయనకు ఆ ఏడు కొండలు పవిత్రమయిన సాలిగ్రామాలలాగా కనిపించాయి. అంత పవిత్రమయిన ఆ కొండలమీద కాళ్ళతో నడవటానికి ఇష్టపడని వడిరాజతీర్థ మోకాళ్ళమీద పాకుతూ ఏడు కొండలు ఎక్కి

శ్రీనివాసుడిని దర్శించుకున్నాడు. ఆ తరువాత ఆయన ఒక సాలగ్రామ హారాన్ని తిరుమలవాసునికి కానుకగా సమర్పించాడు.

వడిరాజతీర్థ తన జీవితకాలంలో మొత్తం రెండుసార్లు భారతదేశ పర్యటనచేసాడు. ఆనాడు అయోధ్యలో ఉన్న శ్రీముఖ్యప్రాణ విగ్రహాన్ని తీసుకువచ్చి ఉడిపి మఠంలో ప్రతిష్టించాడు. భారతదేశ తీర్థయాత్రలో ఉన్న సమయంలో వడిరాజ, పూనాలో ఉన్నప్పుడు చాతుర్మాస దీక్షను చెయ్యాలని సంకల్పించాడు. ఆ సమయంలో పూనాలో ఒక పండిత సభ జరుగుతున్నది. ఆ సభకు వచ్చిన వారందరూ "శిశుపాలవధ" అనే పద్య కావ్యాన్ని చాలా గొప్పదిగా నిర్ణయించారు. ఈ విషయం తెలుసుకున్న వడిరాజ, ఆ పండిత సభ నిర్వాహకులకు ఇలా వర్తమానం పంపించాడు.

"నేను కూడా శిశుపాల వధ అంశం మీదే ఒక గ్రంధాన్ని వ్రాసాను. అది శాస్త్రబద్ధంగా ఉంటుంది. మీకు అభ్యంతరం లేకపోతే నా గ్రంధాన్ని కూడా పోటీలో ఉంచి అందరికీ నచ్చితే నా గ్రంధాన్ని అత్యుత్తమ గ్రంధంగా ప్రకటించండి". అంతేకాకుండా వడిరాజ ఇంకొక విషయాన్నికూడా ఆ పండిత సభ నిర్వాహకులకు ఇలా చెప్పాడు. "శిశుపాలవధ" అన్నపేరు అశుభాన్ని సూచిస్తుంది. మహాత్ముడైన శ్రీకృష్ణుడి గొప్పతనాన్ని తగ్గిస్తుంది.

"సరే, ఈయన వ్రాసిన గ్రంధంలో ఏమాత్రం పస ఉన్నదో పరిశీలిద్దాం" అని నిర్ణయించుకున్న ఆ పండిత సభ నిర్వాహకులు, వడిరాజతీర్థను పిలిచి "మీరు వ్రాసిన గ్రంధాన్నికూడా మాకు ఇవ్వండి. దాన్ని పరిశీలిస్తాం" అని ఆయనకు చెప్పారు. అప్పుడు వడిరాజ ఆ పండితసభ నిర్వాహకులతో ఇలా అన్నాడు. "నేను వ్రాసిన గ్రంధం ప్రస్తుతం ఉడిపిలో ఉంది. నాకు మూడు వారాల గడువు ఇవ్వండి. ఈలోగా ఎవరినైనా అక్కడకు పంపించి దాన్ని తెప్పించి మీకు అందిస్తాను". వడిరాజ కోరినవిధంగా మూడు వారాల గడువును ఆయనకు ఇవ్వటానికి అంగీకరించారు ఆ సభా నిర్వాహకులు.

అయితే ఆ పండిత సభ నిర్వాహకులకు తెలియని విషయం ఏమంటే "వడిరాజ అప్పటికి అసలు ఆ గ్రంధమే వ్రాయలేదని, కేవలం కొంతకాల

వ్యవధికోసమే అలా చెప్పాడని". సరే, మూడు వారాల సమయం అనగా 21 రోజుల వ్యవధి తనకు ఇవ్వబడింది అని అర్థంచేసుకున్న వడిరాజ వెంటనే తాళపత్రాలు ఘంటాన్ని తీసుకుని "రుక్మిణీశ విజయం" అనే గ్రంథాన్ని 19 రోజులలో శరవేగంతో రాసాడు. తాము ఇచ్చిన మూడు వారాల గడువుకి రెండు రోజుల ముందే వడిరాజ తాను అక్కడే వ్రాసిన గ్రంథాన్ని పండిత సభ నిర్వాహకులకు అందజేసాడు. అద్భుతమైన పాండిత్య శోభతో వెలిగిపోతున్న ఆ సంస్కృత గ్రంథం ఆ పండిత సభకు వచ్చిన మహాపండితుల్నికూడా నివ్వెరపడేలా చేసింది.

వడిరాజ ఇచ్చిన గ్రంథం అత్యుత్తమమైన సంస్కృత పద్యకావ్యంగా పండితుల అందరిచేత గుర్తించబడింది. వడిరాజను మహాపండితునిగా ఆ పండిత సభ నిరభ్యంతరంగా ఆమోదించింది. ఆపై చక్కగా అలంకరించిన ఒక ఏనుగుమీద ఆ గ్రంథాన్ని ఉంచి దానిని పూనా నగరం అంతా ఊరేగించి ఆపై వడిరాజను ఘనంగా సత్కరించింది. ఈ గ్రంథంలో వడిరాజ, తత్వవాద సూత్రాలకు అనుగుణంగా, చక్కటి చంధస్సును పాటిస్తూ తన అమోఘమైన జ్ఞానాన్ని ప్రదర్శించాడు.

పూనా నగరంలో అద్భుత సత్కారాన్ని అందుకున్న తరువాత వడిరాజ అక్కడ నుండి పండరీపురం చేరుకున్నాడు. అక్కడ ఉన్న పాండురంగ విఠలుని ఆలయంలో కొన్నివారాలు గడిపాడు. ఆ సమయంలో ఒకరోజున ఒకవ్యక్తి, వడిరాజ వద్దకువచ్చి ఆయనను తీవ్ర స్వరంతో ఇలా నిందించాడు. "నీకు సంబంధించిన ఒక తెల్లగుర్రం ప్రతిరోజూ నా పొలానికివచ్చి పొలంలో ఉన్న జొన్న పంటని తినివేస్తున్నది. దానిని తరిమివేద్దామని ప్రయత్నించి నపుడు అది నా పొలంలో నుండి పారిపోయి ఈ గుడిలో నీవు ఉన్న ప్రదేశం వద్దకు వచ్చి మాయం అయిపోతున్నది. అది ఖచ్చితంగా నీ గుర్రమే అయి ఉంటుంది. లేకపోతే నీవైపు ఎందుకు వస్తుంది?. నీ గుర్రం వల్ల నాశనం అయిపోయిన నా పంటకు నష్టపరిహారం నీవే చెల్లించాలి".

అప్పుడు వడిరాజ శాంతస్వరంతో ఆవ్యక్తితో "నాయనా! నా దగ్గర ఏ గుర్రమూ లేదు. నీకు నమ్మకంలేకపోతే ఇక్కడ అన్నిచోట్లా వెతుక్కో. నీకు

ఏదైనా గుర్రం కనిపిస్తే నేను తప్పకుండా నీకు నష్టపరిహారం కడతాను" అన్నాడు. అప్పుడు ఆ వ్యక్తి ఆ ప్రదేశం అంతా గాలించాడు. అయినా అతనికి ఆ తెల్లగుర్రం కనపడలేదు. ఆ వ్యక్తి తెల్లముఖం వేసుకుని వడిరాజ ముందు నిలబడ్డాడు. అప్పుడు వడిరాజ చిరునవ్వులు చిందిస్తూ ఆ వ్యక్తితో "నాయనా! నా గుర్రం నీ.జొన్న పొలాన్ని తినివేసింది అన్నావు కదా. నేను కూడా నీ వెంట నీ పొలం దగ్గరకు వస్తాను. ఆ పొలం పరిస్థితి ఏమిటో నేనే స్వయంగా తెలుసుకుంటాను" అన్నాడు.

ఆ తరువాత ఆ వ్యక్తి వడిరాజను వెంటపెట్టుకుని పొలం దగ్గరకు వచ్చాడు. ఆ పొలం చక్కటి కంకులతో చక్కగా కనిపిస్తున్నది. కొద్దిసేపటి క్రితం సర్వనాశనం అయిపోయిన ఆ పొలం మళ్ళీ మామూలుగా కనపడటంతో ఆ వ్యక్తికి తీవ్రమైన ఆశ్చర్యం కలిగి ఆపై ఏం చెయ్యాలో అర్థంకాక వడిరాజకేసి దీనంగా చూసాడు. అప్పుడు వడిరాజ ఎంతో ఆప్యాయంగా వ్యక్తి శిరస్సుపై చెయ్యి ఉంచి అతడితో ఇలా అన్నాడు. "నాయనా! నీ పొలంలో మేసిన తెల్లగుర్రం సామాన్యమైన గుర్రంకాదు. సాక్షాత్తు ఆ హయగ్రీవుడే తెల్లగుర్రం రూపంలో నీ పొలంలో మేసాడు. ఆ భగవంతుడిని స్వయంగా చూడగలిగిన నీవు మహాపుణ్యాత్ముడివి".



ఈ సంఘటనతో ఆవ్యక్తికి వడిరాజయొక్క మహత్యం స్పష్టంగా అర్థమయ్యింది. దాంతో అతడు వడిరాజ పాదాలపై పడి తనను క్షమించమని వేడుకున్నాడు. అంతేకాదు తన పొలాన్ని ఉడిపి మఠానికి కానుకగా

సమర్పించాడు. ఆ తరువాత వడిరాజ, పండరీపురం నుండి బయల్దు దేరాడు. ఆ సమయంలో ఆయన "దశావతార స్తుతి" అనే ఒక అద్భుతమైన పద్య కావ్యాన్ని వ్రాసాడు. ఈ కావ్యం "అశ్వధాతి" అనే విధానంలో వ్రాయబడింది. ఈ పద్యాలను పాడుతుంటే గుర్రం నృత్యం చేస్తున్నట్లుగా అనిపిస్తుంది.

హయగ్రీవుడికి మహాభక్తుడైన వడిరాజకి తన ఇష్టదైవానికి నైవేద్యం పెట్టటం ఎంతో ఆనందకరమైన విషయంగా ఉండేది. బెల్లం, బాదం పప్పులు, నెయ్యి, శనగలతో వండిన పదార్థాన్ని ఉడిపి మఠంలో ప్రతిరోజు తయారుచేసేవారు. ప్రతిరోజూ పూజలు అయిపోయిన తరువాత వడిరాజ, మఠంలో తయారుచేయబడిన ప్రసాదాన్ని ఒక పళ్ళెంలో పెట్టుకుని ఆపై దానిని తీసుకుని ఒక గదిలోకివెళ్ళి తలుపులు వేసుకునేవాడు. ఆ తరువాత ఆ పళ్ళాన్ని తన నెత్తిపై పెట్టుకుని హయగ్రీవస్వామిని స్మరించుకునేవాడు. వెంటనే ఆ గదిలో ఉన్న హయగ్రీవ విగ్రహం నుండి ఒక తెల్లటి గుర్రం బయటకువచ్చి ఆపై తన రెండు ముందుకాళ్లను వడిరాజ భుజంపైఉంచి, మూతిని అతని తలపై ఉన్న పళ్ళెంలో ఉంచి అందులో ఉన్న ప్రసాదాన్ని సంతృప్తిగా ఆరగించేది. ఆ తరువాత ఆయన దశావతారస్తుతిని గానం చేసేవాడు. ఆయన ఆ స్తుతిని గానం చేస్తున్నప్పుడు ఆ తెల్లటి అశ్వం ఆనందంతో నృత్యం చేసేది.

"ఈ ప్రపంచంలో ప్రతి మంచివాడికి చాలామంది శత్రువులు ఉంటారు. ఇది సృష్టి ధర్మం". వడిరాజ పెట్టే ప్రసాదాన్ని సాక్షాత్తు హయగ్రీవుడే ఆరగిస్తాడు అన్న ప్రచారం ఉడిపి ప్రాంతంలో ఉండేది. ఈ విషయాన్ని గమనించిన కొందరు అసూయాపరులైన నాస్తికులు ఇలా ప్రచారం ప్రారంభించారు. "హయగ్రీవుడు స్వయంగా రావటం ఏమిటి? వడిరాజ పెట్టే ప్రసాదం తినటం ఏమిటి? ఇదంతా పచ్చి అబద్ధం. వడిరాజ ప్రసాదాన్ని గదిలోకి తీసుకువెళ్ళి ఆపై తలుపులు వేసుకుని తానే ఆ ప్రసాదాన్ని తినివేసి, హయగ్రీవుడు అశ్వరూపంలో వచ్చి తిన్నాడు అని అందరికీ చెబుతాడు. ఈ విషయాన్ని మేము నిరూపిస్తాం".

"కుండెడు పాలల్లో ఒక విషం చుక్కపడితే ఆ పాలు విషంగా మారిపోతాయి. అలాగే కుచ్ఛితుడైన ఒక నాస్తికుడు తన అతి తెలివి తేటలతో, మొండివాదనలతో వందమంది దైవభక్తుల్ని హేతువాదులుగా మార్చివేస్తాడు". ఇది అనాది నుండి మానవ సమాజంలో జరుగుతున్న ఒక విష ప్రక్రియ.

సాక్షాత్తు దైవానికే నైవేద్యం పెట్టగలిగిన వడిరాజను "వంచకుడు" అని నిరూపించాలని కంకణం కట్టుకున్న ఆ నాస్తికులు, వడిరాజను నమ్మే భక్తులతో ఇలా అన్నారు. "మేము ఒక ప్రసాదంలో కొద్దిగా శక్తిగల విషాన్ని కలిపి వడిరాజకు అందిస్తాము. ఆయన ఆ ప్రసాదాన్ని హయగ్రీవుడికి నైవేద్యంగా పెట్టటానికి గదిలోకి తీసుకువెళతాడు. మీరు నమ్ముతున్నట్లుగా హయగ్రీవుడే స్వయంగా వచ్చి ఆ ప్రసాదాన్ని తిన్నట్లయితే దేవుడు కనుక ఆయనకు ఏమీ కాదు. కానీ మేము అనుమానిస్తున్నట్లుగా వడిరాజే ఆ ప్రసాదాన్ని తిన్నట్లయితే ఆయనకు ఆ ప్రసాదంలో ఉన్న విషం వల్ల వాంతులు విరోచనాలు అవుతాయి. దాంతో ఆయన రంగు బట్టబయలు అవుతుంది".

దైవాన్ని నిష్కల్మషంగా ఆరాధించటం తప్ప మరేమీ తెలియని ఆ వడిరాజ ఎంతో సంతోషంతో, ఆ నాస్తికులు కపట భక్తిని నటిస్తూ ఇచ్చిన ప్రసాదాన్ని తీసుకువెళ్ళి హయగ్రీవుడికి సమర్పించాడు. అశ్వరూపంలో వచ్చిన హయగ్రీవుడు ఆ ప్రసాదాన్ని కొంచెం కూడా మిగల్చకుండా సంపూర్తిగా ఆరగించాడు. సాధారణంగా ప్రతిరోజూ హయగ్రీవుడు కొంచెం ప్రసాదాన్ని పళ్ళెంలో వదిలివేస్తాడు. దానిని వడిరాజ కళ్ళకు అద్దుకుని నోట్లో వేసుకుంటాడు. అయితే ఈ రోజు పళ్ళెంలో కొంచెంకూడా మిగల్చకుండా హయగ్రీవుడు తినటంతో వడిరాజకు ఏదో అనుమానం వచ్చింది. అప్పుడు వడిరాజ గద్గదమైన స్వరంతో హయగ్రీవుడిని ఇలా ప్రశ్నించాడు.

"స్వామీ ఈ రోజు నీ ప్రవర్తనలో ఏదో తేడా కనిపిస్తున్నది. నేను తెచ్చిన ప్రసాదంలో ఏదైనా లోపం ఉన్నదా?". అప్పుడు హయగ్రీవుడు

చిరునవ్వు నవ్వుతూ వదరాజతో ఇలా అన్నాడు. "నిన్ను పరీక్షించటానికి ఆ నాస్తికులు విషం కలిపిన ప్రసాదాన్ని పంపించారు. నా భక్తుడైన నిన్ను ఆ విషం బారినుండి కాపాడటానికి మొత్తం ప్రసాదాన్ని నేనే తిన్నాను. ఆ ప్రసాదాన్ని కొంచెం తిన్నా నీవు అనారోగ్యంపాలవుతావు. అలా జరగకుండా ఉండటంకోసమే ఏమాత్రం మిగల్చకుండా మొత్తం నేనే ఆరగించాను".

విషం కలపబడ్డ ప్రసాదాన్ని తిన్న కారణంగా ఉడిపి మఠంలో హయగ్రీవ విగ్రహం అంతటా ముదురు నీలంరంగు వ్యాపించింది. అదిచూసి అటు నాస్తికులు, ఇటు వడిరాజ ఎంతో భయపడ్డారు. మహానుభావుడైన వడిరాజను అనుమానించినందుకు ఆ నాస్తికులు ఎంతగానో బాధపడి ఆపై ఆయన కాళ్ళమీదపడి క్షమాపణలు కోరుకున్నారు. విశాల హృదయుడైన వడిరాజ ఆ నాస్తికులను క్షమించాడు. తాను ప్రాణంగా భావించే హయగ్రీవ విగ్రహం విషప్రభావంతో నీలంగా మారిపోయే సరికి వడిరాజ ఎంతగానో బాధపడ్డాడు. తన భక్తుడి వేదనను గమనించిన ఆ హయగ్రీవుడు, వడిరాజతో ఇలా అన్నాడు. "నీవు మూడు నెలల పాటు నీ చేత్తో స్వయంగా వండిన ప్రసాదాన్ని నాకుపెట్టు. ఆ ప్రసాదం ప్రభావం వల్ల క్రమ క్రమంగా నా విగ్రహంలో ఉన్న విషం అదృశ్యం అయిపోతుంది". హయగ్రీవుడి ఆజ్ఞ ప్రకారమే వడిరాజ స్వయంగా ప్రసాదాన్ని వండి ఆపై దానిని శ్వేతాశ్వరూపంలో వచ్చే హయగ్రీవుడికి అందించేవాడు. మూడు నెలల్లో ఆ విష ప్రభావం పూర్తిగాపోయి విగ్రహంపై ఉన్న ముదురునీలం రంగు అదృశ్యం అయిపోయింది. అయితే ఇప్పటికీ ఆ విగ్రహంలో అతి కొద్ది పరిమాణంలో విషప్రభావం ఉన్న కారణంగా ఆ విగ్రహం మెడమీద ఒక ఆకుపచ్చరంగు గీత కనిపిస్తూ ఉంటుంది.

కర్నాటకలోని దక్షిణకన్నడ జిల్లాలో ఉన్న నేత్రావతి నది ఒడ్డున ధర్మస్థల మంజునాథ ఆలయం నిర్మించబడింది. ఆ నది ఒడ్డున కొందరు తంత్ర గాళ్ళు ప్రతిరోజూ అర్ధరాత్రి సమయంలో క్షుద్రపూజలు చెయ్యటం, బలులు ఇవ్వటం లాంటివి పనులు చేస్తూ ఉండేవారు. ఇలాంటి క్షుద్ర పూజలవల్ల

ఆ ప్రాంతం ఎంతో అపవిత్రంగా ఉండేది. అలాంటి సమయంలో ఒకరోజు వడిరాజ ఆ క్షేత్రం మీదుగా వెళుతున్నాడు. ఆ మంజునాథ ఆలయ నిర్వాహకులు ఈ విషయం తెలుసుకుని వడిరాజ వద్దకువెళ్ళి ఆయనను ధర్మస్థల ఆలయంలోకివచ్చి ఆయన పవిత్ర హస్తాలతో మంజునాథ స్వామికి పూజలు చెయ్యమని అభ్యర్థించారు. అందుకు ఆయన నిరాకరించి ఆ ఆలయ నిర్వాహకులతో ఇలా అన్నాడు. "ఈ ఆలయ పరిసరాలు మరియు ఆలయము క్షుద్ర పూజల కారణంగా అపవిత్రంగా ఉన్నది. ఇలాంటి ఆలయంలో చేసే దైవ పూజలు ఎలాంటి శుభ ఫలితాలను ఇవ్వవు. అందువల్ల నేను మీ మంజునాథ ఆలయంలోకి ప్రవేశించలేను".

అప్పుడు మంజునాథ ఆలయ నిర్వాహకులు, వడిరాజ పాదాలపైపడి ఆయనను ఇలా వేడుకున్నారు. "స్వామీ! మీరు మా యందు దయయుంచి మా ఆలయాన్ని మీ మంత్రబలంతో పరిశుద్ధం చెయ్యండి. మీకు ఎప్పటికీ కృతజ్ఞులుగా ఉంటాం". "దైవాలందరూ ఒకటే" అని నమ్మిన వడిరాజ తాను వైష్ణవుడు అయినప్పటికీ ధర్మస్థల ఆలయంలో వెలసిన మంజునాథుడికి వేదోక్తంగా పూజలు చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. "అయితే ప్రస్తుతం ఆ ఆలయంలో ఉన్న విగ్రహం అపవిత్రంగా ఉన్నది. అందువల్ల ఆ విగ్రహానికి శక్తి ఉండదు" – ఇలా అనుకున్న వడిరాజ ఆపై తన శిష్యుడిని పిలిచి అతడిని కదిరి ఆలయానికి పంపించి అక్కడ ఉన్న మంజునాథేశ్వర శివలింగాన్ని తీసుకు రమ్మని చెప్పాడు. ఆ శిష్యుడు కదిరి క్షేత్రానికివెళ్ళి అక్కడి నుండి మంజునాథేశ్వర శివలింగాన్ని ధర్మస్థల క్షేత్రానికి తీసుకువచ్చి వడిరాజకు అప్పగించాడు. అప్పుడు వడిరాజ అనేకమంది వేదపండితుల సహకారంతో ధర్మస్థల క్షేత్రంలో ఈ క్రొత్త మంజునాథేశ్వర శివలింగాన్ని వైదికశాస్త్ర విధానంలో ప్రతిష్టించాడు. అప్పటి నుండి ధర్మస్థలానికి ఎంతో మహత్యం ఏర్పడింది. ఆనాడు వడిరాజ చేసిన ప్రతిష్ట కారణంగా ధర్మస్థల మంజునాథ శివలింగం ఈనాటికీ లక్షలాది భక్తుల్ని ఆకర్షిస్తున్నది. ఇంకొక విశేషం ఏమంటే శైవ మతానికి చెందిన మంజునాథుడికి అర్చనలు చేసే పూజారులు మధ్వమతానికి చెందిన శివాలి వైష్ణవులు కావటం విశేషం.

వడిరాజకు నారాయణాచార్య అనే ఒక తెలివైన శిష్యుడు ఉండేవాడు. అయితే అతనికి సరిగ్గా మాట్లాడటం తెలియదు. చివరికి తన గురువుని కూడా వంకర మాటలతో హేళన చేస్తూ ఉండేవాడు. సహజంగా వడిరాజ ఎంతో ఓర్పును కలిగి ఉండేవాడు. తన శిష్యుడు నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నా వడిరాజ చాలాకాలంపాటు చిరునవ్వు నవ్వుతూ మౌనం వహించేవాడు. చివరికి ఒకరోజు ఆ శిష్యుడు మితిమీరిపోయి వడిరాజను చాలా అసభ్యంగా నిందించాడు. దాంతో వడిరాజకు తీవ్రమైన ఆగ్రహం వచ్చి తన శిష్యుడిని "బ్రహ్మపిశాచి"గా మారిపొమ్మని శపించాడు. గురుశాపం వల్ల బ్రహ్మ పిశాచిగా మారిన ఆ శిష్యుడు, హంపి నగరాన్ని ఆనుకుని ఉన్న అడవులలో సంచరించటం ఆరంభించాడు. పిశాచిగా మారినప్పటికీ ఆ శిష్యుడి బుద్ధిమారలేదు. తాను సంచరించే అడవిగుండా ప్రయాణం చేసే యాత్రికుల్ని అడ్డగించి వారిని సంస్కృత భాషలో ఇలా ప్రశ్నించేవాడు.

**"అకామవైకో న స్నానహః"** (అకామవైలో స్నానం చెయ్యని పాపాత్ముడు ఎవరు?.) ఈ విచిత్రమైన ప్రశ్న అర్థంకాని యాత్రికులు సమాధానం చెప్పలేక మౌనంగా ఉండిపోయేవారు. దాంతో ఆ బ్రహ్మపిశాచి వాళ్ళని అనేక రకాలుగా పీడించి ఆ అడవిలోంచి బయటకు తరిమివేసేది. తన ప్రశ్నకు సమాధానం చెప్పిన వాళ్ళని ఏమీ చెయ్యకుండా వదలాలని ఆ బ్రహ్మపిశాచి నిర్ణయించుకున్నది. దురదృష్టవశాత్తు ఎవరూ కూడా ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయారు. ఫలితంగా ఆ పిశాచి చేతుల్లో నానా బాధలుపడి పారిపోతూ ఉండేవారు. ఇలాంటి సమయంలో ఒకరోజు మధ్యాహ్నం వడిరాజ ఆ అరణ్యంగుండా నడుస్తున్నారు. యథాప్రకారంగా ఆ బ్రహ్మపిశాచి ఆయన ముందు నుంచుని ఆయనతో ఇలా అన్నది.

"నా ప్రశ్నకు సరైన సమాధానం చెబితే నిన్ను వదిలిపెడతా. లేకపోతే నిన్ను పీల్చిపిప్పిచేస్తా". బ్రహ్మపిశాచిగా మారినా తన శిష్యుడి వంకర బుద్ధి పోలేదని వడిరాజకు అర్థమయ్యింది. ఆయన గంభీరమైన స్వరంతో ఆ

బ్రహ్మపిశాచితో ఇలా అన్నాడు. "నీ ప్రశ్నకు సరైన సమాధానం చెబితే ఆపై నీవు ఎల్లకాలమూ నా దాసుడిగా ఉంటావా?". అప్పుడు ఆ బ్రహ్మ పిశాచి వికృతంగా నవ్వుతూ "సరే" అన్నది. అప్పుడు ఆ బ్రహ్మపిశాచి తన ప్రశ్నను వడిరాజముందు ఇలా ఉంచింది. "ఆకామావైలో ఎవరు స్నానం చెయ్యరు?".

వడిరాజ ఒకసారి గంభీరంగా తల ఊపి తన మనస్సులో ఇలా అనుకున్నారు. "ఆషాఢ, కార్తీక, మార్గశిర మరియు వైశాఖ మాసాలు (ఆ = ఆషాడం, కా = కార్తీకం, మా = మార్గశిరం, వై = వైశాఖం) హిందువులకు ఎంతో పవిత్రమైనవి. ఈ నెలల్లో దైవాన్ని పూజించాలనుకునే ఏ భక్తుడు అయినా ముందుగా తప్పనిసరిగా స్నానం చెయ్యాలి. ఆస్తికుడైన ఏ హిందువు అయినా ఈ నెలల్లో తప్పనిసరిగా పూజకోసం కాకపోయినా ప్రతిరోజూ స్నానంచేస్తాడు. అంటే ఈ బ్రహ్మపిశాచి అడుగుతున్న ప్రశ్నకు నిజంగా ఒక అర్థం ఉన్నది. అది ఏమిటంటే "ఆషాఢ, కార్తీక, మార్గశిర, వైశాఖ మాసాలలో స్నానం చెయ్యని పాపాత్ములు ఎవరు?".

తన ప్రశ్నకు వడిరాజ సమాధానం చెప్పలేదని ఆ బ్రహ్మపిశాచి అనుకుంటున్న సమయంలో వడిరాజ దానితో ఇలా అన్నాడు. "**రండా పుత్రః త్వాం న స్నానహః**" (ఓ లంజాకొడకా! ఆ పవిత్ర మాసాలలో నువ్వు స్నానం చెయ్యవు). తాను మనిషిగా ఉన్నప్పుడు హైందవ మత నియమాలు ఉల్లంఘించి, ఆ పవిత్ర మాసాలలో స్నానంచెయ్యలేదన్న విషయం ఆ బ్రహ్మ పిశాచికి మాత్రమే తెలుసు. ఆ విషయం వడిరాజకు కూడా తెలియటంతో ఆ బ్రహ్మపిశాచికి జ్ఞానోదయం అయ్యింది. తన ప్రశ్నకు తగిన సమాధానాన్ని ఇచ్చిన వడిరాజకు అప్పటి నుండి బానిసగా మారిపోయింది ఆ బ్రహ్మపిశాచి. అప్పటి నుండి ఆ బ్రహ్మపిశాచికి నారాయణ భూతం లేదా భూతరాజు అన్నపేరు వచ్చింది.

దక్షిణ కన్నడ జిల్లాలోని "కటి శివాలయ" అన్న ప్రదేశంలో కుమారధర మరియు నేత్రావతి నదులు సంగమిస్తాయి. ఈ కటిశివాలయ అన్నప్రదేశం

ఒక పుణ్యక్షేత్రంగా గుర్తించబడింది. ఆ ప్రదేశంలో ప్రకృతి సౌందర్యం నయన మనోహరంగా ఉంటుంది. ఆ క్షేత్రంలో ఉన్న విశేషం ఏమంటే అక్కడ అనేక బండరాళ్ళు ప్రకృతియొక్క మార్పుల కారణంగా శివలింగాల రూపంలోకి కాలక్రమంలో మారిపోయాయి. ఒక సమయంలో వడిరాజతీర్థ ఆ క్షేత్రానికి వచ్చారు. వడిరాజ లాంటి సిద్ధపురుషుడు తమ ప్రాంతానికి రావటంతో అక్కడ ఉండే వేలాదిమంది ప్రజలు వడిరాజను ఒక్కసారైనా కళ్ళారాచూసి తరించాలని అనుకున్నారు. దాంతో కటిశివాలయ చుట్టు ప్రక్కల ఊళ్ళనుండి వేలాదిమంది ప్రజలు కటిశివాలయ ప్రాంతానికి వచ్చారు. అలా వచ్చినవారు వడిరాజకు వరుసగా నమస్కారాలుచేసి ఆయన పట్ల తమకు ఉన్న భక్తిభావాన్ని చాటుకున్నారు.

ఆయనను దర్శించటానికి వచ్చిన ప్రజలలో కొందరు ఆయనతో ఇలా అన్నారు. "స్వామీ! ఇక్కడ ప్రకృతిసిద్ధంగా కొన్ని వందల శివలింగాలు ఏర్పడ్డాయి. వీటి అన్నింటికి కలిపి అభిషేకం చెయ్యాలని మాకు ఏన్నాళ్ళ నుండో ఒక కోరిక ఉన్నది. కానీ అందుకు కావలసిన అపారమైన నీటిని మేము నది నుండి ఇక్కడికి ఎలా తీసుకురాగలం?". వారి మాటలు విన్న వడిరాజ చిన్నగా నవ్వి ఆ తరువాత తన చేతిలోని దండంతో ఆ శివలింగాల మొత్తం చుట్టు చాలా పెద్దదిగా ఉండే ఒక వృత్తాన్ని గీసాడు. ఆ తరువాత తన ఇష్టదైవం అయిన హయగ్రీవుడిని ఒకసారి మనసులో స్మరించుకున్నాడు. అంతే ఆ వృత్తం నుండి ఒక పెద్ద ప్రవాహం పుట్టి అక్కడ ఉన్న వందలాది శివలింగాల్ని ఏకకాలంలో అభిషేకించింది. అలాంటి అద్భుత దృశ్యాన్ని చూసిన అక్కడి ప్రజలు, వడిరాజతీర్థను దైవాంశ సంభూతుడని, దైవస్వరూపుడని స్తుతించారు. ఇప్పటికీ ఆ జలపాతం సజీవంగా ఉన్నది. దానిపేరు "దండతీర్థం".

వడిరాజతీర్థ తన చేతిలో ధరించే దండం(పొడుగాటి కర్ర)తో ఆ జలపాతాన్ని సృష్టించాడు కనుక ఆ జలపాతానికి "దండతీర్థం" అన్నపేరు వచ్చింది.

వడిరాజతీర్థ, ఉడిపి పీఠానికి అధిపతి కావటానికి ముందు ఆ పీఠాధిపతి పదవీకాలం రెండు నెలలుగా ఉండేది. అంత స్వల్పకాలంలో ఒక పీఠాధిపతి ఏ ముఖ్యకార్యాన్ని చెయ్యలేడు అని నిర్ణయించుకున్న వడిరాజతీర్థ తాను ఆ పీఠాధిపతి అయిన తరువాత పీఠాధిపతి పదవీకాలాన్ని రెండు నెలల నుండి రెండు సంవత్సరాలకు పెంచాడు. "ఈ ప్రపంచంలో మంచిని మెచ్చుకునేవాళ్ళతోపాటుగా అసూయతో నిందించే వాళ్ళుకూడా కొందరు ఉంటారు. వాళ్ళనే నాగరిక భాషలో విమర్శకులు'' అని పిలుస్తూ ఉంటారు. ఈ విమర్శకులు కూడా వడిరాజతీర్థను వీలు దొరికినప్పుడల్లా తమశక్తి ఉన్నంతవరకు విమర్శిస్తూ ఉండేవారు. ఉడిపి పీఠాధిపతి పదవీకాలాన్ని రెండేళ్ళకు పెంచిన వడిరాజతీర్థ మనసులో ఏదో స్వార్థం ఉండి ఉంటుందని ఈ విమర్శకులు వడిరాజతీర్థను నిందించారు. తాను ఉడిపి మఠం అభివృద్ధి కోసం చేసిన మార్పుని కొందరు విమర్శకులు తప్పుపట్టటంతో వడిరాజతీర్థ చాలా బాధపడ్డాడు. దాంతో ఆయన ఉడిపి పీఠాన్ని వదిలిపెట్టి ఆపై ఆ పీఠాధిపతి పదవిని తన శిష్యుడైన వేదవేద్యతీర్థకు అప్పగించి ఆపై షాల్మలి నదీతీరానికి చేరుకున్నాడు. అక్కడ ఆయనకు ఆయన శిష్యుడైన నాయక ఒక పెద్ద మఠాన్ని (సోదే మఠం) నిర్మించి ఇచ్చాడు. వడిరాజ అప్పటి నుండి అక్కడే స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు.

ఉడిపిలో ఏవిధమైన తీర్థాలు మరియు ఆలయాలు ఉన్నాయో సరిగ్గా అలాంటి వాటినే సోదేమఠం దగ్గర ఏర్పాటుచేయించాడు వడిరాజ శిష్యుడైన నాయక.

ఒకసారి వడిరాజ ఒక పనస చెట్టుక్రింద కూర్చుని విద్యార్థులకు శాస్త్రాలు బోధిస్తున్నాడు. ఆ సమయంలో ఒక పిడుగు ఆ చెట్టుమీద పడింది. ఫలితంగా ఆ చెట్టు మాడిపోయి చనిపోయింది. అందుకు ఎంతో విచారించిన వడిరాజ తన తపోబలంతో ఆ చెట్టుకి ప్రాణంపోసి మళ్ళీ బ్రతికించాడు. ఇప్పటికీ ఆ చెట్టుకి చక్కటి పనసపండ్లు కాస్తున్నాయి. వాటిని

వడిరాజతీర్థ అభిమాన దైవం అయిన హయగ్రీవ స్వామికి నైవేద్యంగా పెడుతున్నారు.

వడిరాజతీర్థ తనకు ఏదైనా అనారోగ్యం వస్తే దాని గురించి ఎప్పుడూ ఎవరికీ చెప్పేవాడుకాదు. భగవంతుడు తనకు మంచిని ఇచ్చినట్టుగానే రోగాన్నికూడా ఇచ్చాడని, దాన్ని సంతోషంగా అనుభవించటమే తన ధర్మము అని వడిరాజతీర్థ భావించేవాడు. అలా చాలా ఏళ్ళు గడిచాయి. తనకు ఇక భౌతికదేహం చాలించే సమయం ఆసన్నమైనదని గుర్తించిన వడిరాజ తనకు ప్రాణ సమానమైన ఉడిపి పీఠాన్ని చివరిసారి కళ్ళారా చూద్దామని నిర్ణయించుకుని ఉడిపికి వెళ్ళాలనుకున్నాడు. అప్పటికే ఆయనకు 120 ఏళ్ళు వయస్సు రావటంతో కంటిచూపు బాగా మందగించిపోయింది. అలాంటి పరిస్థితుల్లో ఉడిపి పీఠానికివెళ్ళినా ఆ పీఠంలో ప్రధాన దైవంగా పూజలందుకుంటున్న బాలకృష్ణుడిని ఎలా దర్శించాలో? ఆయనకు అర్థం కాలేదు.

ఏదిఏమైనా భారం భగవంతునిపైవేసి ఉడిపికి నడక ప్రారంభించాడు. మార్గమధ్యంలో ఆయన తాను శ్రీకృష్ణుడిని కళ్ళారా చూడగలనో లేదో అని ఆందోళనకు గురి అవుతూ శ్రీకృష్ణునిమీద పాటలుకట్టి పాడుతూ ముందుకు కొనసాగాడు. చివరికి ఆయన ఉడిపికి చేరుకుని శ్రీకృష్ణుడి విగ్రహంముందు రెండు చేతులూ జోడించి నుంచున్నాడు. మహాభక్తుడు అయిన వడిరాజతీర్థను ఉడిపి పీఠంలోని బాలకృష్ణుడు అనుగ్రహించాడు. ఫలితంగా వడిరాజతీర్థకు చూపు బాగుపడింది. ఆయనకు బాలకృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించాడు. స్వామివారి దివ్యదర్శనంతో వడిరాజతీర్థకు ఎంతో స్వస్థత చేకూరింది.

వడిరాజతీర్థ ఈ మానవ లోకాన్ని వదిలిపెట్టే దురదృష్ట సమయం ఆసన్నమైనది. ఫాల్గుణ, బహుళ, తృతీయ తిథినాడు వడిరాజతీర్థ సజీవంగా బృందావనంలో ప్రవేశించారు. ఆయన సమాధి అయిన మరుక్షణమే ఆయన భక్తులు భోరుభోరున విలపించారు. ఆ సమాధి నుండే వడిరాజతీర్థ

ఇంద్రుడు పంపిన రథంలో స్వర్గానికి వెళ్ళిపోయారు. అలా వెళ్ళేటప్పుడు ఆయన తాను ధరించిన వస్త్రాన్ని మరియు పాదుకల్ని తన శిష్యులకు తన జ్ఞాపకార్థంగా ప్రసాదించాడు. ఇప్పటికీ ప్రతి సంవత్సరం వడిరాజతీర్థ ఆరాధన జరిగే సమయంలో ఆయన జీవించినపుడు ధరించిన వస్త్రాలను మరియు పాదుకలను ఎంతో భక్తితో పూజిస్తారు.

వడిరాజతీర్థయొక్క ఆత్మ స్వర్గానికి చేరుకున్న తరువాత కూడా ఆయన తన భక్తుల్ని మర్చిపోలేదు. ఆయన జీవించి ఉన్న సమయంలో ఒక పుట్టుగుడ్డి మూగ మరియు అవిద్యావంతుడు అయిన ఒక బ్రాహ్మణ యువకుడు ఆయనవద్ద పనులుచేస్తూ ఉండేవాడు. వడిరాజతీర్థ వస్త్రాలు ఉతకటం, ఆయన భోజనం చేసిన పాత్రలు కడగటం లాంటివి కూడా ఆ బ్రాహ్మణ యువకుడు చేస్తూ ఉండేవాడు. తనకు అన్నిరకాలుగా సపర్యలుచేస్తున్న ఆ బ్రాహ్మణ యువకుడికి ఏదోఒక సమయంలో తగిన ప్రత్యుపకారం చెయ్యాలని వడిరాజతీర్థ అనుకుంటూ ఉండేవాడు.

ఏదిఏమైనా ఆ బ్రాహ్మణ యువకుడికి ఏ సహాయం చెయ్యకుండానే వడిరాజతీర్థ బృందావనంలోకి ప్రవేశించి ఆపై అవతారాన్ని చాలించారు. కానీ ఆ బ్రాహ్మణ యువకుడు, వడిరాజతీర్థను నిరంతరమూ తలచుకుంటూ ఉండేవాడు. వడిరాజతీర్థ తాను అవతారాన్ని చాలించిన కొన్ని ఏళ్ళ తరువాత ఒకరోజున ఆ బ్రాహ్మణ యువకుడి స్వప్నంలో కనిపించి అతనితో ఇలా చెప్పాడు. "నేను వ్రాయాలి అనుకుని వ్రాయలేకపోయిన ఒక గ్రంథాన్ని నీచేత వ్రాయించాలి అనుకుంటున్నాను. నేను ప్రతిరోజూ నీకు కలలో కనిపించి ఆ గ్రంథంలో కొంతభాగం చెబుతాను. నీవు దానిని తెల్లవారిన తరువాత తాళపత్రాలపై వ్రాయాలి. ఇలా కొద్ది రోజులు వ్రాసినట్లయితే ఆ గ్రంథం పూర్తి అవుతుంది".

అన్నమాట ప్రకారమే ఒకరోజు రాత్రి వడిరాజతీర్థ ఆ అవిద్యావంతుడైన బ్రాహ్మణ యువకుడికి కలలో కనిపించి ఆ గ్రంథంలోని కొంతభాగాన్ని చెప్పాడు. మర్నాడు ఉదయం ఆ యువకుడు, ఉడిపి

పీఠాధిపతివద్దకు వెళ్ళి ఆయనతో ఇలా అన్నాడు. "నాకు రాత్రి స్వప్నంలో వడిరాజతీర్థ కనిపించి ఒక గ్రంథంలో కొంతభాగాన్ని నాకు చెప్పారు. అదిమీకు ఇప్పుడు వివరిస్తాను". ఒక పుట్టు మూగవాడు హఠాత్తుగా మాట్లాడటంచూసిన ఉడిపి పీఠాధిపతికి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది. ఆ తరువాత ఆ బ్రాహ్మణ యువకుడు రాత్రి తనకు కలలో వడిరాజతీర్థ చెప్పిన అనేక సంస్కృత పద్యాలను ఉడిపి పీఠాధిపతికి వినిపించాడు. అవిద్యావంతుడు అయిన ఆ బ్రాహ్మణ యువకుడు అద్భుతమైన సంస్కృత భాషలో అశువుగా పద్యాలను చెప్పటం చూసిన ఉడిపి పీఠాధిపతి నిర్ఘాంతపోయాడు.

ఏదిఏమైనా వడిరాజతీర్థయొక్క కరుణవల్ల మరియు మహత్యంవల్ల పుట్టుమూగవాడు, చెవిటివాడు మరియు అవిద్యావంతుడైన ఆ బ్రాహ్మణ యువకుడు ఆ గ్రంథం మొత్తాన్ని కొన్ని వారాలపాటు భాగాలు, భాగాలుగా ఉడిపి పీఠాధిపతికి వినిపించాడు. ఆ బ్రాహ్మణ యువకుడు అసువుగా చెబుతున్న పద్యాలు ఉడిపి పీఠాధిపతి నియమించిన కొందరు పండితులు తాటియాకు పత్రాలమీద వ్రాస్తూ ఉండేవారు. కొన్ని వారాల తరువాత ఆ గ్రంథం పూర్తి అయ్యింది.

ఈ సంఘటన జరిగిన కొన్ని సంవత్సరాలకే ఆ బ్రాహ్మణ యువకుడు హఠాత్తుగా చనిపోయాడు. ఆ బ్రాహ్మణ యువకుడికి వడిరాజతీర్థ కలలో కనిపించి చెప్పిన గ్రంథంపేరు "స్వప్న బృందావనాఖ్యానం". అద్భుతమైన ఈ గ్రంథంలో ఉన్న పద్యాలకు అర్థం ఏమిటో? మరియు వాటి ప్రాముఖ్యం ఏమిటో? ఆ గ్రంథాన్ని చదివిన ఏ పండితుడికి అర్థంకాలేదు. అలా చనిపోయిన ఆ బ్రాహ్మణ యువకుడు అనేక సంవత్సరాలు గడిచిన తరువాత మళ్ళీ జన్మించి సోదేమఠంలో సన్యాసి జీవితాన్ని గడిపి చివరికి ఆ మఠానికి పీఠాధిపతి అయ్యాడు. ఆ యువకుడే "స్వప్న బృందావనాఖ్యానం"లోని శ్లోకాలకు అర్థం ఏమిటో తెలియజేసే ఒక వ్యాఖ్యానాన్ని వ్రాసాడు.

ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడిని వివాహం చేసుకోవాలని నిర్ణయించు కున్న రుక్మిణీదేవి ఒక వృద్ధబ్రాహ్మణుడిని తన రాయబారిగా కృష్ణుడివద్దకు

పంపి కృష్ణుడికి తన నిర్ణయాన్ని ఆ రాయబారి ద్వారా తెలియజేసింది. దైవ అవతారుడైన శ్రీకృష్ణుని వివాహానికి కారకుడైన ఆ వృద్ధ బ్రాహ్మణుడు మహాపుణ్యాన్ని పొంది ఆపై మరుసటి జన్మలో వడిరాజతీర్థగా జన్మించాడని చెబుతారు. ప్రస్తుతం వైవస్వత మన్వంతరం జరుగుతున్నది. ఇది ముగిసి పోయిన తరువాత వచ్చే మన్వంతరంలో వడిరాజతీర్థ, వాయుదేవుడిగా అవతరిస్తాడని కొందరు పండితులు తెలియజేస్తున్నారు.

ఇప్పటికీ వడిరాజతీర్థ భక్తులు ఆ "స్వప్న బృందావనాఖ్యానం" ఆఖ్యానాన్ని ఎంతో భక్తితో పఠిస్తూ ఉంటారు. ఈనాడు వడిరాజతీర్థ భౌతికంగా లేనప్పటికీ ఆయన "అమర ఆత్మ" బృందావనం నుండి భక్తులను కరుణిస్తూ ఉంటుంది. సోదేలో ఉన్న ఆయన బృందావనాన్ని దర్శించి ఆయనను ప్రార్థించిన భక్తులకు కోరిన కోర్కెలు ఖచ్చితంగా తీరతాయని చెప్పుకుంటూ ఉంటారు.



## 20. ప్రాచీన తమిళనాడు నుండి అదృశ్యం అయిపోయిన కుమారిఖండ భూభాగం మిస్టరీ?

ఒకనాడు భూభాగాలుగా ఉన్నవి కాలక్రమంలో జలంలో మునిగిపోయి అదృశ్యంకావటం జరిగింది. ఒకప్పుడు ఉన్నది అని చెప్పబడిన అట్లాంటా అనే ఒక మహాఖండం కూడా అట్లాంటిక్‌లో మునిగిపోయింది. ఇంకొక విశేషం ఏమంటే ఈనాడు ఎడారులుగా ఉన్న కొన్ని ప్రదేశాలు గతంలో సముద్రాలుగా ఉండేవి. అందుకు ఉదాహరణగా కొన్ని ఎడారులలో సముద్ర జీవులయొక్క అస్తిపంజరాలు ఆ ఎడారులలో కొంతకాలం క్రితం లభించటం జరిగింది. ఒకప్పుడు భారతదేశంలోని తమిళనాడు భూభాగాన్ని కలుపుకుని ఒక మహాఖండం ఉండేదని ప్రాచీనకాలంనాటి తమిళ గ్రంథాలలో వ్రాయబడి ఉన్నది. ఆ భూ ఖండం పేరు "కుమారి ఖండం".

ఈ కుమారి ఖండాన్ని పాశ్చాత్యులు "లెమూరియా" అనేపేరుతో పిలిచారు. హిందూమహాసముద్రం మరియు పసిఫిక్ మహాసముద్రాలలో

ఈ కుమారిఖండం ఉండేదని పరిశోధకులు తెలియజేస్తున్నారు. దక్షిణ భారతదేశం నుండి ఈ ఖండం ద్వారా భూమార్గంలో ఆఫ్రికా ఖండానికి చేరుకునే అవకాశం ప్రాచీన కాలంలో ఉండేదని తెలుస్తున్నది. ఈ కుమారి ఖండాన్ని పాండ్యరాజులు 9990 సంవత్సరాలపాటు పరిపాలించారని, ఆ తరువాత ఆ ఖండం హిందూమహాసముద్రంలో మునిగిపోయిందని చెబుతారు.

కుమారిఖండం, భారతదేశపు దక్షిణ భూభాగము కొస నుండి పశ్చిమాన మడగాస్కర్ వరకు, తూర్పున ఆస్ట్రేలియా వరకు వ్యాపించి ఉండేది. కుమారిఖండం, ప్రాచీన లెమూరియా ఖండంలో భాగంగా ఉండేదని కొందరు వాదిస్తూ ఉండగా మొత్తం లెమూరియా ఖండమే కుమారిఖండం అని మరికొందరు ఉద్ఘాటిస్తున్నారు. ఏది ఏమైనా ఈ కుమారిఖండం, హిందూ మహాసముద్రం మరియు పసిఫిక్ మహా సముద్రాల మధ్య విస్తరించి ఉన్నదని అనేకమంది పరిశోధకులు విశ్వసిస్తున్నారు.

మదాంబ్లావ్‌టస్కీ (దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలు) రచించిన "సీక్రెట్ డాక్ట్రిన్" అనే గ్రంథంలో మానవ పరిణామ క్రమం "7 జాతులుగా" జరుగుతుందని వ్రాయబడి ఉన్నది. అందులో 3వ జాతి "లెమూరియా" అనే ఒక మహా ఖండంలో జీవించిందని, ఆ ఖండంలో నివసించిన ప్రజలు దాదాపు 7 అడుగులు ఎత్తు ఉండేవారని, వారు అర్ధనారీశ్వర శారీరక తత్వాన్ని కలిగి ఉండేవారని, గుడ్లు పెట్టటంద్వారా (గుడ్లద్వారా) తమ జాతిని అభివృద్ధి చేస్తున్నారని ఈ గ్రంథంలో పేర్కొనబడింది. వీరికి అనేక అతీంద్రియ శక్తులు ఉండేవని కూడా మదాంబ్లావ్‌టస్కీ పేర్కొన్నది.

దక్షిణ భారతదేశంలోని తమిళనాడు రాష్ట్రానికి చివర ఉన్న కన్యాకుమారి జిల్లా అంచు నుండి ఈ కుమారిఖండం ఉన్నట్లుగా భావించ బడుతున్నది. క్రీ.శ.2వ శతాబ్దంలో ప్రాచీన తమిళనాడులో 5 సాహిత్య గ్రంథాలు వ్రాయబడ్డాయి. వాటిలో "శిలప్పదికారమ్" అనే గ్రంథం ఒకటి. "క్రూరమైన హిందూమహా సముద్రం పాండ్యరాజ్యాన్ని తనలో కలుపుకున్నదని ఈ శిలప్పదికారమ్‌లో వ్రాయబడి ఉన్నది".

5వేల సంవత్సరాల క్రితం మడగాస్కర్ మరియు దక్షిణభారతదేశ భూభాగం కలిసి ఉండేవి. ఆ సమయంలో వచ్చిన జలప్రళయం కారణంగా ఆ రెండు భూప్రాంతాలను కలిపిన భూ ఖండంలో చాలాభాగం సముద్రంలో మునిగిపోయింది. సముద్రంలో మునగకుండా మిగిలిన కొద్దిపాటి భూభాగం "మాల్‌దీవులు" అన్నపేరుతో ఈనాటికీ పిలువబడుతున్నాయి. ఇంకొక విశేషం ఏమంటే ఈ మాల్‌దీవులు అన్నపేరు గతంలో పశ్చిమ కనుమల నుండి మడగాస్కర్ వరకు వ్యాపించి ఉన్న మలై పర్వతశ్రేణుల పేరుమీదుగా ఏర్పడింది అని గుర్తించాలి.

ఇంకొక విశేషం ఏమంటే రామాయణ మహాగ్రంథంలో పశ్చిమ కనుమలు "మలయపర్వతములు" అన్నపేరుతో పేర్కొనబడినవి. ఆ కాలంలో పశ్చిమ కనుమలు మడగాస్కర్ వరకు వ్యాపించి ఉండేవి అని గ్రహించాలి.

కుమారి పర్వత శ్రేణులలో కుమారి మరియు కొల్లాం అనే రెండు శిఖరాలుఉండేవని, అవి జలప్రళయ సమయంలో హిందూ మహా సముద్రంలో మునిగిపోయాయని "శిలప్పదికారం" అనే గ్రంథంలో వ్రాయబడి ఉన్నది. ఈనాటికీ ఆ పశ్చిమ కనుమల దగ్గరలో కేరళ రాష్ట్రంలో "కొల్లాం" అనేపేరుగల పట్టణం ఉన్నది. దీనినిబట్టి చూసినట్లయితే ప్రాచీన కాలంలో పశ్చిమ కనుమలకు ఆనుకుని ఉన్న కుమారి పర్వతాలలో కొల్లాం అనే శిఖరం ఉన్నట్లుగా నమ్మక తప్పదు.

పశ్చిమ కనుమలు హిందూమహాసముద్రంలో కొంతవరకు ప్రాచీన కాలంలో విస్తరించి ఉండేవి అన్నమాట. వీటినే ఆ కాలంనాటి తమిళ ప్రజలు "కుమారి పర్వతశ్రేణి" అని పిలిచేవారు.

ఆదియార్ కున్నలార్ అనే 12వ శతాబ్దానికి చెందిన ఒక పౌరాణిక గ్రంథ విమర్శకుడి అభిప్రాయం ప్రకారం "ప్రాచీనకాలంలో కన్యాకుమారి దక్షిణ ప్రాంతంలో ఒక మహా భూభాగం ఉండేది. ఇది కుమారి నదికి దక్షిణంలోను, పహురులి నదికి ఉత్తరంలోను వ్యాపించి ఉన్నది. ఈ

భూభాగం 700 కవాటములు విస్తీర్ణాన్ని కలిగి ఉన్నది. (ఈ కవాటమును తమిళభాషలో "కటం" అనికూడా పిలుస్తారు. "కటం" అనగా 10.06 కి.మీ.)

ఈ మహాఖండం 49 నాడులుగా (ప్రాంతాలుగా/రాష్ట్రాలుగా) విభజించ బడి ఉండేది. వాటిలో 7 ప్రాంతాలను "ఎరుత్తెంగనాడు(కొబ్బరికాయ ప్రాంతాలు)". మరియొక 7 ప్రాంతాలను "ఎరుమతురైనాడు(మధురై ప్రాంతానికి చెందినవి)". మరియొక 7 ప్రాంతాలను "ఎలుమూన్‌పలైనాడు (ఇసుక ప్రాంతాలు)". ఇంకొక 7 ప్రాంతాలను "ఎలుప్పిన్‌పాలైనాడు(కొత్త ఇసుక ప్రాంతాలు)". మరికొన్ని 7 ప్రాంతాలను "ఎలుకున్ననాడు(పర్వత ప్రాంతాలు)". మరియొక్క 7 ప్రాంతాలను "ఎలుకునకరైనాడు(సముద్ర తీర ప్రాంతాలు)". మరియొక 7 ప్రాంతాలను "ఎలుకురంపానైనాడు(పొట్టి తాడిచెట్లు ఉన్న ప్రాంతాలు)".

ఈ నాడులలో 2 నాడులు లేదా ప్రాంతాలు ప్రస్తుతం తమిళనాడులో ఉన్న కొల్లాం మరియు కన్యాకుమారి జిల్లాలలో భాగాలు ఉండేవని ఈ విమర్శకులు అభిప్రాయ పడ్డాడు. ప్రాచీనకాలంలో తమిళనాడులోని కవులు మరియు పండితులు సమావేశమై తమిళభాష అభివృద్ధికోసం అనేక అద్భుతమైన గ్రంధాలు వ్రాసారు. ఈ సమావేశాన్ని తమిళభాషలో "సంగం" అని పిలిచారు. ప్రాచీనకాలంలో మొత్తం మూడు సంగమాలు జరిగాయి. అందులో మొదటి రెండు సంగమాలు ఈ కుమారిఖండంలో జరిగాయని 7వ శతాబ్దానికి చెందిన తమిళ సాహిత్య పరిశోధకుడు నక్కీర్‌నార్ తన గ్రంధంలో పేర్కొన్నాడు. ఆ విమర్శకుడు ఇచ్చిన సమాచారం ప్రకారం చూసినట్లయితే తొలి సంగమం పాండ్యరాజధాని నగరమైన మధురై నగరంలో జరిగింది. అప్పట్లో మధురై నగరాన్ని "కాడల్‌కొండ తెన్‌మధురై అని పిలిచారు. అనగా "దక్షిణమధురై" అని అర్థం. ఈ దక్షిణమధురైలో మొదటి సంగమ సభ 4440 సంవత్సరాలపాటు జరిగింది. ఈ సభలో 549 మంది సభ్యులు ఉన్నారు. ఈ సభ్యులలో శివుడు, కుబేరుడు,


AFRICA
ARABIAN SEA
SOUTHERN INDIA (DECCAN)
POTHIGAI HILLS
KAYATA PURAM
BAY OF BENGAL
SRI LANKA (CEYLON)
ANCIENT KUMARI KANDAM
>>>>>>>
KUMARI ARU
THEN MADURAI
SUMATRA
JAVA
PERU ARU
SUBMERGED TAMIL NADU
MUTHUR
PAHRULI
PANDYAN KINGDOM
MERU MOUNTAIN
MADAGASCAR
PERUMALA NADU
KANNI
OLINADU
AUSTRALIA

మురుగన్ (సుబ్రహ్మణ్యస్వామి) లాంటి దేవతలు కూడా ఉన్నారని చెప్పబడింది. మొదటి సంగమ సభకు 4449 మంది కవులు వచ్చారు. వారు అనేక పద్య గ్రంధాలను వ్రాసారు. ఈ సంగమ సభ జరిగిన కాలంలో దాదాపు 89మంది పాండ్యరాజులు పరిపాలించారు. ఈ పాండ్యరాజుల పరిపాలనా కాలాన్ని ఆధారంగా తీసుకుని పరిశీలించినట్లయితే మొదటి సంగమసభ క్రీ.పూ.తొమ్మిదివేల సంవత్సరాల పరిధిలో జరిగినట్లు భావించవచ్చు.

మంచుయుగం చివరిలో వచ్చిన మొదటి జలప్రళయ (సునామి) సమయంలో కుమారిఖండం భారతదేశ దక్షిణ చివరి భాగంలో ఉన్న దక్షిణ మధురై పట్టణం నుండి దక్షిణంవైపు వ్యాపించి ఉండేది.

కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం ఇప్పటికి పదకొండువేల సంవత్సరాల క్రితం కుమారి ఖండాన్ని పరిపాలించిన పాండ్య రాజ్యం తీవ్రమైన జలప్రళయానికి (బహుశా సునామి అయి ఉండవచ్చు) గురి అయ్యింది. ఆ సమయంలో ఆ ప్రాంతంలోని ప్రజలు అక్కడి నుండి కుమారి పర్వత ప్రాంతాలకు చేరుకున్నారు. ఈ కుమారి పర్వత ప్రాంతాన్ని మలైయరిడ్జ్ (మలై పర్వత వరుసలు లేదా శ్రేణులు) అనేపేరుతో కూడా పిలుస్తారు. ఈ పర్వతశ్రేణుల వద్ద నుండి దక్షిణభారతదేశపు నైరుతి సముద్ర తీరాల వరకు వ్యాపించారు ఈ ప్రజలు. ఆ తరువాత ఆ ప్రజలతోపాటు వలస వచ్చిన పాండ్యరాజులు ఆ ప్రాంతంలో పాండ్యరాజధాని నగరాన్ని ఏర్పాటుచేసుకుని దానికి "కవాటం" అనే పేరు పెట్టుకున్నారు.

ఈ మొదటి సంగమ సభ జరుగుతున్న కాలంలోనే కుమారిఖండం లోని భూమి కొంచెం కొంచెంగా హిందూమహాసముద్రంలో మునిగిపోవటం ఆరంభించింది. ఫలితంగా పాండ్యరాజవంశము మరియు ప్రజలు కుమారిఖండంలో భూమిగా మిగిలిన భాగంలోకి వలస వెళ్ళిపోయారు. అప్పటి నుండి పాండ్యరాజులు, కపటపురాన్ని తమ రాజధానిగా

చేసుకున్నారు. ఆ సమయంలో ప్రస్తుత తమిళనాడు భూభాగాన్ని చేర, చోళ మరియు 46 చిన్నరాజులు పరిపాలిస్తూ ఉండేవాళ్ళు.

దాదాపు పదకొండువేల సంవత్సరాల క్రితం కుమారిఖండంలో మొదటి "సంగమ సభ" జరిగింది. ఆ సమయంలో హిందూ మహా సముద్రంలో వచ్చిన తొలి జలప్రళయం కారణంగా ఆ ప్రాంతం ప్రజలు అరేబియా సముద్రం వైపు వలస వచ్చారు. వారిలో కొంతమంది ప్రజలు ఉత్తరంవైపు వెళ్ళారు. అనగా భూమధ్య రేఖకు ఉత్తరంవైపు చేరుకున్నారు. వారు చేరుకున్న ఉత్తర ప్రాంతాన్ని "సుమేరు" అని పిలిచారు. ఆనాడు కుమారిఖండం నుండి ఉత్తర ప్రాంతానికి వలస వచ్చిన ప్రజలు నివసించే ప్రాంతాలలో ఒకదానికి "సుమేరియా" అన్నపేరు పెట్టటం జరిగింది. (సుమేరియా నాగరికత ప్రపంచ ప్రాచీన నాగరికతలలో ప్రముఖమైనదిగా పేర్కొనబడింది).

త్రేతాయుగంలో జరిగిన రామాయణకాలంలో కవాటం ప్రస్తావన కనిపిస్తుంది. దక్షిణ భారతదేశంలో కవాటం అనే ఒక నగరం ఉన్నదని సుగ్రీవుడు చెబుతాడు. క్రీ.పూ. 3500 సంవత్సరంలో వచ్చిన 3వ జలప్రళయంలో ఈ కవాటం నగరం సముద్రంలో మునిగిపోయింది. ఒక విచిత్రం ఏమంటే ఈ కవాటం నగరం జలసమాధి అయిపోయినప్పటికీ ఆ నగరంపేరు మాత్రం ఆ తరువాతకాలంలో కూడా ప్రజల జ్ఞాపకాలలో నిలిచిపోయింది. ఆ కారణంగానే ఆనాటి కవాటం నగరానికి దగ్గరలో ఉన్న అనేక ప్రదేశాలకు కవాటం అన్నపేరు పెట్టటం జరిగింది. ఇంకొక విశేషం ఏమంటే ఈ కవాటం అన్న నగరానికి "అలవై" అన్న ఇంకొక పేరు కూడా ఉన్నది. అలవై అనగా తమిళ భాషలో "సర్పంయొక్క నోరు" అనిఅర్థం. ఈ అలవై లేదా కవాటం ప్రాంతం నుండి వరద కారణంగా దక్షిణవైపుకు వచ్చిన ప్రజలలో కొందరు కేరళ భూభాగానికి చేరుకున్నారు. ఆ తరువాత తమ పాత నగరం పేరైన అలవైని తాము వచ్చిన కొత్త ప్రాంతంలోని ఒక ప్రదేశానికి పెట్టుకున్నారు. అదే ఈనాడు కేరళలో ఉన్న ఆల్వే పట్టణం కావటం విశేషం.

ఇక రెండవ సంగమసభ పాండ్యుల కొత్తరాజధాని నగరమైన కపటపురంలో జరిగింది. ఈ సభ దాదాపు 3700 సంవత్సరాలపాటు కొనసాగింది. ఈ సభలో 59మంది సభ్యులు, 3700 మంది కవులు పాల్గొన్నారు. రెండవ సంగమ సభ జరిగిన కాలంలో దాదాపు 59 మంది పాండ్యరాజులు రాజ్యాన్ని పాలించారు. ఆ తరువాత కొంత కాలానికి కపటపురం కూడా సముద్రంలో మునిగిపోయింది. రామాయణం మరియు చాణుక్యుడు వ్రాసిన అర్ధశాస్త్ర గ్రంధాలలో దక్షిణభారతదేశంలో ఆనాడు ఉన్న కపటపురం గురించి ప్రస్తావించబడింది. పాండ్యుల రాజధాని నగరమైన కపటపురమే ఈ కవటపురమని గుర్తించాలి.

రెండవ జలప్రళయం సమయంలో కొల్లాం పర్వతశ్రేణులు సముద్రంలో మునిగిపోయాయి. దాంతో ఆ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలు అక్కడ నుండి బయలుదేరి పశ్చిమ కనుమల నుండి రాజస్థాన్ వరకు చేరుకున్నారు.

రెండవ సంగమం ముగిసేనాటికే కుమారిఖండం సముద్రంలో మునిగి పోయింది. దాంతో పాండ్యరాజులు, చోళ మరియు చేర రాజుల ఆధీనంలో ఉన్న రాజ్యాలను (నేటి తమిళనాడును) జయించి, ఆ తరువాత భారత ద్వీపకల్పానికి దక్షిణకొసలో ఉన్న "కొరకాయ్" అనే రేవు పట్టణాన్ని తమ రాజధానిగా చేసుకున్నారు. ఆ తరువాత కాలంలో పాండ్యులు తమ రాజధానిని కొరకాయ్ నుండి నేటి మధురై పట్టణానికి మార్చుకున్నారు.

మూడవ సంగమ సభ నాటి పాండ్యుల రాజధాని నగరమైన మధురై పట్టణంలో (ఆనాటి మధురై పట్టణం ఇప్పటికీ నిలిచే ఉన్నది) జరిగింది. ఈ సభ 1850 సంవత్సరాలపాటు కొనసాగింది. ఈ సభలో 49మంది సభ్యులు ఉన్నారు. దాదాపు 449మంది కవులు ఈ సభలో పాల్గొన్నారు.

(నోట్ : మొదటి సంగమ సభ జరిగిన మధురై పట్టణం, కుమారి ఖండంలో ఉండేది. అది హిందూమహాసముద్రంలో మునిగిపోయింది.

అలా మునిగిపోయిన మధురై పట్టణాన్ని "దక్షిణమధురై" అని పిలిచారు. ఇక మూడవ సంగమ సభ జరిగిన మధురై పట్టణం కూడా కుమారిఖండంలో మునిగిపోయిన మధురై పట్టణం పేరుతో పిలువబడటం విచిత్రం.)

**కుమారిఖండం (లెమూరియా) ఉనికిని బలపరచే సాహిత్య అధారాలు :**

కుమారిఖండం భూమిగా ఉన్నప్పుడు ఆ ఖండంలో నివసించిన తమిళ మహర్షి మయన్ వ్రాసిన "అయింత్రం" అనే గ్రంథం సంగమ సభ జరిగిన కాలంలో ఎంతో ప్రముఖమైనదిగా గుర్తించబడింది. ఈ గ్రంథంలో నాటి కుమారిఖండం యొక్క భౌగోళికరూపం చాలా స్పష్టంగా వివరించబడి ఉన్నది. ఇంకా ఆనాడు సంస్కృత భాషలో వ్రాయబడిన భాగవత పురాణంలో కూడా కుమారి ఖండానికి సంబంధించిన సమాచారం లభిస్తున్నది.

సంగమ వాంఙ్మయకాలంలో రచించబడిన "మణిమేఖలై" అనే గ్రంథంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే ఆనాడు కుమారి ఖండంలో భాగంగా ఉన్న "పుంపుహార్" అనే సముద్రతీర పట్టణం హిందూమహాసముద్రంలో వచ్చిన ఒక భయంకరమైన "సునామీ" కారణంగా సముద్రంలో మునిగిపోయినట్లుగా తెలుస్తున్నది. ఈనాటి పుంపుహార్ పట్టణానికి ఆనుకుని ఉన్న సముద్ర తీరంలో ఆనాడు మునిగిపోయిన పుంపుహార్ పట్టణ శిథిలాలు కనిపిస్తున్నాయని భారతీయ పురావస్తుశాఖ నిర్ధ్వందంగా ప్రకటించింది.

భారతదేశపు దక్షిణ దిశలో ఉన్న హిందూమహాసముద్రం నుండి పశ్చిమ దిశలో ఉన్న అరేబియా సముద్రం వరకు కుమారి పర్వత శ్రేణులు వ్యాపించి ఉండేవి.

ఈనాడు పశ్చిమ భారతదేశంలో (మహారాష్ట్ర-కేరళ) వ్యాపించి ఉన్న పశ్చిమ కనుమలకు (వెస్టర్న్ ఘాట్స్) ఆనుకుని ఉన్న మెకరేన్ పీఠభూమి ప్రారంభం నుండి కుమారి పర్వత శ్రేణులు ఉండేవి.

తమిళ పద్యగ్రంథమైన "తమిళ్‌వీడ్ ధూదు"లో కుమారిఖండంయొక్క భౌగోళికరూపం వర్ణించబడింది. పాండ్యరాజైన నడియన్, కుమారిఖండం

లోని పర్వతలోయ ప్రాంతానికి నీరును పారించటంకోసం పహ్రూలినదిని త్రవ్వించాడని ఇదే గ్రంథంలో చెప్పబడింది.

మూడవ సంగమకాలంలో రచించబడిన "పురనానూర్" అనే గ్రంథంలో కుమారిఖండం గురించి, ఆ ఖండంలో ఉన్న పహ్రూలి నది గురించి వర్ణించబడి ఉన్నది.

తమిళ వ్యాకరణ గ్రంథమైన "నన్నూల్"లో కుమారిఖండం గురించి చెప్పబడి ఉన్నది.

మత్స్యపురాణంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే కుమారిఖండంలో ఉన్న ద్రవిడ దేశాన్ని "మను" అనే రాజు పరిపాలించాడని తెలుస్తున్నది. ఒక విశేషం ఏమంటే గరుడపురాణంలో కూడా కుమారిఖండం గురించిన ప్రస్తావనలు కనిపిస్తాయి.

సంస్కృత భాషలో దక్షిణార్ధ గోళాన్ని (భూమి దక్షిణంవైపు భాగాన్ని మరియు దక్షిణ ధృవాన్ని "కుమేరు" అని పిలిచేవారు. అదేవిధంగా ఉత్తరార్ధ గోళాన్ని మరియు ఉత్తర ధృవాన్ని "సుమేరు" అని పిలవటం జరిగింది. ఈ ప్రకారం చూసినట్లయితే భారతదేశపు దక్షిణ భాగాన్ని "కుమేరు" అని పిలిచి ఉంటారు. బహుశా ఈ "కుమేరు" ప్రాంతంలో ఉండే ఆనాటి ప్రాచీన భూభాగాన్ని "కుమారిఖండము" అనేపేరుతో పిలిచి ఉండవచ్చునని కొంతమంది పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

**ప్రాచీన చైనా మరియు గ్రీకు రచనలలో కుమారిఖండ ప్రస్తావనలు :**

ప్రాచీనకాలంలో భారతదేశానికి వచ్చిన అనేకమంది చైనా మరియు గ్రీకు యాత్రికులు కుమారిఖండాన్ని దర్శించినట్లుగా ఆ యాత్రలో వారు వ్రాసిన గ్రంథాల ద్వారా తెలుస్తున్నది. ఆనాడు కుమారిఖండంలో ఉన్న బంగారు గనులలో పని చెయ్యటంకోసం వేలాదిమంది చైనా శ్రామికులు నియమించబడ్డారని ఒక చైనా యాత్రికుడు వ్రాసాడు. 49 శిఖరాలుగల "మేరు" అనే ఒక పర్వతం కుమారిఖండంలో ఉండేదని, ఆ పర్వతం

నుండే కుమారి నది, పెరూ నది, పహ్రూలి నది ఆవిర్భవించాయని ఆనాటి తమిళ సాహిత్యంలో వ్రాయబడి ఉన్నది.

క్రీ.పూ.350-290 సంవత్సరాల మధ్య జీవించిన మెగస్తనీస్ అనే ఒక గ్రీకు రచయిత, పరిశోధకుడు మరియు యాత్రికుడు "ఇండికా" అనే ఒక మహాగ్రంథాన్ని వ్రాసాడు. ఆసేతుహిమాచలము కాలినడకన సంచరించిన మెగస్తనీస్ భారతదేశంలో తనకు ఎదురైన అనుభవాల గురించి తన ఇండికా గ్రంథంలో చాలా వివరంగా తెలియజేసాడు. అతడి గ్రంథంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే దాదాపు 2,300 సంవత్సరాల క్రితం తప్రోబేనే అనే ఒక దీవి (ఈనాటి శ్రీలంక) ఒక నదిచేత భారత భూ ఖండం నుండి వేరుచేయబడి ఉన్నది అని తెలుస్తున్నది.

మెగస్తనీస్‌చేత గుర్తించబడిన ఆ నది పేరు తమిరబరని. నేడు ఆ నదిపేరు పురునాయ్. ప్రస్తుతం పురునాయ్ నది సముద్రంలో కలుస్తున్నది. అంటే మెగస్తనీస్ కాలంలో ఈ నది ఆనాటికీ ఇంకొంచెం మిగిలి ఉన్న కుమారిఖండం భూభాగం గుండా శ్రీలంక వరకు ప్రవహించి ఉంటుందని అర్థంచేసుకోవచ్చు.

భారత పురావస్తుశాఖవారి పరిశోధనల్లో తేలిన ఒక విశేషం ఏమంటే క్రీ.పూ.3వ శతాబ్దంలో ప్రాచీన పుంపుహార్ పట్టణం సముద్రంలో వచ్చిన ఒక భయంకర సునామీ వల్ల సముద్రం పాలయ్యింది.

క్రీ.పూ.4వ శతాబ్దానికి చెందిన కుండలు మరియు మట్టి పాత్రలు ఈ పుంపుహార్ పట్టణానికి తూర్పువైపున సముద్రంలో లభించాయి.

భూగర్భశాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం ఒకప్పుడు కుమారిఖండం ఉన్నది అని చెప్పబడుతున్న ప్రదేశంలో హిందూమహాసముద్రం లోతు కనిష్టంగా 200 మీటర్లు, గరిష్టంగా 2000 మీటర్లు ఉన్నది. తక్కువలోతు అనగా 200 మీటర్ల లోతు ఉన్న ప్రదేశంలో ఒకప్పుడు భూమి ఉండి ఉండి ఉంటుందని, ఆ తరువాతకాలంలో ఆ భూమి సముద్రంలో మునిగి

పోయి ఉంటుందని, అలా సముద్రంలో భూమి మునిగిన కారణంగానే అక్కడ సముద్రం లోతు తక్కువగా ఉన్నదని తెలుస్తున్నది.

కొన్ని ఆస్ట్రేలియా ఆదిమజాతులవారు, ఆఫ్రికా ఆదిమజాతులవారు, బంగళాఖాతంలో ఉన్న అండమాన్ నికోబార్ దీవుల్లో నివసించే జాతుల వారు, అరేబియా సముద్రంలో (కేరళవైపు) ఉన్న లక్షదీవులలో జీవిస్తున్న జాతులవారు మాట్లాడే భాషలు చాలా వరకు తమిళ భాషను పోలి ఉంటాయి. దీన్నిబట్టి అర్థం చేసుకోవలసింది ఏమంటే ప్రాచీనకాలంలో భారతదేశం, ఆస్ట్రేలియా మరియు మడగాస్కర్ దీవులను కలిపే ఒక భూభాగం ఉండి ఉంటుందని. ఆ భూభాగమే కుమారిఖండం అనటంలో అనుమానం ఎంతమాత్రం లేదు.

ఈనాడు ఆఫ్రికా ఖండంలోని హిందూమహాసముద్రం తీరంలో ఉన్న మడగాస్కర్ దీవులలో కొన్ని ప్రాచీనకాలపు జంతువులయొక్క శిలాజాలు (ఫాజిల్స్) లభించాయి. ఈ శిలాజాలుగా మారిపోయిన జంతువులు ఇతర ఆఫ్రికా ఖండంలోని జంతువులకు విభిన్నంగా ఉన్నాయని ఒక పరిశోధకుడు కనుగొన్నాడు. ప్రాచీనకాలంలో భారతదేశ దక్షిణభాగంలో ఆనాడు నివసించిన జంతువులు మరియు శిలాజాలుగామారి మడగాస్కర్ దీవులలో (ఆఫ్రికా) లభించినవి. ఒకే ప్రాంతంలో నివసించాయని ఆ పరిశోధకుడు కనుగొన్నాడు. ఒకప్పుడు మడగాస్కర్ మరియు దక్షిణభారతదేశము కలిసి ఉండేవని, కాలక్రమంలో వచ్చిన 3, 4 జలప్రళయాల (వరదలు) కారణంగా ఈ రెండు ప్రాంతాలను కలిపిన విశాలమైన భూఖండం సముద్రంలో మునిగి పోయిందని ఆ పరిశోధకుడు అంచనావేసాడు. ఈ రెండు ప్రాంతాలను కలిపిన ఆ పెద్ద భూ ఖండమే లెమూరియా (కుమారి ఖండం) అని ఆ శాస్త్రజ్ఞుడు సిద్ధాంతీకరించాడు.

భారతదేశంలో మాత్రమే జీవిస్తున్న "జెబు" జాతి పశువులు కేవలం ఈనాటి మడగాస్కర్ (ఆఫ్రికా) దీవులలో మాత్రమే కనపిస్తున్నాయి. ఆఫ్రికాలో భాగంగా ఉన్న మడగాస్కర్ దీవులలో దక్షిణ భారతదేశంలో కనిపించే

పశువులు ఎలా కనిపిస్తున్నాయి?. ఒకప్పుడు మడగాస్కర్ మరియు దక్షిణ భారతదేశం ఒక భూ ఖండంచేత కలిపి ఉంచబడ్డాయి. ఆ సమయంలో దక్షిణ భారతదేశానికి చెందిన పశువుల కాపరులు తమ పశువులను మేపుతూ మడగాస్కర్‌దాకా వెళుతూ ఉండేవారు.



# 21. 40 రోజులపాటు స్వచ్ఛంధ సజీవ సమాధిలో జీవించిన హఠయోగి సాధుహరిదాస్?

భారతదేశంలో ఎందరో మహర్షులు, యోగులు, సాధువులు, సన్యాసులు, ఫకీర్లు సంచరించారు. ఈ సిద్ధపురుషులు తమ జీవితకాలంలో ఎన్నో మహత్యాలను ప్రదర్శించారు. యోగశాస్త్రంలో చెప్పబడిన అనేక నిగూఢమైన సాధనలు ఏళ్ళతరబడి చేసిన కారణంగా వీరికి అద్భుతమైన అతీంద్రియ శక్తులు వచ్చాయి. వారు తమ జీవితకాలంలో పొందిన గుర్తింపు కన్నా తాము భౌతికదేహం చాలించిన తరువాతే ఎక్కువ గుర్తింపు పొందటం జరిగింది. ఇలాంటి యోగపురుషులలో ఒకడు సాధుహరిదాస్. 19వ శతాబ్దంలో జీవించిన ఈ హఠయోగి యోగశాస్త్రంలో అపారమైన పాండిత్యంగలవాడని చెబుతారు. ఈయన తనలోని కుండలినీశక్తి సాయంతో ఎన్నో అద్భుతమైన మహత్యాలను ప్రదర్శించాడని చెబుతారు. ఈయన చేసిన అనేక మహత్యాలకు లిఖిత పూర్వక ఆధారాలు లభించటం విశేషం.

19వ శతాబ్దంలో పంజాబ్ ప్రాంతాన్ని పరిపాలించిన రంజిత్‌సింగ్ గొప్ప పరిపాలనాదక్షుడిగా గుర్తించబడ్డాయి. అంతేకాకుండా ఆయన బ్రిటీష్ వారితో స్నేహ సంబంధాలు కొనసాగించాడు. ఆనాడు భారతదేశాన్ని తమ గుప్పెట్లో ఉంచుకున్న బ్రిటీషువారితో విరోధం పనికిరాదని గుర్తించాడు రంజిత్‌సింగ్ ఆస్థానంలో బ్రిటీష ప్రభుత్వం తరపున ఒక ప్రతినిధి ఉండేవాడు.

"జమ్మూ పర్వతాలలో జీవిస్తున్న ఒక ఫకీర్ (సన్యాసి) తన శిష్యులచేత భూమిలో పాతిపెట్టబడతాడని, కొన్ని నెలల తరువాత అతడిని భూమిలోంచి బయటకు తీసిన తరువాత అతడు మళ్ళీ గాలి పీల్చుకుని మామూలుగా సంచరిస్తాడని" తన రాజ్యంలోని చాలామంది చెప్పుకోవటంవిన్న రంజిత్‌సింగ్‌కి చాలా ఆశ్చర్యం వేసింది. ఒక మనిషి కొద్దిసేపు గాలి పీల్చుకోకపోతేనే మరణిస్తాడు. అలాంటిది కొన్ని నెలలపాటు భూమిలో సమాధిచేయబడ్డ మనిషి మళ్ళీ బ్రతికి బయటపడటం అసాధ్యమని, అందులో ఏదో మోసం ఉండి ఉంటుందని రంజిత్‌సింగ్‌కి అనిపించింది. ఇందులో ఉన్న నిజానిజాలు తానే ప్రత్యక్షంగా తెలుసుకోవాలని నిర్ణయించుకున్న రంజిత్‌సింగ్ కొంతమంది అధికారులను సాధుహరిదాస్ దగ్గరకు పంపించాడు.



**మేకులతో చేసిన పడకపై విశ్రమించిన సాధుహరిదాస్.**

తనను పరీక్ష చెయ్యటానికి రంజిత్‌సింగ్ తనని ఆహ్వానిస్తున్నాడని ఆ ఫకీర్‌కి అర్థమయ్యింది. హఠయోగంయొక్క గొప్పతనం రంజిత్‌సింగ్‌కి నిరూపించాలన్న లక్ష్యంతో సాధుహరిదాస్ మరేమీ ఎదురుచెప్పకుండా రంజిత్‌సింగ్ ఆస్థానానికి వెళ్ళాడు.

క్రీ.శ.1837లో నాటి పంజాబ్ రాజ్య పరిపాలకుడైన రంజిత్‌సింగ్ సముఖంలో లాహెూర్ పట్టణాన్ని ఆనుకుని ఉన్న ఒక తోటలో సాధుహరిదాస్‌ని సమాధి చేసారు (ప్రస్తుతం లాహెూర్, పాకిస్తాన్‌లో ఉన్నది). సాధుహరిదాస్ తన కుండలినీ శక్తిని ఉపయోగించి ఆహారము, నీరు, కనీసం పీల్చుకునే గాలికూడా లేకుండా భూగర్భంలో 40 రోజుల పాటు స్వచ్ఛందంగా సమాధి అయ్యాడు. ఆ సమయంలో అనేకమంది ఫ్రెంచ్ మరియు ఆంగ్లేయ వైద్యులు అక్కడే ఉన్నారు. వందలాదిమంది ప్రజలు ఈ అద్భుత దృశ్యాన్ని ఊపిరిబిగపట్టి మరీ వీక్షించారు.

రంజిత్‌సింగ్‌కి తనయొక్క కుండలినీ శక్తిని చూపించటానికి అంగీకరించాడు సాధుహరిదాస్. అయితే సమాధి అవటానికి ముందు కొద్దిరోజులపాటు తాను ప్రత్యేక నియమాలను పాటిస్తానని సాధుహరిదాస్, రంజిత్‌సింగ్‌కి తెలియజేసాడు. రంజిత్‌సింగ్ అందుకు అంగీకరించాడు. అప్పటి నుండి సాధుహరిదాస్ ప్రతిరోజూ అతికొద్ది పరిమాణంలో పాలను ఆహారంగా తీసుకోవటం మొదలుపెట్టాడు. సజీవ సమాధి అయ్యే రోజున ఆయన ఏ ఆహారం తీసుకోకుండా ఉండి, ఆపై 30 గజాల పొడవు మరియు 3 వ్రేళ్ళ (ఫింగర్స్) వెడల్పు ఉన్న ఒక నార వస్త్రాన్ని మింగి, ఆపై ఆ వస్త్రాన్ని వెంటనే పొట్టలోంచి నోటిద్వారా బయటకు లాగాడు. సమాధి అవటానికి ముందు తన ఉదరం శుభ్రం కావటంకోసమే ఆయన ఆ వస్త్రాన్ని మింగి మళ్ళీ బయటకు తెప్పించాడని చెప్పటం జరిగింది.

సమాధి అవటానికి ముందు ఆ సాధువు తన శరీరంలో ఉన్న నవ రంధ్రాలకు సువాసన పూరితమైన మైనంతో తయారుచేయబడిన బిరడాలను బిగించుకున్నాడు. ఆపై పద్మాసనంలో కూర్చున్నాడు. ఆ తరువాత తన నాలుకను వెనక్కివంచి గొంతులోకి చేర్చుకున్నాడు. ఆ తరువాత తన రెండు చేతుల్ని ఛాతీమీద అటు ఇటు వేసుకుని, ఆపై శ్వాసను స్తంభింపచేసాడు.

ఆ తరువాత కొందరు సైనికులు - గాలి, నీరు చొరబడని ఒక ప్రత్యేక వస్త్రాన్ని (వస్త్రంపై దట్టంగా మైనాన్ని పూస్తారు. దానివల్ల ఆ వస్త్రంగుండా గాలిగాని, నీరుగాని అవతల వైపుకి వెళ్ళలేదు. ఈ వస్త్రాన్ని ఆయన శిరస్సు చుట్టూ బలంగా కప్పటంవల్ల ఆయనకు ఏమాత్రం

గాలిపీల్చుకునే అవకాశం ఉండదు) ఆయన శిరస్సుపై కప్పి ఆపై తాళ్ళతో ఆ వస్త్రాన్ని ఆయనకు ఆయన మెడకు గట్టిగా బిగించి కట్టటం జరిగింది. ఆ తరువాత ఆయనను ఒకపెద్ద మరియు బలమైన చెక్కపెట్టెలో ఉంచి ఆపై అది తెరుచుకోకుండా ఉండటంకోసం దాని మూతకి బలమైన మేకులు కొట్టారు. ఆ తరువాత ఆ పెట్టెమీద రంజిత్‌సింగ్‌యొక్క రాజముద్ర ముద్రించబడింది. ఆ తరువాత ఆ పెట్టెను భూమిలోపల ఇటుకలతో కట్టబడిన ఒక చిన్న గదిలోకి చేర్చబడింది. ఆపై ఆ గదిపైన మూతవేసి దానిమీద ఎత్తుగా మట్టితో కప్పివేయబడింది.



**సాధుహరిదాస్‌ని ఇద్దరు వ్యక్తులు సమాధిచేస్తున్న దృశ్యాన్ని ఇక్కడ చూడవచ్చు. ఆ సమయంలో ఆ ప్రదేశంలో ఉన్న ఒక ఫ్రెంచి చిత్రకారుడు ఈ చిత్రాన్ని గీసాడు. అందువలన సాధుహరిదాస్ 40 రోజులపాటు సమాధిలో ఉన్నమాట యదార్థమని విశ్వసించక తప్పదు.**

ఆ తరువాత ఆ ఎత్తుగా ఉన్న మట్టిమీద ఒక సైనికుడు కాపలాగా కూర్చోపెట్టబడ్డాడు. అంతేకాకుండా ఆ సమాధిని ఎవరూ తెరవకుండా ఉండటంకోసం పగటిపూట నలుగురు సైనికులు, రాత్రిపూట ఎనిమిదిమంది సైనికులు కాపలాగా ఉంచబడ్డారు. 40 రోజులు గడిచాయి. మహారాజు రంజిత్‌సింగ్ సాన్నిధ్యంలో ఆ మట్టి తొలగించబడింది. ఆపై భూమిలో ఉన్న చెక్కపెట్టె బయటకు తియ్యబడింది. సాధుహరిదాస్ సమాధి అయిన సమయంలో ఉన్న ఫ్రెంచి మరియు ఆంగ్ల వైద్యులు ఈ సమయంలో కూడా ఇక్కడికి వచ్చారు. ఆ తరువాత ఆ చెక్కపెట్టెమీద ఉన్న రాజముద్ర సరిగా ఉన్నదా? లేదా? అని పరిశీలించి ఆపై ఆ పెట్టె తలుపును బిగించి ఉన్న మేకుల్ని తొలగించారు. ఆపై ఆ పెట్టెలో సమాధి స్థితిలో ఉన్న సాధుహరిదాస్‌ని పెట్టెలో నుండి బయటకు తీసి, ఆపై ఆయన శిరస్సును బలంగా కప్పి ఉన్న మైనపు వస్త్రాన్ని తొలగించారు. చెక్కబొమ్మలాగా నీలుక్కుపోయి ఉన్న సాధుహరిదాస్ మీద వేడినీళ్ళను ధారగాపోసారు. ఆ తరువాత ఆయన శరీరాన్ని మర్దనాచేసారు. ఆ తరువాత ఆయన శిరస్సుపైన, కంటిపాపలపైన, నాలుకపైన నెయ్యినివేసారు. ఆపై కొద్ది నిమిషాలలోనే సాధుహరిదాస్ కళ్ళుతెరచి చూసాడు. కొంతసేపటి తరువాత ఆయన శ్వాస పీల్చటం ప్రారంభించాడు. ఆపై ఆయన మామూలుగా మారి పోయాడు.

కుండలినీ శక్తిని నిద్రలేపగలిగిన యోగులు తమ శారీరక ధర్మాల్ని ఆపివేసి ఎంతకాలం అయినా సమాధిలో ఉండగలరని సాధుహరిదాస్ రుజువుచేసాడు. ఈ సంఘటనకు ప్రత్యక్ష సాక్షులైన అనేకమంది ఫ్రెంచి మరియు ఆంగ్లేయ వైద్యులు, భారతీయ యోగులయొక్క యోగశక్తిని ప్రత్యక్షంగాచూసి ఎంతగానో ఆశ్చర్యపోయారు.

సాధుహరిదాస్ 40 రోజులపాటు భూమి అడుగున సమాధిచేయబడి 41వ రోజున బయటకు తియ్యగానే ఎప్పటిలాగానే శ్వాసపీలుస్తూ కనిపించాడని, ఇది గొప్ప అద్భుతమని, ఇది జీవశాస్త్ర ధర్మాలను ధిక్కరించే అమానుష సంఘటన అని కెప్టెన్ ఓస్‌బర్న్ మరియు సర్‌క్లాడ్‌వేడ్ అనే ఇద్దరు ఆంగ్లేయ అధికారులు లిఖితపూర్వకంగా ప్రపంచానికి తెలియజేసారు.



## 22. హైందవ వివాహ సాంప్రదాయ రహస్యములు?

అన్నకి పెళ్ళికాకుండా తమ్ముడికి పెళ్ళిచెయ్యటం, అక్కకు పెళ్ళి కాకుండా చెల్లెలికి పెళ్ళిచెయ్యటం శాస్త్రప్రకారం మహాదోషంగా గుర్తించాలి. ఈ దోషాన్ని "పరివేదన" అని పిలుస్తారు. ఇలాంటి వివాహాలు పెద్దవాళ్లయొక్క (అన్నయ్య/అక్కయ్య) అధికారాన్ని భంగపరుస్తాయి. ఈ కారణంగానే ఇలాంటి వివాహాలు చెయ్యటం పాపం అని ధర్మశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి.

అన్నకి పెళ్ళికాకుండా తాను ముందుగా వివాహం చేసుకునే తమ్ముడిని "పరివిందక" అని పిలుస్తారు.

తనకన్నా ముందుగా తన తమ్ముడి పెళ్ళికి అంగీకరించిన అన్నను "పరివిన్న" అని పిలుస్తారు.

అక్కపెళ్ళి కాకుండా తాను ముందుగా వివాహం చేసుకున్న చెల్లెల్ని "పరివేదిని" అని పిలుస్తారు.

తనపెళ్ళి కన్నా ముందు తన చెల్లెలు పెళ్ళి జరగటానికి అంగీకరించిన అక్కను "దిధిషు" అని పిలుస్తారు.

తన కన్నా పెద్దవాడయిన తన అన్న, ముందుగా వివాహ సంబంధమైన హెూమాన్ని చెయ్యటం ధర్మం. అలా కాకుండా తాను ముందుగా వివాహం చేసుకుని ఆ హెూమం చెయ్యటం పాపంగా పరిగణించబడుతుంది.

ఇలాంటి వివాహాలకు పాల్పడిన వారికి తీవ్రపాపం సంక్రమిస్తుంది. అది ఎలాగంటే అక్క కన్నా ముందుగా పెళ్ళిచేసుకున్న చెల్లెలు, ఆమె భర్త, ఆమె తండ్రి, ఆమె మామగారు మరియు ఆ వివాహాన్ని జరిపించిన పురోహితుడు తప్పనిసరిగా నరకానికి వెళతారని ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది.

ఇలాంటి వివాహాలకు పాల్పడిన వారికి తీవ్రపాపం సంక్రమిస్తుంది. అది ఎలాగంటే అన్న కన్నా ముందుగా పెళ్ళిచేసుకున్న తమ్ముడు, అతని

భార్య, అతని తండ్రి, అతని మామగారు మరియు ఆ వివాహాన్ని జరిపించిన పురోహితుడు తప్పనిసరిగా నరకానికి వెళతారని ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది.

అయితే కొన్ని సందర్భాలలో ఇలాంటి వివాహాలు అంగీకరించ బడతాయి. అది ఎలాగంటే అన్న-పిచ్చివాడైనా, నపుంసకుడు అయినా, దేశాలు పట్టిపోయినవాడైనా అప్పుడు తమ్ముడికి నిరభ్యంతరంగా ముందు వివాహం చెయ్యవచ్చు. ఇదే నియమం స్త్రీలకు కూడా వర్తిస్తుంది.

♦ జీవితంలో కొన్నిసార్లు అనుకోని సంఘటనలు సంభవిస్తూ ఉంటాయి. కొన్నిసార్లు జరిగే సంఘటనలు ప్రమాదాన్ని కలిగించేవి కాకపోయినా ఇబ్బందిని కలిగించే అయిఉంటాయి. ఎన్నో లక్షల రూపాయలు పెట్టి వివాహం చేస్తున్నప్పుడు ఆకస్మికంగా వధువుకి బహిష్టు వచ్చినట్లయితే ఆ వివాహ తంతు ఆపివెయ్యాల్సి ఉంటుంది. కారణం బహిష్టులో ఉన్న వధువు, వరుడితో కలిసి వివాహ సందర్భంలో చెయ్య వలసిన హోమం చెయ్యకూడదు. అయితే సాంప్రదాయాలను ఏర్పరచిన మహర్షులు ఆ సాంప్రదాయాలను అనుసరించేటప్పుడు ఏర్పడే కొన్నిరకాల ఇబ్బందులకు పరిహారాలను కూడా సూచించారు అన్న విషయం మనం మర్చిపోకూడదు. వివాహ సమయంలో వధువుకి బహిష్టు వచ్చినప్పుడు ఆమె, వరుడితో కలిసి హోమం చేసేటప్పుడు "యంజతేమనః" అనే ఋగ్వేద శ్లోకంతో ఆవునెయ్యిని హోమంలో వేసినట్లయితే ఆమె నిరభ్యంతరంగా వరుడితో కలిసి హోమంతో సహా మిగిలిన వివాహ సంబంధ పవిత్ర కార్యాలను కొనసాగించవచ్చు.

♦ వివాహ సమయంలో, గృహాలలో వ్రతాలు, ఇతర వేడుకలు జరిపేటప్పుడు వాకిట్లో లేదా వివాహ మంటప స్తంభాలకు అరిటిచెట్లను కట్టటం ఒక సాంప్రదాయంగా వస్తున్నది. ఇలా అరిటిచెట్లను అలంకరించటం వెనకాల కొన్ని నిగూఢమైన కారణాలు దాగిఉన్నాయని గుర్తించాలి. అవి ఏమిటంటే...

ఒక అరటి పిలకను భూమిలో నాటినట్లయితే కొన్ని నెలలకు అది చెట్టుగా మారుతుంది. ఆ తరువాత ఆ చెట్టు మొదలు నుండి అనేక పిలకలు ఏర్పడి ఆపై అవికూడా చెట్లుగా మారతాయి. అంటే ఒక పిలక నాటితే అది అనంతంగా అభివృద్ధి చెందుతుంది అన్నమాట. వివాహ సందర్భంలో అరిటిచెట్లను అలంకరించటం వెనక మర్మం ఏమంటే "వివాహం చేసుకుంటున్న వధూవరులయొక్క వంశం కూడా అనంతంగా పెరిగి పోవాలి అని".

అరటిచెట్టులోని ప్రతి భాగమూ మనిషికి పనికివస్తుంది. అదేవిధంగా 'దంపతులు కూడా నలుగురికి ఉపయోగపడేలా జీవించాలి" అన్న సూచనను దంపతులకు అందించటంకోసమే పెళ్ళిమండప స్తంభాలకు అరటిచెట్లను కడతారు.

వివాహం తరువాత స్త్రీ మరియు పురుషుడు దంపతులుగా మారతారు. ఆపై వారిమధ్య జరిగే శృంగారం పవిత్రమయినదిగా గుర్తించబడుతుంది. అయితే ఈ శృంగారానికి కొన్ని నియమాలు ఉన్నాయి. విష్ణుపురాణంలో అలాంటి నియమాల గురించి వివరించబడింది. అది ఎలాగంటే...

స్నానంచెయ్యకుండా ఉన్నా/రోగంతో ఉన్నా/బహిష్టులో ఉన్నా/ శృంగారంపట్ల ఆసక్తిలేకుండా ఉన్నా/ఆగ్రహంతో ఉన్న/ తీవ్రమైన ఆకలితో ఉన్నా/ విపరీతంగా భోజనంచేసి భుక్తాయాసంతో ఉన్నా – అలాంటి భార్యతో భర్త సంభోగం జరపటం దోషము.

అమావాస్య, పౌర్ణమి, అష్టమి మరియు చతుర్దశి, సంక్రమణం (సూర్యుడు ఒక రాశి నుండి ఇంకొక రాశిలోకి ప్రవేశించే రోజు) ఈ రోజులలో శృంగారంలో పాల్గొనకూడదు. మాంసాహారం తీసుకొనకూడదు. శరీరానికి తైలాలతో మర్దన చేసుకోకూడదు.



# 23. బెనారస్ హైందవ యోగిని "మాజీ" జీవిత విశేషాలు?

క్రీ.శ. 1826-1898 సంవత్సరాలలో బెనారస్ ప్రాంతంలో జీవించిన ఒక హైందవ యోగిని, కేవలం తన భక్తులనే కాకుండా దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించిన మదాంబ్లావటస్కీనీ కూడా ఎంతగానో ఆకర్షించింది. "మాజీ" అనేది ఈ యోగినియొక్క అసలు పేరుకాదు. హిందీ భాషలో "తల్లిని" మాజీ అని గౌరవంగా పిలుస్తారు. భక్తులుకూడా ఈ యోగినిని తమ మాతృమూర్తిగా భావించి ఆమెను "మాజీ" అని పిలవటం జరిగింది. ఒక విశేషం ఏమంటే ఎంతో గొప్ప యోగినిగా పేరుపొందిన మాజీకి సంబంధించిన సమాచారం చాలామంది ఆధ్యాత్మిక పండితులకు కూడా తెలియదు అనటంలో అతిశయోక్తిలేదు. అసలు మాజీ అనే ఒక యోగిని బెనారస్ ప్రాంతంలో జీవించింది అన్న విషయం ఉత్తరభారతదేశంలోనే చాలా మందికి తెలియదు. కేవలము దివ్యజ్ఞాన సమాజానికి చెందినవారు వ్రాసిన పుస్తకాలలో మాత్రమే ఈ యోగినికి సంబంధించిన సమాచారం క్లుప్తంగా కనిపిస్తుంది.

నాటి ప్రముఖ పాశ్చాత్య రచయిత మరియు పరిశోధకుడు అయిన జాన్‌కాంప్‌బెల్‌వోమన్ వ్రాసిన ఒక గ్రంథం (The mystics, Asetics and saints of india) 1905వ సంవత్సరంలో లండన్‌లో ప్రచురితమైనది. "భారతదేశ సాధువులు, యోగులు" అనే పేరుగల ఈ గ్రంథంలో మాజీకి సంబంధించిన అనేక విశేషాలు కనిపిస్తాయి.

సాధారణంగా జైన మతంలో అనేకమంది స్త్రీ యోగులు కనిపిస్తారు. కానీ హైందవ మతంలో యోగినుల సంఖ్య చాలా తక్కువగా ఉంటుందని చెప్పక తప్పదు. అలా అరుదుగా ఉన్న హైందవ యోగినులలో ఒకరు మాజీ.

బెనారస్ యోగినిగా గుర్తింపబడిన మాజీ అసలు పేరు హరికౌర్. ఈమె క్రీ.శ. 1826వ సంవత్సరంలో బెనారస్ ప్రాంతంలో ఒక సాంప్రదాయ

బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. ఈమె తండ్రి పేరు శ్రీరామేశ్వర్‌దేవ్. ఈమె పూర్వీకులు ఈమె పుట్టటానికి కొన్ని వందల సంవత్సరాల క్రితమే గుజరాత్ నుండి బెనారస్‌కి వలస వచ్చేసారు. హైందవ మతంలో బెనారస్ పట్టణానికి ఎంతో పవిత్ర స్థానం ఇవ్వబడింది. సాక్షాత్తు కాశీవిశ్వనాథుడు నివాసం ఉంటాడు అని చెప్పబడిన కాశీ నగరానికి పెట్టబడిన ఇంకో పేరే బెనారస్.

(నోట్ : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న కాశీ క్షేత్రానికి వారణాసి మరియు బెనారస్ అనే ఇతర పేర్లుకూడా ఉన్నాయి. గంగానదికి చెందిన "వరుణ" మరియు "అశి" అనే రెండు పాయల మధ్య ఉన్న కారణంగా కాశీ క్షేత్రానికి "వారణాసి" (వరుణ+అశి) అన్నపేరు వచ్చింది. వారణాసి పట్టణానికి ఉత్తర మరియు దక్షిణ సరిహద్దులలో ఈ గంగానది పాయలు ప్రవహించటం విశేషం. "వారణాసి" అన్నపేరు కొన్నిమార్పులకు గురై "బెనారస్" అన్నపేరుగా మారిందని తెలుస్తున్నది.)

శ్రీరామేశ్వర్‌దేవ్ సంస్కృత భాషలో అపారమైన పాండిత్యాన్ని కల్గి ఉండేవాడు. ఈయన వైదిక బ్రాహ్మణ ధర్మాలను సక్రమంగా పాటిస్తూ ఉండేవాడు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన హరికౌర్‌కి చిన్నతనం నుండి వేదాంతం బాగా వంటపట్టింది. రామేశ్వర్‌దేవ్‌కి 8వ సంతానంగా హరికౌర్ జన్మించింది. ఆమెకు 5 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఆమె తల్లి చనిపోయింది. ఫలితంగా రామేశ్వర్‌దేవ్, పసిబిడ్డ అయిన హరికౌర్‌ని ఎంతో శ్రద్ధతో పెంచాడు. హరికౌర్‌కి తండ్రితో ఉన్న సాన్నిహిత్యం కారణంగా తండ్రిలోని మతపరమైన విశ్వాసాలు, వేదాంత ధోరణి, దైవభక్తి ఆమెలోకూడా బలంగా నెలకొన్నాయి.

హరికౌర్ తన తండ్రివద్దే సంస్కృత భాషను క్షుణ్ణంగా అభ్యసించింది. ఆమెకు 10 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఒక యువకుడితో వివాహం అయ్యింది. వివాహం అయిన 3 సంవత్సరాలకు హరికౌర్ అత్తవారింటికి వెళ్ళింది. ఆ పెళ్ళి మూన్నాళ్ళముచ్చటగానే మిగిలింది. ఆమె కాపురానికి వెళ్ళిన రెండేళ్ళకే భర్త చనిపోయాడు. ఇక చేసేదిలేక హరికౌర్ మళ్ళీ తండ్రి

దగ్గరకు చేరింది. భర్త పోవటంతో హరికౌర్ పూర్తిగా ఆధ్యాత్మికత మార్గంలోకి వెళ్ళిపోయింది. ఆ సమయంలోనే ఆమె యోగశాస్త్రాన్ని అభ్యసించింది. అతి కొద్ది కాలంలోనే ఆమె, ఆనాటి బెనారస్‌లో పేరుపొందిన సంస్కృత పండితులలో ఒకరుగా పేరుపొందింది.

హరికౌర్‌కి 16 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఆమె తండ్రి తీర్థయాత్రలు చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. తనను కూడా తీర్థయాత్రలకు తీసుకువెళ్ళమని హరికౌర్ తండ్రిని కోరింది. ఆ కాలంలో తీర్థయాత్రలు కాలినడకమీద జరిగేవి. ఆడపిల్ల అయిన హరికౌర్ నడవలేదని భావించిన ఆమె తండ్రి ఆమెను ఒక బుట్టలో పెట్టి ఆపై ఆ బుట్టను తన తలపై పెట్టుకుని తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆ బుట్టలోనే వారి నిత్యావసరాలకు కావలసిన వస్తువులను కూడా పెట్టుకున్నారు. ఆవిధంగా ఆ తండ్రి కూతుళ్ళ తీర్థ ప్రారంభం అయ్యింది. ఈ తీర్థయాత్రలో పూరీ, హరిద్వార్, బృందావనం, బదరీనాథ్ లాంటి దివ్య క్షేత్రాలను వారు దర్శించారు. ఈ తీర్థయాత్రలకు చెయ్యటానికి వారికి 5 సంవత్సరాలు పట్టింది. ఇలా తీర్థయాత్రలు చేసి, ఆ తరువాత క్రీ.శ.1846వ సంవత్సరంలో వారు బెనారస్‌కి తిరిగి వచ్చారు.

అప్పుడు అసలు కథ మొదలయ్యింది. అది ఎలాగంటే....

రామేశ్వర్‌దేవ్‌కి స్వామి శ్రీసచ్చిదానంద అనే ఒక గురువు ఉండేవాడు. ఆయన, ఆనంద్‌గుఫ అనేపేరుగల ఒక కొండగుహలో ఎంతోకాలంగా తపస్సు చేస్తున్నాడు. బెనారస్ పట్టణానికి తూర్పుదిశలో 12 మైళ్ళ దూరంలో ఉన్న ఒక కొండలో ఈ గుహ ఉన్నది. తీర్థయాత్ర ముగించుకున్న రామేశ్వర్‌దేవ్ మరియు హరికౌర్‌లు ఆ గుహలోకివెళ్ళి సచ్చిదానందను దర్శించుకున్నారు. ఆ తరువాత కొద్ది సమయానికే సచ్చిదానంద భౌతిక దేహాన్ని చాలించాడు. ఆయన మరణంతో ఆ గుహ ఖాళీ అయిపోయింది. దాంతో రామేశ్వర్‌దేవ్ తన కుమార్తెతో కలిసి ఆ గుహలో నివసించటం మొదలుపెట్టాడు. ఆ గుహలోనే హరికౌర్ అనేక ఆధ్యాత్మిక గ్రంధాలను పఠించింది. అతిక్లిష్టమైన యోగసాధనలు చేసింది.

ఆవిధంగా 14 సంవత్సరాలపాటు ఆ తండ్రీకూతుళ్ళు ఆ గుహలోనే జీవించారు. చివరికి క్రీ.శ. 1860వ సంవత్సరంలో రామేశ్వర్‌దేవ్ తనువు చాలించాడు. దాంతో హరికౌర్ ఒంటరిగా మిగిలిపోయింది. తండ్రి పోయినప్పటికీ హరికౌర్ ఆ గుహను వదిలిపెట్టి ఇవతలికి రాలేదు. అక్కడే ఏకాంత జీవనం గడుపుతూ తపస్సు చేసుకుంటూ ఉండిపోయింది.

కాలక్రమంలో హరికౌర్‌కి విపరీతమైన పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. ఆమెను మహాయోగినిగా అనేకమంది ప్రజలు గుర్తించారు. ఆమెమీద ఉన్న అభిమానంచేత ప్రజలు ఆమెను "మాజీ" అని పిలవటం ప్రారంభించారు. ప్రతిరోజూ అనేకమంది ప్రజలు, మాజీ నివసిస్తున్న గుహలోకి వెళ్ళి ఆమెకు తమ సమస్యలు చెప్పుకుని అవి తీరేలా అనుగ్రహించమని ఆమెను ప్రార్థించేవారు.

మాజీ యొక్క చిత్రాన్ని ఒక శిల్పి ఒక కొయ్యమీద చెక్కాడు. ఆ తప్ప మాజీకి సంబంధించిన ఒక ఫోటో లేదా పెయింటింగ్ మనకు లభించటంలేదు. ఆనాడు కొయ్యిమీద చెక్కబడిన మాజీయొక్క చిత్రాన్ని ఈపేజీలలో మీరు చూడవచ్చు.

మాజీ, రాజయోగాన్ని అనుసరించింది. యోగశాస్త్రంలో చెప్పబడిన రాజయోగం ఆధ్యాత్మికమైనదిగా గుర్తించబడింది. హఠయోగం భౌతిక పరమైనదిగా చెప్పబడింది. దివ్యజ్ఞాన ఉద్యమానికి సంబంధించిన అనేకమంది గురువులు, హఠయోగాన్ని తిరస్కరించారు. ఒక విశేషం ఏమంటే కేవలము దివ్యజ్ఞాన గురువులే కాకుండా శైవమత స్థాపకుడైన ఆదిశంకరాచార్య కూడా రాజయోగాన్ని గొప్పమార్గంగా ఉద్ఘాటించాడు. ఆయన హఠయోగాన్ని ఖండించాడు.

1879వ సంవత్సరంలో హెచ్.పి.బ్లావటస్కీ మరియు కల్నల్‌ఓల్‌కాట్ అనే పాశ్చాత్యులు న్యూయార్క్‌లో ఉన్న తమ దివ్యజ్ఞాన సమాజ ప్రధాన కార్యాలయాన్ని భారతదేశంలోని మద్రాసు నగరానికి మార్చుకున్నారు. కల్నల్‌ఓల్‌కాట్ వ్రాసుకున్న "పాతడైరీ పేజీలు (ఓల్డ్ డైరీ లీవ్స్)" అనే గ్రంథంలో మాజీకి సంబంధించిన కొన్ని ఆసక్తికరమైన విషయాలను వెల్లడించాడు.

1879 చివరలో నేను (కర్నల్‌ఓల్‌కాట్) మరొక ఇద్దరితో కలసి వెళ్ళి గంగానది ఒడ్డున ఉన్న ఒక గుహలో ధ్యానంలో ఉన్న మాజీని సందర్శించాను. ఆమె తెల్లటి శరీరఛాయతో ఉన్నది. ఆమెకు దాదాపు 40 సంవత్సరాల వయస్సు ఉంటుంది. ఎటువంటివారైనా సరే గౌరవించాల్సిన మృదుమధుర స్వభావాన్ని ఆ యోగిని కలిగి ఉన్నది. ఆమె బొద్దుగా ఉన్న శరీరాన్ని కలిగి ఉన్నది. ఆమె కళ్ళల్లో తెలివి తేటలు ఉత్సాహం కనిపించాయి.



హెచ్.పి.బ్లావటస్కీ శరీరంలో ఒక యోగి ఆత్మ ప్రవేశించిందని, ఆ కారణంగానే హెచ్.పి.బ్లావటస్కీ, హైందవ ఆధ్యాత్మిక రంగంలో విశేషమైన కృషి చెయ్యటం జరుగుతున్నదని మాజీ మాతో అన్నది. ఆ సమయంలో నేను, దామోదర్ మరియు శ్రీమతి గోర్డాన్ ఆ గుహలో ఉన్నాం. అప్పుడు మాతోపాటుగా హెచ్.పి.బ్లావటస్కీ లేరు.

మా బృందం బెనారస్‌లో మకాం చేసి ఉన్నది. మాతోపాటు ఉన్న మేడమ్ హెచ్.పి.బ్లావటస్కీని చూడటంకోసం మాజీ, మా మకాం దగ్గరకు రావటం గొప్ప విచిత్రంగా నాకు అనిపించింది. ఆ సమయంలో మాజీ తనకు సంబంధించిన ఒక రహస్యాన్ని మాకు తెలియజేసింది. అది ఏమిటంటే ఆమె మొదట్లో ఒక ఫకీరు దేహంలో నివసించేదట. ఆ ఫకీరు యోగ సాధనలో ఉన్నాడు. ఆ ఫకీర్ ఒక సమయంలో భరత్‌పూర్ కోట ముందునుంచి వెళుతున్నప్పుడు ఎవరో సిపాయి పేల్చిన తుపాకీ గుండు పొరపాటున ఆ ఫకీరుకి తగిలింది. ఫలితంగా ఆ ఫకీరు శరీరం యోగ సాధనకు పనికిరానివిధంగా దెబ్బతిన్నది. అప్పుడు ఫకీరు శరీరంలో ఉన్న ఆత్మ ఆ శరీరాన్ని వదిలిపెట్టి ఇంకొక శరీరంకోసం అన్వేషిస్తున్న

సమయంలో ఆమెకు ఏడు సంవత్సరాలు వయస్సు ఉన్న హరికౌర్ అనే ఒక బాలిక కనిపించింది. దైవ లిఖితం కారణంగా ఆ ఏడు సంవత్సరాల బాలిక మరణించింది. తాను ప్రవేశించటానికి కావలసిన ఒక మానవ దేహం కోసం అన్వేషిస్తున్న ఆ ఆత్మ, మరణించిన హరికౌర్ దేహంలో ప్రవేశించింది. దీనినిబట్టి అర్థమవుతున్నది ఏమంటే మాజీ శరీరంలో ఉన్నది ఒక ఫకీర్ ఆత్మ. ఆ విధంగా చూసినట్లయితే మాజీ, స్త్రీకాదు **పురుషుడు** అని మనం అర్థం చేసుకోవాలి. కారణం ఆత్మే మనిషి దేహాన్ని నడుపుతుంది. ఆ దేహం స్త్రీది అయినప్పటికీ అందులో ఉన్నది పురుషుడైన ఫకీర్ ఆత్మ.

మాజీ ఇంకొక విషయాన్ని కూడా మాకు తెలియజేసింది. అది ఏమిటంటే తన ఆత్మ, గతంలో ఫకీర్ దేహంలో ఉన్నప్పుడు 6: సంవత్సరాలపాటు యోగసాధన చేసిందని, అయితే ఫకీర్ దేహానికి తుపా గుండు తగలటం వల్ల ఆ దేహం యోగసాధనకు పనికిరాకుండా పోయిందనీ, అందువల్లే ఆ ఆత్మ హరికౌర్ దేహంలో ప్రవేశించి తన యోగ సాధనను పూర్తి చేసుకున్నదని".

క్రీ.శ. 1898 నవంబర్ నెలలో మాజీ తనువు చాలించింది. ఆమె చనిపోయేవరకు ఆ గుహలోనే జీవించింది.






# 1. బ్రహ్మార్షి పర్వతాలపై సిద్ధయోగుల సూక్ష్మరూప సంచార విశేషాలు?

తమిళనాడులోని త్రిచి–చెన్నై రోడ్డుమార్గంలో త్రిచి పట్టణానికి దాదాపు 60 కి.మీ. దూరంలో ఉన్న పేరంబాలూర్ అనే ప్రదేశంలో బ్రహ్మర్షి పర్వతాలు ఉన్నాయి. సంపూర్ణ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పొందాలని భావించేవారు ఈ పర్వతాలపై ధ్యానం చేసుకున్నట్లయితే వారికి సూక్ష్మ రూపంలో సంచరించే సిద్ధయోగులు నిగూఢమైన దైవ రహస్యాలను వివరిస్తారని తెలుస్తున్నది.

దాదాపు 7500 ప్రళయాలను కళ్ళారా చూసిన సిద్ధయోగ కాగపుజందర్ ఈ బ్రహ్మర్షి పర్వతాలమీదే జీవ సమాధి పొందాడని గ్రహించాలి. ప్రపంచానికి ప్రళయం వచ్చినప్పుడు దాదాపు 10 లక్షలమంది సన్మార్గులు ఈ బ్రహ్మర్షి పర్వతాలపై సమావేశం అవుతారని తెలుస్తున్నది. కలియుగాంతం సమయంలో "దేవీనళినిఅమ్మన్" ఈ పర్వతాలపై అవతరిస్తుందని భక్తులు విశ్వసిస్తున్నారు.

ఈ బ్రహ్మర్షి పర్వతశిఖరంపై ఉన్న కొంగనార్ సిద్ధర్ స్తంభం వద్ద కార్తీకమాసంలో వచ్చే పౌర్ణమినాడు వేలాదిమంది భక్తులు కార్తీక దీపాలు వెలిగిస్తారు. ఆ సమయంలో బ్రహ్మర్షి పర్వతాలు కార్తీకదీపాల వెలుగులో మెరిసిపోతాయి.



# 2. జీవ సమాధి అంటే ఏమిటి?

మరణించిన యోగుల మృతదేహాల్ని అనేక రకాలుగా నశింప చేయటం జరుగుతుంది. అయితే కొంతమంది సిద్ధయోగులు తమకు మరణ సమయం ఆసన్నమయినప్పుడు తామంతట తామే, అప్పటికే సిద్ధంగా ఉంచిన సమాధులలోకి ప్రవేశించి, ఆపై ఆ సమాధిలో దీర్ఘమైన తపోధ్యానంలో ఉండిపోతారు. ఆ సిద్ధయోగులు సమాధులలోకి వెళ్ళి పోయిన తరువాత వారి శిష్యులు ఆ సమాధులపై చిన్న చిన్న మందిరాలను నిర్మించటం జరుగుతుంది. దైవ లిఖితం ప్రకారం ఏ జీవికైనా ఒక నియమిత కాలంపాటు ఆయుర్దాయం ఉంటుంది. సిద్ధయోగులకు కూడా ఈ నియమం వర్తిస్తుంది. అందువల్లే వారు తమ ఆయుర్దాయం పూర్తికాగానే సజీవ సమాధిలోకి వెళ్ళిపోయి సృష్టి ధర్మాన్ని గౌరవిస్తారు. అయితే మహా తపఃసంపన్నులైన ఆ సిద్ధయోగుల ఆత్మలు ఆ సమాధులలోనే ఉండి తాము భూమిపై నిర్వర్తించాల్సి ఉన్న కార్యక్రమాలను తాము ఎన్నుకున్న కొందరు వ్యక్తుల ద్వారా పూర్తిచేస్తారు.

జీవసమాధి లేక సజీవసమాధి అంటే "భగవంతునిలో లీనం కావటం" అని అర్ధం. సాధారణంగా ఎవరైనా సిద్ధపురుషుడు మరణించినపుడు ఆయన ఆత్మ, భగవంతునిలో లీనం అవుతుంది. ఆ తరువాత ఆయన భౌతిక శరీరాన్ని భూమిలో ఖననం(సమాధి) చేయటం ద్వారా లేదా ప్రవహించే జలంలో వదిలివెయ్యటం(జలసమాధి) ద్వారా లేదా అగ్నిలో దహింప చేయటం(అగ్ని సమాధి) ద్వారా ఆయనకు సంపూర్తిగా ఈలోకం నుండి వీడ్కోలు పలకటం జరుగుతుంది.

భారతదేశ యోగుల చరిత్ర పరిశీలించినట్లయితే షిరిడీసాయిబాబా, శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, శ్రీ మంత్రాలయ రాఘవేంద్రస్వామి లాంటి ఎందరో సిద్ధపురుషులు జీవ సమాధి అయినట్టుగా తెలుస్తున్నది.

ఈ జీవ సమాధి పొందిన యోగులయొక్క భౌతిక దేహాలు సమాధులలో ఉన్నప్పటికీ అవి ఎన్నివేల సంవత్సరాలు గడిచినా ఏమాత్రం పాడుకాకుండా

ఉంటాయి. అందుకు కారణం ఏమంటే వారి దేహాలలో ఉండే అయస్కాంత బలం (మాగ్నెటిక్‌ఫోర్స్) ప్రాణశక్తిగా పనిచేస్తుంది. ఆ సమయంలో వీరి దేహాలలో ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు మరియు రక్తప్రసరణ స్తంభింపచేయబడ తాయి. అయితే వారి శరీరంలో ఉండే ప్రాణబలం ఆ శరీరాలలో ఉండే జీవ కణాలు సజీవంగాను మరియు బలంగాను ఉండటానికి సహకరిస్తుంది. ఇంకొక విశేషం ఏమంటే జీవ సమాధి పొందిన అనేకమంది సిద్ధపురుషులు తాము ఉన్న సమాధులలో నుండి తమ శరీరాలతోపాటు అదృశ్యం అయి ఇతర ప్రదేశాలలో ప్రత్యక్షంకాగల శక్తిని కలిగి ఉన్నారు.

(మంత్రాలయ రాఘవేంద్రస్వామిని ఒక సంవత్సరంపాటు కఠిన దీక్షతో ఆరాధించిన నాకు 2014 వైకుంఠ ఏకాదశి తెల్లవారుఝామున విజయవాడ దగ్గరలోని సీతానగరం ప్రాంతంలో ఉన్న కృష్ణానదిలో ఆ రాఘవేంద్రస్వామి దర్శనం జరిగింది. నిజానికి నేను ఆ సమయంలో ఆయనను ఒక సాధారణ సాధువుగా భావించాను. కానీ ఆ తరువాత నాకు అర్ధమయ్యింది. ఆయన రాఘవేంద్రస్వామి అని. మంత్రాలయ రాఘవేంద్రస్వామి అనుగ్రహంతో నేను ఎదుర్కొన్న కొన్ని మానవాతీత శక్తులకు సంబంధించిన కొన్ని ఆశ్చర్యకరమైన సంఘటనల గురించి తెలుసుకోవటంకోసం నాచే వ్రాయబడిన "అసురసంధ్య" అనే పుస్తకం చదువగలరు - రచయిత.)

జీవసమాధి పొందిన సిద్ధపురుషులయొక్క సమాధుల వద్దకు వెళ్ళిన వారికి ఆ సమాధులలోని సిద్ధపురుషుల నుండి వచ్చే ప్రకంపనాలు (వైబ్రేషన్స్) ఆశీస్సులుగా మారతాయి.

జీవసమాధి పొందాలనుకునే ప్రతి సిద్ధయోగీ తన సమాధి ఏవిధంగా ఉండాలి? అన్న విషయాన్ని ముందుగానే తన శిష్యులకు తెలియజేస్తాడు. భగవాన్ నిత్యానందకు ప్రియశిష్యుడు అయిన సాలిగ్రామ స్వామి యువకుడు. అతడు తన గురువైన భగవాన్ నిత్యానంద కన్నా ముందుగా తానే జీవసమాధి అవ్వాలని నిర్ణయించుకున్నాడు. అప్పుడు నిత్యానంద తన శిష్యులను పిలిచి వారితో ఇలా చెప్పాడు. "సాలిగ్రామస్వామి

మహాయోగి. అతడు జీవ సమాధి పొందాలనుకుంటున్నాడు. అతనికోసం ఒక చక్కటి సమాధిని నిర్మించండి. ఆ సమాధిలో సాలిగ్రామస్వామిని దక్షిణ ముఖంగా ఉంచండి. అతడు అగ్నిస్వరూపుడు. అతడు రాబోయే ఐదువందల సంవత్సరాలలో తన సమాధి నుండే మానవజాతికి సేవచేయబోతున్నాడు".

ఎవరైనా భక్తులు ఇలాంటి సిద్ధపురుషుల "జీవసమాధుల" వద్దకు వెళ్ళినప్పుడు ఆ సమాధులకు దగ్గరలో కూర్చుని 20 నుండి 30 నిమిషాల పాటు ఆ సమాధిలో ఉన్న యోగిని మనస్ఫూర్తిగా ధ్యానించుకోవాలి. అప్పుడు ఆ సమాధిలో ఉండే యోగియొక్క ఆశీస్సులు అందుతాయి. తమిళనాడులోని పవిత్ర తిరువన్నామలై పర్వతంమీద వందలాదిమంది సిద్ధపురుషులు సమాధి అయ్యారని చెబుతారు. ఈ ప్రదేశంలో ఈ సిద్ధపురుషులు సూక్ష్మ రూపాలలో సంచరిస్తూ ఉంటారు.

కర్నాటకలోని సిద్ధర్‌బెట్ట(సిద్ధుల పర్వతం) తుంకూర్ జిల్లాలో ఉన్నది. ఈ పర్వతంమీద దాదాపు 9వేల మంది సిద్ధులు జీవ సమాధి అయ్యారని తెలుస్తున్నది.

ఒక యోగి "మహాసమాధి" అయినప్పుడు ఆయన శరీరంలోని ప్రాణశక్తి ఆయన మరణానంతరం బయటకు వెళ్ళిపోతుంది. కాలక్రమంలో ఆయన మృతదేహం ఆ సమాధిలోనే పాడైపోతుంది. ఇక జీవ సమాధి విషయానికి వచ్చినట్లయితే సమాధిలోని దేహం నశించదు. అలాగని ఆ దేహంగల యోగి ఇంకా ఆ సమాధిలో జీవించి ఉన్నాడని చెప్పటానికి వీలుకాదు. ఏది ఏమైనప్పటికీ జీవసమాధి పొందిన యోగియొక్క ప్రాణశక్తి ఆ సమాధిలోను మరియు ఆ సమాధి చుట్టుప్రక్కల కొంతదూరం వరకు వ్యాపించి ఉంటుందని చెప్పక తప్పదు.

సిద్ధయోగులలో శ్రేష్ఠుడు అని చెప్పబడిన మహావతార్‌బాబాజీ తన సంకల్పం మేరకు ఎక్కడైనా భౌతికదేహంతో ప్రత్యక్షంకాగల శక్తిని కలిగి ఉన్నారు. పరమహంస యోగానంద గురువుగారైన యుక్తేశ్వర్‌గిరి కూడా

ఈవిధమైన శక్తిని కలిగి ఉన్నారు. యుక్తేశ్వర్‌గిరి చనిపోయిన మర్నాడు బొంబాయిలోని ఒక హెూటల్ రూంలో బసచేసి ఉన్న యోగానంద పరమ హంసకు, యుక్తేశ్వర్‌గిరి భౌతిక రూపంలో దర్శనమివ్వటమే కాకుండా అనేక నిగూఢమైన సృష్టి రహస్యాలను, వేదాంత రహస్యాలను ఆయనకు బోధించటం జరిగింది.

అయితే కొంతమంది సిద్ధపురుషులు తమ చివరి సమయంలో శరీరంతో సహా అదృశ్యం అయిపోవటం జరుగుతుంది. అలాంటి సిద్ధపురుషుల్ని "కాంతి శరీరులు" అని పిలుస్తారు. తమిళనాడులోని వడలూర్ ప్రాంతంలో "వల్లలార్ రామలింగస్వామి" ఈవిధంగానే కాంతిదేహాన్ని పొందటం జరిగింది. ఈ వడలూర్‌లోనే రామలింగస్వామి సమాధి నిర్మించబడింది.

(నోట్ : కాంతి శరీరుడు **వల్లలార్** రామలింగస్వామి జీవిత విశేషాలను తెలుసుకోవటంకోసం శ్రీధరన్‌కాండూరి రచించిన **"సిద్ధయోగులు"** అనే పుస్తకాన్ని చదువగలరు.)

**సమాధి :**

యోగసాధనచేసే సాధకులు సాధనలో బాగా పరిణతి సాధించిన తరువాత "సమాధి" అనే విధానాన్ని సాధన చేస్తారు. సాధకుడియొక్క "చిత్తము" అనగా మనస్సు స్థిరంగా ఉన్నప్పుడు ఈ సమాధిని సాధన చేస్తారు. సమాధిలో ఉండే సాధనలు ఈ క్రిందివిధంగా వర్గీకరించబడ్డాయి. అవి ఏమిటంటే...

**1. తాంద్ర :** దీనిని ఒకవిధమైన యోగనిద్రగా భావించవచ్చు. ఈ విధానంలో సాధకునియొక్క మనస్సు, ప్రాణము మరియు హృదయము పనిచేస్తూ ఉంటాయి.

**2. మూర్ఛ :** ఈ విధానంలో సాధకునియొక్క మనస్సు మరియు ప్రాణము పనిచెయ్యవు. అనగా ప్రశాంతంగా ఉండిపోతాయి.

**3. అర్ధసమాధి :** ఈ విధానంలో సాధకునియొక్క ప్రాణము, సుషుమ్న నాడి, రవినాడి మొదలైనవి శరీర తత్వాలతోపాటుగా పనిచేస్తూ ఉంటాయి. ఈ విధానం కొద్దిసేపు మాత్రమే కొనసాగుతుంది.

**4. సమాధి :** అంతః ప్రాణం శరీరంలో ప్రవహిస్తున్నప్పటికీ సాధకుని ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు ఆగిపోతాయి.

**5. పూర్ణ సమాధి :** ఈ విధానంలో సాధకునియొక్క చిత్తం నిశ్చలంగా ఉంటుంది. అతని శ్వాస ప్రక్రియ మామూలుగా సాగిపోతూ ఉంటుంది. శరీరంలో ప్రాణం ఏకక్రమంలో ప్రవహిస్తూ ఉంటుంది. మనో నేత్రాల ముందు "ఓం" అనే ప్రణవాక్షరం కనిపిస్తూ ఉంటుంది. మనసులో ఓంకార జపం నిరంతరాయంగా జరుగుతూ ఉంటుంది.

## 3. సిద్ధయోగులు అందించిన "సిద్ధవైద్యం" మర్మం ఏమిటి?

అలనాటి కొందరు సిద్ధయోగులు అనేక అద్భుతమైన ఔషధతయారీ రహస్యాలను తాళపత్రాలపై వ్రాసి వాటిని కొండ గుహలలో మరియు పెద్ద, పెద్ద రాళ్ళక్రింద భద్రపరచారు. అతి ప్రమాదకరమైన వ్యాధులకు కూడా శాశ్వతమైన పరిష్కారాన్ని చూపగల అమూల్యమైన ఔషధాల తయారీకి సంబంధించిన విధానాలు ఈ తాళపత్ర గ్రంధాలలో దాగి ఉన్నాయని పరిశోధకులు తెలియజేస్తున్నారు. (ఈనాడు హెూమియోపతి, ఆయుర్వేదం, సిద్ధవైద్యం, యునాని లాంటి ప్రాచీనకాల వైద్యాలకు భారత దేశంలో ఆదరణ విపరీతంగాపెరుగుతున్నది. ఈ ఆదరణను చూసి కొందరు ఇంగ్లీషు వైద్యులు(అల్లోపతి వైద్యులు) తీవ్రమైన అభద్రతా భావానికి మరియు అసూయకు గురై, ఆపై పైన చెప్పిన జాతీయ వైద్యాలను బూటక వైద్యాలుగా కొట్టిపారేస్తున్నారు.)

పంచభూతాలలో భాగాలైన వాయువు, అగ్ని, జలము అనే మూడు శక్తుల ప్రతీకగా వాతం, పిత్తం, కఫం అనే త్రిదోషాలు ఏర్పడ్డాయి. ఇవి ప్రతి మానవుడిలోను 4:2:1 నిష్పత్తిలో ఉండాలి. ఈ నిష్పత్తి దెబ్బతిన్నట్ల

యితే మనిషిలో ఏదో ఒక అనారోగ్యం తలఎత్తుతుంది. సిద్ధవైద్యంలో కొన్నిరకాల ఔషధాలను రోగికి ఇచ్చి, అతడిలో త్రిదోషాలు మరల సమతౌల్యంలోకి వచ్చేలా చెయ్యటం జరుగుతుంది. ఫలితంగా ఆ రోగి మళ్ళీ ఆరోగ్యవంతుడు అవుతాడు.

**డయాబెటీస్ మరియు అధిక రక్తపోటును అల్లోపతి అడ్డుకోలేదా?**

ప్రజలందరూ గమనించాల్సిన ఒక ముఖ్య విషయం ఏమంటే ఇంగ్లీషువైద్యం నిజంగా సత్తా ఉన్నది అయితే అతి సామాన్య రోగాలైన డయాబెటీస్, రక్తపోటు(బి.పి.) లాంటి వ్యాధులను శాశ్వతంగా ఎందుకు తగ్గించలేకపోతున్నది?. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే చక్కెరవ్యాధి లేదా అధిక రక్తపోటు రావటానికి మూలకారణం ఏమిటో ఈనాటికీ అల్లోపతి వైద్యశాస్త్రానికి అంతుపట్టటం లేదు. ఈ రెండు వ్యాధులూ రావటానికి అల్లోపతి వైద్యులు రకరకాల కారణాలు చెబుతున్నారు. కానీ అవి సరైన కారణాలు కావని వారికి కూడా తెలిసి ఉంటుందేమో మరి. ఈ వ్యాధుల సంగతి అలా ఉంచి ఈనాడు భారతదేశంతోపాటుగా ప్రపంచంలోని అనేకమందిని వేధిస్తున్న అతి క్లిష్టమైన ఆరోగ్యసమస్య అధిక రక్తపోటు(బి.పి.).

ఇంగ్లీషు వైద్యంలో బి.పి. శాశ్వతంగా కాదు కదా కనీసం తాత్కాలికంగా బి.పి. తగ్గించే ఔషధాలు లేవని చాలామందికి తెలియదు కానీ ఇది నిజం. సాధారణంగా ఎవరికైనా బి.పి. వ్యాధి మొదలైతే చిరకాలం పాటు బి.పి. బిళ్ళలు ప్రతిరోజు మ్రింగుతూ ఉండాలి. ఇక్కడ ఒక నిగూఢ రహస్యం దాగి ఉన్నది. ఇది దాదాపు చాలామందికి తెలియదని నా భావన. అది ఏమిటంటే ఎవరికైనా హఠాత్తుగా బి.పి. పెరిగినప్పుడు (సాధారణంగా ఆరోగ్యవంతుడి బి.పి. 120/80 ఉండాలి. పై సంఖ్య 120కి దాటి వెళ్ళిపోయినట్లయితే ఆ వ్యక్తికి అధిక రక్తపోటు ఉన్నట్లుగా గుర్తిస్తారు.) గుటుక్కున ఒక బి.పి. బిళ్ళ మ్రింగుతాడు. పది నిమిషాలలో బి.పి. తగ్గిపోతుంది. దాంతో "అమ్మయ్య" అనుకుని ఆ రోగి తాత్కాలికంగా సంతోషిస్తాడు. అయితే ఆ రోగి తెలియని ఒక మర్మం అతను మ్రింగిన బిళ్ళలో దాగి ఉన్నది. అది ఏమిటంటే బి.పి. పెరిగినప్పుడు రోగి మ్రింగే ఇంగ్లీషు టాబ్లెట్ వల్ల బి.పి. తగ్గదు. మరి ఏమౌతుంది?. ఆ రోగి మ్రింగిన టాబ్లెట్ ప్రభావం

పల్ల, శరీరంలోని వివిధ భాగాలకు రక్తాన్ని పంపింగ్‌చేసే గుండె వేగం నిదానం అవుతుంది. అందువల్ల బి.పి. తగ్గినట్లుగా అనిపిస్తుంది. అనగా గుండెపై భారం తగ్గటంవల్ల బి.పి. నిదానిస్తుంది. అయితే ఇక్కడ ఒక ప్రమాదం కూడా పొంచి ఉంటుంది. అది ఏమిటంటే శరీరంలోని వివిధ భాగాల నుండి వచ్చిన మలిన రక్తాన్ని శుభ్రపరచి, దానిని మరల వివిధ భాగాలకు పంపింగ్ చేస్తుంది గుండె. ఎప్పుడైతే టాబ్లెట్ కారణంగా గుండె యొక్క పంపింగ్‌వేగం నియంత్రించబడుతుందో అప్పుడు శుద్ధిచేయబడే రక్తం పరిమాణం కూడా తగ్గిపోయి దోషాలతో కూడిన రక్తం శరీర అవయవాలకు చేరుతుంది. దాని ఫలితంగా పాదాలు "స్పాంజీలు" లాగా ఉబ్బిపోవటం జరుగుతుంది. దీనినే "కాళ్ళల్లో నీరు చేరటం" అని సామాన్య భాషలో పిలుస్తూ ఉంటారు. దీన్నిబట్టి ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసిన విషయం ఏమంటే అధిక రక్తపోటును ఎట్టి పరిస్థితుల్లోను అల్లోపతివైద్యం అరికట్టలేదు. అయితే హోమియోపతి మరియు సిద్ధవైద్యం ఈ సమస్యను దీర్ఘకాలంలో శాశ్వతంగా పరిష్కరిస్తుంది.

రక్త ప్రసరణ సాఫీగా సాగటానికి అడ్డుపడే కొవ్వు కణాలు(కొలెస్ట్రాల్) లాంటి పదార్థాలు లాంటి అవాంఛనీయ పదార్థాలను, క్రమ క్రమంగా రక్తం నుండి తొలగించి, ఆపై రక్తనాళాల గుండా రక్తం శరీరంలోని వివిధ భాగాలకు స్వేచ్ఛగా ప్రవహించే అవకాశాన్ని హోమియోపతి, ఆయుర్వేదం, సిద్ధ లాంటి ప్రాచీన వైద్యాలు కలిగిస్తున్నాయి.

సిద్ధయోగులలో ముఖ్యంగా గోరక్‌నాథ్, భోగర్, అగస్త్య మరియు కరువూరర్ లాంటి మహర్షులు వ్రాసిన గ్రంధాలలోని సమాచారం ప్రకారం చూసినట్లయితే భారతదేశంలోని అనేక పర్వతాలలోను, అడవులలోను కొన్ని ప్రత్యేకమయిన కొండ గుహలలోను అనేక అద్భుతమైన ఔషధాల తయారీకి సంబంధించిన సమాచారం భద్రపరచబడినట్లుగా తెలుస్తున్నది. ఇలాంటి సమాచారం భద్రపరచబడి ఉన్న కొన్ని గుహలు సామాన్య మానవులకు పొరపాటునకూడా కనపడవని తెలుస్తున్నది. చౌక అయిన లోహాలను బంగారంగా మార్చే విధానాలు, మానవుల ఆయుర్దాయాన్ని, యవ్వనాన్ని చాలాకాలంపాటు కొనసాగేలాచేసే అద్భుత ఔషధాల తయారీకి సంబంధించిన రహస్యాలు కొన్ని గుహలలో నిక్షిప్తం చేయబడినట్లుగా తెలుస్తున్నది.

ప్రస్తుత తమిళనాడులోని చతురగిరి, పొట్టిక్కాయ్ పర్వతాలు, కొల్లి పర్వతాలు, కంచ పర్వతాలు, మహేంద్రగిరి పర్వతాలు లాంటి పర్వతాలను "సిద్ధపర్వతాలు"గా పిలుస్తున్నారు. అంతేకాకుండా కేరళలోని అగస్త్యపర్వతం ఆంధ్రదేశంలోని శ్రీశైలపర్వతం, గుజరాత్‌లోని గిరినార్ పర్వతాలను సిద్ధయోగులకు సంబంధించిన పర్వతాలుగా పేర్కొంటున్నారు. ఈ పర్వతాలపై ఇప్పటికీ సిద్ధపురుషులు కొన్ని ప్రత్యేక సమయాలలో అదృశ్య రూపులుగా సంచరిస్తూ ఉంటారని అనుభవజ్ఞులు తెలియజేస్తున్నారు. ఈ పర్వతాలలోని రహస్య గుహలలో దాగి ఉండే రహస్యాలను తెలుసుకో వాలంటే సిద్ధయోగుల అనుగ్రహం మరియు అనుమతి ఉండి తీరాలి. అలాంటి అనుమతిని పొందిన వ్యక్తే ఆ గుహలలో దాగి ఉండే నిగూఢ రహస్యాలను తెలుసుకోగలడు.

ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ఆయుర్వేవైద్యాన్ని ఒక శక్తివంతమైన వైద్యవిధానంగా గుర్తిస్తున్నారు. అయితే ఆంధ్రదేశంతో సహా చాలామంది ఉత్తర భారతీయులకు సిద్ధవైద్యం గురించి దాదాపుగా తెలియదనే చెప్పాలి. దాదాపు 11వేల సంవత్సరాల క్రితం మడగాస్కర్-ఆస్ట్రేలియా-శ్రీలంక భూభాగాలను కలుపుతూ ఒక విశాలమైన భూభాగం ఉండేది. ఈ భూభాగం (కుమారిఖండం) ఈనాటి తమిళనాడుతో అనుసంధించబడి ఉండేది. ఆ సమయంలో ఈ భూభాగం అంతా సిద్ధయోగుల సంచారంతో తరించింది. అయితే 11వేల సంవత్సరాల క్రితం ఒకరోజున ఒక భయంకరమైన జలప్రళయం సంభవించి ఆ భూభాగం అంతా మునిగిపోయింది. ఆ విశాలమైన భూభాగాన్నే తమిళులు "కుమారిఖండం" అని పిలిచారు. పాశ్చాత్యులు ఆ భూభాగాన్ని "లెమూరియా" అని పిలవటం జరిగింది. (నీటిలో మునిగి పోయిన కుమారిఖండంకు సంబంధించిన సంపూర్ణ వివరాలను ఇదే పుస్తకంలోని ఇంకొక అధ్యాయంలో చదువగలరు.)

తమిళ భాషను మరియు వ్యాకరణాన్ని సృష్టించిన మహాత్ముడిగా గుర్తించబడిన అగస్త్యమహర్షి ఆధ్వర్యంలో రెండు "సంగమాలు" జరిగాయి. (సంగమం అంటే అనేకమంది మహాపండితుల సభ అనిఅర్థం. ప్రాచీన తమిళనాడులో ఇలాంటి సంగమాలు అనేకం జరిగాయి). ప్రస్తుత శ్రీలంక భూఖండానికి దక్షిణంగా ఉన్న కుమారిఖండం అన్న ప్రదేశంలో ఈ రెండు సంగమాలు జరిగాయని చెబుతారు.

సిద్ధయోగులలో అతిశక్తివంతుడిగా పేర్కొనబడిన భోగర్ ప్రాచీన తమిళనాడులోని ఒక కంసాలి కులంలో జన్మించాడు. ఈయన ఆనాటి నాథయోగి అయిన "కాళంగి" వద్ద గురుదీక్ష తీసుకున్నాడు. అనేక శాస్త్రాలలో అపారమైన పాండిత్యాన్ని గడించిన ఈ భోగర్ అప్పుడప్పుడూ చైనా దేశానికి వెళ్ళిరావటంకోసం ఒక విమానాన్ని తయారుచేసాడని చెబుతారు. ఈ సిద్ధయోగే పళనిలోని మురుగన్‌యొక్క నవపాషాణ విగ్రహాన్ని రూపొందించాడు. ఈ విగ్రహం అతిశక్తివంతమైన బాంబుల వల్లకూడా ఏమాత్రం నాశనంకాదని చెబుతారు.

సిద్ధవైద్య విశేషములు?

ప్రాచీన సిద్ధయోగులచేత రూపొందించబడిన ఈ సిద్ధ వైద్యం అనేక ప్రత్యేకమయిన లక్షణాలను కలిగి ఉన్నది. "మనిషిలో ఒక్కసారిగా ఏ రోగమూ ఆవిర్భవించదు" అని సిద్ధ వైద్యం ఉద్ఘాటిస్తున్నది. మనిషికి వచ్చే రోగానికి అనేక అంశాల ప్రభావం కారణం అవుతుందని సిద్ధవైద్యం భావిస్తుంది. రోగి ఉండే వాతావరణం, అతని జీర్ణశక్తి, అతని శరీర స్వభావం, జీవిత విధానం ఆధారంగా చేసుకుని రోగనిర్ధారణ చెయ్యాలని సిద్ధవైద్యం సూచిస్తుంది. సిద్ధవైద్యంలో రోగియొక్క శరీరంలోకి ఇచ్చే ఔషధాలు, శరీరంమీద చేసే ఔషధపూరిత తైలాలమర్ధన అనే రెండు రకాల విధానాలు రోగ నివారణకోసం ఉపయోగించబడతాయి.

ఒక ముఖ్య విశేషం ఏమంటే సిద్ధవైద్యంలో "పథ్యము"నకు అనగా నియమబద్ధమైన ఆహార నియమానికి ఖచ్చితమైన ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

అగస్త్యమహర్షి మొట్టమొదటి సిద్ధవైద్యుడిగా పేర్కొనబడ్డాడు. సిద్ధ వైద్యంలో మనిషి కేవలం రక్తము, మాంసముతో కూడిన ఒక జీవిగా చూడబడడు. అతనికి మరియు ప్రకృతికి మధ్య ఉండే సంబంధం ఆధారంగా మనిషిని అంచనావెయ్యటం జరుగుతుంది. మనిషి శరీరం కన్నా అతని మనస్సుకి మరియు ప్రాణానికి అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. సిద్ధవైద్యంలో 11 రకాల లోహాలు, 64 రకాల పాషాణాలు (పాదరస సంబంధమైనవి మరియు పాదరస సంబంధం లేనివి), 120 ఉపరసములు (లవణాలు, ఖనిజాలు) మరియు అనేక రకాల జంతు సంబంధ పదార్థాలు

ఉపయోగించి వివిధ వ్యాధులకు ఔషధాలు తయారుచేయబడతాయి. సిద్ధవైద్యంలో మొత్తం 64 రకాల ఔషధాలు ఉంటాయి. వాటిలో 32 రకాలు నోటి ద్వారా తీసుకునేవి, 32 రకాలు శరీరంపైన ఉపయోగించేవిగా ఉన్నాయి.

ఒక విశేషం ఏమంటే కడుపులోకి తీసుకునే కొన్నిరకాల సిద్ధ ఔషధాలు తయారుచేయబడిన తరువాత అనేక సంవత్సరాలపాటు శక్తిని కోల్పోకుండా ఉంటాయి. అనగా ఈ ఔషధాలను తయారుచేసిన 10 సంవత్సరాల తరువాత ఉపయోగించినా అవి శక్తివంతంగా రోగాన్ని నిర్మూలిస్తాయి అన్నమాట. ఒక విశేషం ఏమంటే భారతదేశంలో ఆవిర్భవించిన ఆయుర్వేద వైద్యంలో కూడా సిద్ధవైద్యంలో ఉపయోగించే పద్ధతుల్నే ఉపయోగించటం విశేషం. ఈ రెండు వైద్య విధానాలలో కూడా భస్మం(లోహాలు, లవణాలు కాల్చటంద్వారా ఏర్పడిన భస్మం), చూర్ణం (ఔషధ మూలికల పొడి), కషాయం (ఔషధ మూలికలను నీళ్ళలో బాగా మరగపెట్టటంవల్ల వచ్చే ద్రవం), లేహ్యం (అశ్వగంధ, చవ్యనప్రాస లాంటి జెల్లీ పదార్థాలు), ఘృతం (ఆవునెయ్యితో తయారుచేయబడిన ఔషధాలు) మరియు తైలం (నూనెతో తయారుచేయబడిన ఔషధాలు) ఉపయోగించటం విశేషం.

భారతదేశంలో ఆయుర్వేదం, సిద్ధ, యునాని అనే మూడు సాంప్రదాయ వైద్య విధానాలు చాలాకాలం నుండి వాడుకలో ఉన్నాయి. దక్షిణ భారతదేశంలోని కేరళ రాష్ట్రంలోను, ఉత్తరభారతదేశంలోను ఆయుర్వేదం ప్రముఖ స్థానాన్ని ఆక్రమించి ఉండగా తమిళనాడు మరియు కేరళలోని కొన్ని ప్రాంతాలలో సిద్ధవైద్యం ప్రబలంగా ఉన్నది. ఇక అరేబియా దేశం నుండి దిగుమతి అయిన యునాని వైద్యం భారతదేశంలోని పట్టణ ప్రాంతాలలో ఆదరించబడుతున్నది.

సిద్ధవైద్య చరిత్రలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే మానవజాతి క్షేమంకోసం పరమశివుడు, సిద్ధవైద్య రహస్యాలను మొదట పార్వతీదేవికి తెలియజేసాడు. ఆ తరువాత పార్వతీదేవి ఆ వైద్య రహస్యాలను నందీశ్వరుడికి అందజేసింది. నందీశ్వరుడు మానవ లోకంలో సిద్ధయోగిగా జన్మించాడు. ఆ నందీశ్వరుడే తొలి సిద్ధవైద్యుడని విశ్వసించబడుతున్నది.

ప్రతివ్యక్తి ఒక ప్రత్యేక దోష ఆధిక్యతతో (కఫ/పిత్త/వాత) జన్మిస్తాడు. దానినే వ్యక్తియొక్క ప్రత్యేక స్వభావం అని పిలుస్తారు. పుట్టుకతోనే ఆ స్వభావం నిర్ణయం అవుతుంది. ఆ స్వభావమే అతడు లేదా ఆమె యొక్క ఆరోగ్య స్థాయిని నిర్ణయిస్తుంది. సిద్ధవైద్య సూత్రాల ప్రకారం చూసినట్లయితే ప్రతి మనిషి జీవితాన్ని మూడు భాగాలు విభజించినట్లయితే మొదటి భాగంలో వాత ప్రాబల్యం అధికంగా ఉంటుంది. రెండవ భాగంలో పిత్తం ఆధిక్యత ఉంటుంది. మూడవ భాగం కఫం ఆధిక్యతలో ఉంటుంది.

సిద్ధవైద్య సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే పిల్లలలో వాతం, యువకులలో పిత్తం, వృద్ధులలో కఫం అధికంగా ఉంటాయని తెలుస్తున్నది. ఇక ఆయుర్వేద వైద్యశాస్త్ర సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే పిల్లలలో కఫం, యువకులలో పిత్తం, వృద్ధులలో వాతం అధికంగా ఉంటాయని తెస్తున్నది.

సిద్ధవైద్యంలో 8 అంశాలను పరిశీలించి రోగియొక్క రోగాన్ని నిర్ధారిస్తారు. అది ఎలాగంటే...

**1. నాలుక పరిశీలన :** నాలుక నలుపు రంగులో కనిపిస్తే వాత ప్రకోపం ఉన్నట్లుగా గుర్తిస్తారు. నాలుక పసుపు లేదా ఎరుపు రంగులో కనిపించినట్లయితే పిత్తం ప్రకోపించినట్లుగా గుర్తిస్తారు. తెలుపు రంగులో కనిపిస్తే కఫ ప్రకోపం జరిగినట్లుగా భావిస్తారు. నాలుక పుండులాగా కనిపిస్తే రక్తలోపం ఉన్నట్లుగా గుర్తిస్తారు.

**2. చర్మంరంగు :** చర్మం రంగు నల్లగా ఉంటే వాతం ప్రకోపించినట్లుగా గుర్తిస్తారు. పసుపు లేదా ఎరుపు రంగులో కనిపిస్తే పిత్త ప్రకోపం జరిగిన ట్లుగా భావిస్తారు. చర్మం పాలిపోయినట్లుగా కనిపిస్తే కఫ ప్రకోపం జరిగినట్లుగా భావిస్తారు.

**3. స్వరం :** మనిషి మాట్లాడేటప్పుడు స్వరం మామూలుగా ఉన్నట్లయితే వాత ప్రకోపం ఉన్నట్లుగా గుర్తిస్తారు. స్వరం పెద్దస్థాయిలో వినిపిస్తే పిత్తప్రకోపం అని గ్రహిస్తారు. స్వరం చాలా చిన్నస్థాయిలో ఉన్నట్లయితే కఫ ప్రకోపం జరిగినట్లుగా భావిస్తారు.

**4. కళ్ళు :** కళ్ళు మబ్బురంగులో కనిపిస్తే వాతప్రకోపం అని భావిస్తారు.

పసుపు లేదా ఎరుపు రంగులో కనిపిస్తే పిత్త ప్రకోపం అని గుర్తిస్తారు. కళ్ళు పాలిపోయినట్లుగా కఫప్రకోపం జరిగినట్లుగా భావిస్తారు.

**5.** స్పర్శ : ఒక మనిషిని తాకినప్పుడు అతని చర్మం పొడిగా ఉన్నట్లు కనిపిస్తే అతని శరీరంలో వాత ప్రకోపం ఉన్నట్లుగా గ్రహిస్తారు. వెచ్చగా తగిలినట్లయితే పిత్తం ప్రకోపించినట్లుగా గుర్తిస్తారు. చల్లగా మరియు బంకగా తగిలినట్లయితే కఫప్రకోపం జరిగినట్లుగా భావిస్తారు.

**6.** మలపరీక్ష : మలం నల్లగా ఉండే వాతం ప్రకోపించినట్లుగాను, పసుపు రంగులో ఉండే పిత్తం ప్రకోపించినట్లుగాను, పాలిపోయినట్లుగా ఉంటే కఫం ప్రకోపించినట్లుగాను గుర్తిస్తారు.

**7.** మూత్రపరీక్ష : థెరయ్యార్ అనే సిద్ధయోగి తాను వ్రాసిన సిద్ధ వైద్యశాస్త్ర గ్రంథంలో మూత్ర పరీక్ష గురించి ఎన్నో ఆసక్తికరమైన విషయాలను వ్రాయటం జరిగింది. మూత్రంయొక్క రంగు మరియు చిక్కదనములలో వచ్చే మార్పులనుబట్టి శరీరంలో ఉండే దోషాల అసమతౌల్యాన్ని గుర్తించవచ్చని థెరయ్యార్ పేర్కొన్నాడు. ప్రాచీనకాలంలో సిద్ధవైద్యులు రోగియొక్క ఒక మూత్రపుచుక్కను నూనెపై వేసేవారు. ఆపై ఆ చుక్కను పరిశీలించి రోగిలో ఏ దోషం (హ్యూమర్) ప్రకోపించిందో మరియు ఆ రోగి ఏ రోగంతో బాధపడుతున్నాడో తెలుసుకునేవారు.

సిద్ధవైద్యంలో మూత్ర పరీక్షను రోగి ఉదయం నిద్రలేవగానే చేస్తారు. మూత్రం ఎండుగడ్డి రంగులో ఉంటే అజీర్ణం ఉన్నట్లుగాను, పసుపు, ఎరుపు కలిసి ఉన్నట్లుగా ఉంటే వేడి ఉన్నట్లుగాను, గులాబిరంగులో ఉంటే రక్తపోటు ఉన్నట్లుగాను, కుంకుమపువ్వు రంగులో ఉంటే పచ్చకామెర్లు ఉన్నట్లుగాను, మాంసాన్ని కడిగిన నీటి రంగులో ఉన్నట్లయితే గుద సంబంధమైన వ్యాధి ఉన్నట్లుగాను గుర్తిస్తారు.

ఇప్పటికీ సాంప్రదాయ సిద్ధవైద్యులు ఈవిధమైన మూత్రపరీక్షను రోగనిర్ధారణకోసం చెయ్యటం విశేషం.

ఆయుర్వేద మరియు యునాని వైద్య విధానాలలో మూత్ర పరీక్షలో మూత్రంయొక్క రంగు, వాసన, చిక్కదనం, మూత్రంలో పోగుబడిన వివిధ రకాల రసాయనాలను పరీక్షించటం జరుగుతుంది. మలపరీక్ష మరియు

చెమట పరీక్ష కన్నా మూత్రపరీక్షకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుందని సిద్ధవైద్యం పేర్కొంటున్నది. మానవ శరీరంలో తయారయ్యే వ్యర్థ పదార్థాలు మూత్రం ద్వారా బయటకు విసర్జించబడతాయి. ఒకవ్యక్తి కొన్ని రోజులపాటు మల విసర్జన చెయ్యకపోయినా పెద్ద ప్రమాదం ఏమీ ఉండదు. కానీ ఒకవ్యక్తి ఒక రోజుపాటు (24 గంటలు) మూత్ర విసర్జన చెయ్యకపోతే అతడికి తీవ్రమైన అనారోగ్యాలు సంక్రమించే అవకాశం ఉంటుంది. కారణం శరీరంలో పేరుకుపోయిన మలిన పదార్థాలు 24 గంటల్లోనే శరీర వ్యవస్థను తీవ్రంగా దెబ్బతీస్తాయి.

సాధారణంగా ఆరోగ్యవంతుల మూత్రం ఎండుగడ్డి రంగులో ఉంటుంది. ఇది ఏవిధమైన వాసనను కలిగి ఉండదు. మూత్రం 5 రంగులలో వస్తుంది. అది ఎలాగంటే.... 1. పసుపుపచ్చ, 2. ఎరుపు, 3. ఆకుపచ్చ, 4. నలుపు, 5. తెలుపు రంగులు. మరల ఈ 5 రంగులు ఒక్కొక్కటి ఇంకొన్ని ఉప విభాగాలుగా విభజించబడ్డాయి. ఈ ఉప విభాగాలు కూడా విభిన్నమైన రంగులలో ఉంటాయి.

**1. పసుపురంగు మూత్రం :**

ఎ) ఎండుగడ్డి నానబెట్టబడిన నీటిరంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తికి "అజీర్ణవ్యాధి" ఉన్నట్లుగా గుర్తించాలి.

బి) నిమ్మపండు రంగులో మూత్రం ఉన్నట్లయితే ఆ వ్యక్తికి "జీర్ణశక్తి" చక్కగా ఉన్నట్లుగా గుర్తించాలి.

సి) ఎరుపురంగు కలిసిన పసుపుపచ్చ రంగులో మూత్రం ఉన్నట్లయితే ఆ వ్యక్తికి వేడిచేసినట్లుగా అర్థంచేసుకోవాలి.

డి) మూత్రం పూర్తి ఎరుపురంగులో ఉన్నట్లయితే ఆ వ్యక్తికి శరీరంలో విపరీతమైన వేడి ఉన్నట్లుగా భావించాలి.

ఇ) మూత్రం కాషాయరంగులో ఉన్నట్లయితే ఆ వ్యక్తికి అత్యంత తీవ్రమైన వేడిచేసినట్లుగా గ్రహించాలి.

**2. ఎరుపు :**

ఎ) కొద్దిగా ముదురు ఎరుపురంగులో మూత్రం ఉన్నట్లయితే ఆ వ్యక్తి శరీరంలో రక్తం వేడెక్కినట్లుగా గుర్తించాలి.

బి) ప్రకాశవంతమైన ఎరుపురంగులో మూత్రం ఉన్నట్లయితే ఆ వ్యక్తి రక్తం తీవ్రమైన వేడితో ఉన్నట్లుగా గ్రహించాలి.

సి) ముదురు ఎరుపురంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ మూత్రంలో రక్తం పడుతున్నట్లుగా గ్రహించాలి.

**3. ఆకుపచ్చరంగు :**

ఎ) కొంచెం ముదురు ఆకుపచ్చరంగులో మూత్రం వచ్చినట్లయితే ఆవ్యక్తి శరీరంలో శీతలం లేదా చల్లదనం ఉన్నట్లుగా గుర్తిస్తారు.

బి) ఆకాశనీలం రంగు కలిసిన ఆకుపచ్చరంగులో మూత్రం ఉన్నట్లయితే అతని శరీరంలో శీతలం మరియు విషపదార్థాలు ఉన్నట్లుగా గ్రహిస్తారు.

సి) నీలంరంగు కలిసిన ఆకుపచ్చరంగులో మూత్రం కనిపిస్తే ఆ వ్యక్తి శరీరంలో వాతదోషం అసమతౌల్యంలో పడినట్లుగా అర్థంచేసుకుంటారు.

డి) నీలిరంగు మరియు బంకమన్ను రంగు కలిసిన రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తిలో వాతసంబంధరోగం ప్రారంభం అవుతున్నట్లుగా గుర్తించాలి.

ఇ) ఆకుపచ్చరంగులో మూత్రం వచ్చినట్లయితే వాతదోష సంబంధ రోగం ముదిరినట్లుగా గ్రహిస్తారు.

**3. ముదురు రంగు :**

ఎ) ముదురు ఎరుపు రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తికి పచ్చకామెర్లు(జాండీస్) లేదా తీవ్రమైన పిత్తసంబంధ రోగం ఉన్నట్లుగా అంచనావేస్తారు.

బి) ఎర్రటి ఎరుపురంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తి శరీరంలోని రక్తకణాలు నాశనం అవుతున్నట్లుగా గుర్తిస్తారు.

సి) ముదురు ఆకుపచ్చ రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తి రక్తంలో మలిన పదార్థాలు అధికంగా ఉన్నట్లుగా అంచనావేస్తారు.

డి) పాలిపోయిన తెలుపు మరియు ముదురు రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తిలో వాత మరియు కఫ సంబంధ వ్యాధి ఉన్నట్లుగా భావిస్తారు.

**4. తెలుపు రంగు :**

ఎ) పాలిపోయిన తెలుపు రంగులో మూత్రం రావటం మరియు శరీరంలో వేడి తగ్గిపోవటం జరిగినప్పుడు ఆ వ్యక్తికి నయంకాని అనారోగ్యం ఉన్నట్లుగా అంచనావేస్తారు.

బి) మూత్రంలో శ్లేష్మం కూడా పడుతున్నప్పుడు ఆ వ్యక్తిలో వేడి విపరీతంగా పెరిగిపోయి కఫదోషం ఏర్పడినట్లుగా గుర్తిస్తారు.

సి) తెల్లటి పాల రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తి శరీరంలోని ఎముకల గుజ్జు నాశనం అవుతున్నట్లుగాను మరియు ఆ వ్యక్తి క్షయవ్యాధి వచ్చే అవకాశం ఉన్నట్లుగాను గుర్తిస్తారు.

డి) పాలిపోయిన తెలుపురంగులో వచ్చే మూత్రంలో శ్లేష్మం కనిపిస్తుంది మరియు ఆ మూత్రం దుర్వాసన వస్తుంది. – ఇలాంటి పరిస్థితి మూత్రంలో కనిపించినట్లయితే ఆ వ్యక్తికి మూత్రమార్గంలో లేదా మలమార్గంలో అల్సర్ వచ్చినట్లుగా లేదా మూత్ర నాళంలో రాళ్ళు ఏర్పడినట్లుగా గుర్తిస్తారు.

ఇ) వీర్యం రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తిలో కఫదోషం బాగా తక్కువ అయినట్లుగా మరియు అన్నిదోషాలు అసమతౌల్యంలో పడ్డట్లుగా అంచనావేస్తారు.

ఎఫ్) మూత్రంలో ఏవిధమైన మురికి పదార్థాలు లేనట్లయితే ఆ వ్యక్తికి నివారణకాని వ్యాధి వచ్చినట్లుగా గుర్తిస్తారు.

జి) పాలరంగులో లేదా మజ్జిగరంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తికి నయంకాని అనారోగ్యం ఉన్నట్లుగా అర్థంచేసుకుంటారు.

హెచ్) కుళ్ళిపోయిన మాంసాన్ని కడిగినప్పుడు వచ్చే ద్రవాన్ని పోలిన రంగులో మూత్రం వచ్చినట్లయితే ఆ వ్యక్తిలో మూత్రపిండాలు సరిగా పనిచెయ్యనట్లుగాను, రక్తంలో మరియు కఫదోషంలో తేడాలు వచ్చినట్లుగా గుర్తిస్తారు.

ఐ) మూత్రం చిక్కగా ఉన్నా లేక కరగపెట్టిన నెయ్యిరంగులో ఉన్నా ఆ వ్యక్తికి త్వరలో మరణం రాబోతున్నదని గుర్తిస్తారు.

**టిబెటన్ మరియు సిద్ధవైద్యంలో నాడీపరీక్ష :**

టిబెటన్ సాంప్రదాయ వైద్యశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం మనిషి మణికట్టు వద్ద ఉండే నాడి బలంగా కొట్టుకుంటున్నట్లయితే ఆ వ్యక్తిలో 'పిత్తరసం' (Bile) నిష్పత్తి అధికంగా ఉన్నట్లుగా భావిస్తారు. కొన్నిసార్లు నాడి బలంగా కొట్టుకుంటుంది కానీ ఒక క్రమవిధానంలో కొట్టుకోదు. అలాంటి పరిస్థితి ఉన్నట్లయితే ఆ మనిషిలో 'వాయు దోషం' అధికంగా ఉన్నట్లుగా భావిస్తారు. కొన్నిసార్లు ఒక రోజులో నాడి నిదానంగా మరియు ఒక పద్ధతి లేకుండా కొట్టుకోవటం జరుగుతుంది. అలాంటి పరిస్థితి ఉన్నట్లయితే ఆ వ్యక్తిలో 'కఫం' అధికంగా ఉన్నట్లుగా గ్రహిస్తారు.

సాంప్రదాయ చైనా మరియు టిబెట్ వైద్యవిధానాలు నాడీ పరీక్షద్వారా రోగ నిర్ధారణ చేస్తాయి. సాంప్రదాయ చైనావైద్యుల అభిప్రాయం ప్రకారం నాడి 200 రకాలుగా కొట్టుకుంటుంది. కానీ టిబెట్ సాంప్రదాయ వైద్యశాస్త్రం ప్రకారం నాడి కేవలము 11 రకాలుగా మాత్రమే కొట్టుకుంటుంది. నాడీపరీక్ష విషయానికి వస్తే సాంప్రదాయ చైనావైద్యులు కన్నా, టిబెట్ సాంప్రదాయ వైద్యులే అధిక సామర్థ్యంగలవారని చెప్పవచ్చు. కేవలము నాడీ పరీక్ష ద్వారా కొద్ది నెలల్లో రాబోయే రోగాన్నికూడా టిబెట్ వైద్యులు ముందుగానే సూచించగలరు.

సిద్ధవైద్యంలో రోగ నిర్ధారణకోసం నాడీ పరీక్షను ప్రధానంగా తీసు కుంటారు. ఆయుర్వేదంలో కూడా నాడీ పరీక్ష ఉన్నప్పటికీ కేవలం క్రీ.శ.14వ శతాబ్దం తరువాతే ఆయుర్వేదంలో నాడీపరీక్షా విధానం ప్రవేశించింది. కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం అరబ్బీ దేశాలకు చెందిన యునాని వైద్య విధానం నుండి నాడీ పరీక్ష విజ్ఞానాన్ని సిద్ధవైద్యం తీసుకున్నదని తెలుస్తున్నది. సిద్ధవైద్యంలో నాడీపరీక్షకు అధిక ప్రాధాన్యత ఉన్నది అని చెప్పక తప్పదు. నాడీపరీక్ష అన్ని ఋతువులలో ఒకే సమయంలో చేయరు.

సిద్ధవైద్య సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే ఒక వ్యక్తికి విపరీతమైన ఆకలిగా ఉన్నప్పుడు లేదా ఒకవ్యక్తి పొట్టనిండా ఆహారం తీసుకుని

ఉన్నప్పుడు, బిడ్డ చేతులతో ఉన్నప్పుడు లేదా మానసికంగా ఒత్తిడిలో ఉన్నప్పుడు లేదా శారీరకంగా బాగా అలిసిపోయినప్పుడు ఆ వ్యక్తికి నాడీపరీక్ష చేయటం వల్ల రోగ నిర్ధారణ సరిగా జరగదని తెలుస్తున్నది.

కొన్నిసార్లు చేతి మణికట్టువద్ద నాడీపరీక్షను చేసే అవకాశం లేనప్పుడు మనిషియొక్క మెడ లేదా చెవి తమ్మెలు లేదా కాలి చీలమండ వద్ద ఉండే రక్తనాళాల కేంద్రాలను పరిశీలించి రోగ నిర్ధారణ చెయ్యటం జరుగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే నాడీపరీక్ష చేసేటప్పుడు స్త్రీల ఎడమ చేయిని, పురుషుల కుడిచేయిని తీసుకోవటం జరుగుతుంది.

సిద్ధవైద్యంలో అతిముఖ్యమైన ఔషధం పాదరసం (మెర్క్యురి) నుండి తయారవుతుంది. పాదరసం మరియు గంధకం కలిపినప్పుడు "మెర్క్యురిక్ సల్ఫైడ్" తయారవుతుంది. ఆయుర్వేదం మరియు సిద్ధవైద్య ఔషధ తయారీలో పాదరసం అధికంగా ఉపయోగించబడుతుంది. ఈ ఔషధ తయారీకి శుద్ధమైన పాదరసం కావలసి ఉంటుంది. అలాంటి పాదరసం భారతదేశంలో దొరకదు. దానిని ఐరోపాదేశం అయిన ఇటలీ నుండి దిగుమతి చేసుకుంటారు.

సిద్ధవైద్యులు అనేక నూతన ఔషధాలను వాడుకలోకి తీసుకువచ్చారు. ఉదాహరణకు కోరక్కర్‌సిద్ధర్ గంజాయిని నొప్పుల తయారీ ఔషధంగా తొలిసారిగా ఉపయోగించాడు. మానసిక వ్యాధులతో బాధపడేవారికి "పెరండభస్మ" అనే ఎముకల భస్మాన్ని ఔషధంగా ఉపయోగించారు. ఈ భస్మం లేదా బూడిద, మానవుల మరియు కుక్కల పుర్రె ఎముకలను కాల్చి సేకరించటం జరిగేది.

"వర్మ" వైద్య విధానం సిద్ధవైద్యంలో ఒక భాగంగా ఉన్నది. తమిళనాడు మరియు కేరళలోని గ్రామాలలో ఈ వైద్య విధానం వాడుకలో ఉన్నది. ముఖ్యంగా ప్రమాదాల వల్ల శరీరం లోపల అయ్యే గాయాలకు ఈ వైద్య విధానం ఎంతగానో ఉపయోగపడుతుంది. మనిషి శరీరంలో వందకు పైగా ముఖ్యమైన కేంద్రాలు ఉంటాయని, వాటిని వర్మ కేంద్రములు (వర్మ పాయింట్స్) అని పిలుస్తారు. వివిధ రకాల తైలాలతో ఈ వర్మ కేంద్రాల వద్ద మర్దన లాంటి ప్రక్రియలు చేస్తారు.

మానవ శరీరంలో "ఓజస్సు" (రోగనిరోధక శక్తి) తగ్గటం వల్ల HIV/ AIDS వస్తుందని ఆయుర్వేద వైద్యం పేర్కొంటున్నది.

"ఎయిడ్స్ వ్యాధి"ని సిద్ధవైద్యం "వేట్టైనాయ్" (వేటకుక్క) అని పేర్కొన్నది. సిద్ధవైద్య సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే ఎయిడ్స్ వ్యాధి 21 వర్గాలుగా వర్గీకరించబడింది. దాదాపు 3వేల సంవత్సరాల క్రితమే సిద్ధవైద్యం ఎయిడ్స్ వ్యాధికి ఔషధాన్ని రూపొందించినట్లుగా తెలుస్తున్నది,

"ఓజస్సు" మానవుల ఎముకల గుజ్జులో ఉంటుంది. మనిషి శరీరంలో జీర్ణశక్తి, రోగనిరోధక శక్తిని పెంచటంలో ప్రధానపాత్ర ఓజస్సు వహిస్తుంది. మానవుల వెన్నుముక పొడవునా ఉండే చక్రాలలో ఓజస్సు నిల్వచేయబడి ఉంటుంది. పురుషుడు భావప్రాప్తి పొందినప్పుడు ఈ ఓజస్సు క్రిందకు దిగిస్తుంది.

ఓజస్సును ఎక్కువగా నష్టపోవటంవల్ల మనిషిలోని వాతరసం తీవ్రమైన అసమతౌల్యానికి గురి అవుతుంది. సాత్వికమైన ఆహారం మరియు ప్రాణాయామంవల్ల ఓజస్సుయొక్క శక్తి అధికం అవుతుంది.

అశ్వగంధ లేదా శతావారి అనే ఆయుర్వేద ఔషధాన్ని పాలతోపాటు తీసుకున్నట్లయితే శరీరంలో రోగనిరోధకవ్యవస్థ బలంగా తయారవుతుంది.

**సిద్ధవైద్యంలో మర్దన విధానాలు :**

సిద్ధవైద్య సూత్రాల ప్రకారం చూసినట్లయితే మానవునిలో పిత్తదోషం ప్రకోపించినప్పుడు శరీరానికి చల్లదనాన్ని కలిగించే నూనెలకు (కొబ్బరినూనె/ సన్‌ఫ్లవర్ ఆయిల్/నెయ్యి) సువాసనలు ఇచ్చే గంధపు నూనె/రోజ్‌వాటర్ కలిపి ఆపై ఆ మిశ్రమ ద్రవంతో అతడికి లేదా ఆమెకు మర్దనా చెయ్యాలి. ఫలితంగా వారి వంట్లో ఉష్ణోగ్రత తీవ్రత తగ్గిపోయి పిత్తదోషం సమతౌల్యంలోకి వస్తుంది.

కొంతమందిలో కొన్ని సమయాలలో కఫదోషం ప్రకోపిస్తుంది. అలాంటి సమయాలలో ఆవనూనె/ఉలవలనూనె తీసుకుని ఆ నూనెకు కర్పూరం/కస్తూరి/లవంగనూనె కలిపి ఆ మిశ్రమనూనెతో వారికి మర్దనాచెయ్యాలి. ఫలితంగా వారిలో కఫదోషం సమతౌల్యంలోకి వస్తుంది.

కొంతమందిలో అప్పుడప్పుడూ వాతదోషం అసమతౌల్యంలో పడుతుంది. లేదా ప్రకోపిస్తుంది. అలాంటి సమయాలలో నువ్వులనూనె

లేదా బాదంనూనెను తీసుకుని దానికి గంధపునూనె/కర్పూరం లాంటి సువాసన తైలాన్ని కలిపి ఆపై ఆ మిశ్రమ తైలంతో వారికి మర్దనా చెయ్యాలి. అప్పుడు వారిలో ఉండే వాతదోషం సమతౌల్యంలోకి వస్తుంది.

వాస్తవానికి ఆయుర్వేదం కంటే సిద్ధవైద్యం మరింత ఆధునిక మరియు శక్తివంతమైన పదార్థాలను ఔషధ తయారీకి ఉపయోగిస్తుందని గుర్తించాలి. సిద్ధవైద్య సాహిత్యంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే లక్షలాది రకాల ఔషధాల తయారీ, సిద్ధవైద్యంలో ఉన్నట్లుగా తెలుస్తున్నది. ఇప్పటివరకు సిద్ధవైద్యులు(సిద్ధయోగులు) తెలియజేసిన ఔషధాలలో కేవలం రెండు శాతం మాత్రమే ఆ తరువాతకాలానికి చెందిన వైద్యులు తయారు చేసినట్లుగా తెలుస్తున్నది. ఇప్పటికీ అపార సంఖ్యలో ఎన్నో అద్భుత ఔషధాల తయారీకి సంబంధించిన సమాచారం ప్రాచీన తాళపత్ర గ్రంథాలలో మగ్గిపోతున్నది కొందరు పరిశోధకులు విచారం వ్యక్తం చేస్తున్నారు.

సిద్ధయోగులు ప్రాచీనకాలంలో రచించిన గ్రంథాలయొక్క లిఖిత ప్రతులు ఆ తరువాత కాలంలో తమిళనాడులోని వివిధ ప్రదేశాలకు చేరుకున్నాయి. ఆ గ్రంథాలలోని ప్రయోజనకర సమాచారాన్ని గుర్తించిన వారు ఆ గ్రంథాలను మానవాభ్యుదయంకోసం ఉపయోగించారు. కొంతమంది తమవద్దకు చేరిన ఆ లిఖిత ప్రతులయొక్క ఉపయోగాన్ని తెలుసుకోలేక వాటిని చెక్కపెట్టెలలోపెట్టి తమ ఇంటి అటకమీద చేర్చారు. ఇప్పటికీ అప్పుడప్పుడూ ఆ గ్రంథాలయొక్క లిఖిత ప్రతులు బయటపడుతూ ఉంటాయి. వాటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుని భాషా పండితులు మరియు పురావస్తు శాస్త్రజ్ఞుల సహకారంతో ఆ లిఖిత ప్రతులలోని సారాంశాన్ని ప్రజలకు అందేలా చెయ్యటం జరుగుతున్నది.

## 4. అద్భుత శక్తులు కలిగిన అంబజోగాయ్ దివ్యక్షేత్రం విశేషాలు?

మహారాష్ట్రలోని బీడ్ జిల్లాలో అంబాజోగాయ్ అనే ఒక పట్టణం ఉన్నది. గతకాలంలో ఈ పట్టణంలో స్వామి రామానందతీర్థ లాంటి గొప్ప

రాజకీయ నాయకులు ఆవిర్భవించారు. ఈ రామానంద తీర్థ, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో తెలంగాణా రాష్ట్రంలో(నాటి హైదరాబాద్ స్టేట్) అరాచకాలు సృష్టించిన రజాకార్లను తరిమికొట్టటంలో ప్రముఖ పాత్ర పోషించాడు.

ఈ పట్టణం మరఠ్వాడ ప్రాంతంలో ఉన్నది. ఈ పట్టణంలో ఉన్న ఒక ప్రధానమైన ఆకర్షణ ఏమంటే ఇక్కడ అత్యంత మహాత్యంగల "యోగీశ్వరి" అనే ఒక దేవతయొక్క దివ్యక్షేత్రం ఏర్పడి ఉన్నది. మహారాష్ట్ర మరియు కొంకణ్ ప్రాంతాలలో ఉండే అనేకమంది హైందవులు ఈ దేవతను తమ కుల దేవతగా పూజిస్తున్నారు. మహారాష్ట్రలోని పార్లే వైద్యనాధ్ క్షేత్రానికి 25 కి.మీ. దూరంలో అంబాజోగాయ్ క్షేత్రం ఉన్నది.


యోగీశ్వరి

పురాణ కాలంలో ఈ ప్రాంతంలో దంతాసురుడు అనే ఒక రాక్షసుడు ఉండే వాడు. అతడు చేసే అరాచకాలను అణచివేయ్యటంకోసం అంబ (పార్వతి) ఈ ప్రాంతంలో అవతరించింది.

ఈ ప్రాంతం చాలాకాలంపాటు నిజాం నవాబు పాలనలో ఉన్నది. ఆ సమయంలో ఈ ప్రాంతానికి మోమినాబాద్ అన్నపేరు పెట్టబడింది. భారత సైన్యం 1948లో నిజాం సైన్యాలను ఓడించి, నిజాం రాష్ట్రాన్ని భారతదేశంలో విలీనం చేసింది. నిజాం అధికారం తొలగిపోవటంతో ఈ ప్రాంతంలోని హిందువులు ఈ ప్రాంతానికి దాని పాత పేరైన అంబాజోగాయ్ అనే పేరును పెట్టుకున్నారు. ఈ ప్రాంతంలో ప్రపంచ ప్రఖ్యాతి చెందిన క్షయ వ్యాధి నివారణ అసుపత్రి ఉన్నది. వివాహంకాని యువతీ యువకులు ఈ క్షేత్రానికివెళ్ళి యోగేశ్వరీ మాతను ప్రార్ధించినట్లయితే అతి త్వరలో వారికి వివాహాలు జరుగుతాయని అనేకమంది విశ్వసిస్తున్నారు. ప్రతి సంవత్సరం దసరా సమయంలో ఈ క్షేత్రంలో ఘనంగా ఉత్సవాలు జరుగుతాయి.

ఈ క్షేత్రానికి ఎలా చేరుకోవాలి?

అంబాజోగాయ్ క్షేత్రం మహారాష్ట్రలోని 156వ నెంబరు రాష్ట్ర రహదారిమీద ఉన్నది. పార్లే-వైద్యనాథ్ రైల్వేస్టేషన్ నుండి ఈ క్షేత్రం 25 కి.మీ. దూరంలో ఉన్నది. పూనా, నాందేడ్, నాగపూర్, నాసిక్ లాంటి మహారాష్ట్ర నగరాల నుండి ఈ క్షేత్రానికి బస్సు సౌకర్యం ఉన్నది.

## 5. గయ క్షేత్ర అద్భుత విశేషాలు?

భారతదేశం ఎన్నో పవిత్రమయిన క్షేత్రాలకు నిలయంగా ఉన్నది. అలాంటి వాటిలో గయ ఒకటి. గయలో పితృదేవతలకు పిండ సమర్పణ చేసినట్లయితే పితృదేవతలకు తప్పనిసరిగా పుణ్యలోకాలు వస్తాయని హైందవ మత గ్రంధాలలో చెప్పబడి ఉన్నది. "ప్రయాగ క్షేత్రంలో తలనీలాలు సమర్పించటం, గయలో పిండాలు సమర్పించటం, కురుక్షేత్రంలో దానాలు చెయ్యటం, వారణాసిలో దేహాన్ని చాలించటం చాలా పుణ్యప్రదమైన కార్యాలు" అని తీర్థచింతామణి అనే గ్రంధంలో చెప్పబడి ఉన్నది.

గయ పట్టణం బీహార్ రాష్ట్రంలో ఉన్నది. గయ పట్టణానికి దక్షిణంగా కొద్దిమైళ్ళదూరంలో అతి ప్రాచీనకాలంనాటి ఒక బోధి వృక్షం (రావిచెట్టు) ఉన్నది. ఈ చెట్టుక్రింద కొంతకాలంపాటు తపస్సుచేసిన గౌతముడు, మహా జ్ఞానాన్నిపొంది "బుద్ధుడు"గా మారాడు. బోధి వృక్షం క్రింద గౌతమునికి జ్ఞానోదయం కలిగింది కనుక ఆయనకు బుద్ధుడు అన్నపేరు వచ్చిందని చెబుతారు. ఈ వృక్షానికి దగ్గరలోనే మహాబోధి ఆలయం ఉన్నది. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనేకమంది బౌద్ధమతస్తులు ఈ ఆలయానికి వస్తూ ఉంటారు.

బీహార్ రాష్ట్రంలోని రెండవ పెద్దనగరం గయ. బీహార్ రాష్ట్ర రాజధాని నగరం అయిన పాట్నాకు దక్షిణంగా 100 కిలోమీటర్ల దూరంలో గయ పట్టణం ఉన్నది. ఈ గయ పట్టణం ఫాల్గు (నిరంజన) నది ఒడ్డున ఉన్నది. రామాయణంలో కూడా ఈ నది ప్రస్తావన కనిపిస్తుంది. హిందువులకు, బౌద్ధులకు, జైనులకు గయ ఎంతో పవిత్రమయిన క్షేత్రంగా గుర్తించ బడింది.

ఈ గయ పట్టణానికి మూడు వైపులా చిన్న చిన్న కొండలు ఆవరించి ఉంటాయి. వీటిపేర్లు మంగళగౌరి, శృంగస్థాన్, రామ్‌శిల మరియు బ్రహ్మయోని. గయ పట్టణానికి నాల్గవ దిక్కులో అనగా తూర్పున ఫాల్గునది ప్రవహిస్తున్నది. పురాణ కాలంలో గయాసురుడు అనే రాక్షసుడు మహావిష్ణువుచేత ఈ క్షేత్రంలో సంహరించబడ్డాడు. అతని మృతదేహం అనేక కొండల వరుసగా మారిపోయింది. ఆ కొండల వరుసలే ప్రస్తుతం గయ నగరానికి మూడువైపులా వ్యాపించి ఉన్నాయని చెబుతారు.

ఈ క్షేత్రంలో పితృదేవతలకు పిండాలు సమర్పిస్తే పితృదేవతల ఆత్మలు పుణ్యలోకాలకు చేరతాయని హైందవ పురాణాలలో చెప్పబడి ఉన్నది. ఇందుకు సంబంధించిన ఒక వృత్తాంతము రామాయణ గ్రంథములో మనకు కనిపిస్తుంది. అది ఎలాగంటే....

తన తండ్రి అయిన దశరథునికి పిండ ప్రదానాలు చెయ్యాలన్న ఉద్దేశంతో శ్రీరాముడు, సీతాదేవితో కలిసి గయ క్షేత్రానికి వచ్చాడు. సీతాదేవి గయ క్షేత్రంలో ఉన్న నిరంజన నది ఒడ్డున కూర్చుని ఉండగా శ్రీరాముడు ఆ నది ఒడ్డున కొంచెం దూరంలో స్నానం చెయ్యటానికి వెళ్ళాడు. స్నానం చేసివచ్చి ఆపై తన తండ్రికి పిండ ప్రదానం చెయ్యాలని శ్రీరాముడు భావించాడు. ఏ కారణంచేతో శ్రీరాముడు అక్కడకు రావటానికి కొంచెం ఆలస్యం అయ్యింది. ఆ సమయంలో దశరథుడి హస్తాలు నదిలోంచి బయటకు వచ్చాయి. ఆ తరువాత ఒక స్వరం సీతాదేవితో ఇలా అన్నది. "అమ్మా! నాకు విపరీతంగా ఆకలిగి ఉన్నది. నా కుమారుడైన శ్రీరాముడు వచ్చి పిండప్రదానం చేసేదాకా ఆగలేను. అందువలన నీవే నాకు పిండం సమర్పించు దానితో నా ఆకలి తీర్చుకుంటాను".

పిండ ప్రదానానికి కావలసిన పదార్థాలు శ్రీరాముడు తీసుకురావలసి ఉన్నది. అవి లేకుండా పిండాలు ఎలా తయారుచేయాలో? సీతాదేవికి అర్థం కాలేదు. ఒక ప్రక్క స్వర్గస్థుడైన మామగారి హస్తాలు ఆహారం ఇవ్వమని నది నుండి బయటకు వచ్చి అడుగుతున్నాయి. సీతాదేవి కొద్దిసేపు ఆలోచించింది. ఆ తరువాత తన పాతివ్రత్య మహత్యంతో నది ఒడ్డున ఉన్న ఇసుకను పిండాలుగా మార్చి నదిలోంచి బయటకు వచ్చిన దశరథుని చేతిలో ఉంచి భక్తితో నమస్కరించింది. ఆ హస్తాలు ఆ పిండాలతో సహా నదిలోకి వెళ్ళిపోయాయి.

కొంతసేపు గడిచింది. శ్రీరాముడు ఒక పురోహితుడిని వెంటపెట్టుకుని సీతాదేవి వద్దకు వచ్చాడు. ఆ తరువాత శాస్త్రోక్తంగా పిండాలు తయారు చేసి వాటిని తన తండ్రి ఆత్మకు సమర్పించాలని ప్రయత్నించాడు. శ్రీరాముడు ఎన్నిసార్లు పిలిచినా దశరథుడి ఆత్మ రాలేదు. దాంతో ఆయన మనోవేదనకు గురి అయ్యాడు.

అప్పుడు సీత, శ్రీరాముడితో ఇలా అన్నది. "కొద్ది సేపటి క్రితమే నేను మీ తండ్రిగారికి పిండ ప్రదానం చేసాను. ఆయన ఆత్మ మళ్ళీ పితృ లోకానికి వెళ్ళిపోయింది. అందువల్లే మీరు ఇప్పుడు పిండ ప్రదానం చేసినా ఆయన స్వీకరించటంలేదు". అంతేకాకుండా తాను పిండ ప్రదానం చేసాను అన్నమాట నిరూపించటంకోసం ఆమె - నిరంజన నదీమాతను, ఒక ఆవును ఆ నది ఒడ్డునే ఉన్న ఒక మర్రిచెట్టును మరియు కొంచెం ప్రక్కగా నిలబడి ఉన్న ఒక బ్రాహ్మణుడిని సాక్ష్యం చెప్పమని కోరింది. ఒక్క మర్రిచెట్టు మినహా మిగిలినవారు, "సీతాదేవి పిండ ప్రదానం చేసింది అన్నమాటను మర్ధించ లేదు. ఎందుకంటే సీతాదేవి పిండప్రదానం చెయ్యటం తాను చూసాను అని ఒప్పుకుంటే మళ్ళీ రాముడు పిండప్రదానం చెయ్యడని, తనకి సంభావన సొమ్మురాదని ఆ బ్రాహ్మణుడు, సీతాదేవికి అనుకూలంగా సాక్ష్యం చెప్పలేదు. పిండ ప్రదానం చేసినప్పుడు రాముడు అనేక పూజలను తనకు చేస్తాడని, సీతాదేవికి అనుకూలంగా సాక్ష్యం చెబితే శ్రీరాముడు ఆ పూజలను చెయ్యడని భావించిన నిరంజన నది, "సీతాదేవి పిండప్రదానం చెయ్యలేదని" చెప్పింది. ఆవు, శ్రీరాముడిని చూసి భయపడి ఏమీ చెప్పకుండా మౌనం వహించింది. తాను చేసిన పిండప్రదానానికి సాక్ష్యం చెప్పటానికి తిరస్కరించి అబద్ధాలు చెప్పిన బ్రాహ్మణుడిని, నిరంజన నదిని, ఆవుని సీతాదేవి శపించింది. ఫలితంగా నిరంజన నదిలోని నీరు చాలా వరకు ఎండిపోయి చాలాచోట్ల ఇసుక దిబ్బలు బయటపడ్డాయి. సీతాదేవికి అనుకూలంగా సాక్ష్యం చెప్పిన మర్రిచెట్టు, సీతాదేవిచేత అక్షయ వరాన్ని పొందింది. అప్పటి నుండి ఈ వృక్షానికి "అక్షయ వటవృక్షం" అన్నపేరు వచ్చింది.

సాధారణంగా ప్రతి మర్రిచెట్టు (వటవృక్షం) సంవత్సరంలో ఒకసారి తనపై ఉండే ఆకులన్నింటినీ రాల్చివేస్తుంది. కానీ ఈ క్షేత్రంలో ఉన్న ఈ

వటవృక్షం మీద ఉన్న ఆకులు అన్ని ఋతువులలో పచ్చగా కనిపిస్తాయి. ఈ చెట్టు ఆకులు రాలవు. సీతాదేవి ఇచ్చిన వరం కారణంగానే ఈ మర్రిచెట్టుకి నిత్యము పచ్చగా ఉండే అదృష్టం లభించిందని చెబుతారు.

బ్రహ్మయోని కొండ - గయ :

గయ క్షేత్రానికి దక్షిణ దిక్కులో బ్రహ్మయోని పర్వతం అనే ఒక కొండ ఉంది. గయలో ఉన్న కొండలన్నింటిలో ఇదే చాలా ఎత్తుగా ఉంటుంది. ఈ కొండయొక్క శిఖరంమీద ప్రకృతిసిద్ధంగా ఒక చీలిక ఏర్పడింది. ఇది బ్రహ్మదేవునియొక్క స్త్రీశక్తికి లేదా యోనికి ప్రతీకగా ఉంటుంది. ఈ ప్రదేశంలో 5 శిరస్సులు కలిగిన ఒక స్త్రీ దేవతావిగ్రహం పూజలు అందుకుంటుంది.



బ్రహ్మయోని ఆలయం

ఈ దేవతను "బ్రహ్మయోని" అని పిలుస్తారు. ఒకప్పుడు మరాఠా ప్రాంతాన్ని పరిపాలించిన బాలాజీపండిట్ అనే ఒక ప్రముఖవ్యక్తి ఈ ఆలయాన్ని నిర్మించాడని చెబుతారు. కొండపాదం నుండి కొండమీద ఉన్న ఈ ఆలయం వరకు మెట్లు ఉన్నాయి. ప్రతి సంవత్సరం ఈ క్షేత్రంలో

పితృపక్షమేళా జరుగుతుంది. ఆ సమయంలో ఇక్కడికి వేలాదిమంది హిందువులు వచ్చి తమ పితృదేవతలకు పిండాలు సమర్పిస్తారు.

**ప్రేతశిల పర్వతం - గయ :**

పవిత్ర గయ క్షేత్రానికి వాయవ్యదిశలో ఈ ప్రేతశిల అనే ఒక పర్వతం ఉన్నది. ఈ పర్వత శిఖరంమీద ప్రేతరాజు అనగా యమధర్మరాజుయొక్క ఆలయం ఉన్నది. అనేకమంది హైందవులు ఈ పర్వతంమీదకి వచ్చి తమ పూర్వీకులయొక్క ఆత్మలకు శాంతి కలగటంకోసం ఇక్కడ పిండాలు సమర్పిస్తారు. ఒకప్పుడు ఒక ప్రేతం ఈ పర్వతంపైన సంచరిస్తూ ఉండేదట. అది శాంతించటంకోసం ఇక్కడ ప్రేతరాజు అయిన యమధర్మరాజుయొక్క ఆలయం నిర్మించబడింది. పర్వత పాదం నుండి కొండమీద ఉన్న ప్రేతరాజు ఆలయం వరకు మెట్లు ఉన్నాయి. ఈ పర్వతపాదం వద్ద "రామకుండం" అనే పేరుగల ఒకపుష్కరిణి ఉన్నది. త్రేతాయుగంలో శ్రీరాముడు ఈ కుండంలో స్నానంచేసి ఆపై ప్రేతరాజు ఆలయం వద్దకువెళ్ళి అక్కడ తన పితృ దేవతలకు పిండ ప్రదానం చేసాడు. శ్రీరాముడు స్నానంచేసిన కారణంగా ఈ పుష్కరిణికి "రామకుండం" అన్నపేరు వచ్చింది. గయ నగరం తీవ్రమైన వాతావరణాన్ని కలిగి ఉంటుంది. ఇక్కడ చలికాలం విపరీతమైన చలి, ఎండాకాలం విపరీతమైన ఎండ ఉంటాయి.

భారతదేశంలోని చాలా ప్రాంతాల నుండి గయ నగరానికి రైలు మరియు బస్సు సౌకర్యం ఉన్నది.

బీహార్‌లోని పాట్నా, రాంచి, భగల్‌పూర్ నుండి, పశ్చిమ బెంగాల్ లోని కలకత్తా నుండి గయ నగరానికి విస్తారంగా బస్సు సౌకర్యం ఉన్నది. గయలో అంతర్జాతీయ విమానాశ్రయం కూడా ఉన్నది.

## 6. బ్రహ్మచర్య మహాత్మ్యం ఏమిటి?

జంతు ప్రపంచంలో శృంగారం కేవలం సంతానంకోసం మాత్రమే జరుగుతుంది. ఏ జంతువుకీ ప్రత్యేకంగా శృంగారపరమైన వాంఛలు ఉండవు. సాధారణంగా ఏ ఆడ జంతువైనా వసంత ఋతువు ప్రారంభ

సమయంలో సంతానాన్ని కంటుంది. ఆ సంతానం పుట్టిన కొద్ది నెలలలో వాతావరణం క్రమక్రమంగా వెచ్చబడటం మరియు ఆహారం సమృద్ధిగా లభించటం జరుగుతుంది. ఆవిధంగా, కొత్తగా పుట్టిన జంతువుల బిడ్డలకి ఆహారానికి లోటులేకుండా ఉంటుంది. వసంత ఋతువు ప్రారంభ సమయానికి జంతువులు ప్రసవించటానికి తగినవిధంగా అంతకుముందు కొద్ది నెలలముందు జంతువుల మధ్య సంభోగ ప్రక్రియ (జతకట్టటం) జరుగుతుంది. అంటే ప్రకృతి ఏర్పాటుచేసిన పద్ధతిలో మాత్రమే జంతువులు శృంగారాన్ని జరపటం మరియు సంతానాన్ని కనటం జరుగుతుంది.

కానీ మానవుల విషయానికివస్తే సంభోగం వారి సంతోషంకోసం జరుగుతుంది. సంవత్సరం పొడవునా శృంగారం అనుభవించటానికి మానవులు సిద్ధంగా ఉంటారు. శృంగారాన్ని విపరీతంగా అనుభవించినా ఎలాంటి ఆరోగ్యపరమైన నష్టాలు ఉండవని ఆధునిక అల్లోపతి వైద్యులు ఉద్ఘాటిస్తున్నారు. కానీ విపరీత శృంగారంవల్ల మానవులు అనేక రకాల శారీరక మరియు మానసిక రుగ్మతలకు గురిఅవుతారు. అలా గురి అవటంవల్ల అనేక రకాల ఔషధాలు మార్కెట్లో విపరీతంగా అమ్ముడు అవుతాయి. ఔషధాల విక్రయం పెంచటంకోసం మరియు ఆధునిక ఇంగ్లీషు వైద్యుల ప్రాక్టీసుని పెంచటంకోసమే విశృంఖల శృంగారం మంచిదని ఆధునిక వైద్యులు ఉద్ఘాటిస్తున్నారని కొందరు విమర్శకులు చెబుతున్నారు.

సంభోగ సమయంలో పురుషుడియొక్క గుండె రెట్టింపువేగంతో కొట్టుకుంటుంది. శ్వాసతీసుకునే వేగం మూడురెట్లు పెరుగుతుంది. రక్త ప్రసరణవేగం కూడా అధికం అవుతుంది. ఫలితంగా సంభోగం తరువాత పురుషుడి నరాల తాత్కాలికంగా అలిసిపోతాయి. అంతేకాక ఒకవిధమైన మతిమరుపు, సోమరితనం తాత్కాలికంగా అతడిని ఆవరిస్తాయి.

సంభోగంవల్ల కలిగే ఆరోగ్యపరమైన సమస్యల సంగతి అటుంచి సంభోగంలో పురుషుడు కోల్పోయే వీర్యంవల్ల అతడు తనకు ఎంతో ఉపయోగించే ఖనిజలవణాలను కోల్పోవటం జరుగుతుంది. వీర్యంలో అధిక పరిమాణంలో లెసీథిన్, కాల్షియం, ఫాస్పరస్, ఐరన్, కొలెస్ట్రాల్, విటమిన్-ఇ, మరియు విటమిన్-బి, న్యూక్లియోప్రోటీన్స్ మరియు సెక్స్ హార్మోన్లు అధిక పరిమాణంలో ఉంటాయి. మానవుడు తన క్షణిక సుఖం

కోసం సంభోగంలో పాల్గొని వీర్యాన్ని కోల్పోవటంవల్ల పైన చెప్పిన పోషక పదార్థాలన్నీ బయటకు వెళ్ళిపోతాయి. ఫలితంగా అతడి శరీరం బలహీన పడుతుంది. బ్రహ్మచర్యం పాటించినప్పుడు అతడి వీర్యంలో ఉండే ఆ పదార్థాలన్నీ మరల రక్తప్రవాహంలో కలిసిపోయి శరీరంలోని జీవకణాలకు ముఖ్యంగా మెదడుకు మరియు నరాలవ్యవస్థకు చక్కటి శక్తిని అందిస్తాయి.

వీర్యంలో అన్ని బలమైన పోషక పదార్థాలు ఉన్న కారణంగానే హైందవ మతంలో వీర్యాన్ని "పవిత్ర ద్రవము" అని పిలవటం జరిగింది. ఇంకొక జీవిని సృష్టిచేయగలిగిన ఆ పవిత్రద్రవం శరీరంలోనే ఉండిపోయినట్లయితే అది మనిషికి ఎంతో ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుంది.

సాధారణంగా మనిషి శరీరం, ఇతర శరీరాల తాలీకు భాగాలను లేదా కణాలను అంగీకరించదు. అలా అంగీకరించగలిగి ఉంటే శరీర అవయవాలు కోల్పోయిన ఎంతోమందికి ఇతరుల అవయవాలను అమర్చ గలిగి ఉండేవారు. ఒక గ్రూపుకి చెందిన రక్తం ఇంకొక గ్రూపు రక్తంలో కలవదు. అదేవిధంగా ఒక పురుషుడి వీర్యాన్ని ఒక స్త్రీయొక్క శరీరం లోపల భాగాలు అంగీకరించవు. ఒక పురుషుడు ఒక స్త్రీతో సంభోగంలో పాల్గొన్నప్పుడు అతడు, ఆమె యోనిలో స్కలించే వీర్యం నేరుగా ఆమె మూత్రనాళంవైపు ప్రయాణిస్తుంది. అలాంటి సమయంలో ఆ వీర్యాన్ని ఆమె శరీరం లోపలి భాగాలైన మూత్రనాళం మరియు అంతర్గత లైంగిక అవయవాలు అంగీకరించనట్లయితే (ఫారన్‌బాడీగా భావించినట్లయితే) ఆమె మూత్రనాళాలలో చీము మరియు శ్లేష్మం ఏర్పడే అవకాశాలు ఉంటాయి.

"ప్రోస్టేట్" గ్రంధి అక్రోట్‌కాయ పరిమాణంలో ఉంటుంది. మలద్వారం మరియు మూత్రాశయం (బ్లాడర్) మధ్యభాగంలో ఈ గ్రంధి ఉంటుంది. ఈ గ్రంధిలోనే వీర్యం తయారవుతుంది. సాధారణంగా ప్రతి ముగ్గురు పురుషులలో ఒకరికి, వారి 20-50 సంవత్సరాల మధ్యవయస్సులో వారి ప్రోస్టేట్ గ్రంధి వాచటం జరుగుతుంది. శృంగారంలో పాల్గొన్నప్పుడు సంక్రమించే వ్యాధులతో సహా అనేక రకాల ఇన్ఫెక్షన్ల కారణంగా ఈ గ్రంధి వాపుకు గురి అవుతుంది. పురుషుడు శృంగారపరంగా తీవ్రమైన ఉద్వేగానికి గురైనప్పుడు అతని లైంగిక అవయవాలు, ప్రోస్టేట్ గ్రంధి రక్తంతో నిండి

పోతాయి. పురుషుడు తరచుగా ఉద్రేకపడి శృంగారంలో పాల్గొనటానికి సిద్ధపడుతున్నప్పుడు ప్రొస్టేట్ గ్రంధి తరచుగా రక్తంతో నిండిపోయి వాచి పోవటం లేదా పెద్దది కావటం జరుగుతుంది. ఫలితంగా మూత్ర ప్రవాహం అడ్డగించబడటం జరుగుతుంది. కొన్నిసార్లు ఈ గ్రంధికి కాన్సర్ (ప్రొస్టేట్ కాన్సర్) వచ్చే అవకాశాలు కూడా ఉంటాయి.

పాశ్చాత్యదేశాలలో పురుషులకి ఎక్కువగా లంగ్ కాన్సర్ వస్తుంది. దాని తరువాత స్థానం ప్రొస్టేట్ కాన్సర్‌కి లభిస్తుంది. పాశ్చాత్య పురుషులు విపరీతమైన సంభోగంలో పాల్గొంటూ ఉంటారు. ఆ కారణంగానే అక్కడ పురుషులకు ఈ వ్యాధి ఎక్కువగా వస్తుంది.

ఇంకొక విశేషం ఏమంటే జంతు ప్రపంచంలో ఉండే ఆడ జంతువులు బహిష్టులో ఉన్నప్పుడు వాటికి చాలా తక్కువ మొత్తంలో రక్తస్రావం అవుతుంది. అయితే మనుషుల మధ్యలో పెరిగే ఆడ జంతువులకు విపరీతమైన తిండి మరియు శృంగారంలో పాల్గొనే అవకాశాలు అధికంగా ఉండటం జరుగుతుంది. ఫలితంగా వాటికి బహిష్టు స్రావం అధికంగా ఉంటుంది. అదేవిధంగా అడవులలో జీవించే అనాగరిక స్త్రీల కన్నా, నాగరిక స్త్రీలకే బహిష్టు స్రావం అధికంగా ఉంటుంది. అత్యధిక పరిమాణంలో ప్రోటీన్లు ఉండే మాంసాహారాన్ని తీసుకోవటం, మితంలేని శృంగారంలో పాల్గొనటంవల్ల ఆధునిక స్త్రీలలో బహిష్టు స్రావం విపరీతంగా ఉంటుందని కొందరు పాశ్చాత్య పరిశోధకులు కనుగొన్నారు.

మనిషిలో కామాన్ని ప్రేరేపించటంలో ఆహారానికి ప్రధాన పాత్ర ఉంటుంది.మాంసం, చేపలు, గుడ్లు, ఉల్లిపాయలు, వెల్లుల్లి, మద్యం, పొగాకు, మసాలాద్రవ్యాలు, ఉప్పు, టీ, కాఫి లాంటివి తీసుకునేవారిలో కామవాంఛ అధికంగా ఉంటుంది. ఒకవిధంగా చెప్పాలంటే ఈ పదార్థాలన్నీ మానవులపై ఒకవిధమైన "వాజీకరణ" ఔషధాలు (శృంగార వాంఛను పెంచే ఔషధాలు)గా పనిచేస్తున్నాయని చెప్పక తప్పదు. ముఖ్యంగా యూరిక్ యాసిడ్ అధికంగా ఉండే మాంసము మరియు సీఫుడ్ (నత్తలు, పీతలు, రొయ్యలు వగైరా) తీసుకున్నప్పుడు మానవుల లైంగిక అవయవాలలో వత్తిడి అధికమై శృంగారవాంఛలు చెలరేగుతాయి.

ఇక ప్రోటీన్లు బాగా తక్కువగా ఉండే శాఖాహారాన్ని తీసుకునేవారిలో

కామవాంఛ కూడా తగ్గే అవకాశం ఉంటుంది అని ఆధునిక పరిశోధకులు కనుగొన్నారు. తీసుకునే ఆహారాన్ని తగ్గించేస్తే అనేక రకాల వ్యాధులు దూరం అవటమేకాకుండా, కామవాంఛ తగ్గుతుంది, స్వప్నస్కలనాలు కావు అని పరిశోధకులు తెలియజేస్తున్నారు. జంతుప్రపంచంలో తొందరగా యుక్తవయస్సులోకి వచ్చే జంతువులు చిన్నవయస్సులోనే సంభోగంలో పాల్గొంటాయి. వాటి జీవన ప్రమాణం తక్కువగా ఉంటుంది.

బ్రహ్మచర్యాన్ని పాటించి వీర్యాన్ని శరీరంలోనే నిలుపుకోవటం వల్ల మనిషికి అతీంద్రియ శక్తులు వస్తాయని, దాదాపు ఆసియా ఖండంలోని దేశాలన్నింటిలోనూ విశ్వసిస్తున్నారు. బ్రహ్మచర్యం ద్వారా అతీంద్రియ శక్తుల్ని సాధించిన వ్యక్తి, ఎప్పుడైనా తన వీర్యాన్ని కోల్పోయినట్లయితే అతడి శక్తులు వెంటనే నశించి పోతాయని చెబుతారు. ఈ విషయాన్ని జపాన్ దేశానికి చెందిన ఒక జానపదగాథ నిరూపిస్తుంది. ఆ కథలో....

జపాన్‌లోని ఒక ప్రదేశంలో ఉన్న పర్వతాలవద్ద ఒక బౌద్ధఆలయం ఉండేది. ఆ ఆలయంలో సెనిన్ అనే ఒక బౌద్ధసన్యాసి జీవిస్తూ ఉండేవాడు. ఆయన తన జీవితకాలంలో ఎప్పుడూ కామోద్రేకం పొందలేదు. వీర్యాన్ని స్కలించలేదు. ఫలితంగా ఆయనకు గాలిని ఆహారంగా తీసుకోగలిగే శక్తి మరియు గాలిలో ఎగిరిపోగలిగే శక్తులు వచ్చాయి. ఒకరోజు ఆయన ఆకాశంలో ఎగురుతూ పై నుండి క్రిందకి చూస్తున్నాడు. అలాంటి సమయంలో ఆయనకు ఒక నది గట్టున బట్టలు ఉతుకుతున్న ఒక అందమైన స్త్రీ కనిపించింది. ఆమె అందమైన తెల్లటి పాదాలు నదినీళ్ళలో తడిసి అద్భుతంగా మెరుస్తూ కనిపించాయి. ఆ పాదాల అందాన్ని చూసిన సెనిన్ మనసులో కామసంబంధమైన ఆలోచనలు చెలరేగాయి. ఫలితంగా ఆయనకి అప్పటి వరకు ఉన్న ఎగిరే శక్తి పోయింది. దాంతో ఆయన పక్షిలాగా కిందకు జారిపోయి నది ఒడ్డున పడ్డాడు. అలా పడటం వల్ల సెనిన్‌కి ఏ గాయం కాలేదు. ఆ తరువాత ఆయన ఆ శక్తులను తిరిగి పొందలేకపోయాడు కానీ ఆ నది ఒడ్డున ఉన్న స్త్రీని భార్యగాపొంది, ఆపై ఆమె ద్వారా అనేకమంది వారసుల్ని పొందగలిగాడు.

భారతదేశ పరాక్రమానికి ప్రతీకగా గుర్తించబడిన ఉత్తరభారతదేశ చక్రవర్తి పృధ్విరాజ్ చౌహాన్ కేవలం అతి శృంగారం కారణంగా తన

శత్రువు చేతిలో ఓడిపోయాడు అంటే చాలామంది నమ్మకపోవచ్చు. కానీ అది నిజం అని చరిత్రకారులు ఉద్ఘాటిస్తున్నారు. ఆ వివరాల్లోకి వద్దాం.....

ఇస్లాం దురాక్రమదారుడైన మహమ్మఘోరీ ఎలాగైనాసరే ఉత్తర భారత దేశాన్ని ఆక్రమించి ఆ ప్రాంతంలో ఉండే సంపదలను కొల్లగొట్టాలని అనేక పర్యాయాలు భారతదేశంపై దండయాత్రలు చేసాడు. ఆనాటి ఉత్తర భారత దేశ పాలకుడైన పృధ్వీరాజ్ చౌహాన్ ఎంతో వీరోచితంగా పోరాడి మహమ్మద్ ఘోరీని తరిమివేస్తూ ఉండేవాడు. ఎన్నిసార్లు పృధ్వీరాజ్ చౌహాన్ చేతిలో ఓడిపోయినా మహమ్మద్‌ఘోరీకి భారతదేశాన్ని జయించాలన్న వాంఛ చావలేదు. మొత్తం 17సార్లు మహమ్మద్‌ఘోరీ భారతదేశంపై దండెత్తాడు. అందులో 16సార్లు పృధ్వీరాజ్ చౌహాన్ చేతిలో చావుతప్పి కన్నులొట్టబోయి పలాయనం చిత్తగించాడు. 17వ సారి మహామ్మద్‌ఘోరీ దండయాత్ర చేసినప్పుడు పృధ్వీరాజ్ చౌహాన్ అతడిని ఎదుర్కొని ఎంతో పరాక్రమంతో పోరాడాడు. కానీ ఈసారి పృధ్వీరాజ్ చౌహాన్ తన పూర్తి సామర్థ్యాన్ని యుద్ధంలో ప్రదర్శించలేకపోయాడు. ఫలితంగా ఆ హైందవ మహారాజు యుద్ధంలో ఓడిపోయి మహమ్మద్‌ఘోరీకి బందీగా చిక్కాడు. తనని 16సార్లు ఓడించి అవమానించిన పృధ్వీరాజ్ చౌహాన్ మీద ఎంతో ద్వేషం పెంచుకున్న మహమ్మద్‌ఘోరీ, పృధ్వీరాజ్ చౌహాన్ కళ్ళను నిప్పుల్లో కాల్చిన రెండు ఇనుప కడ్డీలతో పొడిపించి అతడిని గుడ్డివాడిగా మార్చాడు.



పృధ్వీరాజ్ చౌహాన్

సింహంలాగా పోరాడి 16సార్లు మహమ్మద్‌ఘోరీని ఓడించిన పృధ్వీరాజ్ చౌహాన్ 17వ సారి జరిగిన యుద్ధంలో ఓడిపోవటానికి ఒక ఆశ్చర్యకరమైన కారణం ఉన్నది. అది ఏమిటంటే పృధ్వీరాజ్ చౌహాన్ 17వ సారి యుద్ధానికి వెళ్ళేటప్పుడు తన భార్య పద్మినిని కూడా తన వెంటపెట్టుకుని వెళ్ళాడు. పద్మిని ఆ కాలంలో ఆనాటి సుందరీమణులందరి

కన్నా అద్భుత సౌందర్యవతిగా గుర్తించబడింది. పృథ్వీరాజ్ చౌహాన్ ఆమెను గాంధర్వ వివాహం చేసుకున్నాడు. వారిద్దరి మధ్య అపూర్వమైన ప్రేమకథ నడిచింది. ఏది ఏమైనా యుద్ధరంగానికి వెళుతున్న పృథ్వీరాజ్ చౌహాన్, నవమోహిని అయిన తన భార్య పద్మినిని తీసుకుని యుద్ధరంగానికి వెళ్ళటం ఒక పెద్ద పొరపాటుగా మారింది. ఎందుకంటే అంతులేని వ్యామోహాన్ని కలిగిస్తున్న పద్మినినిచూసి పృథ్వీరాజ్ చౌహాన్ తీవ్ర కామోద్రేకానికి గురి అవుతూ ఉండేవాడు. ఫలితంగా రాత్రి నుండి ఉదయం సూర్యోదయం అయ్యే వరకు ఆమెతో నిద్ర అనేది లేకుండా శృంగారం సాగిస్తూ ఉండేవాడు. ఫలితంగా యుద్ధరంగానికి వెళ్ళేసరికి శక్తిహీనుడిగా మారేవాడు. "మనిషికి బలాన్ని ఇచ్చేది అతనిలో నిలువ ఉండే వీర్యమే. అది యుద్ధ సమయంలో తనలోనే ఉంచుకుని అనగా బ్రహ్మచర్యాన్ని పాటించి పృథ్వీరాజ్ చౌహాన్ మహాశక్తి వంతుడిగా ఉండి ఆపై మహమ్మద్ఘోరీని చిత్తు చిత్తుగా ఓడించేవాడు.

17వసారి మహమ్మద్ఘోరీతో యుద్ధంలో పాల్గొనే సమయంలో పృథ్వీరాజ్ చౌహాన్ యుద్ధరంగం బయటవేయబడిన తన గుడారంలో విరామం దొరికినప్పుడల్లా తన భార్య పద్మినితో శృంగారం సాగించాడు. మితిమీరిన అతడి శృంగారం కారణంగా అతడి జీవశక్తి వీర్యరూపంలో వెళ్ళిపోయింది. ఫలితంగా పృథ్వీరాజ్ చౌహాన్ బలహీన పడ్డాడు. ఆపై తన శత్రువు మహమ్మద్ఘోరీ చేతుల్లో పరాజయాన్ని మరియు పరాభవాన్ని పొంది చివరిగా అంధుడిగా మార్చబడ్డాడు. ఈ సంఘటనబట్టి "బ్రహ్మచర్యం" ఎంత శక్తివంతమైనదో మనం అర్థంచేసుకోవచ్చు.

ద్వాపరయుగంలో జీవించిన భీష్మాచార్యుడు కఠిన బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ తన జీవితాన్ని గడిపాడు. ఆజన్మాంతం బ్రహ్మచర్యాన్ని పాటించిన కారణంగా భీష్ముడికి విపరీతమైన శక్తి వచ్చింది. మహావీరుడిగా పేరు పొందిన అర్జునుడిని కురుక్షేత్ర యుద్ధంలో తన పదునైన బాణాలతో అల్లాడించాడు. సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మే ప్రక్కన ఉన్నా అర్జునుడు, భీష్ముడిని న్యాయమార్గంలో ఓడించలేకపోయాడు. బ్రహ్మచర్యాన్ని పాటించటం వల్ల భీష్ముడికి తాను కోరింతకాలం జీవించగలిగే శక్తి వచ్చింది. ఆ కారణంగానే యుద్ధరంగంలో కూలిపోయిన భీష్ముడు ఉత్తరాయణం వచ్చేవరకు అంపశయ్య మీద సజీవంగా పడుకుని ఉండి ఆపై ఉత్తరాయణం వచ్చిన

రోజున (సూర్యుడు ఉత్తర దిశగా ప్రయాణాన్ని ప్రారంభించిన సమయం) తన ప్రాణాన్ని త్యజించాడు.

మహాభారతంలో కనపడే ఇంకొక మహావీరుడు అభిమన్యుడు. శ్రీకృష్ణుడి మేనల్లుడు మరియు అర్జునుడి కుమారుడు అయిన అభిమన్యుడు అతిశక్తి సంపన్నుడు. కురుక్షేత్ర యుద్ధం 18 రోజులు జరిగింది. అభిమన్యుడు కేవలం ఒకేఒక్కరోజు యుద్ధంచేసి దాదాపు రెండున్నర అక్షౌహిణల సైన్యాన్ని అంతంచేసాడు అంటే అతడి బలం ఎంత అద్భుతమైనదో అర్ధంచేసుకోవచ్చు. అతిశక్తివంతుడైన అభిమన్యుడు కౌరవులు పన్నిన పద్మవ్యూహాన్ని చీల్చుకుని లోపలికివెళ్ళి ఆపై అపారమైన కౌరవ సైన్యాన్ని సంహరించాడు. "అతడిని ఎదుర్కోలేని కౌరవులు ఒక కుట్రను పన్ని అనేకమంది ఏకాకాలంలో అతడిపై దాడిచేసి అతడిని ఘోరంగా సంహరించారు" అని మహాభారతంలో చెప్పబడి ఉన్నది. అయితే అభిమన్యుడు అంతశక్తివంతుడు అయి ఉండికూడా తనమీదకి విరుచుకుపడ్డ వారిని ఎందుకు చంపలేకపోయాడు?. తనని కత్తులతో పొడుస్తున్నా ఎందుకు ఎదుర్కోలేకపోయాడు? అన్న ప్రశ్న కొందరికైనా ఎదురవుతుంది.

అభిమన్యుడి ఓటమివెనకాల ఒక నిగూఢరహస్యం దాగి ఉన్నది. అది ఏమిటంటే, సాధారణంగా మర్నాడు యుద్ధానికి వెళ్ళవలసినవారు యుద్ధానికి ముందురోజు రాత్రి దైవాన్ని ధ్యానిస్తూ బ్రహ్మచర్యాన్ని పాటిస్తారు. కానీ కోడెవయస్సులో ఉన్న అభిమన్యుడు యుద్ధానికి ముందురోజు రాత్రి తన భార్య ఉత్తరతో ఎడతెగని శృంగారాన్ని సాగించాడు. సూర్యోదయానికి ముందు అతడు తన భార్య నుండి విడివడి ఆపై స్నానంచేసి యుద్ధానికి బయలుదేరాడు. ముందురోజు రాత్రి అతడు జరిపిన శృంగార క్రీడల వల్ల అతడి ప్రాణశక్తి విపరీతంగా బలహీనపడింది. ఫలితంగా అతడు తన శత్రువుల చేతిలో మరణించాల్సి వచ్చింది. అదే అతడు కనీసం ముందురోజు రాత్రి అయినా బ్రహ్మచర్యాన్ని పాటించినట్లయితే అతడు తప్పకుండా పద్మవ్యూహం నుండి బయటపడి ఆపై చాలాకాలం జీవించి ఉండేవాడు.

ఇక త్రేతాయుగం నుండి ఈనాటి వరకు సజీవంగా ఉన్న హనుమంతుడి విషయానికి వద్దాం.....

హనుమంతుడు ఘోటక బ్రహ్మచారి. ఆయన అత్యంత కఠినంగా బ్రహ్మచర్యాన్ని పాటించటంవల్లే ఆయనను అష్టసిద్ధులు వరించాయి. శతయోజన విస్తీర్ణంగల సముద్రాన్ని ఆకాశమార్గంలో దాటిన హనుమంతుడు లంకా నగరంలో ప్రవేశించి, అక్కడ సీతను దర్శించి, ఆపై తనను అడ్డగించిన అనేకమంది రాక్షస వీరుల్ని అవలీలగా సంహరించాడు. హనుమంతుడు తన పిడికిలితో రావణాసురుడి తలమీద కొట్టినప్పుడు రావణుడు మూర్ఛపోయాడు. మహాబలిష్టుడు మరియు అమోఘమైన తాంత్రిక శక్తులు కలిగిన రావణుడు, హనుమంతుడి పిడికిలి పోటుకి గజ గజలాడిపోయాడు. హనుమంతుడు హిమాలయ పర్వతాల్లోని సంజీవనీ పర్వతాన్ని తన అరచేతిలో పెట్టుకుని లంక వరకు తీసుకువచ్చాడు. హనుమంతుడు చేసిన ఈ గొప్ప కార్యాలకు మూలం ఆయన బ్రహ్మచర్య బలమే అని గుర్తించాలి.

బైబిల్ గ్రంథంలో "శాంసన్" అనే ఒక మహావీరుడి గురించి చెప్పబడి ఉన్నది. అతడు ధైర్యానికి మరియు పరాక్రమానికి ప్రతీకగా ఉండేవాడు. అతడు తన గురించి ఇలా చెప్పుకున్నాడు.

"పదిమంది వ్యక్తులకు సమానమైన బలం నాకు ఉన్నది. అందుకు కారణం నా హృదయం స్వచ్ఛమైనది. నేను ఎప్పుడూ ఏ స్త్రీయొక్క చేతిని నా చేత్తో పట్టుకోలేదు. నేను ఎప్పుడూ ఏ స్త్రీ ప్రేమ గురించి ఆలోచించలేదు". అనగా శాంసన్ బ్రహ్మచర్యాన్ని పాటించాడని అందువలననే అతడు గొప్ప వీరుడిగా ఉన్నాడని గ్రహించాలి. ఎప్పుడైతే ఈ శాంసన్, "ఒక స్త్రీ నేత్రాల నుండి స్రవించే విషపూరితమైన మద్యాన్ని సేవించాడో" (అనగా ఒక స్త్రీతో ఎప్పుడైతే సంభోగం జరిపాడో ఆ క్షణమే అనిఅర్థం) ఆ క్షణమే అతని ధైర్యం, పరాక్రమం నశించిపోయాయి".

ఇక విద్యార్థుల విషయానికి వస్తే ఏ విద్యార్థి అయితే తన పరీక్షల ముందు మరియు పరీక్షల సమయంలో కఠిన బ్రహ్మచర్యాన్ని పాటిస్తాడో ఆ విద్యార్థి తప్పనిసరిగా పరీక్షలలో ఘనవిజయాన్ని సాధిస్తాడు.

కామవాంఛను జయించటం అంత తేలికైన విషయం ఏమీకాదు. ఆ కారణంగానే మనువు ఇలా అన్నాడు. "ఏ పురుషుడు అయినా సరే తన సవతి తల్లి, అక్క, చెల్లి మరియు కూతురుతో కలిసి ఒకే ఆసనంమీద

దగ్గర దగ్గరగా కూర్చొనకూడదు". మనువు అలా ఎందుకు చెప్పాడు అంటే కామం చాలా బలమైంది. అది ఎప్పుడు, ఎవరిని తప్పుదోవ పట్టిస్తుందో తెలియదు. అందుకే విజ్ఞుడైనవాడు తగు నియంత్రణలను పాటిస్తూ జాగ్రత్తగా ప్రవర్తించాలి అని పండితులు ఉద్ఘాటిస్తున్నారు.

చక్కగా చదువుకుని ఉన్నత స్థానానికి చేరాలనుకునే యువకులు, దైవాన్ని అన్వేషిస్తూ వివిధ రకాల ఆధ్యాత్మిక విధానాలను పాటిస్తున్న మధ్య వయస్సు దాటినవారు "బ్రహ్మచర్యాన్ని" పాటించటం ఉత్తమం. కానీ అది చాలా కష్టంతో కూడుకున్న పని అని చెప్పక తప్పదు.

పురుషుడికి 60 సంవత్సరాలు దాటిన తరువాత కూడా శృంగారం పట్ల ఆసక్తి తగ్గదు. అవకాశం దొరికితే కొంతమంది 60 సంవత్సరాల వృద్ధులుకూడా 16 సంవత్సరాల వయస్సు ఉండే కన్యలను వివాహం చేసుకోవటానికి సంసిద్ధంగా ఉంటారు. కానీ ఈవిధమైన కోరికలు వారి ఔన్నత్యానికి భంగం కలిగిస్తాయి. బలవంతంగా బ్రహ్మచర్యాన్ని పాటించటం కన్నా కొన్నిరకాల ఆయుర్వేద పదార్థాలను తీసుకుని కొంతకాలం పాటైనా కామ సంబంధమైన ఆలోచనలకు దూరంగా ఉండటం మంచిదనే చెప్పాలి.

అందుకు ఉపకరించే ఒక పదార్థం గురించి తెలుసుకుందాం.... "ఎండిపోయిన ఉసిరికాయలను తీసుకుని దానిని మెత్తగా పొడి చేసుకోవాలి. ఆ తరువాత రెండు వంతుల ఉసిరిక పొడికి, ఒక వంతు శిలాచక్కెర (Rock Sugar) కలిపి ఒక మిశ్రమ పదార్థాన్ని తయారుచేసుకోవాలి. ఆ తరువాత ప్రతిరోజూ రాత్రి నిద్రపోవటానికి అరగంటముందు ఈ మిశ్రమాన్ని ఒక చెంచాడు తీసుకుని దానికి నీటిని కలిపి త్రాగాలి". ఈ మిశ్రమాన్ని కొద్దిరోజులపాటు త్రాగటం వల్ల అనేక మంచి ఫలితాలు వస్తాయి. వాటిలో కొన్ని ఇలా ఉంటాయి.

ఈ పదార్థాన్ని క్రమం తప్పకుండా కొంతకాలంపాటు తీసుకున్నట్లయితే వీర్యం చిక్కబడుతుంది. మలబద్ధకం సంపూర్తిగా తొలగిపోతుంది. శరీరంలో ఉండే కఫ, వాత, పిత్త అనే త్రిదోషాల మధ్య సమతౌల్యం ఏర్పడుతుంది. కొంతమంది అవివాహితులకు రాత్రి సమయాలలో శృంగారపరమైన స్వప్నాలు వచ్చి నిద్రలోనే వీర్యస్ఖలనం అవుతుంది. ఈ పొడిని సేవించటంవల్ల స్వప్న స్ఖలనాల పీడ తొలగిపోతుంది.

నోట్ : కేవలము బ్రహ్మచర్యాన్ని పాటించాలనుకునే వారేకాకుండా గృహస్తులు కూడా ఈ పొడిని ఉపయోగించినట్లయితే చక్కటి ఆరోగ్యాన్ని పొందుతారు అని ఆయుర్వేద శాస్త్రజ్ఞులు ఉద్ఘాటిస్తున్నారు.

ప్రతి హైందవ గృహాల ముందో లేక వెనకో తులసిచెట్టు తప్పని సరిగా ఉంటుంది. ఆ తులసి ఆకులకు అమోఘమైన వైద్య సంబంధ ప్రయోజనాలు ఉన్నాయని ఆయుర్వేద వైద్యశాస్త్రం తెలియజేస్తున్నది.

ప్రతిరోజూ ఉదయం పరగడుపున (ఏమీ తినకుండా మరియు కాఫీ, టీ లాంటి పానీయాలు సేవించకుండా) కనీసం పది తులసి ఆకుల్ని బాగా నమిలి మ్రింగాలి. ఇలా కొంతకాలం చేసినట్లయితే హై బి.పి. సంపూర్తిగా నియంత్రించబడుతుంది. శరీరంలో ఉండే త్రిదోషాల మధ్య సమతౌల్యం ఏర్పడుతుంది. జ్ఞాపకశక్తి ఏర్పడుతుంది. పురుషుడిలో వీర్యశక్తి అధికం అవుతుంది. ఇంకా శరీరంలో రోగనిరోధక వ్యవస్థ బలపడుతుంది. గుండె సంబంధ వ్యాధుల నుండి రక్షణ కలుగుతుంది.



# 7. అద్భుత ఫలితాలను ఇచ్చే ఉచ్ఛిష్ఠ ఛండాలినీ సాధన?

దశమహావిద్యలలో ఒకటైన మాతంగీదేవిని "ఉచ్ఛిష్ఠ ఛండాలినీ" అనే ఇంకొక పేరుతోకూడా పిలుస్తారు. తంత్రశాస్త్రంలో ఈమెకు ప్రముఖ స్థానం ఇవ్వబడింది. అతిశక్తివంతమైన ఈ ఉచ్ఛిష్ఠ ఛండాలినీ సాధనచేసి మంత్ర సిద్ధిపొందిన వారికి అతీంద్రియ శక్తులు రావటం, అధికార ప్రాప్తి కలగటం, సంపదలు లభించటం, శత్రువులు నశించిపోవటం, కీర్తిప్రతిష్టలు సంప్రాప్తించటం జరుగుతాయని తంత్రశాస్త్రం తెలియజేస్తున్నది. అతి తేలికైన ఈ సాధన అత్యద్భుతమైన ఫలితాలను ఇస్తుంది అని చెప్పటంలో సందేహం ఎంతమాత్రంలేదు. ఈ సాధన స్త్రీలు మరియు పురుషులు కూడా నిరభ్యంతరంగా చెయ్యవచ్చు. ఇందుకు పాటించాల్సిన విధానం...

మధ్యాహ్న భోజనం లేదా రాత్రి భోజనం చేసిన తరువాత సాధకుడు లేదా సాధకురాలు తన నోటిని కడుక్కోకుండా అనగా ఎంగిలి నోటితో ఈ

మంత్రాన్ని పఠించాల్సి ఉంటుంది. ఉచ్ఛిష్టం అనగా "ఎంగిలి" అనిఅర్థం. ఎంగిలి నోటితో చేసే ఛండాలినీ సాధనను "ఉచ్ఛిష్ఠ ఛండాలినీ సాధన" అని పిలవటం జరుగుతున్నది.

రోజుకి 5వేల సార్లు ఈ మంత్రాన్ని జపించాలి. ప్రతిరోజూ ఈవిధంగా జపిస్తూ మొత్తం లక్షసార్లు ఈ మంత్ర జపంచేసినట్లయితే మంత్రసిద్ధి అవుతుంది. ఉచ్ఛిష్ఠ ఛండాలినీ అనుగ్రహిస్తుంది.

ప్రతిరోజూ ఈ మంత్ర జపాన్ని ఒకే ప్రదేశంలో కూర్చుని చెయ్యాలి. ఈ మంత్రసాధన చేస్తున్న స్త్రీలకు బహిష్టు వచ్చినట్లయితే నాలుగు రోజులు విరామం తీసుకుని మరల ఐదవ రోజునుండి మంత్రసాధన ప్రారంభించాలి.

ఈ మంత్రసిద్ధి పొందినవారికి దరిద్రం నశించిపోతుంది. వాక్శుద్ధి లభిస్తుంది. సమాజంలో ఉన్నతస్థానం లభిస్తుంది. శత్రువులు నశించి పోతారు. అద్భుతమైన ఈ ఉచ్ఛిష్ఠ ఛండాలినీ సాధన తిరుగులేని ఫలితాలను ఇస్తుందని అనేకమందికి ఋజువు అయ్యింది.

ఉచ్ఛిష్ఠ ఛండాలినీ మంత్రం :

**॥ ఓం నమో ఉచ్ఛిష్ఠ ఛండాలినీ వాగ్వాదినీ**
**రాజమోహినీ ప్రజామోహినీ స్త్రీ మోహినీ ఆన్**
**ఆత్ ఏవే వాయు ఉచ్ఛిష్ఠ ఛండాలినీ**
**సత్యవాదినీ కి శక్తి కురు కురు స్వాహా ॥**

# 8. హైందవ ఆచారాల మర్మం?

## నదిలో నాణాలు ఎందుకు విసురుతారు?

మానవదేహం ఆరోగ్యవంతంగా ఉండటానికి రాగి ఎంతో ఉపకరిస్తుంది. పూర్వకాలంలో రాగినాణాలు వాడుకలో ఉండేవి. అప్పట్లో అనేక ప్రాంతాలవారికి త్రాగటానికి నదీజలాలు మాత్రమే అందుబాటులో ఉండేవి. ఆ కారణంగానే నదుల

సమీప ప్రాంతాలలో పెద్ద పెద్ద పట్టణాలు, నగరాలు ఏర్పడ్డాయి. దైవం పేరుమీద నదిలోకి రాగి నాణాలు అనేకమంది విసిరినట్లయితే ఆ రాగినాణాలు నదీజలాలలో కొద్ది కొద్దిగా కరిగిపోయి ఆ నాణాల తాలీకు రాగి, నదీజలాలలో కలిసిపోతుందని ఆ తరువాత ఆ నదీ జలాలను త్రాగిన మానవుల శరీరంలోకి నదీజలంతోపాటు రాగికూడా చేరుతుందని అందువలన ఆ జలం త్రాగిన మానవులు ఆరోగ్యవంతంగా ఉంటారని ఆనాటి జ్ఞానులు భావించారు. ఆ కారణంగానే వీలున్నప్పుడల్లా నదిలోకి రాగి నాణాలు విసిరే సాంప్రదాయాన్ని వారు ఏర్పాటుచేసారు.

**ఎదుటివారికి నమస్కరించే ఆచారం వెనుక ఉన్న మర్మం ఏమిటి?**

భారత సాంప్రదాయంలో తమకు ఎదురైన పెద్దవారికి, పరిచయస్తులకి, మిత్రులకి రెండు చేతులూ జోడించి నమస్కరించే సాంప్రదాయం తర తరాలుగా వస్తున్నది. ఇలాంటి సాంప్రదాయం పెట్టటం వెనకాల రెండు శాస్త్రీయ కారణాలు ఉన్నాయని తెలుస్తున్నది. అవి ఏమిటంటే...

నమస్కారం పెట్టటంకోసం రెండుచేతుల్ని జోడించినప్పుడు రెండు చేతుల వ్రేళ్ళకు ఉండే కొసలు ఒకదానితో ఒకటి గట్టిగా వత్తుకుంటాయి. కళ్ళు, చెవులు, మెదడు అనే మూడు అవయవాలకు సంబంధించిన కేంద్రాలు ఈ వ్రేళ్ళలో ఉంటాయి. నమస్కారం చేసినప్పుడు వ్రేళ్ళు ఒకదానికి ఒకటి వత్తుకోవటంవల్ల పైన పేర్కొన్న అవయవాలలో గట్టి చలనం ఏర్పడుతుంది. ఫలితంగా నమస్కరించిన వ్యక్తికి, నమస్కారం అందుకున్న వ్యక్తి చాలాకాలంపాటు గుర్తుండిపోతాడు.

పాశ్చాత్యులలాగా కరచాలనం చెయ్యటం (షేక్‌హాండ్) భారతీయులకు అలవాటులేదు. ఎవరితోపడితే వారితో కరచాలనం చెయ్యటం చాలా ప్రమాదం. అవతలవాళ్ళ చేతులు శుభ్రంగా లేకుంటే వారితో కరచాలనం చేసినప్పుడు వారిచేతిమీద ఉండే సూక్ష్మరోగ క్రిములు కరచాలనం చేసిన వారికి అంటుకుంటాయి. ఫలితంగా కరచాలనం చేసినవారికి రోగాలు వచ్చే అవకాశం ఉంటుంది. ఆ కారణంగానే భారతీయులు కరచాలనం బదులు నమస్కారాన్ని ప్రముఖంగా ఉపయోగిస్తారు.

కొంతమంది వేదాంతుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే ఒక వ్యక్తితో కరచాలనం చేసినప్పుడు అతని శరీరంచుట్టూ అదృశ్యరూపంలో ఉండే కాంతివలయం (అరా)యొక్క ప్రభావం మనపై పడుతుంది. ఆ వ్యక్తితో కరచాలనం చేసినప్పుడు ఆ వ్యక్తి మంచివాడు అయినట్లయితే అతనిచుట్టూ ఉండే "అరా" ప్రభావం మనపై అనుకూలంగా ఉంటుంది. ఎదుటివ్యక్తి దుర్మార్గుడు లేదా చెడు గ్రహప్రభావంతో

బాధపడుతున్నవాడు అయినప్పుడు అతడితో కరచాలనం చేస్తే అతడి చెడు "అరా" ప్రభావం మనపై పడి మనంకూడా తాత్కాలికంగా చెడు స్వభావాన్ని పొందటం లేదా చెడుగ్రహ ప్రభావాన్ని అనుభవించటం జరుగుతుంది. ఈ బాధలన్నీ లేకుండా ఉండటంకోసమే కరచాలనం నిషేధించి నమస్కారాన్ని ప్రోత్సహించారు మన పూర్వీకులు.

**భారతీయ స్త్రీలు కాలివ్రేళ్ళకు మెట్టెలు ఎందుకు ధరిస్తారు?**

సాధారణంగా వివాహిత స్త్రీలు తమకాలి రెండవ వ్రేలుకి మెట్టెలు (వెండి ఉంగరాలు) ధరిస్తారు. మెట్టెలు ధరించటం వెనకాల కొన్ని శాస్త్రీయ కారణాలు దాగి ఉన్నాయని తెలుస్తున్నది. అవి ఏమిటంటే ఒక నరం కాలి రెండవ వ్రేలు నుండి గర్భసంచి మరియు గుండె వరకు వ్యాపించి ఉంటుంది. ఆ వ్రేలుకి మెట్టెలు ధరించటంవల్ల ఆ నరంయొక్క బలం పెరిగి స్త్రీయొక్క గర్భసంచి బలిష్టంగా మారుతుంది. ఫలితంగా ఆ స్త్రీ ప్రతినెలా క్రమం తప్పకుండా బహిష్టును పొందుతుంది.

ఇంకొక విశేషం ఏమంటే వెండి ఉత్తమ శక్తివాహకం. భూమి నుండి వచ్చే ధ్రువ ప్రాంతం నుండి వచ్చే శక్తి ప్రవాహాలను (పోలార్ ఎనర్జీ) ఈ వెండి మెట్టె తనలోకి తీసుకుని స్త్రీ శరీరంలోకి పంపిస్తుంది.

**రావిచెట్టును హైందవులు ఎందుకు ఆరాధిస్తారు?**

నిజం చెప్పాలంటే రావిచెట్టు నీడను ఇవ్వటానికి తప్పించి మరెందుకూ పనికిరాదని చాలామంది భావిస్తారు. ఎందుకంటే దానికాండం కలపగా పనికిరాదు. దానికి రుచికరమైన పండ్లు కాయవు. మరి ఏ కారణంగా తరతరాలుగా హైందవులు రావిచెట్టును దైవస్వరూపంగా పూజిస్తున్నారు?

రావిచెట్టు రాత్రిపూట కూడా ప్రాణవాయువు అయిన ఆక్సిజన్‌ని విడుదల చేస్తూ ఉంటుంది. బహుశా ఇంకేచెట్టూ కూడా అలా చెయ్యదు. ఆ కారణంగానే రావిచెట్టును దైవ ప్రతీకగా గుర్తించటం జరిగింది.

**భోజనాన్ని కారంతో ప్రారంభించి తీపితో ఎందుకు ముగిస్తారు?**

హైందవ సాంప్రదాయంలో భోజన ప్రారంభంలో కారంగా ఉండే పదార్థాలు తీసుకోవాలని, భోజనం ముగించినప్పుడు తీపి పదార్థాలు తీసుకోవాలని చెప్పబడి ఉన్నది. దీనివెనకాల ఒక శాస్త్రీయ కారణం ఉన్నదని తెలుస్తున్నది. అది ఏమిటంటే భోజన ప్రారంభ సమయంలో తీసుకునే కారం పదార్థాలు ఉదరంలో జీర్ణప్రక్రియకు సహకరించే జీర్ణరసాలను ప్రేరేపిస్తాయి. ఫలితంగా మనిషి తీసుకునే ఆహారం సక్రమంగా

జీర్ణం అవుతుంది. తీపి పదార్థాలు జీర్ణప్రక్రియను మందగింపచేస్తాయి. అందు వలన తీపి పదార్థాలను చివరగా తీసుకున్నా నష్టం ఉండదు. మొదటే తీపి పదార్థం తిన్నట్లయితే జీర్ణరసాల ఉత్పత్తి మందగిస్తుంది. ఫలితంగా జీర్ణప్రక్రియ మందగిస్తుంది.

(ఒక విచిత్రం ఏమంటే అనేక హెూటల్స్‌లో భోజనానికి ముందు ఏదో ఒక స్వీట్ పెడతారు. ఆ తరువాత తీసుకునే భోజనం చాలా తక్కువ పరిమాణంలోనే ఉంటుందని అందరికీ తెలుసు.)

**భారతదేశంలో చేతితో మాత్రమే భోజనం ఎందుకు చేస్తారు?**

వైదిక సాంప్రదాయాన్ని పాటించే భారతదేశంలో హాయిగా కుడిచేత్తో భోజనం చెయ్యటం పాటించబడుతున్నది. పాశ్చాత్యులు ఫోర్క్‌లతోను, స్పూన్లతోను ఆహారం తీసుకుంటారు. చైనా మరియు జపాన్ దేశస్థులు రెండు పుల్లలతో ఆహారాన్ని పట్టుకుని నోట్లోవేసుకుంటారు. భారతదేశంలో మాత్రం అనేకమంది చేత్తోనే ఆహారాన్ని తీసుకుంటున్నారు. ఇలా తీసుకోవటం వెనకాల ఒక నిగూఢమైన రహస్యం దాగి ఉన్నదని చాలామందికి తెలియదు. అది ఏమిటంటే.....

"ఆయుర్వేదవైద్యశాస్త్రం" ఇస్తున్న సమాచారం ప్రకారం చూసినట్లయితే మనిషి చేతికి ఉండే ప్రతి వ్రేలు పంచభూతాలలో ఒక్కొక్కదానికి ప్రాతినిధ్యం వహిస్తూ ఉంటుంది. బొటనవ్రేలు పంచభూతాలలో ఒకటైన అగ్నికి ప్రతీకగా ఉంటుంది. పసిపిల్లలు తమ బొటనవేలుని నోట్లోపెట్టుకుని చప్పరిస్తూ ఉండటం ఎప్పుడోఒక సమయంలో చూసే ఉంటారు. అతి చిన్న వయస్సులో ఉండే ఆ పిల్లలకు నమిలే శక్తి ఉండదు. అగ్ని తత్వానికి ప్రతీకగా ఉండే బొటనవ్రేలు చీకటం వల్ల ఆ పిల్లలోని జీర్ణశక్తి శక్తివంతంగా ఉంటుంది. పసిపిల్లలో జీర్ణశక్తికి సహాయం చెయ్యటంకోసమే ప్రకృతి ఆవిధమైన ఏర్పాటు పసిపిల్లలకు చేసిందని గుర్తించాలి. ఇక చూపుడు వ్రేలు వాయుతత్వానికి మధ్యవ్రేలు ఆకాశతత్వానికి, ఉంగరంవ్రేలు భూతత్వానికి, చిటికెనవ్రేలు జలతత్వానికి ప్రతీకగా ఉంటుంది.

పంచభూతాలతో తయారైన మానవదేహంలో జీర్ణశక్తి సమర్థవంతంగా పనిచెయ్యాలంటే మానవుడు, ఆ పంచభూతాల శక్తిని తమలో నింపుకున్న ఐదు వ్రేళ్ళు కలిగిన చేతితో భోజనం చెయ్యాలి. అంటే చేత్తో తింటేనే ఆహారం చక్కగా జీర్ణం అవుతుందని ఆయుర్వేదవైద్యశాస్త్రం చెప్పినట్లుగా గుర్తించాలి. ఆధునికకాలంలో అనేకమంది చెంచాలతో ఆహారం, అల్పాహారం తీసుకుంటున్నారు. ఆ కారణంగానే ఆధునిక కాలంలో అజీర్ణ సమస్యలు విపరీతంగా వస్తున్నాయి. కనుక తమకు జీర్ణశక్తి

బాగా ఉండా లని కోరుకునేవారు చేత్తోనే భోజనం చేస్తారని ఆశిద్దాం. ఇంకొక విశేషం ఏమంటే భారతదేశ రాష్ట్రపతిగా పనిచేసిన ప్రముఖ శాస్త్రవేత్త డా.అబ్దుల్‌కలాం చేత్తోనే ఆహారం తీసుకుంటారు. ఆ విషయాన్ని ఆయనే స్వయంగా లోకానికి తెలియజేసారు. ఇంకొక విశేషం ఏమంటే చేత్తో ఆహారం తీసుకున్నప్పుడే ఆ ఆహారంలో ఉండే రుచిని ఆస్వాదించే అవకాశం ఉంటుందని గుర్తించాలి.

# 9. స్తంభేశ్వర్ మహదేవ్ ఆలయం – గుజరాత్.

పరమశివుడు తన భక్తులతో దాగుడుమూతలు ఆడుతున్నాడా? అనే అభిప్రాయాన్ని కలగజేసే ఒక విచిత్రమైన శివాలయం గుజరాత్‌లోని అరేబియా సముద్రము మరియు కాంబే **అఖాతం** (అఖాతం అనగా భూమి మీదకి చొచ్చుకు వచ్చిన సముద్ర భాగం. దీనినే ఆంగ్లంలో BAY లేదా GULF అని పిలుస్తారు.) వద్ద ఉన్నది. గుజరాత్ రాష్ట్రంలోని వడోదర పట్టణానికి 70 కి.మీ. దూరంలో ఉన్న కావికంబాయ్ అనే పట్టణ తీరంలో **అత్యద్భుతమైన** ఈ స్తంభేశ్వర్ మహాదేవ ఆలయం ఉన్నది. ఈ ఆలయం దాదాపు 150 సంవత్సరాలక్రితం నిర్మించబడిందని తెలుస్తున్నది. ఈ ఆలయింలోని శివలింగం నాలుగు అడుగుల ఎత్తు ఉంటుంది.




సముద్రపు నీటిలో మునిగిపోయిన ఆలయం – నీరు వెళ్ళిపోయిన తరువాత బయట పడ్డ శివలింగం.

దీని విశేషాల గురించి క్లుప్తంగా తెలియజేస్తాను. సముద్రంలో ఉండే ఈ శివాలయం సముద్రానికి పోటు వచ్చినప్పుడు గంటలపాటు సముద్ర జలాలలో మునిగిపోతుంది.

సముద్రం పోటుకు గురైనప్పుడు అనగా సముద్ర జలం వెనక్కిపోయినప్పుడు ఈ ఆలయం క్రమక్రమంగా పైకి కనిపిస్తుంది. ఈ ఆలయంలో నాలుగు అడుగులు ఎత్తు ఉండే శివలింగం ఉన్నది. ఈ ఆలయంలోకి వెళ్ళాలంటే ఒకరోజంతా సముద్రం ఒడ్డున వేచి ఉండాలి. ఉదయ సమయంలో సముద్రం వెనక్కి వెళ్ళిపోతుంది. ఆ సమయంలో ఈ ఆలయం బయట పడుతుంది. అప్పుడు ఈ ఆలయంలోకివెళ్ళి లోపల ఉన్న శివలింగాన్ని దర్శించుకుని ఆ తరువాత ప్రశాంతమైన ఈ ఆలయ పరిసరాలలో సంచరించవచ్చు.

ఈ ఆలయానికి అరకిలోమీటరు దగ్గరలో ఉన్న రెస్టారెంట్‌లో మధ్యాహ్నం భోజనం చెయ్యవచ్చు. అక్కడే వాహనాలను కూడా నిలుపుకోవచ్చు. మధ్యాహ్న సమయం నుండి ఈ ఆలయం క్రమ క్రమంగా సముద్ర జలాలలో మునిగిపోవటం ప్రారంభిస్తుంది. రాత్రి సమయానికి ఈ ఆలయ శిఖరంతో సహా మొత్తం ఆలయం సముద్రంలో మునిగిపోతుంది. ఇంకొక విశేషం ఏమంటే ఈ ఆలయంలోకి వెళ్ళిన భక్తులు శివలింగంపై ఉంచిన పూలు సముద్రానికి పోటు వచ్చినప్పుడు ఆ పూలు సముద్రజలంపై తేలతాయి. సముద్రజలాలపై తేలే ఆ రంగు రంగుల పువ్వులు ఒక అద్భుతమైన దృశ్యాన్ని ఆవిష్కరిస్తాయి.

ప్రతిరోజూ సాయంత్ర సమయంలో సముద్రమే శివుడికి అభిషేకం చేస్తున్నదా? అని భక్తులకు అనిపించక మానదు. ఇంకొక విశేషం ఏమంటే ఈ ప్రదేశంలోనే మాహిసాగర్ మరియు సబర్మతి నది సంగమిస్తాయి.

॥ శుభమ్భూయాత్ ॥

# రహస్యయోగులు

# (Mysterious Saints)

(అతీంద్రియ శక్తులను సాధించిన సిద్ధపురుషుల గురించి
తెలియజేసే అపూర్వ పరిశోధనాత్మక గ్రంథం)

1. సౌరకాయస్వామి జీవిత విశేషాలు ?
2. మహావతార్ బాబాజీ చెప్పిన "విశ్వసర్వశ్వాస" వివరములు ?
3. బ్రహ్మర్షి కాగపుంజందర్ జీవిత విశేషాలు ?
4. సిద్ధయోగి నటనగోపాల నాయికిస్వామి జీవిత విశేషాలు ?
5. సిద్ధపురుషుడు గజానన్ మహరాజ్ జీవిత విశేషములు ?
6. [illegible]జులపాటు స్వచ్ఛంధ సజీవ సమాధిలో జీవించిన హఠయోగి సాధుహరిదాస్ ?
7. ప్రాచీన తమిళనాడు నుండి అదృశ్యం అయిపోయిన కుమారిఖండ భూభాగం మిస్టరీ ?
8. భవిష్యత్తులో వాయుదేవుడిగా అవతరించబోతున్న మహాయోగి వడిరాజరు జీవిత విశేషములు ?
9. బ్రహ్మచర్య మహాత్యం ఏమిటి ?
10. అద్భుత ఫలితాలను ఇచ్చే ఉచ్ఛిష్ఠ ఛండాలినీ సాధన ?
11. హైందవ ఆచారాల మర్మం ?
12. జీవసమాధి అంటే ఏమిటి ?
13. పంబత్తిసిద్ధర్ జీవిత విశేషాలు ?

శ్రీధరన్ కాండూరి